శ్రీ రస్తు

# తైత్తిరీయోపనిషత్

(శ్రీ శాంకరభాష్యోపేతా)

కీ॥ శే॥ బ్రహ్మశ్రీ, కనుపర్తి మార్కండేయ శర్మగారిచేత
ఆంధ్ర టీకా తాత్పర్యములు వ్రాయఁబడినవి.


ప్రకాశకులు :

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు

24/141, ఆనందబాగ్, మల్కాజిగిరి,

హైదరాబాదు - 500 047.

తైత్తిరీయోపనిషత్
(ఆంధ్ర టీకా తాత్పర్య
సహితము)

తొలి ముద్రణ : 1992

ప్రతులు : 1000

శ్రీ సీతారామ దివ్య పాదపద్మములకు
అంకితము

మూల్యము : రూ. 50/-

ప్రాప్తిస్థానము :
శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు
H. No. 24-141 ఆనందబాగ్, మల్కాజిగిరి
హైదరాబాద్ - 500 047

ముద్రణ :
క్రాంతి ప్రెస్, మద్రాసు - 600 001.

# ప్రకాశకుల విజ్ఞప్తి

శ్రీ శంకర భగవత్పాద విరచిత రచనలను ఆంధ్ర తాత్పర్యముగా (మూలోపేతముగా) ప్రకటించు మా ప్రయత్నములో నిది సప్తమ ప్రకటనము. ఈ తైత్తిరీయ శంకరభాష్యమునకు ఆంధ్ర వ్యాఖ్యానము వ్రాసినవారు బ్ర. శ్రీ. కనుపర్తి మార్కండేయశర్మగారు. వారు దీనిని 1934 సం॥ ప్రకటించి తరువాత కొన్ని దినములకే దివంగతులైరి. వారి ఆంధ్ర తాత్పర్యము అన్యూనాతిరిక్తముగను సులభ సుందరముగను బహుజనాదర పాత్రముగను ఉండుటచేత దీనిని మఱల మేము ప్రకటించుచున్నాము.

శ్రీ భగవత్పాదులు రచించిన పన్నెండు ఉపనిషద్భాష్యములలో ఈ తైత్తిరీయ భాష్యమునకే మంగళాచరణ మున్నది. అనగా వారు దీనిని తొలుత రచించిరని ఇది వారికి స్వశాఖోపనిషత్తని పెద్దలు నిశ్చయించినారు. అంతేగాక బ్రహ్మసూత్రములలో మొదటి రెండు సూత్రములకు ఈ ఉపనిషత్తే ఆధారము.

ఈ తైత్తిరీయోపనిషత్తునందు శిక్షావల్లి, బ్రహ్మవల్లి అను ఆనందవల్లి, భృగువల్లి, నారాయణ ప్రశ్నము, చిత్తి ప్రశ్నము అను ఐదు భాగములు కలవు. శిక్షావల్లికి 'సాగుం హితి' అనియు ఆనందవల్లి, భృగువల్లులకు 'వారుణి' అనియు నారాయణ ప్రశ్నకు 'యాజ్ఞిక' అనియు నామములు. ఈ మూడు పేర్లును తైత్తిరీయులకు నిత్యతర్పణమునందు మననయోగ్యములుగా నున్నవి.

నారాయణ ప్రశ్నమందు తొలుత బ్రహ్మ ప్రతిపాదక మంత్రము లున్నను అవసానమందు జ్ఞానసాధన మంత్రము లున్నను, ఎక్కువ భాగము యజ్ఞములం దుపయోగింపబడు మంత్రములే. అందుచేతనే దానికి 'యాజ్ఞికి' అని పేరు. అందుచేతనే కావలయును దానికి శ్రీ భగవత్పాదులు భాష్యము రచింపలేదు. శిక్షావల్లి త్రయమునకే ఆచార్యపాదుల భాష్య మున్నది. మా దృష్టి శ్రీ భగవత్పాద రచనలయందు కేంద్రీకరింపబడినది కావున వారి భాష్యమున్న శిక్షావల్లి త్రయమునే యీ గ్రంథము నందు గ్రహించినాము.

ఈ గ్రంథ ముద్రణావశ్యకతను గుర్తించి విశేషముగా ప్రోత్సహించిన ప.ప. శ్రీశ్రీ అద్వయానంద భారతస్వామివారికి మా కృతజ్ఞతా ప్రణామములు. మఱియు

న్యాయవాది బ్ర.శ్రీ రావినూతల శ్రీనాథరావుగారు పూర్వము శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటింపబడిన ప్రతిని అందించి మిక్కుటముగా ప్రోత్సహించిరి. వారికి మా ధన్యవాదములు.

మా ట్రస్టునందు సభ్యులై మాకు ప్రోత్సాహమందించుచున్న మిత్రు లంద రకు ఈ అవకాశమును పురస్కరించుకొని ధన్యవాదములు పలుకుచున్నాము.

ఈ గ్రంథమును సముచిత సుందరముగా ముద్రించి మాకు సహకరించిన మద్రాసు, క్రాంతి ప్రెస్ యజమాని శ్రీ ధనికొండ శ్రీధరరావుగారికి మా ధన్య వాదములు.

ఇట్లు,

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు.

శ్రీ గురుభ్యో నమః

# తైత్తిరీయోపనిషదుపోద్ఘాతము



శ్లో. నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్,
అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరమ్పరామ్.
శాస్త్రం శారీర మీమాంసా దేవస్తు పరమేశ్వరః,
ఆచార్య శ్శంకరాచార్యః సంతు మే జన్మజన్మని.

వేదములు పరమపవిత్ర గ్రంథములు. ఇవి భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములు, ఇట్టి వేదములు పరమపూజ్యులును జన్మ జరామరణశూన్యులును అగు మహర్షిపుంగవులచేత స్వతపస్సామర్థ్యముచేత గ్రహింపఁబడి లోకోపకారార్థము శిష్య ప్రశిష్య సంప్రదాయ రూపమున లోకము నందు వ్యాపింపఁజేయఁబడినవి.

ఈ వేదము అందు కర్మబ్రహ్మకాండలకు సంబంధించిన విషయ మంతయు అధికార తారతమ్యము ననుసరించి చక్కఁగా బోధింపబడియున్నది.

కర్మకాండ యందు ఇహపరలోక సుఖసంపాదనమునకు వలయు శాస్త్రీయము లగు సకలోపాయములు చక్కఁగాఁ దెలుపఁబడియున్నవి. లోకమునందుఁ గల చతుష్షష్టి విద్యలకు ఈ కర్మకాండయే మూలాధారము. చతుష్షష్టి విద్యలకు సంబంధించిన రహస్యము లన్నియు వేదము అందు బీజభూతములుగా నచ్చటచ్చటఁ దెలుపఁబడియున్నవి.

బ్రహ్మకాండము నందు నశ్వరమగు ఇహపరలోక సుఖ ప్రాప్తికంటె శాశ్వతముగా నిరతిశయానందరూప బ్రహ్మానుభవ ప్రాప్తికి సంబంధించిన విషయ మంతయు సాధన సహితముగఁ దెలుపఁబడినది. ఇట్టి వేదభాగమునకు ఉపనిషత్తని నామాంతరము గలదు. ఒక్కొక్క వేదశాఖ కొక్కొకటి చొప్పున గల ౧౧౩౧ ఉపనిషత్తులలో, ౧౦౮ ఉపనిషత్తులు మాత్రమే యిప్పుడు లభించుచున్నవి. వీనిలో ౧౦ ఉపనిషత్తులు అధిక ప్రచారము కలిగియున్నవి. వీనికే దశోపనిషత్తు లని ప్రసిద్ధి. ఈ పది యుపనిషత్తులలో తైత్తిరీయోపనిషత్తు ఒకటి, ఇది కృష్ణయజుర్వేద తైత్తిరీయ శాఖకు చేరినది, తైత్తిరీయశాఖ యందు ఆరణ్యక భాగమున పఠింపఁబడియున్నది.

ఇట్టి తైత్తిరీయోపనిషత్తునకు ౫ ప్రశ్నము లని అధ్యాపక సంప్రదాయ ప్రసిద్ధము.

౧ శిక్షావల్లి
౨ బ్రహ్మవల్లి
౩ భృగువల్లి
౪ నారాయణ ప్రశ్నము
౫ చిత్తి ప్రశ్నము

అను ౫ ప్రశ్ననామములు సుప్రసిద్ధము, అయినను చిత్తి ప్రశ్నము చాతుర్హోత్రచయనము నందు వినియుక్తమై యుండి బ్రహ్మవిద్యను ప్రతిపాదించునది కానందుచేత ఉపనిషద్గ్రంథము లందు శిక్షాది ప్రశ్న చతుష్టయమునే అందఱు ప్రకటించుచున్నారు. మేమున్ను శిక్షాది ప్రశ్న చతుష్టయమునకు మాత్రమే టీకా తాత్పర్య వివరణముల నిచట వ్రాసినారము. సకల వేదభాష్యకారులగు సాయణాచార్యు లిట్లని చెప్పిరి:—

ఈ తైత్తిరీయోపనిషత్తు 'సాంహితీ' యనియు. 'వారుణి' యనియు, 'యాజ్ఞికి' యని త్రివిధమయి యున్నది.

౧. సాంహితి:—శిక్షా ప్రశ్నము, లేక శిక్షావల్లి యను భాగము సాంహితి యనంబడును. ప్రప్రథమమున సంహితాధ్యయన విధానము—ఉపాసనము చక్కఁగా నిరూపింపఁబడియుండుటచేత దీని కీ పేరు కలిగినది.

౨. వారుణి:—బ్రహ్మవల్లి, లేక ఆనందవల్లి యను భాగము, భృగువల్లి యను భాగము వారుణి యనంబడును. బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకుఁడగు వరుణుని యొక్క సంబంధముచేత నీ రెండు ప్రశ్నములకు వారుణి యను నామము కలిగినది.

౩. యాజ్ఞికి:—యజ్ఞ సంబంధములగు మంత్రములు అధికముగా నుండుటచేత (నారాయణ ప్రశ్నము) యాజ్ఞికి యనంబడుచున్నది.

ఈ మూఁడింటిలో వారుణియే ముఖ్యమయినది. కాని బ్రహ్మవిద్యా ప్రాప్త్యుపాయ సాధనభూతములగు అనేకోపాసనల నిరూపించి యుండుటచేత సాంహిత్యుపనిషత్తు (అనఁగా శిక్షా ప్రశ్నము) ప్రథమమున చెప్పఁబడినది.

## బ్రహ్మసూత్రములు - తైత్తిరీయోపనిషత్తు

ఉత్తరమీమాంసాశాస్త్ర మనంబడు సూత్రములను వేదవ్యాస భగవానుఁడు రచించెను. వేదశిరోభాగములగు వేదాంతము లందు—అనఁగా ఉపనిషత్తులందుఁ

గల సంశయాంశములను సమన్వయించి విమర్శించి సిద్ధాంత మొనర్చుటకుఁగాను ఉత్తర మీమాంసాశాస్త్రమును వేదవ్యాసమహర్షి రచించెను. ఈ మీమాంసాశాస్త్రము నందు విమర్శార్థము గైకొనఁబడిన విషయములు చాలవఱకు ఉపనిషత్తులకు సంబంధించి యున్నవి.

## బ్రహ్మసూత్రములు - ప్రథమాధ్యాయము

౧. జిజ్ఞాసాధికరణమునందు గల

సూ. అథాతో బ్రహ్మజిజ్ఞాసా. ౧-౧-౧

అను సూత్రమునకు "తపసా బ్రహ్మజిజ్ఞాసస్వ" అను నీ తైత్తిరీయోపనిషద్వాక్యము ప్రమాణము.

౨. జన్మాద్యధికరణమునందు గల

సూ. జన్మాద్యస్య యతః. ౧-౧-౨

అను సూత్రమునకు 'యతోవా ఇమాని భూతాని జాయంతే' అను తైత్తిరీయ వాక్యము ప్రమాణము.

౩. ఈక్షత్యధికరణమునందు గల

సూ. గతిసామాన్యాత్. ౧-౧-౧౦

అను సూత్రమునకు 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః' అను శ్రుతి వాక్యము ప్రమాణము.

౪. ఆనందమయాధికరణమునందు గల

సూ. ఆనందమయో ఽభ్యాసాత్. ౧-౧-౧౨

అను సూత్రమునకు 'తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్, అన్యోఽంతర ఆత్మాఽఽనందమయః. (తై. ఉ. ౨-౫)' అను శ్రుతివాక్యము ప్రమాణము.

ఇట్లే ఈ యధికరణమునందుఁ గల

| | | |
|---|---|---|
| సూ. | తద్ధేతు వ్యపదేశాచ్చ. | ౧-౧-౧౪ |
| ,, | మాంత్రవర్ణిక మేవచ గీయతే. | ౧-౧-౧౫ |
| ,, | నేతరోఽనుపపత్తేః. | ౧-౧-౧౬ |
| ,, | భేదవ్యపదేశాచ్చ. | ౧-౧-౧౭ |
| ,, | కామాచ్చనానుమానాపేక్షా. | ౧-౧-౧౮ |
| ,, | అస్మిన్నస్యచతద్యోగం శాస్తి. | ౧-౧-౧౯ |

అను ఆఱు సూత్రములందును ఈ తైత్తిరీయ శ్రుతివాక్యము లధికముగ ప్రమాణముగ గైకొనఁబడినవి.

౫. ఆకాశాధికరణమునందు గల

సూ. ఆకాశ స్తల్లింగాత్. ౧-౧-౨౨

అను సూత్రమునకు 'యదేష ఆకాశ ఆనందో న స్యాత్, తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః' అను తైత్తిరీయోపనిషచ్ఛ్రుతివాక్యములు ప్రమాణము.

౬. కారణత్వాధికరణమునందు గల

సూ. కారణత్వేన చాకాశాదిషు యథావ్యప దిష్టోక్తేః॥ ౧-౧-౧౪

అను సూత్రమునకు 'ఆత్మన ఆకాశ స్సంభూతః' ఇత్యాది శ్రుతివాక్యము ప్రమాణము.

౭ ప్రకృత్యధికరణమునందు గల

సూ. అభిధ్యోపదేశాచ్చ ౧-౪-౨౫

అను సూత్రమునకు 'సోఽకామయత బహూస్యాం ప్రజాయే యేతి' మున్నగు శ్రుతులు ప్రమాణములు.

సూ. ఆత్మకృతేః పరిణామాత్. ౧-౪-౨౬

అను సూత్రమునకు 'తదాత్మానగ్ం స్వయ మకురుత' మున్నగు శ్రుతులు ప్రమాణము.

## బ్రహ్మసూత్రములు - ద్వితీయాధ్యాయము

౮. విలక్షణత్వాధికారమునందు గల

సూ. నవిలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్. ౨-౧-౪ అను సూత్రమునకు 'విజ్ఞానంచా విజ్ఞానంచ' మున్నగు శ్రుతి వాక్యములు ప్రమాణములు.

౯. ఆరంభణాధికరణమునందుఁ గల

సూ. అసద్వ్యపదేశా న్నేతి చే న్నధర్మాంతరేణవాక్యశేషాత్. ౨-౧-౧౭.

అను సూత్రమునకు 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' అను శ్రుతివాక్యము ప్రమాణము.

౧౦. ఇతర వ్యపదేశాధికరణమునందు గల

సూ. ఇతర వ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః. ౨-౧-౨౧

అను సూత్రమునకు 'తత్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్' అను శ్రుతివాక్యము ప్రమాణము.

౧౧. వియదధికరణమునందు గల

సూ. అస్తితు. ౨-౩-౨

అను సూత్రమునకు 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః' అను శ్రుతి ప్రమాణము.

సూ. శబ్దాచ్చ. ౨-౩-౪

అను సూత్రమునకు 'ఆకాశ శరీరం బ్రహ్మ, ఆకాశఆత్మా' మున్నగు శ్రుతులు ప్రమాణము.

సూ. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్. ౨-౩-౫

అను సూత్రమునకు 'తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ. తపో బ్రహ్మేతి' మున్నగు శ్రుతులు ప్రమాణము.

సూ. ప్రతిజ్ఞాహాని రవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః. ౨-౩-౬

అను సూత్రమునకు 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః' మున్నగు శ్రుతులు ప్రమాణము.

## బ్రహ్మసూత్రములు - తృతీయాధ్యాయము

౧౨. పురుషవిద్యాధికరణమునందు గల

సూ. పురుష విద్యాయా మివచేతరేషా మనామ్నానాత్. ౩-౩-౨౪

అను సూత్రమునకు ''తస్యైవం విదుషో యజ్ఞస్య'' అను నారాయణ ప్రశ్నము యొక్క ౮౦-వ అనువాకము విషయము.

## బ్రహ్మసూత్రములు - చతుర్థాధ్యాయము

౧౩. జగద్వ్యాపారాధికరణమునందుఁ గల

సూ. జగద్వ్యాపార వర్జం ప్రకరణాద సన్నిహిత త్వాచ్చ. ౪-౪-౧౭

సూ. ప్రత్యక్షోపదేశాదితిచే న్నాధికారిక మండలస్థోక్తేః. ౪-౪-౧౮

అను సూత్రములకు 'ఆప్నోతి స్వారాజ్యం, సర్వేఽస్మై దేవాబలిమావహంతి' మున్నగు శ్రుతివాక్యములు విషయము.

ఇటుల సూత్రములతో ప్రత్యక్ష సంబంధము లేక విషయము ననుసరించి పరంపరాసంబంధము గల అనేక వాక్యములు ఈ తైత్తిరీయోపనిషత్తునకు సంబంధించినవి ఈ క్రింద తెలుపఁబడిన బ్రహ్మసూత్రములందు శ్రీశంకర భగవత్పాదాచార్యులవారిచేత ప్రమాణముగ గై కొనఁబడి యున్నవి:—

౧-౧-౧; ౧-౧-౨; ౧-౧-౧౧; ౧-౧-౧౨; ౧-౨-౧౧; ౧-౨-౧౭; ౧-౨-౨౩; ౧-౩-౮; ౧-౩-౨౬; ౧-౪-౨౨; ౨-౧-౧౪;

౨-౨-౨౪; ౨-౩-౭; ౨-౩-౮; ౨-౩-౧౦; ౨-౩-౧౩; ౨-౩-౧౪; ౨-౩-౧౭; ౨-౩-౧౮; ౨-౩-౩౧; ౨-౩-౩౬; ౨-౩-౪౦; ౨-౩-౪౭; ౨-౪-౧; ౩-౧-౨; ౩-౨-౧౭; ౩-౨-౨౨; ౩-౨-౨౩; ౩-౨-౩౧; ౩-౩-౪; ౩-౩-౧౧; ౩-౩-౧౨; ౩-౪-౮; ౩-౪-౧౮; ౩-౪-౨౦; ౪-౩-౧౪; ౪-౪-౧౮.

## ఆంధ్రద్రావిడ పాఠభేదములు

ఈ తైత్తిరీయోపనిషత్తును ఆంధ్రపాఠమనియు, ద్రావిడ పాఠమనియు ద్వివిధముగ శిష్టజనులు పఠించుచున్నారు.

శిక్షా బ్రహ్మ భృగువల్లులయందు స్వల్పభేదమున్ను, నారాయణప్రశ్నమువందు విశేషభేదమున్ను ఈ పాఠద్వయమునకుఁ గలదు.

ద్రావిడపాఠము:— ఈ పాఠానుసారము శ్రీ వైష్ణవులు మాత్రము పఠింతురు.

ఆంధ్రపాఠము:— ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, మహారాష్ట్రాది సకల దేశీయ బ్రాహ్మణులందఱు ఆంధ్రపాఠానుసారము పఠింతురు. ద్రవిడ పాఠమున లేని యనేక మంత్రములు ఆంధ్రపాఠమున గలవు.

ద్రవిడపాఠమున గల మంత్రములన్నియు కలిగియుండి, ఇతర మంత్రములు కూడ అనేకము లుండుటచేత మే మీ గ్రంథమునందు ఆంధ్రపాఠము ననుసరించియే టీకాతాత్పర్యములను వ్రాసినారము.

తైత్తిరీయోపనిషత్తులని వ్యాఖ్యాతలందఱుచే అంగీకరింపబడుచున్న శిక్షావల్లి, బ్రహ్మవల్లి (ఆనందవల్లి), భృగువల్లి, నారాయణ ప్రశ్నములు నాలుగింటిలో మొదటి మూడు ప్రశ్నలకు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య కృతభాష్యము, విద్యారణ్య కృత బృహద్వివరణము, శంకరానంద కృతదీపిక, సురేశ్వరాచార్యకృత భాష్య వార్తికము మున్నగు వ్యాఖ్యాన గ్రంథములు గలవు. నారాయణ ప్రశ్నమునకు భట్ట భాస్కర సాయణాచార్యకృత భాష్యములు మాత్రము గలవు. సాయణ భాష్యము ఆంధ్ర పాఠమును, భట్ట భాస్కర భాష్యము ద్రావిడ పాఠమును చాలవఱకు అనుసరించుచున్నవి.

శ్రీమచ్ఛంకరానందులవారు ఆత్మ పురాణమనియు, శ్రీమద్విద్యారణ్యులవారు అనుభూతి ప్రకాశమనియు రెండు గ్రంథములను రచించిరి. ఈ రెండు గ్రంథము

లున్న ఉపనిషత్తులకు విపులముగా నొనర్పఁబడిన శ్లోక రూప వ్యాఖ్యాన గ్రంథములు. ఈ రెండు గ్రంథములను ఉపనిషద్రహస్యము తెలుంగఁ దలఁచినవార లవశ్యము పఠించుట యుక్తము.

## గ్రంథ సహాయము

ఈ తైత్తిరీయోపనిషత్తునకు, ఆంధ్ర టీకా తాత్పర్యములు వ్రాయునప్పుడు గైకొనిన గ్రంథ సహాయము.

౧. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యకృత మగు తైత్తిరీయోపనిషద్భాష్యము, ఆనందగిరి వ్యాఖ్యాన సహితము.

౨. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య కృత తైత్తిరీయ భాష్యము, వనమాల వ్యాఖ్యాన సమన్వితము.

౩. శ్రీమచ్ఛంకరానందకృత ఆత్మపురాణము.

౪. శ్రీమద్విద్యారణ్య మునికృత అనుభూతి ప్రకాశము.

౫. శ్రీమత్సురేశ్వరాచార్య కృత తైత్తిరీయ భాష్యవార్తికము.

౬. శ్రీమద్విద్యారణ్యమునికృత తైత్తిరీయ బృహద్వివరణము.

ఆంధ్ర వ్యాఖ్యానమును వ్రాయునపుడు పై గ్రంథముల నుండి చాలా విషయములను సంగ్రహించినాడను, మఱికొన్ని గ్రంథములనుండియు సహాయమును పొందినాడను. ప్రథమ ముద్రణమునందు చాలచోట్ల మంత్రమునకు మాత్రమే ఆంధ్ర టీకా తాత్పర్యముల వ్రాసియుంటిని. ఈ ద్వితీయ ముద్రణమునందు చాల చోట్ల శంకరకృతమగు ఉపనిషద్భాష్యమును పలుతావుల ఆంధ్ర తాత్పర్యమునందు అధికముగా చేర్చినాడను. ఇంకయు గ్రంథమునందు నిలిచియున్న అజ్ఞాన కృతములగు దోషములను, ప్రమాదజనిత దోషములను పండితులు తెలిపిన యెడల కృతజ్ఞతాపూర్వకముగ పరిగ్రహించి తృతీయ ముద్రణమున సంస్కరించి ప్రకటించెదము.

"బృందావనం" కీలుపాకు
మదరాసు. ౨౦-౫-౩౪.

ఇట్లు విద్వద్విధేయుడు,
క. మార్కండేయ శర్మ.

ఓమ్

# శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు (రిజిష్టర్డ్)

ఇం. నెం. 24-141, ఆనందబాగ్, మల్కాజిగిరి, హైదరాబాద్-500 047

## ఉద్దేశ్యములు - లక్ష్యములు

1. శ్రీ భగవత్పూజ్యపాదులు జగద్గురువులైన ఆదిశంకరాచార్యుల వారిచే ప్రణీత గ్రంథములు—ఆధ్యాత్మిక, తాత్త్విక వేదాంత భాష్యములను, భక్తి ప్రబోధకములు, ఉపదేశ స్తోత్ర, ప్రకరణాది సాహిత్య రచనల నెల్ల సేకరించి భద్రపరచుట.

2. పై పేర్కొన్న శ్రీ శంకరాచార్యకృత సంస్కృత రచనలకు వాని ప్రసిద్ధ వ్యాఖ్యలకును ఆంధ్రానువాదమును సమర్థులచే చేయించి ప్రచురించుట.

3. ఇంత మాత్రమేగాక, ఇంతకు పూర్వమే శ్రీ భగవత్పాదులవారి రచనలు తెలుగులోని కనువదింపబడి ప్రస్తుతము లభ్యముకాని వానిని పైతము సేకరించి ప్రచురించుట.

4. అద్వైత సిద్ధాంతపరమైన వేదాంతమును ప్రచారము చేయుట:—అనుభవజ్ఞులైన యభిజ్ఞులచే ప్రస్థానత్రయ ప్రసిద్ధ ధర్మాద్వైత సిద్ధాంత ప్రచారమును, అధ్యయన—అధ్యాపకాది రూపముననుు, ఉపన్యాసములు, గోష్ఠులు, పండిత సదస్సులు మున్నగునవి ఏర్పాటు చేయుట మూలముననుు నల్పి, జ్ఞాన విజ్ఞానాభిరుచి గల వాతావరణమును సమాజములో నెలకొల్పుట.

5. ఈ కార్యసిద్ధికై అవసరమైన ఇతర విధ కార్యకలాపములను ఆ యా సందర్భముల కనుగుణముగా ఎన్నుకొని ముఖ్యోద్దేశ్యము నెరవేర్చుకొనుటకై పాటుపడుట.

ఈ సీతారామ ఆదిశంకర ట్రస్టు ది. 1-11-85 హైదరాబాదులో శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులు, ప॥ ప॥ జగద్గురు శ్రీ భారతీ తీర్థ మహాస్వాములవారిచే ఆశీః పూర్వకముగా ప్రారంభింపబడినది.

# విజ్ఞప్తి

మా ప్రకటిత జ్ఞానసేవా కార్యక్రమమును నిర్విఘ్నముగా కొనసాగించుటకు, శ్రీ జగద్గురువులను, శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్యులను, శ్రీమ దద్వైత సిద్ధాంత ప్రచారకాభిమానులను, సహృదయులైన ఆస్తిక మహాజనుల నెల్లరను, తమ తమ సహాయ సహకారములను అందించుచుండవలసినదిగా వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.

అయిదువందల రూపాయలు గాని, అంతకుమించి గాని శాశ్వత విరాళము లిచ్చు దాతల పేర్లు ముద్రింపబడి, వారలకు (అట్టి దాతలకు) ఈ ట్రస్టు ప్రచురణ లన్నియు నొక్కొకటి చొప్పున ఉచితముగా నొసంగఁబడును.

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టుకు శాశ్వత నిధికిగా రూ. 500/- అంతకు మించి విరాళముల నిచ్చిన దాతల పేర్లు.

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు, అడ్వకేటు, విజయవాడ.
శ్రీ కై. ఎ. వి. శివరామశర్మగారు, వనస్థలిపురము, హైదరాబాద్.
శ్రీ ఐ. బి. రామకృష్ణారావుగారు, వనస్థలిపురము, హైదరాబాద్.
శ్రీ పురంశెట్టి సత్తయ్యగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ వి. లచ్చారావుగారు, అశోకనగర్, హైదరాబాద్.
శ్రీ జి. శ్రీరామమూర్తిగారు, న్యూనల్లకుంట, హైదరాబాద్.
శ్రీ జె. ఎమ్. రామచంద్రన్‌గారు, మించన్ స్ట్రీటు, కర్నూలు.
శ్రీ పి. వి. భీమశంకరమ్‌గారు, చెంబూర్, బొంబాయ్.
శ్రీ కె. క్రిష్ణయ్యగారు, కొనెదన, ప్రకాశమ్ జిల్లా.
శ్రీ యాబలూరి లోకనాధ శర్మగారు, అడ్వకేటు, విజయవాడ.
శ్రీ తాదేపల్లి నరసింహదాసుగారు, విజయవాడ, కార్యదర్శి, శ్రీరామకృష్ణాశ్రమము, అశోకనగర్, హైదరాబాద్.
శ్రీ మండలీక శ్రీరామమూర్తిగారు, ఎస్.సి. రైల్వే ఆఫీసు, బెల్లంపల్లి.
శ్రీ పి. లక్ష్మణరావుగారు, బి. ఇ. మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారు, వనస్థలిపురము, హైదరాబాద్.

శ్రీ పితలమ్ రాముగారు, అసిఫ్ నగర్, హైదరాబాద్.
శ్రీ కందర్ప శివరామకృష్ణగారు మచిలీపట్నము, కృష్ణా జిల్లా.
శ్రీ కందర్ప వెంకటేశ్వర్లుగారు, బి.ఇ., భిలాయి.
శ్రీ చదలవాడ సుబ్రహ్మణ్యముగారు. సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.
శ్రీ చుండూరు పార్థసారథిగారు, శ్రీరామకృష్ణాపురమ్ కాలని, హైదరాబాద్.
శ్రీ తంగిరాల శ్రీరామశర్మగారు, సీతాఫల్ మండి, సికింద్రాబాద్.
శ్రీ డాక్టర్ కొమరవోలు వెంకటసుబ్బారావుగారు, రామకృష్ణాపురమ్. త్రిమల్ గిరి పోస్టు, హైదరాబాద్.
శ్రీ కె. రామచంద్రరావుగారు, కొత్తపేట, కర్నూలు.
శ్రీ దేవరకొండ సీతారామయ్యగారు, కె. కె. నగర్, మద్రాసు.
శ్రీ గుంటూరు నాగేశ్వరరావుగారు. మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ దామరాజు సత్యనారాయణగారు, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.
శ్రీమతి టి. వి. లక్ష్మిగారు, ఆనందబాగ్, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ డాక్టర్ ఎమ్. ఎస్. రామానుజాచార్యులుగారు, కర్నూలు.
శ్రీ నారుమంచి రాధాకృష్ణమూర్తిగారు. గుంటూరు.
శ్రీ కె. వి. పి. ఎల్. నరసింహారావుగారు, బౌద్ధనగర్, సికింద్రాబాద్.
శ్రీ నిడుమోలు శ్రీరామమూర్తిగారు. హైదరాబాద్.
శ్రీ రామకృష్ణ పరమహంస కామర్స్ విద్యార్థుల భక్తబృందము, తుని, తూ. గోదావరి జిల్లా.
శ్రీమతి ఎస్. అన్నపూర్ణమ్మగారు, మల్కాజిగిరి, హైదరాదాద్.
శ్రీ మద్దుల రామారావుగారు, తుని, తూ. గోదావరి జిల్లా.
శ్రీ పి. వి. కృష్ణమూర్తిగారు, అశోకనగర్, హైదరాబాద్.
శ్రీ జి సత్యప్రసాద శర్మగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ జొన్నలగడ్డ చలపతిరావుగారు, దోమలగూడ, హైదరాబాద్.
శ్రీ గంటి భవానీశంకరమ్‌గారు, పేరూరు, తూ. గోదావరి జిల్లా.
శ్రీ పి. లక్ష్మివరప్రసాదగారు, చైతన్యపురి, హైదరాబాద్.
శ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రిగారు, సంగీత విద్వాన్ కొత్తపేట, హైదరాబాద్.
శ్రీ చేబ్రూరి సత్యనారాయణగారు, యోగానంద ఆశ్రమము, వినుకొండ, గుం. జిల్లా.

శ్రీ కొండపల్లి సత్యనారాయణమూర్తిగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ నడువల్లి రామకృష్ణరావుగారు. సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.
శ్రీ మంత్రాల రమణమూర్తిగారు, విజయనగర్ కాలని, హైదరాబాద్.
శ్రీ ధూలిపాల పార్వతీశంగారు, మచిలీపట్నము, కృష్ణా జిల్లా.
శ్రీ ఎమ్. వెంకట శేషగిరిశర్మగారు, న్యూనల్లకుంట, హైదరాబాద్. క్లాత్ మర్చంట్సు ఎసోసియేషన్. తుని, తూ. గోదావరి జిల్లా.
శ్రీ ఎమ్. జి. పి. శ్రీరామచంద్రమూర్తిగారు, మామిల్లగూడెము, ఖమ్మం.
శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. మల్కాజిగిరి. హైదరాబాద్.
కుమారి టి. వి. రత్నకుమారి, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ పోతరాజు ఆంజనేయశర్మగారు, ఎల్లారెడ్డిగూడ, హైదరాబాద్.
శ్రీ కోపల్లి శ్రీనివాసరావుగారు, హైదర్‌బస్తి, సికింద్రాబాద్.
శ్రీ పుట్టంరాజు వెంకట్రావుగారు. కేశవనగర్ కాలని, సికింద్రాబాద్.



# తైత్తిరీయోపనిషద్విషయ సూచిక

## శిక్షావల్లి



## బ్రహ్మవల్లి - ఆనందవల్లి



## భృగువల్లి

శ్రీ ర స్తు

# తైత్తిరీయోపనిషత్

## శిక్షావల్లీ

ఆంధ్ర టీకా తాత్పర్య సమన్వితము

---

### పూర్వ శాంతి పాఠః

హరిః ఓమ్

[1]శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ త్వర్యమా ।
శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః ।
[2]నమో బ్రహ్మణే । నమ స్తే వాయో । త్వ మేవ ప్ర
త్యక్షం బ్రహ్మాసి । త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మ వది
ష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి ॥౧॥
త న్మా మ వతు । త ద్వక్తార మవతు । అవతు మామ్ ।
అవతు వక్తారమ్ । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥౧॥
సత్యంవదిష్యామి పంచచ ॥

### ౧. ప్రథమో ఽనువాకః

మూ. హరిః ఓమ్. ౧ శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవ
త్వర్యమా । శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు

రురుక్రమః । ౨ నమో బ్రహ్మణే । నమస్తే వాయో ।
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । *త్వమేవ ప్రత్య
క్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం
వదిష్యామి ॥౧॥ తన్మామవతు । తద్వక్తారమవతు ।
అవతు మామ్ । అవతు వక్తారమ్ । ఓం శాన్తిశ్శాన్తి
శ్శాన్తిః ॥౧॥ సత్యం వదిష్యామి పంచచ ॥

శాంకరభాష్యమ్:

శం సుఖం ప్రాణవృత్తే రహ్నశ్చాభిమానీ దేవతాత్మా మిత్రః నః అస్మాకం భవతు। తథైవ అపాన వృత్తేః రాత్రేశ్చాభిమానీ దేవతాత్మా వరుణః; చక్షుషి ఆదిత్యే చాభిమానీ అర్యమా; బలే ఇన్ద్రః; వాచి బుద్ధౌచ బృహస్పతిః; విష్ణుః ఉరుక్రమః విస్తీర్ణక్రమః పాదయోరభిమానీ; ఏవమాద్యా అధ్యాత్మదేవతాః శం నః; భవతు ఇతి సర్వత్రానుషఙ్గః। తాసు హి సుఖకృత్సు విద్యాశ్రవణ ధారణోపయోగాః అప్రతిబంధేన భవిష్యన్తీతి తత్సుఖ వృత్త్వం ప్రార్థ్యతే — శం నో భవతు ఇతి। బ్రహ్మ విద్యా వివిదిషుణా నమస్కార బ్రహ్మవదన క్రియే వాయు విషయే బ్రహ్మవిద్యోపసర్గ శాన్త్యర్థే క్రియతే - సర్వత్ర క్రియా ఫలానాం తదధీనత్వాత్। బ్రహ్మవాయుః; తస్మై బ్రహ్మణే నమః ప్రహ్వీభావమ్, కరోమీతి వాక్యశేషః। నమః తే తుభ్యం హే వాయో నమస్కరోమి ఇతి పరోక్షప్రత్యక్షాభ్యాం వాయురేవాభిధీయతే। కించ, త్వమేవ చక్షు రాద్యపేక్ష్య బాహ్యం సంనికృష్టమ వ్యవహితం ప్రత్యక్షం బ్రహ్మాసి యస్మాత్, తస్మాత్ త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి। ఋతం యథాశాస్త్రం యథాకర్తవ్యం బుద్ధౌ సుపరినిశ్చితమర్థం త్వదధీనత్వాత్ త్వామేవ వదిష్యామి; సత్యమితి స ఏవ వాక్కాయాభ్యాం సంపాద్యమానః. సోఽపి త్వదధీన ఏవ సంపాద్యత ఇతి త్వామేవ సత్యం వదిష్యామి। తత్ సర్వాత్మకం వాయ్వాఖ్యం బ్రహ్మ మయైవం స్తుతం తత్

---

* భాష్యే 'త్వామేవ' ఇత్యేవవ్యాఖ్యాతం. తథాఽపి సంప్రదాయ పాఠమనుసృత్యాస్మాభిః 'త్వమేవ' ఇత్యేవముద్రితమ్.

విద్యార్థినం మామ్ అవతు విద్యాసంయోజనేన। తదేవ బ్రహ్మ వక్తారమ్ ఆచార్యం చ వక్తృత్వ సామర్థ్య సంయోజనేన అవతు। అవతు మామ్ అవతు వక్తారమ్ ఇతి పునర్వచన మాదరార్థమ్। శాన్తిః శాన్తిః శాన్తిః ఇతి త్రివచనమ్ ఆధ్యాత్మికాధి భౌతి కాధిదైవికానాం విద్యాప్రాప్త్యుప సర్గాణాం ప్రశమనార్థమ్॥

ఇతి ప్రథమానువాక భాష్యమ్॥

టీక. ౧. మిత్రః = మిత్రుఁడు (ప్రాణవృత్తికిని పగటికి అభిమానియగు దేవత). నః = (శిష్యాచార్యులము అగు) మాకు. శం = సుఖమును (కలుగఁజేయు వాఁడు అగుఁగాక). వరుణః = వరుణుఁడు (అపానవృత్తికిని రాత్రికిని అభిమానియగు దేవత), శం = సుఖకరుఁడు (మాకు అగుఁగాక), అర్యమా = అర్యముఁడు (సూర్య మండలమునకును, నేత్రములకును అభిమాని యగు దేవత), నః = మాకు, శం = సుఖకరుఁడు, భవతు = అగుఁగాక. ఇంద్రః = ఇంద్రుఁడు (బలాభిమాని యగు దేవత), నః = మాకు, శం = సుఖకరుఁడు (అగుఁగాక). బృహస్పతిః = బృహస్పతి (వాక్కునకును బుద్ధికిని అభిమానియగు దేవత సుఖకరుఁడు అగుఁగాక), ఉరు క్రమః = (త్రివిక్రమావతారమునందు) విస్తీర్ణమయిన పాదప్రక్షేపముగల, విష్ణుః = విష్ణువు (పాదాభిమాని యగు దేవత), నః = మాకు, శం = సుఖకరుఁడు (అగుఁ గాక).

టీ. ౨. బ్రహ్మణే = వాయుస్వరూపునికొఱకు, నమః = నమస్కారము. వాయో = ఓ వాయూ! తే = నీ కొఱకు, నమః = నమస్కారము, త్వం ఏవ = నీవే, ప్రత్యక్షం = ప్రత్యక్షమయిన, బ్రహ్మ అసి = బ్రహ్మము అగుచున్నాఁడవు. త్వం ఏవ = నిన్నే, ప్రత్యక్షం = ప్రత్యక్షమయిన, బ్రహ్మ = బ్రహ్మము (అని), వదిష్యామి = చెప్పుచున్నాఁడను. (నిన్నే) ఋతం = ఋతుస్వరూపునిగను (ఋత మనఁగా శాస్త్రాను సారము ఆచరణీయమని బుద్ధియందు నిశ్చయించుకొనఁబడిన విషయము, యజ్ఞ యాగాదికర్మ జాతము). వదిష్యామి = చెప్పుచున్నాఁడను. సత్యం = సత్యస్వరూపునిగను (సత్యమనఁగా శాస్త్రానుసారము నిశ్చయింపబడిన విషయమును వాక్కాయములచేత నాచరించుట), వదిష్యామి = చెప్పుచున్నాఁడను. తత్ = (సర్వాత్మకమును, నాచేత స్తుతింపఁబడినదియు అగు) ఆవాయు పరబ్రహ్మము, మాం = (విద్యార్థియగు) నన్ను, అవతు = సంరక్షించుఁగాక. తత్ = ఆ వాయుపరబ్రహ్మము, వక్తారం = ఆచార్యుని, అవతు = సంరక్షించుఁగాక. మాం = (విద్యార్థియగు) నన్ను, అవతు = సంరక్షించుఁగాక. వక్తారం = ఆచార్యుని, అవతు = సంరక్షించుఁగాక. ఓం శాంతిః (అస్తు) = (ఆధ్యాత్మిక

తాపము) శమించుఁగాక. శాంతిః (అస్తు) — (ఆధిభౌతికతాపము) శమించుఁగాక. శాంతిః (అస్తు) = ఆధిదైవికతాపమ శాంతించుగాక.

తా. ౧. మిత్రుఁడు, వరుణుఁడు, అర్యముఁడు, ఇంద్రుఁడు, బృహస్పతి, విష్ణువు. వీరలు అధ్యాత్మదేవతలు. అనఁగా —

౧. శరీరమునందుఁ గల ప్రాణవృత్తికి అభిమానియగు దేవత మిత్రుఁడు; ౨. అపానవృత్తికి అభిమాని యగుదేవత వరుణుఁడు; ౩. నేత్రాభిమాని యగుదేవత అర్యముఁడు; ౪. బలాభిమాని యగుదేవత ఇంద్రుఁడు; ౫. వాగ్బుద్ధ్యభిమాని యగు దేవత బృహస్పతి; ౬. పాదాభిమాని యగుదేవత విష్ణువు. ఇటుల వీరలు అధ్యాత్మ దేవతలగుచున్నారు. ఇట్టిదేవతలు నాకు సుఖమును కలుగఁజేయుదురుగాక యని ప్రప్రథమమున ప్రార్థించుచున్నాఁడు. ఆయా దేవతలు సుఖకారులయిన యెడల విద్యా శ్రవణము, విన్న విషయమును మరుపులేక మనస్సునందు ధరించుట మొదలగు కృత్యములు శిష్యునకును, శిష్యున కుపదేశించుట మొదలగునవి ఆచార్యునకును చక్కఁగా కలుగునను తలంపుతో వారిని ప్రార్థించుట అత్యావశ్యకము గదా.

తా. ౨. బ్రహ్మమునకు నమస్కారము. ఓ వాయూ! నీకు నమస్కారము; ఇచట ప్రథమమున పరోక్షముగను, రెండవ పర్యాయము అపరోక్షముగను బ్రహ్మమునకు నమస్కారము చేయఁబడినది. నీవే ప్రత్యక్షమయిన బ్రహ్మము అయితివి. కావున నిన్నే ప్రత్యక్షమయిన బ్రహ్మమునుగా చెప్పుచున్నాఁడను. ప్రాణము బాహ్యమయిన చక్షురాదికమువలె రూపదర్శనాద్యనుమేయముగాక సాక్షివేద్యమయి భోక్త యగు పరమాత్మకు సన్నిహితమయి యుండునది కావున ప్రత్యక్ష బ్రహ్మమనుట న్యాయమే యగుచున్నది. రాజదర్శనాకాంక్షి యగువాఁడు రాజద్వారపాలకుని గాంచి నీవే రాజువంటివాఁడవు అని పలికి సులభముగ తన కార్యమును సానుకూలముగ చేసికొనుచున్నటుల హృదయాంతర్గతుఁడగు బ్రహ్మమును జూడఁదలచిన ముముక్షువు హార్దబ్రహ్మమునకు ద్వారపాలకుఁడగు వాయువును నీవే బ్రహ్మమని పలుకుటయు యుక్తమే యగుచున్నది.

ఇదివఱకు నమస్కారము, బ్రహ్మవదనము (అనఁగా బ్రహ్మమని చెప్పుట) అనునవి చెప్పి స్తుత్యంతరమును చెప్పుచున్నాఁడు :—

నిన్నే ఋతమునుగాఁ జెప్పుచున్నాఁడను.
నిన్నే సత్యమునుగాఁ జెప్పుచున్నాఁడను.

ఋతమనఁగా శాస్త్రీయమయిన కర్తవ్యమును బుద్ధియందు నిశ్చయించు కొనుట. సత్యము అనఁగా ఆ నిశ్చయించుకొన్న విషయమును వాక్కాయ ములచే నాచరించుట. వాయువు సర్వాత్మకము కావున ఋతుసత్యశబ్దాభిధేయము కూడ అగుచున్నది. ఇట్టి సర్వాత్మక మగు వాయుపరబ్రహ్మము విద్యార్థి యగు నాచేత నమస్కరింపఁబడి స్తుతింపఁబడినదై నాకు విద్యను కలుగఁజేసియు, ఆచా ర్యునకు వక్తృత్వసామర్థ్యమును కలుగఁజేసియు సంరక్షించుఁ గాక. "నన్ను సంరక్షించుఁ గాక। ఆచార్యుని సంరక్షించుఁగాక।" అని రెండు పర్యాయములు చెప్పుట ఆదరార్థము అని గ్రహించవలయును.

"శాంతిః శాంతిః శాంతిః"

అని ముమ్మారు శాంతిని పఠించుట త్రివిధతాప ప్రశమనార్థము చెప్పఁబడినది.

౧. వివరణము

అహరభిమాన దేవత మిత్రుఁడనియు, రాత్ర్యభిమానదేవత వరుణుఁడనియు అనుటకు శ్రుతిప్రమాణము:—

తైత్తిరీయసంహిత ౬-వ కాండము, ౪-వ ప్రపాఠకము, ౮-వ యను వాకమునందు మిత్రావరుణగ్రహ బ్రాహ్మణమునం దీవిధముగఁ గలదు. —

శ్రు. నవా ఇదం దివా న నక్త మాసీ దవ్యావృత్తం తే దేవా మిత్రా వరుణా వబ్రువ న్నిదం నో వివాసయతా మితి తా వబ్రూతాం వరం వృణావహా ఏక ఏవాఽఽవత్పూర్వో గ్రహో గృహ్యాతా ఇతి తస్మాదైంద్ర వాయవః పూర్వో మైత్రావరుణా ద్గృహ్యతే ప్రాణాపానౌ హ్యేతౌ యదుపాగ్ంశ్వన్తర్యామౌ మిత్రోఽహ రజనయ ద్వరుణో రాత్రిం తతో వా ఇదం వ్యౌచ్ఛత్. తై. సం. ౬. ౪. ౮. ౩.

(అర్థ.) ప్రథమమున కాలమంతయు ఇంతవఱకు రాత్రి, ఇంతవఱకు పగలు అను విభాగము లేకయుండెననియు, దేవతలు మిత్రావరుణులను కాలమును విభ జింపవలసినదిగా కోరిరనియు, దేవతల మనోరథానుసారము వారిలో మిత్రుఁడు (సూర్యోదయము మొదలుకొని సూర్యుని యస్తమయము వఱకు) పగలని విభ జించెననియు, వరుణుఁడు (సూర్యాస్తమయము మొదలుకొని మఱల సూర్యో దయము వఱకు) రాత్రియని విభజించెననియు, అదిమొదలుకొని ఈ విభాగము ఏర్పడినది.

ప్రకృతమున కర్తావ్యవశ్యకమగుటచేత తాత్పర్యమునందు అభిమాని దేవతా విషయమును మాత్రమే వివరించినాఁడను.

## ౨. తాపత్రయ వివరణము

1. ఆధ్యాత్మికతాపమనఁగా:— జ్వరము, తలనొప్పి మున్నగు వ్యాధులు; 2. అధిభౌతికతాప మనఁగా:—చోరవ్యాఘ్రాదుల యుపద్రవము; 3. అధిదైవిక తాపమనఁగా:— యక్షరాక్షసాద్యుపద్రవము; ఇట్టి శాంతిపఠనము మున్నగునవి శిష్యాభిప్రేతములు కాని ఆచార్యాభిప్రేతములు కావని ఎఱుంగవలయును.

సూచనము:— మూలమునందు "త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" అని గలదు. ఇట్లే వైదిక పాఠము సుప్రసిద్ధమయి యున్నది. శ్రీమచ్ఛంకరాచార్యులవారు భాష్యమునందు "త్వామేవ" అని గ్రహించి భాష్యము నొనర్చిరి. ద్వాదశానువాకము నందు "త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవాదిషమ్" అనియుండుటచేత ఇచట కూడ ఆచార్యులవారి కాలమునందు "త్వామేవ" అని పాఠ ముండుటచేతనే వారటుల గ్రహించి భాష్యము నొనర్చియున్నారని తెలియవచ్చుచున్నది. అయినను వైదిక పాఠబలము ననుసరించి మేము "త్వమేవ" అనియే మూలమునందు ముద్రించి యున్నారము. అర్థమునందు "త్వం ఏవ = నిన్నే" అని అర్థమును వ్రాసి యున్నారము. అప్పుడు ద్వితీయార్థమునందు ప్రథమనుగా గ్రహించవలయును.

౩. "వదిష్యామి" అను లకారమునకు వర్తమానార్థమును గ్రహించితిమి. వనమాలయందిట్లే వ్యాఖ్యాతమైనది.

౪. శాంతి పాఠరూపమగు "శం నో మిత్ర శ్శం వరుణః..........ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః" అనునది ఇచట ప్రథమానువాకముగా పరిగణింపఁబడినది. ఈ శిక్షాధ్యాయమునందు ౧౨ అనువాకములు గలవు. అందు ౧-వ, ౧౨-వ అనువాకములు శాంతిపాఠరూపములు.

౫. ఈ యధ్యాయమునందు ప్రప్రథమమున వర్ణ, స్వర, మాత్రాది శిక్షణావశ్యకతను బోధించుటచేత "శిక్షావల్లి" యనియు, సంహితాద్యుపాసనమును చెప్పుటచేత "సాంహిత్యుపనిషత్" అనియు, ఈ యధ్యాయమునకు నామములు వ్యవహారములో నున్నవి.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృత

# ఉపనిషద్భాష్య పీఠిక



(మంగళాచరణము)

శ్లో. యస్మా జ్జాతం జగ త్సర్వం యస్మి న్నేవ ప్రలీయతే,
యేనేదం ధార్యతే చైవ తస్మై జ్ఞానాత్మనే నమః. ౧

తా. ఈ జగమంతయు ఎవనివల్ల నుండి పుట్టినదో, ఎవనిచేత ధరింపఁబడు చున్నదో, ఎవనియందు లీన మగుచున్నదో అట్టి జ్ఞానాత్మునకు (అనఁగా జ్ఞానస్వరూపు నకు) నమస్కారము.

శ్లో. యై రిమే గురుభిః పూర్వం
పదవాక్యప్రమాణతః,
వ్యాఖ్యాతా స్సర్వవేదాంతా
స్తా న్నిత్యం ప్రణతోఽస్మ్యహమ్. ౨

తా. పదవాక్య ప్రమాణ వివేచనాపూర్వకముగ ఈ సకలోపనిషత్తులను ఏ గురువులు వ్యాఖ్యాన మొనర్చియుండిరో అట్టి గురువులను గూర్చి నే నెల్లప్పుడు నమస్కరించుచున్నాఁడను.

శ్లో. తైత్తిరీయకసారస్య మయా ఽఽచార్యప్రసాదతః,
విస్పష్టార్థరుచీనాం హి వ్యాఖ్యేయం సంప్రణీయతే. 3

తా. (ఉపనిషత్తునందుండు) సకల పదములకు స్పష్టముగ అర్థమును గ్రహింపఁదలఁచు వారి నిమిత్తము నేను శ్రీ మదాచార్యులవారి కృపావిశేష బలము చేత తైత్తిరీయోపనిషత్తునకు వ్యాఖ్యానమును చేయుచున్నాఁడను.

శాంకరభాష్యమ్:

నిత్యాన్యధిగతాని కర్మాణి ఉపాత్తదురితక్షయార్థాని, కామ్యాని చ ఫలార్థినాం పూర్వస్మిన్ గ్రంథే। ఇదానీం కర్మోపాదాన హేతుపరిహారాయ బ్రహ్మవిద్యా ప్రస్తూయతే। కర్మహేతుః కామః స్యాత్, ప్రవర్తకత్వాత్। ఆప్తకామానాం హి కామాభావే స్వాత్మన్యవస్థానా ప్రవృత్త్యను పపత్తిః। ఆత్మకామత్వే చాప్తకామతా। ఆత్మా చ

బ్రహ్మ। తద్విదోహి పరప్రాప్తిం వక్ష్యతి। అతః అవిద్యానివృత్తౌ స్వాత్మన్యవస్థానం పరప్రాప్తిః. "అభయం ప్రతిష్ఠాం విన్దతే" "ఏతమానన్దమయ మాత్మానముప సంక్రామతి" ఇత్యాది శ్రుతేః। కామ్యప్రతిషిద్ధయో రనారమ్భాత్ ఆరబ్ధస్యచ ఉప భోగేన క్షయాత్ నిత్యానుష్ఠానేన చ ప్రత్య వాయాభావాత్ అయత్నత ఏవ స్వాత్మన్య వస్థానం మోక్షః। అథవా, నిరతిశయాయాః ప్రీతేః స్వర్గశబ్దవాచ్యాయాః కర్మహేతు త్వాత్కర్మభ్య ఏవ మోక్ష ఇతి చేత్, న; కర్మానేకత్వాత్। అనేకాని హి ఆరబ్ధఫలాని అనారబ్ధ ఫలాని చ అనేక జన్మాంతరకృతాని విరుద్ధఫలాని కర్మాణి సంభవన్తి। అతః తేషామనారబ్ధ ఫలానామేకస్మిఞ్జన్మన్యుపభోగేన క్షయాసంభావాత్ శేషకర్మానిమిత్త శరీ రారమ్భోపపత్తిః। కర్మశేష సద్భావసిద్ధిశ్చ "తద్య ఇహ రమణీయ చరణాః" "తతః శేషేణ" ఇత్యాది శ్రుతి స్మృతి శతేభ్యః। ఇష్టానిష్టఫలానామనారబ్ధానాం క్షయార్థాని నిత్యాని ఇతి చేత్, న; అకరణే ప్రత్యవాయశ్రవణాత్। ప్రత్యవాయ శబ్దోహి అనిష్ట విషయః। నిత్యాకరణ నిమిత్తస్య ప్రత్యవాయస్య దుఃఖరూపస్య ఆగామినః పరిహారా ర్థాని నిత్యానిత్యభ్యుపగమాత్ న అనారబ్ధ ఫలకర్మక్షయార్థాని। యది నామ అనారబ్ధ ఫలకర్మక్షయార్థాని నిత్యాని కర్మాణి, తథాప్యశుద్ధమేవ క్షపయేయుః; న శుద్ధమ్, విరోధాభావాత్। న హి ఇష్టఫలస్య కర్మణః శుద్ధరూపత్వాన్నిత్యైర్విరోధ ఉపపద్యతే। శుద్ధాశుద్ధయోర్హి విరోధో యుక్తః। న చ కర్మహేతూనాం కామానాం జ్ఞానాభావే నివృ త్త్యసంభవాదశేష కర్మక్షయోపపత్తిః। అనాత్మవిదోహి కామః, అనాత్మ ఫలవిషయ త్వాత్। స్వాత్మని చ కామానుపపత్తిః, నిత్యప్రాప్తత్వాత్। స్వయం చాత్మా పరం బ్రహ్మేత్యుక్తమ్। నిత్యానాం చ అకరణ మభావః తతః ప్రత్యవాయానుపపత్తి రితి। అతః పూర్వోపచిత దురితేభ్యః ప్రాప్యమాణాయాః ప్రత్యవాయక్రియాయా నిత్యా కరణం లక్షణమితి శతృప్రత్యయస్యానుపపత్తిః — "అకుర్వన్విహితం కర్మ" ఇతి। అన్యథా హి అభావాద్భావోత్పత్తి రితి సర్వప్రమాణవ్యాకోప ఇతి। అతః అయత్నతః స్వాత్మన్యవస్థాన మిత్యనుపపన్నమ్। యచ్చోక్తం నిరతిశయ ప్రీతేః స్వర్గశబ్ద వాచ్యాయాః కర్మనిమిత్తత్వాత్కర్మారభ్య ఏవ మోక్ష ఇతి, తన్న; నిత్యత్వా న్మోక్షస్య। న హి నిత్యం కించిదారభ్యతే, లోకే యదారబ్ధమ్, తదనిత్యమితి। అతో న కర్మారభ్యో మోక్షః। విద్యా సహితానాం కర్మణాం నిత్యారమ్భ సామర్థ్యమితిచేత్, న; విరోధాత్। నిత్యం చారభ్యత ఇతి విరుద్ధమ్। యద్ధి నష్టమ్, తదేవ నోత్పద్యత ఇతి ప్రధ్వంసాభావ వన్నిత్యోఽపి మోక్ష ఆరభ్య ఏవేతిచేత్, న; మోక్షస్య భావరూప త్వాత్। ప్రధ్వంసాభావోఽప్యారభ్యత ఇతి న సంభవతి; అభావస్య విశేషాభావాద్వి

కల్ప మాత్రమేతత్। భావ ప్రతి యోగీ హ్యభావః। యథా హ్యభిన్నోఽపి భావో ఘటపటాది భిర్విశేష్యతే భిన్న ఇవ ఘటభావః పటభావ ఇతి, ఏవం నిర్విశేషోఽప్య భావః క్రియాగుణ యోగా ద్రవ్యాది వ ద్వికల్ప్యతే। న హ్యభావ ఉత్పలాది వ ద్విశేషణ సహభావీ। విశేషణ వత్త్వే భావ ఏవ స్యాత్। విద్యా కర్మ కర్తు ర్నిత్య త్వాత్ విద్యాకర్మ సంతానజనిత మోక్ష నిత్యత్వమితి చేత్, న; గఙ్గాస్రోతోవత్కర్తృత్వస్య దుఃఖరూపత్వాత్, కర్తృత్వోపరమే చ మోక్షవిచ్ఛేదాత్। తస్మాద విద్యాకామకర్మో పాదాన హేతునివృత్తౌ స్వాత్మన్యవస్థానం మోక్ష ఇతి। స్వయంచాత్మా బ్రహ్మ। తద్విజ్ఞానా దవిద్యా నివృత్తి రితి। అతః బ్రహ్మవిద్యార్థోపనిషదారభ్యతే। ఉపనిష దితి విద్యోచ్యతే, తత్సేవినాం గర్భ జన్మజరాది నిశాతనాత్, తదవసానాద్వా బ్రాహ్మణ ఉపనిగమయి తృత్వాత్: ఉపనిషణ్ణం వా అస్యాం పరం శ్రేయ ఇతి। తదర్థత్వా ద్గ్రన్థోఽప్యుపనిషత్॥



# పీఠిక



నిత్యకర్మలు పూర్వజన్మమునందు చేసిన పాపములను నశింపఁజేయునవి యనియు, కామ్యకర్మలు ఫలాభిలాషగలవారికనియు పూర్వభాగమునందు (అనఁగా వేదమునందు) ప్రతిపాదింపఁబడియున్నది. ఇపుడు కర్మప్రవృత్తికి హేతుభూత మగు కామముయొక్క నిరాసముకొఱకు బ్రహ్మవిద్య చెప్పఁబడుచున్నది. కోరికయుండియే కర్మాచరణమునందు ప్రవర్తింపుచున్నారు కావున కర్మమునకు కామము (కోరిక) ప్రవర్తక మగుచున్నది. ఆప్తకాములయిన వారలకు కామము లేనందువలన వారు ఆనందాత్మయందు లీనులయియుందురు. అప్పుడు ప్రవృత్తియే కలుగఁజాలదు. ఆత్మకాముఁడే ఆప్తకాముఁ డనంబడును. ఆత్మయనఁగా బ్రహ్మము. అట్టి బ్రహ్మము నెఱింగిన వానికే పరప్రాప్తిని (బ్రహ్మవిదాప్నోతి పరం. తై. ఆ. ౮. ౧. ౧. అని యందు) చెప్పఁబడును. అందువలన అవిద్య నశింపఁగా స్వస్వరూపమునం దుండుటయే పరప్రాప్తియగును. ఇందులకు ప్రమాణభూతములగు శ్రుతులు.—

౧. అభయం ప్రతిష్ఠాం విందతే. తై. ఉ. ౨. ౭. ౧.

౨. ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి. తై. ఉ. ౨. ౮. ౧.

(మున్నగునవి చాల గలవు.)

## ౧. పూర్వపక్షము

### పూర్వమీమాంసకులు కేవల కర్మములే మోక్ష సాధనములని నిర్ణయించుట

క. (మోక్షము నభిలషించువాఁడు) కామ్య. నిషిద్ధకర్మలను చేయఁడు. ప్రారబ్ధకర్మము అనుభవముచేత నశించును. నిత్యకర్మాచరణము వలన ప్రత్యవాయము కలుగదు. కావున అప్రయత్నముగ స్వస్వరూపముగ నుండుటయే మోక్షము.

ఖ. లేక నిరతిశయ ప్రీతియనునది స్వర్గశబ్దవాచ్యము. అట్టి స్వర్గము కర్మాచరణసాధ్యము. కావున కర్మల నాచరించుటవలననే మోక్షము కలుగును.

## ౧. తత్సమాధానము

క. కర్మ లనేకవిధములు అయియుండుటవలన అట్లనరాదు. అనేక జన్మాంతర కృతములును, [1]విరుద్ధఫలజనకములును అగు కర్మలు ఆరబ్ధఫలములనియు, అనారబ్ధ ఫలములనియు అనేకవిధములుగా నున్నవి. అందువలన అనారబ్ధఫలములు (అగు కర్మలు) ఒకే జన్మమునందు అనుభవించుటచేత నశించుననుట సంభవముకాదు. (కావున) శేషకర్మ (ఫలానుభవ) నిమిత్తము శరీరారంభము కలిగితీరును. కర్మ (ఫలము) శేషించి యుండుననుటకు.—

౧. శ్రు. తద్య ఇహ రమణీయచరణాః అభ్యాశోహ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వా; ఉథ యఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సుకరయోనిం వా చాండాల యోనింవా[2]) ఛాందోగ్యోపనిషత్తు. ౫. ౧౦. ౭.

౨. స్మృ. (వర్ణా ఆశ్రమా శ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మను భూయ) తతశ్శేషేణ విశిష్టదేశజాతికులరూపాయుశ్శ్రుతవృత్తవిత్తసుఖ మేధసో జన్మప్రతి ప్రవద్యంతే.[2]

గౌతమధర్మసూత్ర. ౨. ౧౧. ౨౯.

మున్నగు శ్రుతిస్మృతిప్రమాణము లనేకములు గలవు.

### పూర్వపక్షము

నిత్యకర్మలు ఆరబ్ధములుకాని ఇష్టానిష్టఫలములుగల కర్మల నాశన మొనర్చును (కావున నిత్యకర్మాచరణముచేత కర్మ శేషము నశించి మోక్షము సిద్ధించును. దీనివలన

1. విరుద్ధఫలజనకము లనఁగా ఒకఁడు అశ్వమేధయాగము నొనర్చును. అతఁడే సురా పానాది దుష్కృత్యముల నొనర్చును. ఈ సుకృత దుష్కృతముల ఫలములు విరుద్ధముగ నుండును. ఒక జన్మమునందు ఇట్టి విరుద్ధ ధర్మములగు ఫలముల ననుభవించుట అసంగతమని భావము.

2. అర్థ. పుణ్యకర్మల నాచరించినవారు స్వర్గమునందు పుణ్యఫల మనుభవించి పుణ్య శేషముతో బ్రాహ్మణాద్యుత్తమ జన్మములందు పుట్టుచున్నారు. పాపకర్మల నొనర్చినవారు నరక లోకమునందు తత్ఫల మనుభవించి కర్మశేషముతో శ్వసూకరచండాలాది నీచజన్మములందు పుట్టు చున్నారు. అని పై ఛాందోగ్యశ్రుత్యర్థము. గౌతమధర్మసూత్రార్థము నైత మింతయే.

జ్ఞానము లేకయే నిత్యకర్మాచరణమువలన మోక్షము సిద్ధించును.) అని పూర్వమీమాంసకుని యభిప్రాయము.

## సమాధానము

(నిత్యకర్మలు) చేయనియెడల ప్రత్యవాయము గలదని చెప్పఁబడి యున్నది కావున నీవు చెప్పినట్లు అనరాదు. (నిత్యకర్మలు) నిత్యకర్మల నాచరింపకపోవుటచేత కలుగునట్టి ప్రత్యవాయమును పోగొట్టుకొనుటకే ఆచరింపఁబడుచున్నవి. (అని పూర్వ మీమాంసకులు) అంగీకరించియున్నారు కావున అనారబ్ధఫలకర్మ క్షయార్థము (నిత్య కర్మాచరణ) మనుట తగదు. లేక ఒకవేళ నిత్యకర్మాచరణము అనారబ్ధఫల కర్మ క్షయార్థమే యని యంగీకరించినను పాపఫలప్రదకర్మనే నశింపఁ జేయునుఁగాని విరోధము లేకపోవుటవలన పుణ్యఫలప్రదకర్మలను నశింపఁజేయఁజాలదు. ఇష్టఫల (ప్రద) మగు కర్మ పుణ్యకర్మ కావున నిత్యకర్మలతోడ విరోధింపదు. పుణ్యపాపము లకు (గదా పరస్పరము) విరోధము తగియుండును.

కర్మాచరణమునకు హేతుభూతములగు కామములు జ్ఞానము లేనియెడల నశింపఁజాలవు కావున అశేషకర్మక్షయ మెన్నఁటికిని కాఁజాలదు. కామము ఫల విషయము కావున (ఆ కామము) అనాత్మవిదునకే కలుగునుగాని ఆత్మవిదునకు కలు గదు. ఆత్మ నిత్యప్రాప్తుఁడు కావున కామోత్పత్తియే కలుగఁజాలదు. విద్వాంసుని విషయమై "అయమాత్మా పరంబ్రహ్మ" యని చెప్పఁబడియే యున్నది.

నిత్యకర్మల నాచరింపమిచే ప్రత్యవాయము కలుగుననుట అయుక్తము కావున పూర్వజన్మార్జిత పాపములవలన పొందఁబడునట్టి ప్రత్యవాయ క్రియకు నిత్యాకరణ మును లక్షణగా గ్రహించినయెడల "అకుర్వన్ విహితం కర్మ" అనుచోటఁ గల శతృప్రత్యయమునకు అనుపపత్తి లేదు.

అట్లు గ్రహింపని యెడల "అభావమువల్ల నుండి భావము పుట్టుట" యను సర్వప్రమాణవ్యాకోపము సిద్ధించును.

ఇందువలన అయత్నముగ స్వాత్మావస్థాన మనుట పొసఁగనేరదు.

(ఇంతవఱకు మీమాంసకుని ప్రథమాశంకకు సమాధానము.)

## పూర్వమీమాంసకుని ద్వితీయాశంకకు సమాధానము

౮. "స్వర్గశబ్దవాచ్య మగు నిరతిశయప్రీతి కర్మలవల్లనే సిద్ధించుచున్నది కావున కర్మలవల్లనే మోక్షము సిద్ధించును" అని చెప్పుట యుక్తము కాదు.

(ఏలయనఁగా) మోక్షము నిత్యము. లోకమునందు నిత్యమేదియు ఆరబ్ధమగుటలేదు. ఏయది ఆరబ్ధమో అది యనిత్యము. కావున మోక్షము కర్మల (నాచరించుట) వలన కలుగఁజాలదు. ''విద్యాసహితములగు కర్మలు నిత్య (మగు మోక్ష)మును కలుగఁజేయును'' అనియు ననఁగూడదు. (అట్లనుట) విరోధమగుచున్నది. ''నిత్యము ఆరబ్ధమగుచున్నది.'' అనుట (పరస్పర) విరుద్ధము (గదా) ''ఏయది నశించుచున్నదో అదియే మఱల పుట్టుటలేదు. కావున ప్రధ్వంసాభావమువలె నిత్యమగు మోక్షము సైతము ఆరబ్ధము కావచ్చును'' అను నెడల అట్లనరాదు. (ఏలయనఁగా) మోక్షము భావరూపము. ''ప్రధ్వంసాభావము ఆరబ్ధమగుచున్నది'' అనుటయు పొసఁగనేరదు, అభావమునకు విశేషము లేకపోవుటచేత కేవలము వికల్పమే యగుచున్నది. అభావమనఁగా భావమునకు భిన్నమయినది. (భావమునకు ప్రతియోగియనుట) లోకమునందు అభిన్నమగు భావము ఘటపటాదులతో విశేషితమయి భిన్నమయినదానివలె 'ఘటభావము' అనియు; 'పటభావము' అనియు (ఎటుల) చెప్పఁబడుచున్నదో అట్లే నిర్విశేషమగు అభావము సైతము క్రియాగుణసంబంధమువలన ద్రవ్యాదికమువలె వికల్పింపఁబడుచున్నది. అభావము ఉత్పలాదికమువలె విశేషణవిశిష్టముకాదు. విశేషణ సమన్వితమే యభావమగు నెడల భావమే యగునుగదా.

ప్రకారాంతరముగా పూర్వపక్షము—తత్సమాధానము

పూర్వ:- విద్యాకర్మకర్త నిత్యుఁడు కావున విద్యాకర్మసమూహము వలన కలుగునట్టి మోక్షము సైతము 'గంగాప్రవాహమువలె నిత్యమగుఁగాక'

సమా:- అనుట తగదు. కర్తృత్వ మెప్పుడును దుఃఖరూపము. కర్తృత్వమును వదలిన మోక్షమునకు విచ్ఛిత్తి సంభవించును. కావున అవిద్యాది కర్మోపాదాన హేతువులు నశింపఁగా స్వాత్మావస్థానమే మోక్షము.

ఆత్మయనిన బ్రహ్మమే. అట్టి యాత్మవిజ్ఞానమువల్లనే అవిద్యానివృత్తి యగుచున్నది. కావున బ్రహ్మవిద్యానిమిత్తము ఉపనిషత్తు (యొక్క వ్యాఖ్యానము) ఆరంభింపఁబడుచున్నది.

ఉపనిషచ్ఛబ్దనిర్వచనము

ఉపనిషత్తనఁగా బ్రహ్మవిద్యయని (ఎఱుంగునది).

వైయాకరణ మతము ననుసరించి నిర్వచనత్రయము.

౧. ఉపనిషదితి బ్రహ్మవిద్యా. తచ్ఛీలనాం కర్మజన్మమరణాది నిశాతనాత్.

౨. తదవసాదనా ద్వా.

౩. బ్రహ్మణః ఉపనిగమయితృత్వాత్ (తదర్థత్వాత్ గ్రంథోఽప్యుపనిషత్).

అర్థ. ౧. ఉపనిషత్తనఁగా బ్రహ్మవిద్య. ఆ బ్రహ్మవిద్యను పరిశీలించు విద్వాంసులగువారలకు కర్మజన్మ మరణాదికమును శిథిలమొనర్చునది కావున "ఉపనిషత్తు" అనంబడును.

౨. లేక ఆజన్మమరణాదికమును నశింపఁజేయునది కావున (బ్రహ్మవిద్య) ఉపనిషత్తనంబడును.

౩. (లేక) బ్రహ్మమును పొందింపఁజేయునది కావున బ్రహ్మవిద్య 'ఉపనిషత్తనంబడును. అట్టి విషయము కలిగియుండుటచేత గ్రంథము సైతము ఉపనిషత్తనంబడును.

## అర్థాంతరము

౪. ఉపనిషణ్ణం అస్యాం పరంశ్రేయ ఇతి ఉపనిషత్. తదర్థత్వాద్గ్రంథోఽప్యుపనిషత్.

అర్థ. దీనియందు మోక్షము సమీపమునందు విషయముగానున్నది. కావున 'ఉపనిషత్' అని చెప్పఁబడును. అట్టి విద్యయే ప్రయోజనముగాఁగల గ్రంథము సైతము ఉపనిషత్తని చెప్పఁబడును.

వివరణము:- జీవునకు శరీరప్రాప్తి కలుగుట బంధహేతువనియు, శరీరప్రాప్తిలేకపోవుట మోక్షమనియు శ్రుతిసిద్ధాంతము. ఈ విషయమునే ౧. శ్రు. న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి ౨. శ్రు. అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః. అనియు శ్రుతులు ఘంటాఘోషముగ పలుకుచున్నవి. ఈ విషయమును వేదాంతులు సుస్పష్టముగను, ఒక విధముగ పూర్వమీమాంసకులును అంగీకరించినారు. కాని ఇట్టి స్థితి జ్ఞానమువలనఁ గాని కలుగఁజాలదని వేదాంతులును. జ్ఞాన సహకారలేకయే కర్మాచరణమువల్లనే సిద్ధించునని పూర్వమీమాంసకులును పలుకుచున్నారు. అందు పూర్వమీమాంసకుని సిద్ధాంతమును ప్రథమమున వివరించెదను:-

ముముక్షువగువాఁడు కామ్యకర్మలను నిషిద్ధకర్మలను ఆచరింపఁజాలఁడు కావున స్వర్గాదిపుణ్యలోకములుగాని, శ్రేష్ఠజన్మముగాని, నరకబాధగాని, నీచజన్మముగాని వానికి కలుగదు.

నిత్యకర్మల నాచరించుచున్నాఁడు కావున ప్రత్యవాయము అనఁగా నిత్యకర్మల నాచరింపనందువలన కలిగెడి పాపము నశించును.

ప్రారబ్ధమగు కర్మఫలమువలన ఈ జన్మము మనకు సమకూడెను కావున ప్రారబ్ధజన్మానుభవమువలన కర్మయంతయు నశించిపోవును.

జన్మాంతరమును కలుగఁజేయఁ జాలెడి కామ్యనిషిద్ధకర్మలు ముముక్షువగువానికి లేవు గనుక వానికి పునర్జన్మ ప్రాప్తియేలేదు. ఇదియే ప్రియాప్రియరహితావస్థ గావున మోక్షము అనంబడును.

(పూర్వమీమాంసకుల యభిప్రాయమునందు నిత్యకర్మాచరణమునకు ఫలమేమియు లేదు. ఆచరింపని యెడల వచ్చెడి పాపమును పోఁగొట్టుకొనుటకయి నిత్యకర్మల నాచరించుచున్నాఁడేగాని ఆ యాచరణము వలన మఱొక పుణ్యఫలమేమియు లేదని భావము.

## వేదాంత మతమున పైదానికి సమాధానము

వేదాంతుల యభిప్రాయమునందు నిత్యకర్మాచరణము సైతము పుణ్యలోక ప్రాప్తికి సాధనభూతమని గ్రహించునది.

కర్మలు విహితములనియు, కామ్యములనియు, ప్రాయశ్చిత్తములనియు, నిషిద్ధములనియు నాల్గు తెఱఁగులు.

శ్రుతియందు ఈపైని వివరింపఁబడిన కర్మభేదమును పరిగణింపక శ్రు. కర్మణా పితృలోకః. బృ. ఉ. ౧. ౫. ౧౬. అని చెప్పఁబడియున్నది. ఇచట 'కర్మణా' యను నిర్విశేషణమగుపదము విహితకర్మ వాచకముగాని తదితరవాచకము గాదు. ఏలయనఁగా, 'కర్మణా' యను పదమునకు నిషిద్ధ కర్మయని గ్రహింపఁ దగదుగదా. అట్లే ప్రాయశ్చిత్తకర్మయని గ్రహింపఁ దగదుగదా. కామ్యకర్మ యని యందుమేని కామ్యకర్మలు పశుకాముఁడు, స్వర్గకాముఁడు, స్వారాజ్యకాముఁడు మున్నగు అధికారిని కంఠోక్తిగనే చెప్పుచున్నవి. ఇచట అట్టి కంఠోక్తి లేదు. ఇఁక పరిశేషన్యాయముచేత 'కర్మణా' యను పదముచేత 'విహితకర్మయే' తప్పక గ్రహింపవలసివచ్చుచున్నది అని వేదాంతుల యభిప్రాయము.

ఇదియునుఁగాక మోక్షకామియగువాఁడు ఈ కర్మను చేయువలయును అని ప్రత్యేకముగ వేదమునం దెచ్చటగాని ఏమియు విధింపఁబడియుండలేదు కనుక కర్మాచరణమునకు సంసారమే ఫలమనుట సిద్ధాంతము.

పూర్వమీమాంసకుఁడు 'ముముక్షు వగువాఁడు కామ్యనిషిద్ధకర్మముల నాచరింపఁడు కావున పుణ్యపాపజన్మలు వానికి కలుగఁజాల'వని చెప్పినపుడు అట్టి

పుణ్యపాపకర్మలు ప్రకృతజన్మమునందు ఆచరింపకపోవచ్చును గాని జన్మాంతరము లందు సంచితములయియున్న కర్మలను గుఱించి పూర్వ మీమాంసకుఁ డేమియు సమాధానమును చెప్పియుండలేదు. పూర్వజన్మములందు సంచితమయియున్న పుణ్య పాపకర్మజాతమంతయు కలసి ప్రకృతజన్మ మేర్పడియున్నదని పూర్వమీమాంసకుని యభిప్రాయము కావచ్చునుగాని అయ్యది సంగతముకాదు.

విరుద్ధఫలజనకములగు కర్మలయొక్క ఫలము ఒక జన్మమునందు అనుభ వించుట యుక్తి ప్రమాణవిరుద్ధము గదా. ఇదియునుఁగాక ధర్మశాస్త్రములందు ఒక్కొక్క కర్మవలన వచ్చెడి ఫలము అనేక జన్మములం దనుభవింపవలసినటుల సుస్పష్టముగా చెప్పఁబడియున్నదిగదా. ఈ విషయమును గుఱించి సుస్పష్టముగ వచించిన శ్రీవార్తికకారుని వచనముల నిట నుదహరించుచున్నాఁడను:—

శ్లో. అనారబ్ధఫలానీహ సంతి కర్మాణి కోటిశః,
తద్వ్యక్షహేతి వచసో గమ్యతాం కర్మణాం స్థితిః. ౧౨

నచైకదేహే భోగోఽస్తి బ్రహ్మహత్యాఽశ్వమేధయోః,
విరుద్ధఫలహేతుత్వాన్మూఢసాత్త్విక దేహయోః. ౧౩

సప్తజన్మానుగం కార్య మేకస్యాపీహ కర్మణః,
శ్రూయతే ధర్మశాస్త్రేషు కిముతానేకకర్మణామ్. ౧౪

పూర్వమీమాంసకుఁడు తరువాత "నిత్యకర్మలు సంచితదురిత క్షయార్థ ములు" అని ఒక మాట చెప్పఁగా మీ సిద్ధాంతమునందు నిత్యకర్మలు నిత్యాకరణము వలన రాఁబోవునట్టి ప్రత్యవాయపరిహారకములు అని గలదు గావున నీ విపుడు చెప్పిన మాట నీ సిద్ధాంతమునకు భంగకరము అని వేదాంతి పూర్వమీమాంసకుని విరసించినాఁడు. నిత్యాకరణమువలన ప్రత్యవాయము పుట్టుననుట పూర్వమీమాంసక మతసిద్ధాంతానుసారమని గ్రహించునది.

"ఆరబ్ధమయినది అనిత్యము" అనెడి సుప్రసిద్ధమయిన వ్యాప్తిని గ్రహించి మోక్షము నిత్యము కావున కర్మారబ్ధము కాదనెడి వేదాంత సిద్ధాంతమునకు విరుద్ధముగ ఆరబ్ధమయినను నిత్యముగా నుండెడి దానిని పూర్వమీమాంసకుఁడు దృష్టాంతముగాఁ జూపుచున్నాఁడు:—

ఘటప్రధ్వంసరూపమగు అభావము ఆరబ్ధమయినను అయ్యది నిత్యము అగు చున్నదిగదా. అట్లే మోక్షము సైతము కర్మారబ్ధమయినను ప్రధ్వంసాభావమువలె

నిత్యమేయగును. అని పూర్వమీమాంసకుఁ డాక్షేపింపఁగా "నీవు చెప్పిన దృష్టాంతము విరుద్ధమయినది. భావరూపమయిన కార్యము ఆరబ్ధమయినది అనిత్య" మని వ్యాప్తియున్నది కావున నీవు చెప్పిన ప్రధ్వంసా భావదృష్టాంతము సరికాదు. ఆ భావము అనఁగా ఉన్నది అనుటకు విరుద్ధము గాని దానియందు సత్తలేదు. మోక్షము భావరూపముగాని అభావరూపముగాదు. భావరూపమగు కార్యము ఆరబ్ధమగునెడల నశించుట సర్వసమ్మతము కావున మోక్ష మెన్నటికిని కర్మారబ్ధము కాదు. అభావ మెన్నటికిని కార్యరూపముకాదు. అభావము సైతము కార్యమే యగునెడల అయ్యదియు భావమే యగును గదా.

## ఉపనిషత్ శబ్దనిర్వచనము.

'ఉపనిషత్' అను శబ్దము "ఉ, ప, ని" అను ఉపసర్గలతో కూడిన 'షద్ల్' ధాతువువల్ల నుండి పుట్టినది. క్విప్ ప్రత్యయరూపము, షద్ల్ ధాతువునకు

'షద్ల్ విశరణగత్యవసాదనేషు' అని మూఁ డర్థములు.

విశరణ మనఁగా:—శిథిలమగుట.

గతి యనఁగా:—పొందుట.

అవసాదన మనఁగా:—నాశనము.

ఈ మూఁ డర్థములకు అనుకూలమగు విధముగా నిర్వచనత్రయమును శ్రీమదాచార్యులవారు భాషించిరి. ఇది వైయాకరణమతానుసారము.

రెండవ నిర్వచనమును శ్రీమదాచార్యులవారు వేదాంతశాస్త్ర సంప్రదాయానుసార మిచ్చియున్నారు. వా రిచ్చిన నిర్వచనమును అనుసరించునట్టి నిర్వచన శ్లోకములను కొన్నింటిని ప్రాచీనములగువాని నీ క్రింద గనంబఱుచుచున్నాఁడను.

శ్లో. ఉపనీయ తమాత్మానం బ్రహ్మాపాస్తద్వయం యతః,
నిహంత్యవిద్యాం తజ్జంచ తస్మా దుపనిషత్ భవేత్. ౧

నిహంత్యనర్థమూలాం స్వా విద్యాం ప్రత్యక్తయా పరమ్,
నయత్య పాస్తసంభేద మత శ్చోపనిషత్ భవేత్. ౨

ప్రవృత్తిహేతూ న్నిశ్శేషాం తన్మూలోచ్ఛేదకత్వతః,
యతో ఽవసాదయే ద్విద్యా తస్మా దుపనిషత్ భవేత్. ౩

శ్రీ మచ్ఛంకరభగవత్పాదాచార్యుల వారే మఱొకచోట ఈ యుపనిషత్ శబ్దమును వివరింపుచు ఇంతకంటె సుస్పష్టముగ వివరించియున్నారు:—

1. య ఇమాం బ్రహ్మవిద్యా ముపయంతి ఆత్మభావేన శ్రద్ధా భక్తి పురస్సరాః సంతః తేషాం గర్భజన్మ జరారోగాద్యనర్థపూగం నిశాత యతి పరం వా బ్రహ్మగమయతి అవిద్యాది సంసారకారణం చ అత్యంత మవసాదయతి— వినాశయతీత్యుపనిషత్; ఉప + ని + పూర్వస్య సదేః ఏవమర్థస్మరణాత్.

అర్థ. ఎవ్వరీ బ్రహ్మవిద్యను శ్రద్ధాభక్తియుక్తులయి సేవించుచున్నారో వారి యొక్క జన్మజరామరణాద్యనర్థములను శిథిల మొనర్చునదియు, లేక పరమగు బ్రహ్మమును పొందించునదియు సంసారకారణమగు అవిద్యను సమూలముగ నాశనమొనర్చునదియు ఉపనిషత్తనంబడును.

ఉప + ని + పూర్వకమగు 'షద్‌ల్' ధాతువునకు ఇట్టి యర్థము గలదని పండితాభిప్రాయము.

సూచనము:— ఈ తైత్తిరీయోపనిషద్రాజము యొక్క వివరణమును శ్రీమచ్ఛంకరాచార్యులు మున్నగువారలు భాష్యములు, దీపికలు మున్నగు రూపమున మాత్రమేగాక ౧. అనుభూతిప్రకాశము - అను పేరుతో శ్రీమద్విద్యారణ్యులవారును. ౨. ఆత్మపురాణము - అను పేరుతో శంకరానందులవారును శ్లోకరూపముగ వివరించి యున్నారు. మఱియు సురేశ్వరాచార్యులవారు తైత్తిరీయోపనిషచ్ఛంకర భాష్యమునకు వార్తికరూపముగ శ్లోకములతో వివరణ మొనర్చియున్నారు. ఆయాయనువాకాంతము నందు ఆయా యనువాకమునకు వివరణరూపములగు శ్లోకములయొక్క సంఖ్యను సూచించెదను: పాఠకు లా గ్రంథములను గాంచి విషయములను గ్రహించెదరు గాక.

౧. అనుభూతిప్రకాశము.

౨. ఆత్మపురాణము.

౩. భాష్యవార్తికము. పీఠిక. శిక్షా. ౧-౩౬
మంత్రభాష్యము. శిక్షా. ౩౭-౪౯



# ౨. ద్వితీయోఽనువాకః

అవ. ఉపనిషద్గ్రంథము అర్థజ్ఞానమే ప్రధానముగాఁ గలది కావున గ్రంథమును పఠించునపుడు అశ్రద్ధగా పఠింతురని భావించి అట్లు పఠింపఁ గూడదని తెలుపుటకుఁగాను శిక్షాధ్యాయ మారంభ మగుచున్నది:—

మ. శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణ స్స్వరః । మాత్రా

బలమ్ । సామసంతానః । ఇత్యుక్త శ్శీక్షాధ్యాయః ॥

శీక్షాం పంచ ॥౧॥

శాంకరభాష్యమ్:—

అర్థజ్ఞాన ప్రధానత్వాదుపనిషదః గ్రన్థపాఠే యత్నోపరమో మా భూదితి శీక్షాధ్యాయ ఆరభ్యతే—

శిక్షా శిక్ష్యతే అనయేతి వర్ణాద్యుచ్చారణ లక్షణమ్; శిక్ష్యన్తే అస్మిన్ ఇతి వా శిక్షా వర్ణాదయః। శిక్షైవ శీక్షా। దైర్ఘ్యం ఛాన్దసమ్। తాం శీక్షాం వ్యాఖ్యాస్యామః విస్పష్టమ్ ఆ సమన్తాత్ప్ర కథయిష్యామః। చక్షిఙః ఖ్యాఞా దిష్టస్య వ్యాఙ పూర్వస్య వ్యక్తవాక్కర్మణ ఏతద్రూపమ్। తత్ర వర్ణః అకారాదిః। స్వర ఉదాత్తాదిః। మాత్రా హ్రస్వాద్యాః। బలం ప్రయత్నవిశేషతః। సామ వర్ణానాం మధ్యమ వృత్త్యోచ్చారణం సమతా। సంతానః సంతతిః, సంహితేత్యర్థః॥ ఏవం శిక్షిత వ్యోఽర్థః శిక్షా యస్మిన్నధ్యాయే, సోఽయం శీక్షాధ్యాయః ఇతి ఏవమ్ ఉక్తః ఉదితః। ఉక్త ఇత్యుప సంహారార్థః॥

ఇతి ద్వితీయానువాక భాష్యమ్॥

టీక. శీక్షాం = శిక్షను, వ్యాఖ్యాస్యామః = వివరముగా చెప్పుచున్నారము. వర్ణః = వర్ణములనియు, స్వరః = స్వరములనియు, మాత్రా = మాత్రలనియు, బలమ్ = బలమనియు, సామ = సామమనియు, సంతానః = సంతానమనియు శీక్షాధ్యాయః = శిక్షాధ్యాయము, ఇతి = ఈ ప్రకారము, ఉక్తః = చెప్పఁబడినది.

తా. వర్ణములనియు, స్వరములనియు, మాత్రలనియు, బలమనియు, సామమనియు, సంతానమనియు నాఱు విధములుగాఁగల శిక్షను చక్కఁగా చెప్పినారము. ఇదియే శిక్షాధ్యాయము.

ఇఁక వీని వివరము:—

౧. వర్ణములు:—అకారాది క్షకారాంతము లగు అక్షరములు.

౨. స్వరములు:—ఉదాత్త, అనుదాత్త, స్వరితములు.

౩. మాత్రలు:—హ్రస్వ, దీర్ఘ, ప్లుతములు.

౪. బలము:—ఆయా యక్షరముల నుచ్చరించునపుడు చేయవలసిన ప్రయత్న విశేషము. ఉదాహరణము:—'బ' యను అక్షరమును ఉచ్చరింపఁ దలఁచితిమేని పెదవుల రెంటిని కలపవలయును. ఆ విధముగా 'బ' అను అక్షరము నుచ్చరించుటకుఁగాను పెదవులరెంటిని కలపుట యనుప్రయత్న విశేషమునుచేయుట 'బలం' మనంబడును. ఇట్లే సకలాక్షరములకు గ్రహించవలయును.

౫. సామము:—అనఁగా సమత. అక్షరములను అతివేగముగను అతి మందముగను పలుకక మధ్యమవృత్తిగా నుచ్చరించుట.

౬. సంతానము:—అనఁగా సంహిత 'వర్ణానాం అవిలంబేనోచ్చారణం సంహితాసంజ్ఞం స్యాత్' అనుప్రమాణానుసారము అక్షరములను విలంబము లేక ఉచ్చరించుట సంహిత యనంబడును.

పైన చెప్పఁబడిన ఆఱు విషయములను అధ్యయనకాలమునందు సావధానముగ పరిశీలించుచు పఠనమును, ప్రవచనకాలమునందు అధ్యాపనమును ఆచరించవలయును. అట్లు కానియెడల మన మనుకొన్నదానికంటె విలక్షణ మయిన అర్థము సంభవించును. కావున అట్టియనర్థనివృత్తికొఱకు ఈ యుపదేశ మిచట చేయఁబడినది.

మంత్రో హీన స్స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న త మర్థ మాహ,
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రు స్స్వరతో ఽపరాధాత్.

అనెడి పాణినీయశిక్షాగ్రంథవచనమువలన ఇట్టి స్వరవర్ణాది నియమవిశేషావశ్యకత కర్మకాండకుసైతము అత్యావశ్యకము కావున ఈ యుపదేశము కర్మకాండయందే చెప్పుట న్యాయము కాని జ్ఞానకాండయందు చెప్పుట మాత్రము తగదని కొందఱందురు. కాని అట్లు చెప్పఁగూడదు.

స్వరవర్ణాదినియమాదికము కర్మకాండమునందు కంటె జ్ఞానకాండమునందే అత్యంతావశ్యకము. ఎట్లనఁగా కర్మకాండమునందు స్వరవర్ణవిపర్యాసాదికము సంభవించు నెడల తద్దోషపరిహారార్థము ప్రాయశ్చిత్తము సైతము విధించఁబడియున్నది

కావున ఆ ప్రాయశ్చిత్తము నాచరించిన యెడల తత్ స్వరవర్ణాదివిపర్యాసోచ్చారణము చేత జనించిన పాపము శాంతించును.

జ్ఞానకాండమునందు సగుణనిర్గుణ ప్రతిపాదకములగు వాక్యములను విపరీతముగ నుచ్చరించి వ్యతిరేకార్థమును గ్రహించితిమేని యథార్థోపాసనము, యథార్థావబోధము కలుగనందువలన పురుషార్థమే సిద్ధింపదు. వ్యతిరేకార్థబోధమువలన కలిగిన మిథ్యాజ్ఞాన, అన్యథాజ్ఞానములు నశించుటకు ప్రాయశ్చిత్తమేమియు శాస్త్రమునందు ప్రతిపాదితమయి యుండలేదు.

కావున యథార్థముగ బ్రహ్మావబోధము కలుగుటకుగాను ఉపనిషదధ్యయనమునందే యత్నాతిశయము ఆవశ్యక మనుటకుఁగాను ఉపనిషత్కాండమునందు ఈ విషయ ముపదిష్టమయినది.

శ్రీ మాధవాచార్యులవారు ఈయనువాకమునకు వ్యాఖ్యాన మొనర్చుచు అంతమునందు:—

“యద్యప్యత్ర శీక్షాదిశబ్దానా మేకశ్రుత్యా అధీయమానత్వాత్ వ్యాకరణోక్త ప్రకృతి ప్రత్యయాదిప్రయుక్త స్వరో నోపలక్ష్యతే తథాఽపి సంప్రదాయ ప్రసిద్ధః స్వరః తథైవాభ్యసనీయః, తస్యచార్థవిశేషజ్ఞాన ఉపయోగాభావే ఽప్యనేన శీక్షాధ్యాయేన విధీయమానత్వా దదృష్టోపయోగో భవిష్యతి. తచ్చ అదృష్ట ముపాసనాయాం తత్త్వజిజ్ఞాసోః తత్త్వ విద్యాయాం చ ప్రతిబంధపరిహారాయ సంపద్యతే.” అని చెప్పియున్నారు. దీనివలన సంహితయందువలె ప్రకృతి ప్రత్యయములకు వ్యాకరణశాస్త్రము నందు విధించియున్న స్వరాదికము ననుసరించి ఈ యుపనిషద్గ్రంథమునందు స్వరములేదనియు సంప్రదాయానుసారముగా ఉన్న స్వరము మాత్రము గలదనియు, అట్టి సంప్రదాయానుసారమగు స్వరమైనను ఉపనిషత్ప్రతిపాదిత మయినది కావున అట్లే ఉచ్చరింపఁదగిన దనియు, అన్యథాగా ఉచ్చరించిన దోషావహమనియు భావము.

విపర్యయముగ దంత్యతాలవ్యోచ్చారణాదికమువలన కలిగెడి అర్థభేదముల కుదాహరణము:—

౧. కార్యం సకలం కురు — కార్యమును సమగ్రముగ చేయుము, ఇందుఁగల దంత్యమగు సకారమును, తాలవ్యముగ నుచ్చరించితిమేని “కార్యం శకలం కురు — కార్యమును చెడఁగొట్టుము” అను విపరీతార్థబోధ కలుగును.

౨. సకృత్ కురు = ఒక్క పర్యాయము చేయుము. శకృత్ కురు = పురీషోత్సర్జనము చేయుము. ఇట్లే గ్రహించునది.

స్వరాదివిషయమును గ్రంథవిస్తరభీతిచేత మానినాఁడను.

శిక్షాశబ్దమునకు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు ద్వివిధమగు వ్యుత్పత్తిని ఇచ్చియున్నారు.

౧ శిక్షా:—శిక్ష్యతే అనయేతి వర్ణాద్యుచ్చారణలక్షణం, 'శిక్షా' శిక్షైవ 'శీక్షా' దైర్ఘ్యం ఛాందసం.

అర్థ. దీనిచేత వర్ణములు మొదలగునవి పలుకవలసిన లక్షణము శిక్షింపఁబడును. కావున 'శిక్షా' అని చెప్పఁబడును. 'శిక్షా' అనునదియే 'శీక్షా' అనియగును. 'శిక్షా' అని యనుటకు 'శీక్షా' అనుట ఛాందసము.

### అక్షరముల నుచ్చరించు రీతి

౧. అకుహ విసర్జనీయానాం కంఠః = అ, క, ఖ, గ, ఘ, ఙ, హ, ః వీనిని కంఠస్థానమునందుండి ఉచ్చరింపవలయును.

౨. ఇచుయశానాం తాలు = ఇ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ వీనిని తాలుస్థానమునందుండి ఉచ్చరింపవలయును.

౩. ఋటురషాణాం మూర్ధా = ఋ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష వీనిని మూర్ధస్థానమునందుండి ఉచ్చరింపవలయును.

౪. ౡతులసానాం దన్తాః = ౡ, త, థ, ద, ధ, న, ల, స వీనిని దంతములనుండి ఉచ్చరింపవలయును.

౫. ఉపూపధ్మానీయానామోష్ఠౌ = ఉ, ప, ఫ, బ, భ, మ, ః ఇవి ఓష్ఠమునుండి ఉచ్చరింపవలయును.

౬. ఞమఙణనానాం నాసికాచ = అర్థము సులభము.

౭. ఏదైతోః కంఠతాలు ,,

౮. ఓదౌతోః కంఠోష్ఠం ,,

౯. వకారస్య దంతోష్ఠం ,,

౧౦. అనుస్వారస్యనాసికా ,,

౧౧. జిహ్వామూలీయస్య జిహ్వామూలం ,,

ఈ విధముగా నెఱుంగునది.

ఈ యధ్యాయమునందు ఈ యుచ్చారణలక్షణము చెప్పఁబడియుండ లేదు గదా, కావున పైనిఁ జెప్పఁబడిన వ్యుత్పత్తి ఇచట అంతగా అనుకూలముగా లేదను తలంపుతో వ్యుత్పత్త్యంతరమును ఆచార్యులవారే చెప్పి యున్నారు.

౨. శిక్ష్యంత ఇతివా శిక్షాః వర్ణాదయః (వేదనీయ త్వేన ఉపదిశ్యంత ఇత్యర్థః. 'వనమాలా')

అర్థ. వర్ణ, స్వర మాత్రా, బల, సామ, సంతానములు తెలిసికొన వలసినవని ఉపదేశింపఁబడినదని యర్థము.

౧. అను. .... .... ....

౨. అధ్యా. .... .... ....

౩. భా. వా. శిక్షా. ౫౦-౫౩



## 3. తృతీయోఽనువాకః

౧. ౧ సహ నౌ యశః । సహ నౌ బ్రహ్మవర్చసమ్ । ౨ అథాత స్సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః । పంచస్వధికరణేషు । అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ మధ్యాత్మమ్ । తా మహాసగ్ంహితా ఇత్యాచక్షతే । 3 అథాధిలోకమ్ । పృథివీ పూర్వరూపమ్ । ద్యౌ రుత్తరరూపమ్ । ఆకాశ స్సంధిః ॥3॥

౨. వాయు స్సంధానమ్ । ఇత్యధిలోకమ్ । ౪ అథాధిజ్యౌతిషమ్ । అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య ఉత్తరరూ

పమ్ । అప స్సంధిః । వైద్యుతస్సంధానమ్ । ఇత్యధి
జ్యౌతిషమ్ । ౩ అథాధివిద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్ ॥౪॥

3. అన్తేవాస్యుత్తరరూపమ్ । విద్యా సన్ధిః । ప్రవచన
గ్ంం సన్ధానమ్ । ఇత్యధివిద్యమ్ । ౬ అథాధిప్రజమ్ ।
మాతా పూర్వరూపమ్ । పితోత్తరరూపమ్ । ప్రజా
—సన్ధిః । ప్రజననగ్ంం సన్ధానమ్ । ఇత్యధిప్రజమ్ ॥౫॥

౪. ౭ అథాధ్యాత్మమ్ । అధరాహనుః పూర్వరూపమ్ ।
ఉత్తరా హనురుత్తరరూపమ్ । వా క్సంధిః । జిహ్వా
సంధానమ్ । ఇత్యధ్యాత్మమ్ । ౮ ఇతీమా మహాసగ్ంం
హితాః । య ఏవ మేతా మహాసగ్ంంహితావ్యాఖ్యా
తా వేద సంధీయతే ప్రజయా పశుభిః । బ్రహ్మవర్చ
సేనాన్నా ద్యేన సువర్గేణ లోకేన ॥౬॥

సంధి, రాచార్యః పూర్వరూప, మిత్యధిప్రజం, లోకేన ॥3॥

శాంకర భాష్యమ్:—

అధునా సంహితోపనిషదుచ్యతే । తత్ర సంహితాద్యుపనిష త్పరిజ్ఞాన నిమిత్తం యత్ యశః ప్రాప్యతే, తత్ నౌ ఆవయోః శిష్యాచార్యయోః సహైవ అస్తు । తన్నిమిత్తం చ యత్ బ్రహ్మవర్చసం తేజః, తచ్చ సహైవాస్తు ఇతి శిష్యవచన మాశీః । శిష్యస్య హి అకృతార్థత్వా త్ప్రార్థనోపపద్యతే; నాచార్యస్య,

కృతార్థత్వాత్ । కృతార్థో హ్యాచార్యో నామ భవతి । అథ అనన్తరమ్ అధ్యయనలక్షణ విధానస్య పూర్వవృత్తస్య, అతః యతోఽత్యర్థం గ్రన్థభావితా బుద్ధిర్నశక్యతే సహసార్థ జ్ఞానవిషయే ఽవతారయితు మిత్యతః, సంహితాయాః ఉపనిషదం సంహితావిషయం దర్శనమిత్యేతత్ గ్రన్థసంనికృష్టామేవ వ్యాఖ్యాస్యామః, పఞ్చసు అధికరణేషు ఆశ్రయేషు, జ్ఞానవిషయేష్విత్యర్థః । కాని తానీత్యాహ —— అధి లోకం లోకేష్వధి యద్దర్శనమ్, తదధిలోకమ్; తథా అధిజ్యౌతిషమ్ అధి విద్యమ్ అధిప్రజమ్ అధ్యాత్మమితి । తాః ఏతాః పఞ్చ విషయా ఉపనిషదః లోకాదిమహావస్తు విషయత్వాత్సం హితా విషయత్వాచ్చ మహత్యశ్చ తాః సంహితాశ్చ మహాసంహితాః ఇతి ఆచక్షతే కథయన్తి వేదవిదః । అథ తాసాం యథోపన్యస్తానాం మధ్యే అధి లోకం దర్శన ముచ్యతే । దర్శనక్రమవివక్షార్థ అథశబ్దః సర్వత్ర । పృథివీ పూర్వ రూపమ్, పూర్వో వర్ణః పూర్వరూపమ్. సంహితాయాః పూర్వేవర్ణే పృథివీ దృష్టిః కర్తవ్యేత్యుక్తం భవతి । తథా ద్యౌః ఉత్తరరూపమ్ । ఆకాశః అన్తరిక్షలోకం సంధిః మధ్యం పూర్వోత్తర రూపయోః సంధీయతే అస్మిన్పూర్వోత్తరరూపే ఇతి॥

వాయుః సంధానమ్ । సంధీయతే అనేనేతి సంధానమ్ । ఇతి అధిలోకం దర్శనముక్తమ్ । అథాధిజ్యౌతిషమ్ ఇత్యాది సమానమ్ । ఇతీమా ఇతి ఉక్తా ఉప ప్రదర్శ్యన్తే । యః కశ్చిత్ ఏవమ్ ఏతాః మహాసంహితాః వ్యాఖ్యాతాః వేద ఉపాస్తే; వేదేత్యుపాసనం స్యాత్. విజ్ఞానాధికారాత్, "ఇతి ప్రాచీనయోగ్యోపాస్వ" ఇతి చ వచనాత్ । ఉపాసనం చ యథాశాస్త్రం తుల్యప్రత్యయసంతతి రసంకీర్ణా చ అత త్ప్రత్యయైః శాస్త్రోక్తాలమ్బనవిషయా చ । ప్రసిద్ధశ్చోపాసనశబ్దార్థో లోకే — "గురు ముపాస్తే" "రాజానముపాస్తే" ఇతి । యోహి గుర్వాదీన్సంతతముపచరతి, స ఉపాస్త ఇత్యుచ్యతే । స చ ఫలమాప్నోత్యు పాసనస్య । అతః అత్రాపి య ఏవం వేద, సంధీయతే ప్రజాదిభిః స్వర్గాన్తైః । ప్రజాదిఫలం ప్రాప్నోతీత్యర్థః॥

ఇతి తృతీయానువాక భాష్యమ్॥

టీక. ౧. (సంహితోపాసనము పున్నగువాని నెఱుంగుటవలనవచ్చెడి) యశః = కీర్తి, నౌ = శిష్యాచార్యుల మగు మాకు, సహ (అస్తు) = కూడా (అగుఁ గాక). బ్రహ్మవర్చసం = (ఆసంహితోపాసనమువలన కలిగిన) బ్రహ్మతేజస్సు, నౌ = శిష్యాచార్యుల మగుమాయిద్దఱకు, సహ(అస్తు) = కూడా (అగుఁగాక).

౨. అథ = పూర్వానువాకమునందు చెప్పఁబడిన స్వరవర్ణాది శిక్షాభ్యాసరూప అధ్యయనలక్షణపరిజ్ఞాన) అనంతరము, అతః =(ఆ సంహితోచ్చారణమునందే బుద్ధి

సత్వరముగ (ప్రవేశించును) కావున, అధిలోకం=లోకములందును, అధిజ్యౌతిషం= తేజస్సులందును, అధివిద్యం = విద్యలందును, అధిప్రజం = ప్రజలందును, ఆధ్యాత్మం = దేహమునందును, పంచసు=ఐదు అయిన, అధికరణేషు=ఆశ్రయ ములచేత (తృతీయార్థమునందు సప్తమి), సంహితాయాః = సంహితయొక్క, ఉపనిషదం = ఉపాసనమును, వ్యాఖ్యాస్యామః = స్పష్టముగా చెప్పఁగలము. తాః= ఆ యైదు విషయములును, మహాసగ్ంహితా ఇతి=గొప్ప సంహితులని, ఆచక్షతే = (వేదజ్ఞులు) పలుకుచున్నారు.

౩. అథ=ఇఁక), అధిలోకం=లోకసంహితకు సంబంధించిన విషయము (చెప్పఁబడుచున్నది.) పూర్వరూపం=(సంహితయొక్క) పూర్వాక్షరము, పృథివీ= భూమియనియు, ఉత్తరరూపం = (సంహితయొక్క) ఉత్తరాక్షరము, ద్యౌః = అంతరిక్షమనియు, సంధిః = (సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల) సంధి, ఆకాశః=ఆకాశమనియు, సంధానం=(పూర్వోత్తరాక్షరముల) సంధానము, వాయుః= వాయువనియు, ఇతి= ఈవిధముగా, అధిలోకం=లోకము నాశ్రయించి చెప్పఁబడిన యుపాసనము.

౪. అథ = ఇఁక, అధిజ్యౌతిషం = జ్యోతిస్సంహితకు సంబంధించిన విషయము (చెప్పఁబడుచున్నది.) పూర్వరూపం = (సంహితయొక్క) పూర్వా క్షరము. అగ్నిః = అగ్నియనియు, ఉత్తరరూపం = (సంహితయొక్క) ఉత్త రాక్షరము, ఆదిత్యః = సూర్యుఁడనియు, సంధిః = (సంహితయొక్క పూర్వోత్త రాక్షరములు) కలియుట, ఆపః = ఉదకములనియు, సంధానం=(పూర్వోత్తరాక్షర ముల) సంధానము, వైద్యుతః = విద్యుత్తులనియు, ఇతి = ఈ విధముగా, అధి జ్యౌతిషం=జ్యోతిస్సుల నాశ్రయించి చెప్పఁబడిన యుపాసనము.

౫. అథ=ఇఁక. అధివిద్యం=విద్యాసంహితకు సంబంధించిన విషయము (చెప్పఁబడుచున్నది.) పూర్వరూపం=(సంహితయొక్క) పూర్వాక్షరము, ఆచార్యః= ఆచార్యుఁడనియు, ఉత్తరరూపం=(సంహితయొక్క) ఉత్తరాక్షరము, అంతేవాసీ= శిష్యుఁడనియు, సంధిః = (సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల) సంధి, విద్యా= విద్యయనియు, సంధానం=(సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల) సంధానము, ప్రవచనం=ప్రవచనమనియు, ఇతి=ఈ విధముగా, అధివిద్యం = విద్య నాశ్రయించి చెప్పఁబడిన యుపాసనము.

౬. అథ=ఇఁక, అధిప్రజం=ప్రజాసంహితకు సంబంధించిన విషయము (చెప్పఁబడుచున్నది) పూర్వరూపం=(సంహితయొక్క) పూర్వాక్షరము, మాతా= తల్లియనియు, ఉత్తరరూపం = (సంహితయొక్క) ఉత్తరాక్షరము, పితా=తండ్రి యనియు, సంధిః = (సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల) సంధి, ప్రజా= ప్రజయనియు, సంధానం = (సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల) సంధానము, ప్రజననం = ప్రజననమనియు, ఇతి=ఈ విధముగా, అధిప్రజం = ప్రజ నాశ్రయించి చెప్పఁబడిన యుపాసనము.

౭. అథ=ఇఁక, అధ్యాత్మం=అధ్యాత్మసంహితకు సంబంధించిన విషయము (చెప్పఁబడుచున్నది.) పూర్వరూపం = (సంహితయొక్క) పూర్వాక్షరము, అధ రాహనుః = క్రింది పెదవియనియు, ఉత్తరరూపం = (సంహితయొక్క) ఉత్త రాక్షరము, ఉత్తరాహనుః=పై పెదవియనియు, సంధిః=(సంహితయొక్క పూర్వోత్త రాక్షరముల) సంధి, వాక్=వాక్కనియు, సంధానం=సంధానము, జిహ్వా=నాలుక యనియు, ఇతి = ఈవిధముగా, అధ్యాత్మం = దేహము నాశ్రయించి చెప్పఁబడిన యుపాసనము.

౮. ఇతి=ఈ విధముగా, ఇమాః=ఈ చెప్పఁబడినవి, మహాసంహితాః = గొప్ప సంహితలు (సంహిత యనఁగా ఉపాసనము.) యః = ఎవఁడు, ఏవం = ఈ విధముగా, వ్యాఖ్యాతాః=వివరింపఁబడిన, ఏతాః=ఈ. మహాసంహితాః=గొప్ప సంహితలను (ఐదింటిని), వేద = ఉపాసించుచున్నాఁడో, (సః=వాఁడు,) ప్రజయా=సంతానముతోడను, పశుభిః=పశువులతోడను, బ్రహ్మవర్చసేన=బ్రహ్మ వర్చస్సుతోడను, అన్నాద్యేన=భోగ్యవస్తుసముదాయముగల. సువర్గేణ లోకేన= స్వర్గలోకముతోడను, సంధీయతే = సంధింపఁబడుచున్నాఁడు.

తా. ౧. శిష్యుఁడు ప్రప్రథమమున బ్రహ్మవిద్యావిషయక మగు కీర్తియు, బ్రహ్మవర్చస్సు ఇవి శిష్యాచార్యుల మగు మా కిద్దఱకుఁ గలుగవలయునని కోరు చున్నాఁడు. శిష్యుఁడు కృతకృత్యుఁడు కాలేదు కావున ఈ ప్రార్థనము శిష్యుఁ డొనర్చినదే. ఆచార్యుఁ డొనర్చినది కాదు. ఆచార్యుఁడు కృతార్థుఁడు కావున అతఁడు కోరఁదగినదియే లేదు అని శ్రీ శంకరాచార్యులవారు భాష్యమునందు వివరించి యున్నారు.

౨. ఇఁక సంహితోపనిషత్తును అయిదు అధిష్ఠానములందు వివరించి చెప్పు చున్నాము. వాని పేరులు ౧. అధిలోక మనియును, ౨. అధిజ్యౌతిషమనియును,

౩. అధివిద్యయనియును, ౪. అధిప్రజమనియును; ౫. అధ్యాత్మమనియును చెప్పఁబడును. ఇవియే మహాసంహితలని చెప్పఁబడును. మూలమునందుఁ గల అథ, అతః అను శబ్దములకు గల భాష్యవివరణ మేమనఁగా:—

అథ = అధ్యయనలక్షణవిధానమును చెప్పిన పిదప అని. (వర్ణ, స్వర, మాత్రా, బల, సామ, సంతానములని వివరముగ ద్వితీయానువాకమునందు అధ్యయన లక్షణవిధానము చెప్పఁబడియున్నది) అతః = అను శబ్దమునకు "సాధారణముగా అధ్యయన మొనర్చినవారలు గ్రంథమునందుమాత్రమే చిత్తప్రవృత్తి కలిగియుందురు కావున వారి మనస్సు అర్థవిషయమగు వస్తువునందు మొట్టమొదట ధారాళముగ ప్రవేశింపదు. అట్టి వారికిగాను స్థూలమగు శబ్దవిషయోపాసనమును విధించుటయే లాభకరము కావున సంహితారూప గ్రంథప్రధాన మగు ఉపాసనమును విధించుటయే న్యాయమను తలంపుతో" అని వ్యాఖ్యాన మొనర్చినవారు. భాష్యపంక్తి నీ క్రింద నుదహరించుచున్నాఁడను.

అతః = యతోఽత్యర్థం గ్రంథభావితా బుద్ధి ర్న శక్యతే సహసాఽర్థజ్ఞాన విషయమే అవతారయితుమిత్యతః" అని.

౩. ఇఁక లోకసంహిత చెప్పఁబడుచున్నది:— సంహితముయొక్క పూర్వ వర్ణమును పృథివిగను, ఉత్తరవర్ణమును ద్యులోకముగను, పూర్వోత్తర వర్ణముల యొక్క సంధిని ఆకాశముగను, పూర్వోత్తరవర్ణసంధానమును వాయువుగను, ఈ విధముగా లోకాత్మకముగ సంహిత నుపాసించవలయును. ఇది లోకసంహిత యనం బడును.

౪. ఇఁక జ్యోతిస్సంహిత చెప్పఁబడుచున్నది:— సంహితయొక్క పూర్ణ వర్ణమును అగ్నిగను, సంహితయొక్క ఉత్తరవర్ణమును అదిత్యునిగను, పూర్వోత్తర వర్ణములయొక్క సంధిని అప్పులు (జలములు) గను, పూర్వోత్తరవర్ణసంధానమును విద్యుత్తుగను, ఈ విధముగ జ్యోతిరాత్మకముగ సంహిత నుపాసించవలయును. ఇది జ్యోతిస్సంహిత యనంబడును.

౫. ఇఁక విద్యాసంహిత చెప్పఁబడుచున్నది: — సంహితయొక్క పూర్వ వర్ణమును ఆచార్యునిగను, సంహితయొక్క ఉత్తరవర్ణమును శిష్యునిగను పూర్వోత్తర వర్ణములయొక్క సంధిని విద్యగను, పూర్వోత్తరవర్ణ సంధానమును ప్రవచనముగను, ఈ విధముగ విద్యాత్మకముగ సంహిత నుపాసించవలయును. ఇది విద్యాసంహిత యనంబడును.

౬. ఇఁక ప్రజాసంహిత చెప్పఁబడుచున్నది:—సంహితయొక్క పూర్వ వర్ణమును మాతగను, సంహితయొక్క ఉత్తరవర్ణమును పితగను, పూర్వోత్తర వర్ణములయొక్క సంధిని ప్రజగను, పూర్వోత్తర వర్ణసంధానమును ప్రజననముగను, ఈ విధముగ ప్రజాసంహిత నుపాసించవలయును. ఇది ప్రజాసంహిత యనం బడును.

౭. ఇఁక అధ్యాత్మసంహిత చెప్పఁబడుచున్నది:— సంహితముయొక్క పూర్వవర్ణమును క్రిందిపెదవిగను, సంహితయొక్క ఉత్తరవర్ణమును పై పెదవిగను, పూర్వోత్తరవర్ణములయొక్క సంధిని వాక్కుగను, పూర్వోత్తరవర్ణ సంధానమును జిహ్వగను ఈ విధముగ నుపాసించవలయును.

౮. ఈ చెప్పఁబడిన ౫ను మహాసంహితలు. ఎవ్వఁ డీ విధముగా (అనఁగా లోకజ్యోతిషాదిదృష్టితో) ఈ మహాసంహితల నుపాసించునో వాఁడు ప్రజ, పశువులు, బ్రహ్మవర్చస్సు, అన్నాదికము, స్వర్గము మున్నగు ఫలములను పొందును.

మంత్రమునందుగల 'వేద' అనుపదము ఉపాసనాప్రకరణమునందు చెప్పఁ బడుటచేత 'ఉపాసనావాచి' యగుచున్నది. "ఇతి ప్రాచీనయోగ్యోపాస్వ" అని చెప్పుటయే ఇందులకు ప్రమాణము.

ఉపాసనమనఁగా శాస్త్రానుసారము విచ్ఛేదములేక శాస్త్రనిర్దిష్టమగు ఒక ఆలంబ నమునందు బుద్ధిని ప్రవేశపెట్టి ఎల్లప్పుడు దానిని స్మరించుటయగును. (ఒక్కపర్యా యము ధ్యేయవస్తువునందు బుద్ధిని ప్రవేశపెట్టుట ఉపాసనమనంబడదు. ఏల యనఁగా:— ఈ విషయము లోకప్రసిద్ధమయియున్నది. 'గురువు నుపాసించు చున్నాఁడు, రాజు నుపాసించుచున్నాఁడు' అనుచోట ఎవ్వఁడు నిరంతరము గురువును రాజును ఉపాసించునో వాఁడే యగును గాని ఇతరుఁడుగాఁడు. అట్టివాఁడే ఉపాసనా ఫలమును పొందును. కావున ఇచ్చట సైతము ఈ సంహితల నీభావనతో నిరంతర ముపాసనమును సలిపిన వాఁడే ఈ ఫలమును పొందును.

వివరణము:— సంహితలను లోకాదిదృష్టితో ఉపాసించవలయునని చెప్పిన విషయమును దృష్టాంతపూర్వకముగ వివరించుచున్నారము.

'ఇషేత్వా' అనుచోట.

౧. షకారముపైనగల ఏకారము పూర్వవర్ణము. దీనిని పృథివీభావనతో నుపాసించవలయును.

౨. త్వా అనుచోట గల తకారము ఉత్తరవర్ణము. దీనిని ద్యులోకభావనతో నుపాసించవలయును.

౩. ఆ 'ఏకారతకార'ముల యొక్క మధ్యభాగము సంధి. దీనిని అంతరిక్ష లోకభావనతో నుపాసించవలయును.

౪. 'షేత్త్వా' అనునపుడు సంహితాసమయమునం దుచ్చరించునపుడు అచట గనంబడునట్టి రెండవతకార మెయ్యదిగలదో అది సంధానము. దీనిని వాయులోక భావనతో నుపాసించవలయును.

ఇచట లోకసంహితను మాత్రమే గనంబఱిచితిమి. ఇట్లే తక్కిన జ్యోతిష, విద్యా, ప్రజా, ఆత్మసంహితలను గూర్చి గ్రహించునది.

ఆత్మసంహితయనఁగా:— ఆత్మయనఁగా దేహము. ఆ దేహావయవములను గుఱించి చెప్పెడి విషయము అధ్యాత్మ మనఁబడును.

పృథివి పూర్వరూపమనియు, ద్యులోకము ఉత్తరరూపమనియు మున్నగునవి తెలిసికొన్నంతమాత్రముచేతనే ఫలమేమియు లేదు. తదనుసారము అసకృదావృత్తి పూర్వకస్మరణరూపమగు ఉపాసనముచేతనే ఫలము కలుగును.

మఱియు ఈ విషయము బ్రహ్మజ్ఞానప్రకరణమునందు చెప్పఁబడియున్నది కావున ఫలకామియై ఉపాసించునెడల కామితఫలము కలుగుననియు, నిష్కామియై ఉపాసనమును సల్పునెడల జ్ఞానమునకు సాధనమగు ననియు తెలిసికొనవలయును.

అథాధిలోకం.... ఇత్యధిలోకం। అథాధిజ్యౌతిషం.... ఇత్యధిజ్యౌతిషం। ఇటుల ౩ పర్యాయములు 'అథ' శబ్దము మంత్రమునందు చెప్పఁబడి యున్నది. అధిలోక, ఇది లోకదృష్టి, జ్యౌతిషదృష్టి మున్నగు క్రమనియమార్థమని సూచించుటకుగాను చెప్పఁబడినది.

౧. అను .... ....

౨. ఆత్మ .... ....

౩. భా. పా. శిక్ష. ౫౪.౬౩.



# ౪. చతుర్థో ఽనువాకః

మేధాకామస్య జపమన్త్రాః;

శ్రీకామస్య హోమార్థా మన్త్రాశ్చ

మూ. ౧ య శ్ఛన్దసా మృషభొ విశ్వరూపః। ఛన్దోభ్యో ఽధ్య మృతాత్సంబభూవ। స మేన్ద్రో మేధయా స్పృణో తు। అమృతస్య దేవ ధారణో భూయాసమ్। ౨ శరీరం మే విచర్షణమ్। జిహ్వా మే మధుమత్తమా। కర్ణా భ్యాం భూరి విశ్రువమ్। బ్రహ్మణః కోశో ఽసిమేధ యా పిహితః। శ్రుతం మే గోపాయ। ౩ ఆవహంతీ వితన్వానా ॥౧॥

కుర్వాణా చీర మాత్మనః। వాసాగ్ంసి మమ గావ శ్చ। అన్నపానే చ సర్వదా। తతో మే శ్రియ మావహ। లోమశాం పశుభి స్సహ స్వాహా। ౪ ఆమా యన్తు బ్రహ్మచారిణ స్స్వాహా। (*౫ విమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా। ౬ ప్రమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా। ౭ దమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా। ౧ శమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా) ॥౨॥

---

*ఏతే 5, 6, 7 మంత్రాః ద్రావిడపాఠే నవిద్యంతే. ఆంధ్రపాఠే విద్యంతే.

౯ యశోజనే ఽసాని స్వాహా । ౧౦ శ్రేయాన్వస్యసో

ఽసాని స్వాహా । ౧౧ తం త్వా భగ ప్రవిశాని స్వాహా ।

౧౨ సమా భగ ప్రవిశ స్వాహా । ౧౩ తస్మిం త్సహస్ర శాఖే ।

ని భగాహం త్వయి మృజే స్వాహా । ౧౪ యథా ఽఽపః

ప్రవతా యన్తి । యథామాసా అహర్జరమ్ । ఏవం

మాం బ్రహ్మచారిణః । ధాత రాయన్తు సర్వత స్స్వాహా ।

౧౫ ప్రతివేశో ఽసి ప్రమా భాహి ప్రమాపద్యస్వ ॥3॥

(వితన్వానా ప్రవిశస్వాహా సప్తచ । (ద్రావిడపాఠః).

(వితన్వానా శమాయన్తు బ్రహ్మచారిణ స్స్వాహా,

ధాత రాయన్తు సర్వత స్స్వాహైకం చ॥

శాంకరభాష్యమ్:—

యశ్ఛన్దసామితి మేధాకామస్య శ్రీకామస్య చ తత్ప్రాప్తి సాధనం జపహోమా ఉచ్యేతే, "సమేన్ద్రో మేధయా స్పృణోతు" "తతో మే శ్రియమావహ" ఇతి చ లిఙ్గదర్శనాత్। యః ఛన్దసాం వేదానాం ఋషభ ఇవ ఋషభః, ప్రాధాన్యాత్। విశ్వరూపః సర్వరూపః, సర్వవాగ్వ్యాప్తేః "తద్యథా శఙ్కునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవమోంకారేణ సర్వా వాక్సంతృణ్ణోంకార ఏవేదం సర్వమ్" ఇత్యాది శ్రుత్యన్తరాత్। అత ఏవ ఋషభత్వమోంకారస్య। ఓంకారో హ్యత్రోపాస్య ఇతి ఋషభాదిశబ్దైః స్తుతిర్న్యాయ్యైవ ఓంకారస్య। ఛన్దోభ్యః దేవేభ్యః, వేదా హ్యమృతమ్, తస్మాత్ అమృతాత్ అధి సంబభూవ లోకదేవవేదవ్యాహృతిభ్యః సారిష్ఠం జిఘృక్షోః ప్రజాపతేస్తపస్యతః ఓంకారః సారిష్ఠత్వేన ప్రత్యభాదిత్యర్థః। న హి నిత్యస్య ఓంకారస్య అఞ్జసైవోత్పత్తిరవకల్పతే। సః ఏవంభూత ఓంకారః ఇన్ద్రః సర్వకామేశః పరమే

శ్వరః మా మాం మేధయా ప్రజ్ఞయా స్పృణోతు ప్రీణయతు, బలయతు వా, ప్రజ్ఞా బలం హి ప్రార్థ్యతే। అమృతస్య అమృతత్వహేతుభూతస్య బ్రహ్మజ్ఞానస్య, తదధికారాత్; హే దేవధారణః ధారయితా భూయాసం భవేయమ్। కించ, శరీరం మే మమ విచర్షణం విచక్షణం యోగ్యమిత్యేతత్, భూయాదితి ప్రథమ పురుష విపరిణామః। జిహ్వా మే మమ మధుమత్తమా మధుమతీ, అతిశయేన మధురభాషిణీత్యర్థః। కర్ణాభ్యాం శ్రోత్రాభ్యాం భూరి బహు విశ్రువం వ్యశ్రవమ్, శ్రోతా భూయాసమిత్యర్థః। ఆత్మజ్ఞాన యోగ్యః కార్యకరణ సంఘాతోఽస్త్వితి వాక్యార్థః । మేధా చ తదర్థమేవ హి ప్రార్థ్యతే — బ్రహ్మణః పరమాత్మనః కోశః అసి అసే రివ; ఉపలబ్ధ్యధిష్ఠానత్వాత్; త్వం హి బ్రహ్మణః ప్రతీకమ్; త్వయి బ్రహ్మోపలభ్యతే। మేధయా లౌకిక ప్రజ్ఞయా పిహితః ఆచ్ఛాదితః స త్వం సామాన్య ప్రజ్ఞైరవిదితతత్త్వ ఇత్యర్థః। శ్రుతం శ్రవణపూర్వకమాత్మజ్ఞానదికం విజ్ఞానం మే గోపాయ రక్ష; తత్ప్రాప్త్యవిస్మరణాదికం కుర్వి త్యర్థః। జపార్థా ఏతే మన్త్రా మేధాకామస్య। శ్రీకామస్య హోమార్థా స్త్వధునోచ్యన్తే మన్త్రాః—ఆవహన్తీ; ఆనయన్తీ, వితన్వానా విస్తారయన్తీ, తనోతే స్తత్కర్మకత్వాత్; కుర్వాణా నిర్వర్తయన్తీ అచీరమ్ అచిరం క్షిప్రమేవ; ఛాన్దసో దీర్ఘః। చిరం వా; కుర్వాణా, ఆత్మనః మమ; కిమిత్యాహ — వాసాంసి వస్త్రాణి, మమ. గావశ్చ గాశ్చేతి యావత్; అన్నపానే చ సర్వదా; ఏవమాదీని కుర్వాణా శ్రీర్యా, తాం తతః మేధానిర్వర్తనాత్పరమ్ ఆవహ ఆనయ; అమేధసో హి శ్రీ రనర్థాయైవేతి । కిం విశిష్టామ్? లోమశామ్ అజావ్యాదియుక్తామ్ అన్యైశ్చ పశుభిః సహ యుక్తామ్ ఆవహేతి । అధికారా దోంకార ఏవాభి సంబధ్యతే । స్వాహా, స్వాహాకారో హోమార్థ మన్త్రాన్త జ్ఞాపనార్థః। ఆమాయన్త్వితి । ఆయన్తు, మామితి వ్యవహితేన సంబన్ధః, బ్రహ్మచారిణః । విమాయన్తు ప్రమాయన్తు దమాయన్తు శమాయన్తు ఇత్యాది । యశోజనే యశస్విజనేషు అసాని భవాని । శ్రేయాన్ ప్రశస్యతరః. వస్యసః వసీయసః వసుతరాద్వసుమత్తరాద్వా ధనవజ్జాతీయ పురుషాద్విశేషవానహమసానీత్యర్థః । కించ, తం బ్రహ్మణః కోశభూతం త్వా త్వాం హే భగవన్ పూజార్హ, ప్రవిశాని ! ప్రవిశ్య చానన్యస్త్వదాత్మైవ భవానీత్యర్థః । సః త్వమపి మా మాం భగ భగవన్, ప్రవిశ; ఆవయోరేకాత్మత్వమేవాస్తు । తస్మిన్ త్వయి సహస్రశాఖే బహుశాఖాభేదే హే భగవన్, నిమృజే శోధయామి అహం పాపకృత్యామ్ । తథా లోకే ఆపః ప్రవతా ప్రవణవతా నిమ్నవతా దేశేన యన్తి గచ్ఛన్తి, తథాచ మాసాః

అహర్జరమ్, సంవత్సరోఽహర్జరః అహోభిః పరివర్తమానో లోకాన్ జరయతీతి; అహాని వా అస్మిన్ జీర్యన్తి అన్తర్భవన్తీత్యహర్జరః; తం చ యథా మాసాః యాన్తి. ఏవం మాం బ్రహ్మచారిణః హే ధాతః సర్వస్య విధాతః, మామ్ ఆయన్తు ఆగచ్ఛన్తు సర్వతః సర్వదిగ్భ్యః । ప్రతివేశః శ్రమాపనయనస్థానమ్ ఆసన్నం గృహమిత్యర్థః । ఏవం త్వం ప్రతివేశ ఇవ ప్రతివేశః త్వచ్ఛీలినాం సర్వపాప దుఃఖాపనయనస్థానమసి । అతః మా మాం ప్రతి ప్రభాహి ప్రకాశయాత్మానమ్, ప్ర మా పద్యస్వ ప్రపద్యస్వ చ మామ్ । రసవిద్ధ మివ లోహం త్వన్మయం త్వదాత్మానం కుర్విత్యర్థః । శ్రీ కామోఽస్మి న్విద్యా ప్రకరణే అభిధీయమానో ధనార్థీః; ధనం చ కర్మార్థమ్; కర్మ చ ఉపాత్త దురిత క్షయార్థమ్; తత్క్షయే హి విద్యా ప్రకాశతే । తథా చ స్మృతిః

"జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః । యథా
దర్శతలే ప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని" ఇతి ॥

ఇతి చతుర్థానువాక భాష్యమ్॥

టీక. ౧. యః = ఏయది, ఛందసాం = వేదములకు, ఋషభః = ప్రాధాన్యమైనదో, విశ్వరూపః = సర్వరూపమయినదో, (సః = ఆ ప్రణవము,) అమృతాత్ = అమృతస్వరూపములగు, ఛందోభ్యః = వేదములలో, సంబభూవ = (సారభూతమై) ప్రకాశించుచున్నది. ఇంద్రః = పరమేశ్వర స్వరూపమగు, సః = ఆ ప్రణవము, మా = నన్ను, మేధయా = ప్రజ్ఞచేత, స్పృణోతు = సంతోషింపఁజేయుఁగాక. దేవ = ప్రకాశ స్వరూపమగు ఓ ప్రణవమా! అమృతస్య = (అమృతత్వమునకు హేతుభూతమగు) బ్రహ్మజ్ఞానమును, ధారణః = ధరించువాఁడను, భూయాసం = అయ్యెదనుగాక.

౨. మే = నాయొక్క, శరీరం = దేహము, విచర్షణం = యోగ్యమయినది, (భూయాత్ = అగుఁగాక.) మే = నాయొక్క, జిహ్వా = నాలుక, మధుమత్తమా = మధురభాషణము గలది. (భూయాత్ = అగుఁగాక.) కర్ణాభ్యాం = కర్ణములవల్లనుండి, భూరి = విస్తారముగా, విశ్రువం = వినియెదనుగాక. (నా దేహేంద్రియములు ఆత్మజ్ఞానార్హము లగుఁగాక) (ఓ ప్రణవమా! నీవు) బ్రహ్మణః = పరమాత్మకు, కోశః = నివాసస్థానము, అసి = అయితివి. మేధయా = సామాన్య ప్రజ్ఞచేత, పిహితః = కప్పఁబడితివి. మే = నా యొక్క, శ్రుతం = శ్రవణపూర్వకమయిన ఆత్మజ్ఞానాదికమును, గోపాయ = రక్షించుమా) (ఈ మంత్రములు మేధాకాముఁడు జపింపఁదగినవి.)

శ్రీ కాముఁడు హోమము చేయవలసిన మంత్రములు :—

౩. తతః=మేధను కలుగఁజేసిన తరువాత. ఆత్మనః మమ=నాకు, వాసాంసి=వస్త్రములను, గావః చ=గోవులను, అన్నపానేచ=అన్నపానీయములను, సర్వదా=ఎల్లప్పుడు. ఆవహంతీ = సంపాదించుచున్నదై (అటుల విస్తరింపఁ జేసినదానిని), వితన్వానా = విస్తరింపఁజేయుచున్నదై (అటుల విస్తరింపఁ జేసినదానిని) చీరం = దీర్ఘకాలముండుదానిగా, కుర్వాణా = చేయుచున్నట్టి (ఏ సంపద గలదో అటి), లోమశాం=అజాదివిశిష్టమయిన, శ్రియం = సంపదను, పశుభిఃసహ = పశువులతో కూడా, (ఓ ప్రణవమా!) మే = నాకు, ఆవహ=పొందింపుము. స్వాహా = స్వాహా పద మిచట హోమార్థమయిన మంత్ర మిదియని సూచించుటకుఁగాను చెప్పఁబడినది. (ఇట్లే సర్వత్ర గ్రహించునది.)

౪. బ్రహ్మచారిణః = విద్యార్థులగు బ్రహ్మచారులు, మా = నన్నుఁ గూర్చి, ఆయన్తు=వచ్చెదరుగాక.

౫. వి = వివిధకామములుగల అనఁగా స్వర్గలోకకాములు, మోక్షకాములు, పశ్వాదికాములునగు, బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు, మా = నన్నుఁగూర్చి, ఆయన్తు=వచ్చెదరుగాక.

౬. ప్ర=శ్రేష్ఠబుద్ధిగల, బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు, మా = నన్నుఁ గూర్చి, ఆయన్తు=వచ్చెదరుగాక.

౭. దం=బాలక్రీడ లుడిగిన, బ్రహ్మచారిణః=బ్రహ్మచారులు, మా = నన్నుఁ గూర్చి, ఆయన్తు = వచ్చెదరుగాక.

౮. శం = క్రోధాది చిత్తదోషములు లేని, బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు, మా=నన్నుఁ గూర్చి, ఆయన్తు=వచ్చెదరుగాక.

౯. జనే=జనులయందు, యశః=యశస్సుగలవాఁడను, అసాని = అయ్యెదనుగాక.

౧౦. వస్యసః=ధనికులకంటె, శ్రేయాన్ = శ్రేష్ఠుఁడను, అసాని=అయ్యెదనుగాక.

౧౧. భగ=పూజ్యమయిన ఓ ప్రణవమా! తం=(బ్రహ్మకు కోశభూతమయిన) ఆ, త్వా=నిన్ను, ప్రవిశాని=ప్రవేశించి, త్వత్స్వరూపుఁడ నయ్యెదను.

౧౨. భగ = పూజ్యమయిన ఓ ప్రణవమా! సః=ఆ ప్రసిద్ధమయిన నీవు, మా=నన్ను, ప్రవిశ=ప్రవేశించుమా!

౧౩. భగ = పూజ్యమగు నో ఓంకారమా! సహస్రశాఖే = శివవిష్ణ్వాది రూపభేదములు గలదానివలె గనంబడు, తస్మిన్ = ఆ, త్వయి=నీయందు, అహం= నేను, (పాపకృత్యాం = నే నొనర్చిన పాపకార్యమును.) నిమృజే= ప్రక్షాళనము చేసికొనుచున్నాఁడను.

౧౪. ఆపః=ఉదకములు, ప్రవతా = పల్లమయినదారిగ, యథా=ఏ విధముగా, గచ్ఛంతి = పోవుచున్నావో, యథా = ఏ విధముగా, మాసాః = మాసములు, అహర్జరం = సంవత్సరమును గూర్చి, (గచ్ఛంతి = పోవుచున్నవో.) ఏవం = ఈ విధముగా, ధాతః=సర్వజగత్కారణమగు ఓ ప్రణవమా! బ్రహ్మచారిణః = బ్రహ్మ చారులు, మాం=నన్నుఁగూర్చి, సర్వతః=అంతటనుండి, ఆయంతు=వచ్చెదరుగాక.

౧౫. (ఓ ప్రణవమా! నీవు.) ప్రతివేశః = సమీపమునందున్న గృహము (అనగా గృహమువలె సకల దుఃఖనివారకమని యర్థము.) అసి = అయితివి, మా = నన్ను, ప్రభాహి = ప్రకాశింపఁజేయుమా! మా = నన్ను ప్రపద్యస్వ = పొందుమా!

తా. ౧. (ప్రథమ ద్వితీయానువాకములందు శాంతిని, శిక్షను విధించి మూఁడవ యనువాకమునందు సంహితోపాసనమును విధించి ఈ యనువాకము నందు మేధాకాముఁ డగువాఁడు జపించవలసిన మంత్రములును, శ్రీకాముఁడు చేయవలసిన హోమార్థము లగుమంత్రములును చెప్పఁబడినవి. ప్రప్రథమమున మేధాకాముఁడు జపించవలసిన మంత్రములు చెప్పఁబడుచున్నవి:— (ఈ యను వాకము ప్రణవస్తుతి పరము) ప్రణవము వేదత్రయములలో సారభూతమయి ప్రకా శించుచున్నది. ఇదియే సర్వస్వరూపము. పరమేశ్వర స్వరూపమగు ఈ ప్రణవము నన్ను మేధావంతునిగా నొనర్చుఁగాక. ఓ ప్రణవమా! నేను అమృతస్వరూపమగు బ్రహ్మజ్ఞానమును ధరించువాఁడ నయ్యెదను గాక యని తాత్పర్యము.

సూచనము:— ఈ మంత్రమునందు "ఛందోభ్యోఽధ్యమృతా త్సంబభూవ" అనుచోట "అధిసంబభూవ" యను పదమునకు "పుట్టుట" యను విషయము సుప్రసిద్ధమయియుండఁగా "ప్రకాశించెను" అను అర్థమును చెప్పుట న్యాయ మగునా? అను సందేహమునకు శ్రీ శంకరాచార్యులవారు భాష్యమునం దిటుల వ్రాసియున్నారు:— నిత్యమయిన ఓంకారమునకు పుట్టుకను చెప్పుట ఉపపన్నము కాదు. "ప్రజాపతి ర్లోకా నభ్యతపత్" అను (ఛాందో. ౨.౨౩.౨.) శ్రుతివలన లోకదేవవేదవ్యాహృతుల వలన సారమును గ్రహింపఁ దలఁచి తపమొనర్చిన ప్రజా

పతికి సారభూతముగా ఓంకారము స్ఫురించెను. అని తెలియవచ్చుచున్నది కావున అట్టి యర్థ మిచట చెప్పఁబడినది.

ఇచ్చట మేధాప్రార్థనమునకు అవకాశ మేమియున్నదని సంశయించఁబనిలేదు. మేధ ఉన్నఁగాని ఆచార్యుని అనుగ్రహమువలన గ్రహించిన విద్యను ధరింపఁ జాలఁడు. విద్యాధారణ మున్నఁగాని బ్రహ్మజ్ఞానము కలుగఁజాలదు. కావున ఇచట మేధాకాముఁడు జపించవలసిన మంత్రమును చెప్పుట ఆవశ్యకమే గాని అనావశ్యకము కాదని తెలిసికొనవలయును.

౨. నా దేహము ఆరోగ్యసమన్వితమైనది అగుఁగాక. నా నాలుక మధురభాషణములు గలది యగుఁగాక. నా చెవులు చక్కఁగా వినుటకు సమర్థము లగుఁగాక. అనఁగా నా దేహము ఇంద్రియములు బ్రహ్మజ్ఞానార్హము లగుఁగాక. ఓ ప్రణవమా! నీవు పరబ్రహ్మమునకు కోశభూతమయినదానవు. (కోశ మనఁగా ఒర. కత్తి ఒర యందు ఎటులనుండునో పరబ్రహ్మము సైతము ప్రణవమునం దట్లే ఉండును. కావున ప్రణవ మిచట బ్రహ్మమునకు కోశస్థానముగాఁ జెప్పఁబడినది.) లౌకికప్రజ్ఞ చేత ఆచ్ఛాదింపఁబడితివి (అనఁగా సాధారణ ప్రజ్ఞ గలవారలు నీ మాహాత్మ్యము నెఱుంగఁజాలరని తాత్పర్యము.) అట్టి నీవు శ్రవణపూర్వకమగు ఆత్మజ్ఞానమును సంరక్షించుము. (అనఁగా రాగద్వేషాదికముచేత చిత్తము పరిభూత మగుటగాని లేక తదర్థవిస్మరణముగాని లేనివడువున నన్ను రక్షించుమని తాత్పర్యము. శరీరపాటవము లేనియెడల శ్రవణాద్యనుష్ఠానమునకే యోగ్యుఁడు కాఁజాలఁడు. వాగింద్రియము పరుషభాషణశీలమయినయెడల శీలము సర్వదా ఏకాకారము కావున జ్ఞానోపదేష్ట యందును అట్టి పరుషభాషణము నుపయోగించుట సంభవము కావున జ్ఞానోపదేశము సైతము సంభవించదు. కర్ణములకు చెవుడు తటస్థించిన గ్రంథశ్రవణమే సంభవించదు. ఇట్లే అన్నియవయవములకు గ్రహించునది. ఇచ్చట జిహ్వాకర్ణశ్రవణము లనే గ్రహించినను సర్వవిధ శరీరపాటవమునకు బోధకముగానే మనము గ్రహించవలయును. కావున కండ్లు మున్నగు సకలావయవములు కూడ చక్కఁగా తత్తత్క్రియా నిర్వహణక్షమములయి యుండవలయు ననియే ఉపాసకుని యభిప్రాయము.) ఈ రెండు మంత్రములును మేధాకాముఁడు దేహారోగ్యకాముఁడు జపించవలసినవి.

ఇఁక శ్రీకామునకు హోమార్థములయిన మంత్రములు చెప్పఁబడుచున్నవి. —

౩. ఓ ప్రణవమా! నాకు మేధను శరీరపాటవమును కలుగఁజేసిన పిదప అన్న పానీయములను, గోవులను వస్త్రములు మొదలగువానిని కలుగఁ జేయుచు అట్టివానిని వృద్ధిజేయుచు ఆ వృద్ధి చేసినవానిని చిరకాల ముండునటుల చేయునట్టి సంపదను గూడ నాకు కలుగఁజేయుము. కేవలము గోవులు మాత్రమే గాక మేఁకలు, గొఱ్ఱెలు మున్నగు పశువులుకూడ నాకు కలిగియుండుగాక యని తాత్పర్యము. (మేధ లేనివానికి సంపద లున్నయెడల వాఁడు దుష్టుఁడై దుర్వ్యయముల నొనర్చి చెడిపోవును కావున మేధను కలుగఁజేసిన తరువాతనే సంపదను కలుగఁజేయుమనియు, సంపద లేనియెడల చిత్త శుద్ధికయి ఆచరించవలసిన యాగాద్యనుష్ఠానము సైతము ఆచరించ వలనుపడదు కావున మేధను కలుగఁజేసిన పిదప అవశ్యము సంపదనుకూడ నొసంగుమని తాత్పర్యము.

౪. విద్యాభిలాషులయిన బ్రహ్మచారులు నన్నుఁగూర్చి వచ్చెదరుగాక.

౫. స్వర్గాదిలోకప్రాపకము లగు లౌకిక విద్యలను మోక్షవిద్యను అభిలషించు విద్యార్థులుకూడ నా సమీపమునకు వచ్చి సఫలీకృతమనోరథు లయ్యెదరుగాక.

౬. శ్రేష్ఠమయిన బుద్ధిబలముగల బ్రహ్మచారులందఱు నా సమీపమునకే వచ్చెదరుగాక.

౭. బాలచేష్టలను మానిన బ్రహ్మచారులు నా సమీపమునకు విద్యార్థులయి వచ్చెదరుగాక.

౮. శాంతచిత్తులగు బ్రహ్మచారులు నా సమీపమునకు వచ్చెదరు గాక.

(ఈ మంత్రమునకు మొత్తముగా కలిసి అనేక సంఖ్యలుగల విద్యార్థి బృందము నా సమీపమునకు వచ్చుగాక యని ఒకరి మతము.)

౯. 'ఈ యాచార్యుఁ డెందఱినో విద్యావంతుల నొనర్చినాఁడు' అనెడి కీర్తి విశేషమును జనసమూహమునందు నేను పొందెదను గాక.

౧౦. ఐశ్వర్యవంతునికంటె అతిశయమైన మాన్యతగలవాఁడ నయ్యెదనుగాక.

౧౧-౧౨. (ఇదివఱకుఁ జెప్పఁబడిన మంత్రములందు మేధాప్రాప్తి ఐశ్వర్య ప్రాప్తి మున్నగు సకలేప్సితములను కోరియున్నాఁడు. ఇప్పు డీ మంత్రమునందు విద్యాప్రాప్తికిని ఐశ్వర్యాదికమునకును ప్రయోజనభూతమగు ఓంకారవాచ్యబ్రహ్మము తోడ ఐక్యతను ప్రార్థించుచున్నాఁడు:—) ఓ పూజ్యమయిన ప్రణవమా! నేను పర బ్రహ్మమునకు కోశభూతమగు నిన్ను ప్రవేశించుచున్నాఁడను. బ్రహ్మకు కోశభూత మగు నీవున్నూ నన్ను ప్రవేశించుము. అనఁగా పరబ్రహ్మమునకు కోశభూతమగు

త్వత్స్వరూపుఁడనే అయ్యెదను. నీవున్నూ నన్ను ప్రవేశించుము. అనఁగా మన కిద్దఱకు భేదమున్నదని తలంచెడి అజ్ఞానమును సమూలముగా నిర్మూలనము చేయుమని భావము.

౧౩. ఓ పూజ్యమగు ప్రణవమా! శివవిష్ణ్వాద్యనేకవిధరూపములు గల నిన్ను స్మరించి నా పాపములను పోఁగొట్టుకొనియెదను.

౧౪. నీళ్లు పల్లపుప్రదేశమునకు ఎట్లు పోవునో, మాసములు సంవత్సరమును గూర్చి ఎటులపోవునో అదేవిధముగా ఓ ప్రణవమా! నా సమీపమునకు అధ్యయనార్థము నలుదిక్కుల నుండి బ్రహ్మచారులందఱు వచ్చెదరుగాక.

౧౫. ఓ ప్రణవమా! నీవు నిన్నుపాసించువారలకు సమీపమునందున్న గృహమువంటిదానవు, అనఁగా గృహమువలె సకలదుఃఖములను నివారించుదానవు. కావున ఆత్మతత్త్వమును నాకు ప్రకాశింపఁ జేయుము. (నీ నిష్ఠయే సంసారశ్రమాపనోదనక్షమమయినది. కావున ఆత్మస్వరూపమును వాస్తవముగా ప్రకాశింపఁజేయుమని భావము.) నన్నుఁగూడ పొందుము. (రసవిద్ధమయిన లోహము రసమయమయిన విధముగా నన్నుపొంది నన్నుఁగూడ తన్మయుని చేయుమని భావము.)

జ్ఞాపిక:—విద్యాప్రకరణమునందు శ్రీకాముని గుఱించి చెప్పుట ధనార్థమని గ్రహించవలయును. ఆ ధనము శాస్త్రీయవిహితకర్మల నాచరించుటకొఱకనియు, విహితకర్మలు, ఉపాత్తదురితక్షయార్థమనియు, దురితక్షయమయిన పిదప జ్ఞానోత్పత్తి కలుగుననియు శ్రీమదాచార్యులవారు భాష్యమునందు చెప్పి ఇందులకు ప్రమాణముగ శ్రీమన్మహాభారతము శాంతిపర్వమునందు మోక్షధర్మములోని ఈ క్రింది శ్లోకము నుదహరించిరి:—

శ్లో. జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః,
యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని.

భార. మోక్ష. ౨౦౪. ౮.

ఈ మంత్రములలో ౫, ౬, ౭, ౮ మంత్రములు ఆంధ్రపాఠమునందు మాత్రము గలవు గాని ద్రావిడపాఠమునందు లేవు. ఆనందాశ్రమ. మహీశూరపుర ముద్రితభాష్య గ్రంథము లందు పై మంత్రములు ఆచార్యధృతము లయినటుల గలదు. శ్రీరంగముద్రితభాష్య గ్రంథమునందు పై వాక్యములు గ్రహింపఁబడి యుండలేదు.

తైత్తిరీయభాష్యవార్తికమునందు ౬, ౮ మంత్రములు మాత్రము పరిగ్రహింపఁబడినవి. ౫, ౭ మంత్రములు పరిగ్రహింపఁబడి యుండలేదు. దీనివలన ఆచార్యులవారిచట ఆంధ్రపాఠమును గ్రహించినటుల స్ఫురించుచున్నది.

౧. అను........

౨. ఆత్మ........

౩. భా. వా. ౬౮-౯౧.



## ౫. పంచమోఽనువాకః

### వ్యాహృత్యుపాసనము

౧ భూర్భువ స్సువ రితి వా ఏతా స్తిస్రో వ్యాహృతయః । తాసాముహస్మైతాం చతుర్థీమ్ । మాహాచమస్యః ప్రవేద యతే । మహ ఇతి । తద్బ్రహ్మ । స ఆత్మా । అఙ్గాన్యన్యా దేవతాః । ౨ భూ రితి వా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షమ్ । సువరిత్యసౌ లోకః ॥౧॥

మహ ఇత్యాదిత్యః । ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయంతే । 3 భూ రితి వా అగ్నిః । భువ ఇతి వాయుః । సువ రిత్యాదిత్యః । మహ ఇతి చన్ద్రమాః । చంద్రమసా వావ సర్వాణి జ్యోతీగ్ంషి మహీయంతే । ౪ భూ రితి వా ఋచః । భువ ఇతి సామాని । సువ రితి యజూగ్ంషి ॥౨॥

మహ ఇతి బ్రహ్మ । బ్రహ్మణా వావ సర్వే వేదా మ
హీయంతే । ౫ భూ రితి వై ప్రాణః । భువ ఇత్యపానః । సువ
రితి వ్యానః । మహ ఇత్యన్నమ్ । అన్నేన వావ సర్వే ప్రాణా
మహీయన్తే । ౬ తా వా ఏతాశ్చతస్ర శ్చతుర్ధా । చతస్ర
శ్చతస్రో వ్యాహృతయః । తా యో వేద । స వేద బ్రహ్మ ।
సర్వేఽస్మై దేవా బలి మావహన్తి ॥3॥

అసౌ లోకో యజూగ్ంషి వేద ద్వే చ. ॥౫॥

శాంకర భాష్యమ్:—

సంహితావిషయముపాసనము క్తమ్। తదను మేధాకామస్య శ్రీకామస్య చాను క్రాన్తా మన్త్రాః। తే చ పారమ్పర్యేణ విద్యోపయోగార్థా ఏవ । అనన్తరమ్ వ్యాహృత్యాత్మనో బ్రహ్మణః అన్తరుపాసనం స్వారాజ్యఫలం ప్రస్తూయతే — భూర్భువః సువరితి। ఇతీత్యుక్తోప ప్రదర్శనార్థః । ఏతాస్తిస్ర ఇతి చ ప్రదర్శితానాం పరామర్శార్థః పరామృష్టాః స్మర్యన్తే వై ఇత్యనేన। తిస్ర ఏతాః ప్రసిద్ధా వ్యాహృతయః స్మర్యన్త ఇతి యావత్। తాసామ్ ఇయం చతుర్థీ వ్యాహృతిర్మహ ఇతి; తామేతాం చతుర్థీం మహాచమనస్యాపత్యం మాహాచమస్యః ప్రవేదయతే, ఉ హ స్మ ఇత్యేతేషాం వృత్తానుకథనార్థత్వాత్ విదితవాన్ దదర్శే త్యర్థః। మాహాచమస్య గ్రహణమార్షానుస్మరణార్థమ్ । ఋష్యనుస్మరణమప్యుపాసనాఙ్గమితి గమ్యతే, ఇహోపదేశాత్ । యేయం మాహాచమస్యేన దృష్టా వ్యాహృతిః । మహ ఇతి, తత్ బ్రహ్మ । మహద్ధి బ్రహ్మ మహశ్చ వ్యాహృతిః । కిం పున స్తత్? స ఆత్మా, ఆప్నోతే ర్వ్యాప్తి కర్మణః ఆత్మా; ఇతరాశ్చ వ్యాహృతయో లోకా దేవా వేదాః ప్రాణాశ్చ మహ ఇత్యనేన వ్యాహృత్యాత్మనా ఆదిత్య చన్ద్ర బ్రహ్మాన్నభూతేన వ్యాప్యన్తే యతః, అత అఙ్గాని అవయవాః అన్యాః దేవతాః। దేవతాగ్రహణముపలక్షణార్థం లోకాదీనామ్। మహ ఇత్యస్య వ్యాహృత్యాత్మనో దేవా లోకాదయశ్చ సర్వే అవయవ భూతా యతః, అత

ఆహ — ఆదిత్యాదిభిర్లోకాదయో మహీయన్త ఇతి। ఆత్మనాహ్యఙ్గాని మహీయన్తే। మహనం వృద్ధిః ఉపచయః। మహీయన్తే వర్ధన్త ఇత్యర్థః। అయం లోకః అగ్నిః ఋగ్వేదః ప్రాణ ఇతి ప్రథమా వ్యాహృతిః భూః, అన్తరిక్షం వాయుః సామాని అపానః ఇతి ద్వితీయా వ్యాహృతిః భువః; అసౌ లోకః ఆదిత్యః యజూంషి వ్యానః ఇతి తృతీయా వ్యాహృతిః సువః, ఆదిత్యః చన్ద్రమాః బ్రహ్మ అన్నమ్ ఇతి చతుర్థీ వ్యాహృతిః మహః ఇత్యేవమ్ ఏకైకాశ్చతుర్ధా భవన్తి। మహ ఇతి బ్రహ్మ బ్రహ్మేత్యోంకారః, శబ్దాధికారే అన్యస్యాసం భవాత్। ఉక్తార్థమన్యత్। తావా ఏతాశ్చతస్రశ్చ తుర్ధేతి। తావై ఏతాః భూర్భువః సువర్మహ ఇతి చతస్రః ఏకైకశః చతుర్ధా చతుః ప్రకారాః। ధా శబ్దః ప్రకార వచనః। చతస్ర శ్చతస్రః సత్యః చతుర్ధా భవన్తీత్యర్థః। తాసాం యథాక్లుప్తానాం పునరుపదేశస్తథైవోపాసననియమార్థః। తాః యథోక్తా వ్యాహృతీః యః వేద, సవేద విజానాతి। కిం తత్? బ్రహ్మ। నను, "తద్బ్రహ్మ స ఆత్మా" ఇతి జ్ఞాతే బ్రహ్మణి, న వక్తవ్యమ విజ్ఞాతవత్ "స వేద బ్రహ్మ" ఇతి; న; తద్విశేష వివక్షుత్వాదదోషః। సత్యం విజ్ఞాతం చతుర్థ వ్యాహృత్యా ఆత్మా బ్రహ్మేతి; నతు తద్విశేషః। —— హృదయాన్తరుప లభ్యత్వం మనోమయత్వాదిశ్చ। "శాన్తిసమృద్ధమ్" ఇత్యే మమన్తో విశేషణ విశేషరూపో ధర్మపూగో న విజ్ఞాయత ఇతి; తద్వివక్షు హి శాస్త్ర మవిజ్ఞాతమివ బ్రహ్మ మత్వా సవేద బ్రహ్మ "ఇత్యాహ। అతో న దోషః। యోవా వక్ష్యమాణేన ధర్మపూగేన విశిష్టం బ్రహ్మ వేద, స వేద బ్రహ్మ ఇత్యభిప్రాయః। అతో వక్ష్యమాణాను వాకే నైకవాక్యతా అస్య, ఉభయోర్హ్యను వాకయోరేకము పాసనమ్। లిఙ్గాచ్చ। "భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి" ఇత్యాదికం లిఙ్గముపాసనై కత్వే। విధాయకాభావాచ్చ। న హి వేద ఉపాసీత వేతి విధాయకః కశ్చిచ్ఛబ్దోఽస్తి। వ్యాహృత్యనువాకే "తాయోవేద" ఇతి తు వక్ష్యమాణార్థత్వాన్నోపాసనాభేదకః। వక్ష్యమాణార్థత్వం చ తద్విశేష వివక్షుత్వా దిత్యాదినోక్తమ్। సర్వేదేవాః అస్మై ఏవం విదుషే అఙ్గభూతాః ఆవహన్తి అనయన్తి బలిమ్, స్వారాజ్యప్రాప్తౌ సత్యా మిత్యర్థః॥

ఇతి పఞ్చమాను వాక భాష్యమ్॥

టీక. ౧. భూః = 'భూః' అనియు, భువః = 'భువః' అనియు, సువః = 'సువః' అనియు, ఇతి = ఈ విధముగా, ఏతాః = ఈ, తిస్రః = మూఁడున్నూ, వ్యాహృతయఃవై = వ్యాహృతులుగదా, తాసాం = ఆవ్యాహృతులకు, ఏతాం =

ఈ, చతుర్థీం=నాల్గవ వ్యాహృతిని, మహఃఇతి='మహః' అని మాహాచమస్యః= మాహాచమస్యమహర్షి, ప్రవేదయతే ఉ హస్మ = తెలిసికొనెనుగదా. తత్ = ఆమాహాచమస్య మహర్షిచేత దృష్ట మగు 'మహః' అను వ్యాహృతియే, బ్రహ్మ = బ్రహ్మము. సః=ఆ'మహ'యనువ్యాహృతియే, ఆత్మా=ఆత్మ, అన్యాః=ఇతరములగు, దేవతాః= దేవతలు, (ఇచట దేవత లుపలక్షణము లోకము మున్నగునవి యనుట.) అంగాని=అంగములు.

౨. భూఃఇతి = 'భూః' అనువ్యాహృతి, అయం=ఈ, లోకఃవై = లోకము గదా (మర్త్యలోకమనుట). భువఃఇతి = 'భువః' అనువ్యాహృతి, అంతరిక్షం = అంతరిక్షలోకము. సువఃఇతి = 'సువః' అనువ్యాహృతి, అసౌలోకః = స్వర్గ లోకము. మహఃఇతి='మహః' అనువ్యాహృతి, ఆదిత్యః=ఆదిత్యలోకము. సర్వే = సమస్తమయిన, లోకాః = లోకములు, ఆదిత్యేన=ఆదిత్యునిచేత, మహీయన్తేవావ= వృద్ధిని పొందుచున్నవిగదా.

౩. భూః ఇతి = 'భూః' అనువ్యాహృతి, అగ్నిః = అగ్ని, భువః ఇతి = 'భువః' అనువ్యాహృతి, వాయుః = వాయువు. సువఃఇతి = 'సువః' అనువ్యాహృతి, ఆదిత్యః = ఆదిత్యుఁడు, మహఃఇతి = 'మహః' అనువ్యాహృతి, చంద్రమాః = చంద్రుఁడు. సర్వాణి= సకలములయిన. జ్యోతీంషి=జ్యోతిస్సులు, చంద్రమసా = చంద్రునిచేత, మహీయంతేవావ=వృద్ధిని పొందుచున్నవిగదా.

౪. భూఃఇతి = 'భూః' అనువ్యాహృతి, ఋచః వై = ఋక్కులుగదా. భువః ఇతి='భువః' అనువ్యాహృతి, సామాని= సామములు, సువః ఇతి = 'సువః' అనువ్యాహృతి. యజూంషి=యజుస్సులు, మహఃఇతి='మహః' అనువ్యాహృతి, బ్రహ్మ=ఓంకారము, సర్వేవేదాః = వేదములన్నియు, బ్రహ్మణా = ఓంకారముచేత, మహీయన్తేవావ=వృద్ధిని పొందుచున్నవిగదా.

౫. భూఃఇతి='భూః' అనువ్యాహృతి, ప్రాణఃవై = ప్రాణవాయువుగదా, భువఃఇతి = 'భువః' అనువ్యాహృతి, అపానః = అపానవాయువుగదా, సువఃఇతి = 'సువః' అనువ్యాహృతి, వ్యానః = వ్యానవాయువుగదా, మహఃఇతి = 'మహః' అనువ్యాహృతి. అన్నం = అన్నముగదా, సర్వే = సమస్తములయిన, ప్రాణాః = ప్రాణములు, అన్నేన=అన్నముచేత, మహీయంతే వావ=వృద్ధిని పొందుచున్నవిగదా.

౬. తాః=ఆ, ఏతాః=ఈ, చతస్రః = నాలుగు వ్యాహృతులు, చతుర్ధావా = నాల్గు విధములుగదా, వ్యాహృతయః = వ్యాహృతులు, చతస్రః చతస్రః = నాల్గేసి

నాల్గేసి యగుచున్నవి. తాః = ఆవ్యాహృతులను, యః = ఎవ్వఁడు, వేద = ఉపాసించునో. సః = వాఁడు, బ్రహ్మ = బ్రహ్మమునే, వేద = ఉపాసించుచున్నాఁడు, అస్మై = ఈ (విషయమును) యెఱింగినవానికి, సర్వేదేవాః = దేవతలందఱు బలిం = పూజను, ఆవహంతి = చేయుచున్నారు.

తా. మూఁడవ యనువాకమునందు సంహితోపాసనము వివరింపఁబడియున్నది. నాల్గవ యనువాకమునందు మేధాకామునకు శ్రీకామునకు తత్తత్కామప్రాప్తికి సాధనభూతము లగు మంత్రములు చెప్పఁబడి యున్నవి. నాల్గవ యనువాకమునందు చెప్పఁబడిన మేధాకామాది మంత్రములను సైతము ఫలాభిలాష లేక జపహోమముల నాచరించునెడల సంహితోపాసనమువలెనే చిత్తశుద్ధిమూలకముగ విద్యోపయోగము లగుచున్నవి. ఈ ౫-వ అనువాకమునందును, పై ౬-వ అనువాకమునందును వ్యాహృత్యాత్మక బ్రహ్మోపాసనము చెప్పఁబడినది.

అందు ౫-వ యనువాకమునందు మాత్రము బ్రహ్మకు అంగభూతములగు వ్యాహృతుల యుపాసనము చెప్పఁబడుచున్నది.

పై యనువాకమునందు అంగిభూత బ్రహ్మోపాసనము చెప్పఁబడును.

'భూః, భువః, సువః' అనునవి మూఁడున్నూ వ్యాహృతులని చెప్పఁబడును. మాహాచమస్యుఁ డను మహర్షి 'మహః' అనునది నాల్గవ వ్యాహృతి కలదని తపః ప్రభావముచేతఁ గనిపెట్టెను. ఆ వ్యాహృతియే బ్రహ్మము. ఆ వ్యాహృతియే ఆత్మ. ఏలయనఁగా 'మహః' అను అంగికి భూః, భువః, సువః అను వ్యాహృతులు అంగములు. అంగ్యధీనముగా ఇతరావయవములకు వృద్ధి ఎటుల కలుగునో అటులనే ఇతర వ్యాహృతులకు ఈ వ్యాహృతి వలన అవస్థితి కలుగుచున్నవి. ఇఁక క్రమముగ ఆ వ్యాహృతులు బ్రహ్మమునకు అంగభూతములు కావున అంగోపాసనారూపమగు వ్యాహృత్యుపాసనమునందు క్రమముగ ౧ లోక, ౨ దేవ, ౩ వేద, ౪ ప్రాణదృష్టి రూపోపాసనములు ఇందు విధింపఁబడినవి:—

## ౧. లోకదృష్ట్యుపాసనము

1. 'భూః' అనువ్యాహృతిని ఈలోక (అనఁగా భూలోక) దృష్టితో ఉపాసింపవలయును.

2. 'భువః' అనువ్యాహృతిని అంతరిక్షలోక దృష్టితో ఉపాసింపవలయును.

3. 'సువః' అనువ్యాహృతిని స్వర్గలోక దృష్టితో ఉపాసించవలయును.
4. 'మహః' అనువ్యాహృతిని ఆదిత్యలోక దృష్టితో ఉపాసించవలయును. లోకము లన్నియు ఆదిత్యప్రకాశసమన్వితములయి సర్వప్రాణులకు వ్యవహారయోగ్యము లగుచున్నవి గదా.

## ౨. దేవవిశేషదృష్ట్యుపాసనము

1. 'భూః' అనువ్యాహృతిని అగ్నిదృష్టితో నుపాసించవలయును.
2. 'భువః' అనువ్యాహృతిని వాయుదృష్టితో నుపాసించవలయును.
3. 'సువః' అనువ్యాహృతిని ఆదిత్యదృష్టితో నుపాసించవలయును.
4. 'మహః' అనువ్యాహృతిని చంద్రదృష్టితో నుపాసించవలయును. సకల తేజఃపుంజములు చంద్రునిచేత పూజ్యములయి పరిగణింపఁబడుచున్నవి గదా.

## 3. వేదదృష్ట్యుపాసనము

1. 'భూః' అనువ్యాహృతిని ఋగ్వేద దృష్టితో నుపాసించవలయును.
2. 'భువః' అనువ్యాహృతిని సామవేద దృష్టితో నుపాసించవలయును.
3. 'సువః' అనువ్యాహృతిని యజుర్వేదదృష్టితో నుపాసించవలయును.
4. 'మహః' అనువ్యాహృతిని ఓంకారదృష్టితో నుపాసించవలయును.

ఓంకారమును ఆద్యంతములందు చేర్చి పఠించుటచేతనే వేదములన్నియు పూజనీయము లగుచున్నవి గదా. ఈ యనువాకమునందే ముందు ''ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్య న్నాహ'' అని చెప్పఁబోవుచున్నాడు కావున వేదమును ఉపక్రమించునప్పుడు ఓంకారపూర్వకముగనే ఉపక్రమించవలయును కావున పైని చెప్పఁబడిన విషయము యుక్తమే యగుచున్నది.

## ౪. ప్రాణదృష్ట్యుపాసనము

1. 'భూః' అనువ్యాహృతిని ప్రాణవాయువు దృష్టితో ఉపాసించవలయును.
2. 'భువః' అనువ్యాహృతిని అపానవాయు దృష్టితో ఉపాసించవలయును.
3. 'సువః' అనువ్యాహృతిని వ్యానవాయు దృష్టితో నుపాసించవలయును.
4. 'మహః' అనువ్యాహృతిని అన్నదృష్టితో నుపాసించవలయును.

లోకమునందు ప్రాణము లన్నియు అన్నముచేతనే పోషింపఁబడుచున్నవి గదా. ఈ విషయము జగత్ప్రసిద్ధముమాత్రమే గాదు. ఇందులకు శ్రుతి ప్రమాణము గూడఁ (బృహ. ౫. ౧౨. ౧.) గలదు:—

శ్రు. ''శుష్యతి వై ప్రాణః ఋతేఽన్నాత్'' అని (అన్నము లేనియెడల ప్రాణము శోషించునుగదా) అని యర్థము.

పైని చెప్పఁబడిన 'భూః, భువః, సువః, మహః' అను వ్యాహృతులు లోక, దేవ, వేద, ప్రాణ, దృష్టులతో నాల్గు విధము లగుచున్నవి. అప్పుడు

1. 'భూః' అనువ్యాహృతి 'పృథివి, అగ్ని, ఋగ్వేదము, ప్రాణవాయువు' ఈ దృష్టితో నాల్గువిధము లగుచున్నది.

2. 'భువః' అనువ్యాహృతి 'అంతరిక్షము, వాయువు, సామవేదము, అపాన వాయువు' ఈ దృష్టితో నాల్గు విధము లగుచున్నది.

3. 'సువః' అనువ్యాహృతి 'స్వర్గము, ఆదిత్యుఁడు, యజుర్వేదము, వ్యాన వాయువు' ఈ దృష్టితో నాల్గు విధము లగుచున్నది.

4. 'మహః' అనువ్యాహృతి 'ఆదిత్యలోకము, చంద్రుఁడు, ఓంకారము, అన్నము' ఈ దృష్టితో నాల్గు విధము లగుచున్నది. మొత్తము నాల్గు నాల్గులు కలపి ౧౬ అగుచున్నది.

ఈ విధముగా అంగభూతములగు వ్యాహృతులను ఎవ్వఁ డుపాసించునో అతఁడే బ్రహ్మము నెఱుంగును. అతనికే దేవతలందఱు పూజాదికము నాచరింతురు.

## వ్యాహృతిశబ్దవ్యుత్పత్తి

౧. వ్యాహరణం—ఉచ్చారణం, తద్విషయత్వా న్మంత్రాణాం వ్యాహృతిత్వమ్.

౨. (యద్వా) వివిధే — కర్మణి, ఆహ్రియంతే — ప్రయుజ్యంతఇతి— వ్యాహృతయః.

అర్థ. వివిధము లగు కర్మలందు ప్రయోగింపఁబడుచున్నవి కావున వ్యాహృతు లనంబడును.

వ్యాహృతులను వివిధ విషయములందు ప్రయోగించవలసినదిగా చెప్పిన మంత్రముల వీ క్రింద నిచ్చుచున్నాఁడను.—

తైత్తిరీయ సంహిత ౧-వ కాండము, ౬-వ పన్నము, ౧౦-వ అనువాకము:

---

౧......అగ్నిహోత్ర మేతాభిర్వ్యాహృతీభి రుపసాదయే ద్యజ్ఞముఖం వా అగ్నిహోత్రం బ్రహ్మైతా వ్యాహృతయో యజ్ఞముఖ ఏవబ్రహ్మ. ౨. కురుతే.

౨. సంవత్సరే పర్యాగత ఏతాభి రేవోపసాదయే ద్బృహ్మణైవో భయత స్సంవత్సరం పరిగృహ్ణాతి.

౩. దర్శపూర్ణమాసౌ చాతుర్మాస్యాన్యా లభమాన ఏతాభి ర్వ్యాహృతీభిర్హవీగ్ం ష్యాసాదయే ద్యజ్ఞముఖం వై దర్శపూర్ణమాసౌ చాతుర్మాస్యాని బ్రహ్మైతా వ్యాహృతయో యజ్ఞముఖ ఏవ బ్రహ్మకురుతే సంవత్సరే పర్యాగత ఏతాభి రేవాసాదయే ద్బృహ్మణైవోభయత స్సంవత్సరం పరిగృహ్ణాతి.........

౪......సామిధేనీ రనువక్ష్య న్నేతా వ్యాహృతీః పురస్తా ద్దధ్యా ద్బృహ్మైవ ప్రతిపదం కురుతే తథాబ్రాహ్మణ స్సాశీర్కేణ యజ్ఞేన యజతే.

౫. యం కామయేత యజమానం భ్రాతృవ్య మస్య యజ్ఞ స్యాశీర్గచ్ఛేదితి తస్యైతావ్యాహృతీః పురోఽనువాక్యాయాం దధ్యాత్....

౬......యాన్కామయేత యజమానా స్సమావత్యేనా న్యజ్ఞ స్యాశీర్గచ్ఛేదితి తేషామేతా వ్యాహృతీః పురోఽనువాక్యాయా అర్ధర్చ ఏకాందధ్యాద్యాజ్యాయై పురస్తా చేకాం యాజ్యాయా అర్ధర్చ ఏకాం తథైనా స్సమావతీ యజ్ఞ స్యాశీ ర్గచ్ఛతి.

అర్థ. ౧. వ్యాహృతులచేత అగ్నిహోత్రహవిస్సు నాసాదించ వలయును.

౨. అగ్నిహోత్రారంభానంతరము సంవత్సరము అయినపిదప మఱల నీ వ్యాహృతులచేతనే హవిరాసాదన మొనర్పవలయును.

౩. దర్శపూర్ణ చాతుర్మాస్య యాగములయందు నీవ్యాహృతులచేతనే హవిరాసాదనము చేయవలయును.

౪. హోత 'సామిధేనీఋక్కులను' పఠింపఁబోవుచు ముందుగా నీ వ్యాహృతులను పఠించవలయును.

౫. యజ్ఞఫలమును యజమానునియొక్క శత్రువునకు చెందఁజేయవలయు. ననుదురూహ అధ్వర్యునకు కలిగెనేని ఆయధ్వర్యుఁడు పురోఽనువాక్యముకంటె ముందుగా వ్యాహృతులను పఠింపవలయును.

౬. అనేక యజమానులు కలిసి చేయు సత్రయాగము లందు యజమానులందఱు సమానమయిన ఫలమును పొందవలయునని 'హోత' యను ఋత్విక్కు తలంచునెడల పురోఽనువాక్యను సగము పఠించి ౧-వ వ్యాహృతిని, యాజ్యను

చెప్పుటకు ముందుగా ౨-వ ఆహుతిని, యాజ్య సగము చెప్పి 3-వ వ్యాహృతిని పఠించవలయును.

మఱియు ప్రాణాయామమునందు, గాయత్రీ జపమునందు, పరిషేచనమునందు దాదాపు సకల కర్మలందు ప్రయోగింపఁబడును. కావున "వ్యాహృతులు" అని చెప్పుటకు తగియున్నవి.

వ్యాహృత్యుపాసనమునకు సంబంధించిన
వివరము నీ క్రింద నిచ్చుచున్నాఁడను:

| | ౧ | ౨ | 3 | ౪ |
|---|---|---|---|---|
| వ్యాహృతులు | భూః | భువః | సువః | మహః |
| లోక | (అయంలోకః) భూలోకము | అంతరిక్ష లోకము | అసౌలోకః స్వర్గలోకము | ఆదిత్య లోకము |
| దేవ | అగ్ని | వాయువు | ఆదిత్యుఁడు | చంద్రుఁడు |
| వేద | ఋగ్వేదము | సామవేదము | యజుర్వేదము | బ్రహ్మవేదము |
| ప్రాణ | ప్రాణవాయువు | అపాన వాయువు | వ్యానవాయువు | అన్నము |

మాహాచమస్యశబ్ద వ్యుత్పత్తి

మహాన్ చమసః — సోమపానార్థః పాత్ర విశేషో యస్య మునేః సః మహాచమసః, బహుషు సోమయాగేషు వర్తమానత్వా చ్చమసస్య మహత్త్వమ్. మహాచమసః గోత్రాపత్యంపుమాన్ — 'మహాచమస్యః'.

అర్థ. చమస మనఁగా, సోమపానార్థమగు పాత్రము. పూజ్యమగు అట్టి పాత్ర మెవ్వనికి గలదో అట్టి మహర్షి 'మహాచమసుఁడు' అనేక సోమయాగము లందు ఉండుటచేతనే అతని చమసమునకు మహత్త్వము సిద్ధించుచున్నది. అట్టి

మహాచమసునియొక్క గోత్రమునందు పుట్టినవాఁడు మహాచమస్యుఁడు. అని తైత్తిరీయభాష్యవార్తికమునం దున్నది.

శంకరభాష్యమునందును, విద్యారణ్యకృత బృహద్దీపికయందును 'మహాచమసస్యాపత్యం మాహాచమస్యః' అని మాత్రమే చెప్పఁబడియున్నది. సురేశ్వరాచార్యకృతభాష్యవార్తికమునందు:—

శ్లో. మహాచమసగోత్రత్వాద్గోత్రార్థ స్తద్ధితో భవేత్.
మహాచమస్యోఽత స్సాక్షాత్ మహో వేదయతే పరామ్.

అని చెప్పఁబడియుండుటచేత ఇచట 'గోత్రాపత్య' మని వ్రాయఁడమైనది.



## ౬. షష్ఠోఽనువాకః

(మనోమయత్వాదిగుణకబ్రహ్మోపాసనము)

అవ. ౫-వ అనువాకమునందు వ్యాహృత్యాత్మకమగు బ్రహ్మముయొక్క అంగభూతములగు వ్యాహృతులయుపాసనము చెప్పఁబడినది. తద్వ్యాహృతుల నుపాసించినవాఁడు బ్రహ్మోపాసనమునకు అర్హుఁడగును కావున అట్టి బ్రహ్మమును సాక్షాత్తుగ పొందుటకు అర్హమగు స్థానము మున్నగునవి ఈ యనువాకమునందు చెప్పఁబడుచున్నది:—

మం. ౧ స య ఏషోఽన్తర్హృదయ ఆకాశః । తస్మి న్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః । ౨ అన్తరేణ తాలుకే । యఏష స్తన ఇవావలంబతే । సేంద్రయోనిః । యత్రాసౌ కేశాన్తో వివర్తతే । వ్యపోహ్య శీర్షకపాలే । 3 భూ రిత్యగ్నౌ ప్రతితిష్ఠతి । భువ ఇతి వాయౌ ॥౧॥

సువ రిత్యాదితే । మహ ఇతి బ్రహ్మణి । ४ ఆప్నో
తి స్వారాజ్యమ్ । ఆప్నోతి మనసస్పతిమ్ । వాక్పతి
శ్చక్షుష్పతిః । శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః । ౫ ఏత త్తతో
భవతి । ఆకాశశరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణా
రామం మన ఆనన్దమ్ । శాన్తిసమృద్ధ మమృతమ్ ।
ఇతి ప్రాచీనయోగ్యోపాస్స్వ ॥౬॥

వాయా వమృత మేకం చ ॥౬॥

శాంకరభాష్యమ్:—

భూర్భువః సువః స్వరూపా మహ ఇత్యేతస్య హిరణ్యగర్భస్య వ్యాహృత్యాత్మనో బ్రహ్మణోఽఙ్గాన్యన్యా దేవతా ఇత్యుక్తమ్ । యస్యతా అఙ్గభూతాః, తస్యైతస్య బ్రహ్మణః సాక్షాదుపలబ్ధ్యర్థముపాసనార్థం చ హృదయాకాశః స్థానముచ్యతే, సాలగ్రామ ఇవ విష్ణోః । తస్మిన్హి తద్బ్రహ్మ ఉపాస్యమానం మనోమయత్వాది ధర్మ విశిష్టం సాక్షాదుపలభ్యతే, పాణావివామలకమ్ । మార్గశ్చ సర్వాత్మభావ ప్రతిపత్తయే వక్తవ్య ఇత్యనువాక ఆరభ్యతే — స ఇతి వ్యుత్క్రమ్య అయం పురుష ఇత్యనేన సంబధ్యతే । య ఏష అన్తర్హృదయే హృదయస్యాన్తః । హృదయమితి పుణ్డరీకాకారో మాంసపిణ్డః ప్రాణాయతనోఽనేక నాడీసుషిర ఊర్ధ్వనాలోఽ అధోముఖో విశస్యమానే పశౌ ప్రసిద్ధ ఉపలభ్యతే । తస్యాన్తః య ఏష ఆకాశః ప్రసిద్ధ ఏవ కరకాకాశవత్, తస్మిన్ సోఽయం పురుషః, పురి శయనాత్; పూర్ణా వా భూరాదయో లోకాయేనేతి పురుషః మనోమయః, మనః విజ్ఞానం మనుతేర్జ్ఞాన కర్మణః తన్మయః తత్ప్రాయః, తదుపలభ్యత్వాత్ । మనుతే అనేనితి వా మనః అన్తఃకరణమ్; తదభిమానీ తన్మయః, తల్లిఙ్గో వా । అమృతః అమరణధర్మా । హిరణ్మయః జ్యోతిర్మయః । తస్యైవం లక్షణస్య హృదయాకాశే సాక్షాత్కృతస్య విదుష ఆత్మభూతస్య ఈశ్వరరూపస్య ప్రతిపత్తయే మార్గోఽభిధీయతే —

హృదయాదూర్ధ్వం ప్రవృత్తా సుషుమ్నా నామనాడీ యోగశాస్త్రేషు ప్రసిద్ధా। సా చ అన్తరేణ తాలుకే మధ్యే తాలుక యోర్గతా। యశ్చ ఏష తాలుకయోర్మధ్యే స్తన ఇవ అవలమ్బతే మాంసఖణ్డః, తస్య చ అన్తరేణ ఇత్యేతత్। యత్ర చ అసౌ కేశాన్తః కేశానామన్తో మూలం కేశాన్తః వివర్తతే విభాగేన వర్తతే, మూర్ధప్రదేశ ఇత్యర్థః; తం దేశం ప్రాప్య తేనాన్తరేణ వ్యపోహ్య విభజ్య విదార్య శీర్ష కపాలే శిరః కపాలే, వినిర్గతా యా సా ఇన్ద్రయోనిః ఇన్ద్రస్య బ్రహ్మణః యోనిః మార్గః, స్వరూప ప్రతిపత్తిద్వారమిత్యర్థః। తథా ఏవం విద్వాన్ మనోమయాత్మదర్శీ మూర్ధ్నో వినిష్క్రమ్య అస్య లోకస్యాధిష్ఠాతా భూరితి వ్యాహృతిరూపో యోఽగ్నిః మహతో బ్రహ్మణోఽఙ్గభూతః, తస్మిన్ అగ్నౌ ప్రతితిష్ఠతి, అగ్న్యాత్మనా ఇమం లోకం వ్యాప్నోతీత్యర్థః। తథా భువ ఇతి ద్వితీయవ్యాహృత్యాత్మని వాయౌ, ప్రతితిష్ఠతీత్యనువర్తతే। సువరితి తృతీయవ్యాహృత్యాత్మని ఆదిత్యే। మహ ఇత్యఙ్గిని చతుర్థవ్యాహృత్యాత్మని బ్రహ్మణి ప్రతి తిష్ఠతీతి। తేష్వాత్మభావేన స్థిత్వా ఆప్నోతి బ్రహ్మభూతం స్వారాజ్యం స్వరాడ్భావం స్వయమేవ రాజా అధిపతిర్భవతి అఙ్గభూతానాం దేవతానాం యథా బ్రహ్మ; దేవాశ్చ సర్వే అస్మై అఙ్గినే బలిమావహన్తి అఙ్గభూతాః యథా బ్రహ్మణే। ఆప్నోతి మనసస్పతిమ్, సర్వేషాం హి మనసాం పతిః, సర్వాత్మకత్వాత్ బ్రహ్మణః సర్వైర్హి మనోభిస్తన్మనుతే। తదాప్నోత్యేవం విద్వాన్। కిం చ, వాక్పతిః సర్వాసాం వాచాం పతిర్భవతి। తథైవ చక్షుష్పతిః చక్షుషాం పతిః। శ్రోత్రపతిః శ్రోత్రాణాంచ పతిః। విజ్ఞాన పతిః విజ్ఞానానాంచ పతిః। సర్వాత్మకత్వాత్సర్వప్రాణినాం కరణైస్తద్వాన్భవతీత్యర్థః। కిం చ, తతోఽపి అధికతరమ్ ఏతత్ భవతి। కిం తత్? ఉచ్యతే — ఆకాశశరీరమ్ ఆకాశః శరీరమస్య, ఆకాశవద్వా సూక్ష్మ శరీరమస్యేత్యాకాశశరీరమ్। కిం తత్? ప్రకృతం బ్రహ్మ। సత్యాత్మ, సత్యం మూర్తామూర్తమ్ అవితథం స్వరూపం వా ఆత్మా స్వభావోఽస్య, తదిదం సత్యాత్మ। ప్రాణారామమ్, ప్రాణేష్వా రమణమాక్రీడా యస్య తత్ప్రాణారామమ్; ప్రాణానాం వా ఆరామో యస్మిన్, తత్ప్రాణారామమ్। మన ఆనన్దమ్, ఆనన్ద భూతం సుఖకృదేవ యస్య మనః, తన్మన ఆనన్దమ్। శాన్తి సమృద్ధమ్, శాన్తి రుపశమః, శాన్తిశ్చ తత్సమృద్ధం చ శాన్తిసమృద్ధమ్; శాన్త్యా వా సమృద్ధవత్తదుపలభ్యత ఇతి శాన్తి సమృద్ధమ్। అమృతమ్ అమరణ ధర్మి; ఏతచ్చాధికరణ విశేషణం తత్రైవ మనోమయ ఇత్యాదౌ ద్రష్టవ్య మితి। ఏవం

మనోమయత్వాది ధర్మైర్విశిష్టం యథోక్తం బ్రహ్మ హే ప్రాచీనయోగ్య, ఉపాస్స్వ ఇత్యాచార్యవచనోక్తిరాదరార్థా । ఉక్తస్తూపాసనా శబ్దార్థః ॥

ఇతి షష్ఠానువాకభాష్యమ్ ॥

౧. టీక. అంతః హృదయే = హృదయపుండరీక మధ్య భాగమునందు యః = ఏ, ఏషః = ఈ, ఆకాశః = ఆకాశము గలదో, తస్మిన్ = ఆ యాకాశము నందు, మనోమయః = మనోమయుఁడును, అమృతః = మరణధర్మరహితుఁడును, హిరణ్మయః=జ్యోతిర్మయుఁడును అగు, సః అయం=ఆ ఈ, పురుషః = పురుషుఁడు (కలఁడు).

౨. తాలుకే అన్తరేణ = తాలుకలకు మధ్యభాగమునందు, యః=ఏ, ఏషః= ఈ (సుషుమ్నానాడి). స్తనః ఇవ= స్తనమువలె, అవలంబతే = వ్రేలాడుచున్నదో, యత్ర=ఎచ్చట, అసౌ = ఈ, కేశాంతః = కేశములయొక్క మొదలు, వివర్తతే = విభాగముగా నున్నదో, శీర్షకపాలే = శిరఃకపాలములను, వ్యపోహ్య = విభజించి బయలు వెడలినది యెయ్యది గలదో, సా=అది, ఇంద్రయోనిః = పరమాత్మను పొందుటకు మార్గభూతము.

౩. (ఈ ప్రకారము = పరమాత్మ ప్రతిపత్తి మార్గమును పొందిన విద్వాంసుఁడు) భూః ఇతిఅగ్నౌ = 'భూః' అనువ్యాహృతాత్మకమగు ఆ అగ్నియందు, ప్రతితిష్ఠతి = ఉంటున్నాఁడు. భువః ఇతివాయౌ = 'భువః' అను వ్యాహృత్యాత్మకమగు వాయువునందు, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. సువః ఇతి ఆదిత్యే = 'సువః' అను తృతీయవ్యాహృత్యాత్మకుఁడగు ఆదిత్యునియందు, (ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు.) మహః ఇతి బ్రహ్మణి = 'మహః' అను చతుర్థవ్యాహృత్యాత్మక మగు బ్రహ్మమునందు, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు.

౪. స్వారాజ్యం = స్వారాజ్యభావమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. మనసః పతి=అందఱి మనస్సులకు అధిపతిత్వమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు. వాక్పతిః = అందఱి వాక్కులకు అధిపతి యగుచున్నాఁడు. చక్షుష్పతిః= నేత్రములకు అధిపతి యగుచున్నాడు. శ్రోత్రపతిః = శ్రవణములకు అధిపతి యగుచున్నాఁడు. విజ్ఞానపతిః = విజ్ఞానాధిపతి యగుచున్నాఁడు.

౫. తతః = తరువాత, ఏతత్ = ఈ చెప్పఁబోవునది, భవతి = అగుచున్నాఁడు. ఆకాశ శరీరం = ఆకాశమువలె సూక్ష్మశరీరము కలిగినట్టియు,

పత్యాత్మ = మూర్తము, అమూర్తము అయిన స్వరూపముగలదియు, ప్రాణా రామం = ప్రాణములందు క్రీడగలదియు, మన ఆనన్దం = ఆనందస్వరూపమగు మనస్సు గలదియు, శాంతిసమృద్ధం = ఉపశమము చేత నిండినదియు, అమృతం=అమరణ ధర్మమును అగు, బ్రహ్మ = బ్రహ్మస్వరూపుఁడు (అగుచున్నాఁడని మొదట చెప్పఁబడిన క్రియతో సమన్వయము) ఈ విధముగా, ప్రాచీన యోగ్యా=ఓ ప్రాచీనయోగ్యుఁడా! ఉపాస్స్వ = ఉపాసించుము.

౧. తా. 'భూః భువః సువః' అను వ్యాహృతిత్రయము లోక, దేవతా, వేద, ప్రాణాత్మకముగా 'మహః' అను వ్యాహృత్యాత్మకమగు బ్రహ్మమునకు అంగభూతమని వెనుకటి యనువాకమునందు చెప్పఁబడినది. ఈ యనువాకమునందు అంగిభూతమగు పరబ్రహ్మముయొక్క సాక్షాల్లాభార్థము ఉపాసనార్థము హృదయాకాశము స్థానముగా చెప్పఁబడుచున్నది. శ్రీ మహావిష్ణువు నుపాసించుటకు సాలగ్రామమును స్థానముగా ఉపదేశించి నటుల ఇచట పరబ్రహ్మము నుపాసించుటకు హృదయపుండరీకము స్థానభూతముగా నుపదేశించడమైనది. ఆ హృదయపుండరీకమునందు ఆ బ్రహ్మ ముపాసించబడు నెడల మనోమయత్వాది ధర్మవిశిష్టమగు అట్టి బ్రహ్మము కరతలామలకముగ చక్కఁగా గ్రహించఁబడును. "సయఏషోఽంతర్హృదయ ఆకాశః" అను చోటగల "సః" అను పదము "తస్మిన్నయం పురుషో మనోమయః" అనుచోటగల "అయం పురుషః" అను పదముతో సమన్వయించఁదగినది గాని "యః ఏషః" అను పదములతో అన్వయించఁదగినది కాదు.

౨. హృదయ మనఁగా తామర మొగ్గవంటి ఆకారము కలిగి అనేకములగు నాడులకు ఆశ్రయములగు రంధ్రములు గలిగి ఊర్ధ్వనాలమును అధో బిలమునుగల మాంసపిండము. ఈ మాంసపిండము పశువును ఛేదించునపుడు ప్రత్యక్షముగా అందఱకు గనంబడును. ఆ హృదయమునందు గల అవకాశమునందు పురుషుఁడు నివసించును. ఆ పురుషుఁడు మనోమయుఁడు. మఱియు అమరణధర్ముఁడు. మఱియు జ్యోతిర్మయుఁడు. ఇట్టి మనోమయ, అమరణ ధర్మ, జ్యోతిర్మయత్వాది గుణములు కలిగి హృదయాకాశమునందు సాక్షాత్కరింపఁబడెడి పరమేశ్వరుని చేరుటకు మార్గము చెప్పఁబడుచున్నది:— హృదయమునుండి ఏనాడి ఊర్ధ్వముగా వ్యాపించి యున్నదో దానికి సుషుమ్నయని పేరు. అయ్యది తాలుకలయొక్క మధ్యభాగమునం దున్నది. ఆ తాలుకలయొక్క మధ్యభాగమునందు ఏ మాంసపిండము స్తనమువలె వ్రేలాడుచున్నదో తన్మధ్యభాగమునుండి మూర్ధప్రదేశమును భేదించుకొని బయలు

వెడలిపోవుట పరమాత్మప్రాప్తికి మార్గము. ఆ విధముగా రేచకముచేత సుషుమ్నా నాడిని శిరఃకపాలము భేదించుకొని బయలువెడలులాగు చేసినవాఁడు ఈ లోకమున కును (ఋగ్వేదమునకును ప్రాణవాయువునకును) అధిష్ఠాతయు, 'మహః' అను వ్యాహృతిరూపబ్రహ్మమునకు అంగభూతుఁ డగు 'భూః' అను వ్యాహృతిరూపాగ్ని యందు ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. అనఁగా అగ్నిస్వరూపముచేత ఈ లోకమును వ్యాపించును.

౩. అట్లే 'మహః' అను వ్యాహృతి రూపబ్రహ్మమునకు అంగభూత మగు నట్టియు, 'భువః' అను వ్యాహృత్యాత్మకమగు వాయువునందు ప్రతిష్ఠితుఁ డగు చున్నాఁడు. పిదప 'సువః' అనువ్యాహృత్యాత్మకమగు ఆదిత్యుని యందు ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. (ప్రతిష్ఠితుఁ డగుట యనఁగా తత్స్వ రూపముచేత లోకమునందు వ్యాపించుట యని యర్థము) పిదప అంగియు చతుర్థవ్యాహృత్యాత్మకమును అగు బ్రహ్మమునందు ప్రతిష్ఠితుఁ డగును.

౪-౫. ఇటుల బ్రహ్మభావమును పొందినవాడై స్వారాజ్యమును పొందును. సకల మనస్సులకు అధిపతి యగును. వాక్కులకు, నేత్రములకు, శ్రోత్రములకు, విజ్ఞానములకు అధిపతియగును. (విద్వాంసుఁడు సర్వాత్మకుఁ డగును కావున వెనుక చెప్పఁబడిన వాక్పతిత్వ, చక్షుష్పతిత్వాదిక ముపపన్న మగుచున్నది.) ఇంతియేకాదు. ఇంతకంటె అతిశయమగు ఫలమును పైతము పొందుచున్నాఁడు:—ఆకాశమే శరీరముగాఁ గలవాఁడును, లేక జలాదికమునకును, దుఃఖాదికమునకును చేరుటకుకూడ వీలులేనంతటి సూక్ష్మమగు శరీరము గలవాఁడును, మూర్తము అమూర్తము అయిన రూపము గలవాఁడును, లేక సత్యస్వరూపుఁడును, ప్రాణారాముఁడును, సుఖకరమగు మనస్సు గలవాఁడును, శాంతిచేత నిండియున్నవాఁడును అగు పరమాత్మస్వరూపుఁడే తానగును. కావున ఓ ప్రాచీన యోగ్యుఁడా! నీ విటుల ఉపాసించుమని మాహాచ మస్యుఁడను ఆచార్యుఁడు తన శిష్యుఁడగు ప్రాచీనయోగ్యునకు ఉపదేశించెను. ఉపాసన శబ్దార్థ మిదివరకే చెప్పఁబడినది.

వివరణము:—శంకర భాష్యమునందు కొన్ని పదములకు వివరణము గలదు. వాని నిచట ఉదాహరించుచున్నాఁడను:—

'తస్మిన్నయం పురుషో మనోమయః' అను చోటగల పురుషశబ్దమునకు భాష్యకారులగు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు త్రివిధముగా వ్యాఖ్యాన మొనర్చినారు.

౧. పురుషః —

౧. పురి శయనాత్ పురుష.

(అర్థ. పురి=హృదయమునందు లేక శరీరమునందు, శయనాత్ = ఉండుట వలన, పురుషః = పురుషుఁడని చెప్పఁబడును.)

౨. పూర్ణత్వాత్ పురుషః.

(అర్థ. పూర్ణత్వాత్=(అంతట), పూర్ణుఁడై యుండుటవలన, పురుషః = పురుషుఁడని చెప్పఁబడును.)

౩. పూర్ణా వా భూ రాదయో లోకా యేనేతి పురుషః.

(అర్థ. యేన=ఎవనిచేత, భూరాదయో లోకాః=భూమి మున్నగు లోకములు, పూర్ణాః = పూరింపఁబడినవో, ఇతి=ఈ హేతువువలన, పురుషః = పురుషుఁడని చెప్పఁబడును.)

౨. మనోమయః —

౧. మనః=జ్ఞానం మనుతే ర్జ్ఞానకర్మణః, తన్మయః తత్ప్రాయః తదుప లభ్యత్వాత్.

(అర్థ. మన మనఁగా జ్ఞానము. ఈ మన శ్శబ్దము 'మన అవబోధనే' అను ధాతువునుండి పుట్టినది. తన్మయ మనఁగా అజ్ఞానమే ప్రధానముగాఁ గలవాఁడు. ఏల యనఁగా ఉపాసనా సంస్కృతమగు మనస్సుచేత లభించుచున్నాఁడు కావున 'మనోమయుఁడు' అనఁబడును.)

౨. మనుతే అనేనేతివా మనః, అంతఃకరణం తదభిమానీ తన్మయః తల్లింగోవా.

అర్థ. ఆచార్యులవారు "హృదయా దూర్ధ్వం ప్రవృత్తా సుషుమ్నానామనాడీ యోగశాస్త్రేషు ప్రసిద్ధా. సాచ అంతరేణ=మధ్యే, తాలుకే=తాలుకయోర్గతా" అని భాష్యమునందు "హృదయాదూర్ధ్వం....ప్రసిద్ధా" అనునంతవఱకు మూలమునందు లేని విషయమునకు మూలభూతనుగు శ్రుత్యంతరమిది:—

(శ్రుతి: శతం చైకాచ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభి నిస్సృతైకా, తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి. కఠ. ౬. ౧౬.)

3. సత్యాత్మ —

౧. సత్యాత్మ, సత్యం (మూర్తామూర్తం)=అవితథం స్వరూపం వా యస్య తదిదం సత్యాత్మ.

అర్థ. సత్యమనఁగా పృథివి, అప్పు, తేజము లక్షణముగాఁగల మూర్తము, వాయ్వాకాశాత్మకమగు అమూర్తము లక్షణముగాఁగలవాఁడు. ఇయ్యది పరమాత్మకు కల్పితమగురూపము.

౨. సత్యం = అవితథం, ఆత్మా = స్వభావో యస్య తదిదం సత్యాత్మ.

లేక సత్యమయిన స్వభావముగలది సత్యాత్మ యనంబడును.

౪. ప్రాణారామమ్ —

౧. ప్రాణారామం = ప్రాణేషు, ఆరమణం = ఆక్రీడాయస్య తత్ ప్రాణారామమ్.

అర్థ. ప్రాణేషు = విషయసమన్వితములగు ఇంద్రియములందు, యస్య = దేనికి, ఆరమణం-ఆక్రీడా = క్రీడించుటగలదో, తత్ = అది, ప్రాణారామం = ప్రాణారామ మనంబడును. ఈ వ్యుత్పత్తి బ్రహ్మమునకు జీవభావాభిప్రాయముతో చెప్పఁబడినది.

కేవల బ్రహ్మపరముగ మఱొక వ్యుత్పత్తిసైతము చెప్పఁబడియున్నది:—

౨. ప్రాణానాం వా ఆరామో యస్మిన్, తత్ ప్రాణారామమ్.

(అర్థ. యస్మిన్ = (నియంతృరూపుఁడై) ఎవఁడుండఁగా, ప్రాణానాం = ప్రాణములకు, ఆరామః = సంచారము కలుగునో, తత్ = ఆ వస్తువు, ప్రాణారామం = ప్రాణారామ మనంబడును.

౫. మన ఆనందమ్ —

మన ఆనందం = 'ఆనందభూతం సుఖకృదేవ యస్య మనః త న్మన ఆనందమ్.'

(అర్థ. యస్య = ఎవనియొక్క, మనః = మనస్సు, సుఖకృత్ ఏవ = సుఖమునే కలుగఁజేయునో, తత్ = అది, మన ఆనందం = మన ఆనంద మనంబడును. ఇయ్యది బ్రహ్మమునకు జీవభావాభిప్రాయముతో చెప్పఁబడిన వ్యుత్పత్తి.)

౬. శాంతిసమృద్ధమ్ —

౧. శాంతిసమృద్ధమ్—శాంతిః = ఉపశమః, శాంతిశ్చ తత్ సమృద్ధం చ శాంతిసమృద్ధమ్.

(అర్థ. శాంతి యనఁగా సకల ద్వైతభావనివృత్తి. సమృద్ధియనఁగా ఆత్మభావముచేత వ్యాపింపఁబడినది. శాంతియై సమృద్ధమైనది. శాంతిసమృద్ధము.)

౨. శాంత్యా వా సమృద్ధవ దుపలభ్యత ఇతి శాంతిసమృద్ధమ్.

(అర్థ. శాంతి యనఁగా సమాధియగును. అట్టి సమాధిచేత పూర్ణానంద రూపముగ పొందఁబడునది 'శాంతిసమృద్ధ' మగును.)

ఇచట మూలమునందు "ఇతి ప్రాచీనయోగ్యోపాస్వ" అని "ప్రాచీన యోగ్యాచార్య" పదము నుదహరించుట విద్యయందు ఆదరాతిశయము కలుగుటకని గ్రహించునది.

ఈ యనువాకమునందు చెప్పఁబడిన బ్రహ్మోపాసనము ముఖ్యబ్రహ్మోపాసనమా? లేక హిరణ్యగర్భబ్రహ్మోపాసనమా? అని కొందఱకు సంశయము కలుగ వచ్చునుకాని ఇందు ప్రతిపాదింపఁబడినది ముఖ్య బ్రహ్మోపాసనమే అని తెలిసికొన వలయును. బ్ర. సూ. ౪. ౩. లో కార్యాధికరణమునం దీవిషయము సిద్ధాంతీకరింపఁ బడినది. గ్రంథవిస్తరభీతిచేత పూర్వపక్షమును అనువదించలేదు.

ప్రాచీనయోగ్యశబ్దమునకు వ్యుత్పత్తి ఇట్లుండ నోపునేమో—ప్రాచీనైః= కర్మకాండ ప్రతిపాదితైః నిత్యనైమిత్తికకర్మభిః వినాశిత పాపః యః ఉపాసనవిధౌ యోగ్యః=అధికారీ సః ప్రాచీనయోగ్యః.

(అనఁగా కర్మకాండయందు విధింపఁబడిన నిత్యనైమిత్తిక కర్మల నాచరించి తన పాపమును నశింపఁజేసికొని ఎవఁడు ఉపాసనావిధికి యోగ్యుఁడై యున్నాఁడో అతఁడు "ప్రాచీనయోగ్యుఁడు" అనంబడును.

ఈ యనువాకమునందు విషయము సుబోధముగ నున్నను పదముల యొక్క అన్వయమును చక్కఁగా చూచునెడల అర్థము సుస్పష్టముగ లేనటుల తోఁచును. అటుల తోఁచుట ఏలయనఁగా విషయపూరణార్థము మఱొక శ్రుతినుండి కొంతవిషయ మును గ్రహించుటచేతనే. కావున ఈ యనువాకాభిప్రాయ బోధకములగు భాష్య వార్తిక శ్లోకముల నీ క్రింద నిచ్చుచున్నాఁడను—

౫-౬. అనువాకములు రెంటికిని పరస్పర సంబంధ ముండుటచేత వార్తిక కారులును అట్లే వివృతి నొనర్చిరి. కనుక శ్లోకములు పై రెం డనువాకములకు సంబం ధించియే యుండును.

శ్లో. స యః పరోక్షనిర్దిష్టః ప్రత్యక్షేణ స దర్శ్యతే,
అన్తర్హృదయ ఆకాశే పశ్యాత్మానం త్వ మాత్మనా. ౧౧

పద్మాకారో హి మాంసస్య ఖండో హృదయ ముచ్యతే,
ఆకాశ స్తస్య మధ్యే యో బుద్ధే రాయతనం సదా. ౧౨

తస్మిన్ స పురుషో జ్ఞేయో మనోమయ ఇహాంజసా,
శీర్షరాహువత్స్వాక్ష న్మనస్యేవోపలభ్యతే. ౧౩
మనుతే మనసా యస్మాత్ తేనాయం స్యా న్మనోమయః,
స్యా ద్వా తదభిమానిత్వా త్తల్లింగా త్తన్మయస్స్మృతః. ౧౪
అమృతో ఽమరణధర్మాస్యా ద్ధిరణ్యం జ్యోతి రుచ్యతే,
ఊర్ధ్వం ప్రవృత్తానాడ్యేకా సుషుమ్నాహృదయా దధి. ౧౫
గత్వాతాలుకయో ర్విద్వా న్మధ్యేనోదానగర్భయా,
స్తనవల్లంబతే కంఠే మాంసఖండ స్త్వధోముఖః. ౧౬
ఇంద్ర స్యాసౌ సృతిర్జ్ఞేయా రేచకేన తయావ్రజేత్,
తయా గత్వా ఽథ యాయా త్స యత్కేశాన్తో నివర్తతే. ౧౭
భిత్వా శిరఃకపాలే ద్వే భూ రిత్యగ్నిం ప్రపద్యతే,
ద్వితీయయాఽథ వ్యాహృత్యా వాయౌ సంప్రతితిష్ఠతి. ౧౮
ఆదిత్యే సువరిత్యేవం లోకేశే ప్రతితిష్ఠతి,
స్థిత్వైవ మంగభూతేషు ప్రతితిష్ఠ త్యథాంగిని. ౧౯
మహ ఇత్యాత్మని స్థిత్వా స్వారాజ్యం ప్రతిపద్యతే,
నాన్యో రాజా ఽస్తి యస్యేహ రాజా య స్స్వయ మేవ తు. ౨౦
స స్వరాట్ తస్య భావశ్చ స్వారాజ్య మిహ కీర్త్యతే,
మనోగీశ్చక్షుషాం చైవ శ్రోత్ర విజ్ఞానయో రపి. ౨౧
ఆప్నోతి పర్యుపాసీనః స్వారాజ్యం నాత్రసంశయః,
వ్యాహృత్యాత్మన ఏతస్య రూపసంక్లృప్తయే ఽధునా. ౨౨
ఉపాసనావిధిత్స్వాయై పరో గ్రంథో ఽవతార్యతే,
వియద్దేహ మిదం బ్రహ్మ వియ త్సదృశ మేవవా. ౨౩
మూర్తామూర్త స్వభావంచ త్రైలోక్యాద్యాత్మతో భవేత్,
ఇంద్రియారమణం చైవ మన ఆనందమేవ చ. ౨౪
శాంత్యా సమృద్ధ మత్యర్థం బ్రహ్మైతత దమృతం పరమ్,
ప్రాచీనయోగ్యో పాస్వేత ద్యథావ్యాఖ్యాతలక్షణమ్. ౨౫
మాహాచమస్య ఆచార్య అన్తేవాసిన ముక్తవాన్.

తైత్తి. భాష్య. వార్తిక శిక్షావల్లీ. ౧౧—౨౬.



# ౭. సప్తమోఽనువాకః

## (పృథివ్యాద్యుపాధిక బ్రహ్మోపాసనము)

మం. ౧ పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోఽవాంతరదిశాః । అగ్ని
ర్వాయు రాదిత్య శ్చన్ద్రమా నక్షత్రాణి । ఆప ఓష
ధయో వనస్పతయ ఆకాశ ఆత్మా । ఇత్యధిభూతమ్ ।
౨ అథాధ్యాత్మమ్ । ప్రాణో వ్యానోఽపాన ఉదాన
స్సమానః । చక్షు శ్శ్రోత్రంమనో వాక్త్వక్ । చర్మ
మాగ్ంసగ్ం స్నావాఽస్థి మజ్జా । ఏత దధి విధాయ
ఋషి రవోచత్ । పాఙ్క్తం వా ఇదగ్ం సర్వమ్ ।
పాఙ్క్తేనైవ పాఙ్క్తగ్ స్పృణోతీతి ॥౧॥

సర్వ మేకం చ ॥౭॥

శాంకరభాష్యమ్: —

యదేత ద్వ్యాహృత్యాత్మకం బ్రహ్మోపాస్యముక్తమ్, తస్యైవేదానీం పృథివ్యాదిపాఙ్క్తస్వరూపేణోపాసనముచ్యతే — పఞ్చసంఖ్యాయోగాత్పఙ్క్తిచ్ఛన్దః సంపత్తిః; తతః పాఙ్క్తత్వం సర్వస్య । పాఙ్క్తశ్చ యజ్ఞః, "పఞ్చపదా పఙ్క్తిః పాఙ్క్తోయజ్ఞః" ఇతి శ్రుతేః । తేన యత్సర్వం లోకాద్యాత్మాన్తం చ పాఙ్క్తం పరికల్పయతి, యజ్ఞమేవ తత్పరికల్పయతి । తేన యజ్ఞేన పరికల్పితేన పాఙ్క్తాత్మకం ప్రజాపతిమభిసంపద్యతే । తత్కథం పాఙ్క్తం వా ఇదం సర్వమిత్యత ఆహ—పృథివీ అన్తరిక్షం ద్యౌః దిశః అవాన్తరదిశః ఇతిలోకపాఙ్క్తమ్ । అగ్నిః వాయుః ఆదిత్యః చన్ద్రమాః నక్షత్రాణి ఇతి దేవతాపాఙ్క్తమ్ । ఆపః ఓషధయః వనస్పతయః ఆకాశః ఆత్మా ఇతి భూతపాఙ్క్తమ్ । ఆత్మేతి విరాట్;

భూతాధికారాత్ । ఇత్యధి భూతమితి అధిలోకాధిదైవతపాఙ్క్తద్వయోపలక్షణార్థమ్, లోకదేవతాపాఙ్క్తయోర్ద్వయోశ్చాభిహితత్వాత్ । అథ అనన్తరమ్ అధ్యాత్మం పాఙ్క్తత్రయముచ్యతే — ప్రాణాది వాయుపాఙ్క్తమ్ । చక్షురాది ఇన్ద్రియ పాఙ్క్తమ్ । చర్మాది ధాతు పాఙ్క్తమ్। ఏతావద్ధిదం సర్వమధ్యాత్మం బాహ్యం చ పాఙ్క్తమేవ ఇతి ఏతత్ ఏవమ్ అధివిధాయ పరికల్ప్య ఋషిః వేదః ఏతద్దర్శన సంపన్నో వా కశ్చి దృషిః, అవోచత్ ఉక్తవాన్ । కిమిత్యాహ — పాఙ్క్తం వా ఇదం సర్వం పాఙ్క్తేనైవ ఆధ్యాత్మికేన, సంఖ్యాసామాన్యాత్, పాఙ్క్తం బాహ్యం స్పృణోతి బలయతి పూరయతి ఏకాత్మతయోపలభ్యత ఇత్యేతత్ । ఏవం పాఙ్క్తమిదం సర్వమితి యో వేద, స ప్రజాపత్యాత్మైవ భవతీత్యర్థః ॥

ఇతి సప్తమానువాక భాష్యమ్॥

టీక. ౧. పృథివీ=భూమి, అంతరిక్షం=అంతరిక్షము, ద్యౌః=ద్యులోకము, దిశః = దిక్కులు, అవాంతరదిశాః = అవాంతర దిశలు (ఇవి లోకపాంక్త మనఁబడును). అగ్నిః=అగ్ని, వాయుః=వాయువు, ఆదిత్యః=సూర్యుఁడు, చంద్రమాః= చంద్రుఁడు, నక్షత్రాణి=నక్షత్రములు (ఇవి దేవతా పాంక్త మనఁబడును). ఆపః = జలములు, ఓషధయః = ఓషధులు, వనస్పతయః=వనస్పతులు, ఆకాశః= ఆకాశము, ఆత్మా = విరాడ్భూతము (ఇవి భూతపాంక్త మనంబడును). ఇతి= ఈ విధముగా, అధిభూతం = భూతపాంక్తము చెప్పఁబడినవి. (లోక దేవతా పాంక్తములు సైతము చెప్పఁబడినవని గ్రహింపవలయును.)

౨. అథ=ఇఁక, అధ్యాత్మం=దేహ విషయక మగు పాంక్తత్రయము (చెప్పఁబడుచున్నది) ప్రాణః = ప్రాణవాయువు, వ్యానః = వ్యానవాయువు, అపానః= అపానవాయువు, ఉదానః = ఉదానవాయువు, సమానః = సమానవాయువు (ఇవి వాయుపాంక్త మనంబడును). చక్షుః = నేత్రములు, శ్రోత్రం = చెవులు, మనః = మనస్సు, వాక్ = వాక్కు, త్వక్ = దేహము (ఇవి ఇంద్రియపాంక్త మనంబడును). చర్మ = చర్మము, మాꣳసం = మాంసము, స్నావా = సన్న నరము, అస్థి = ఎముక. మజ్జా=క్రొవ్వు (ఇవి ధాతుపాంక్త మనంబడును). ఏతత్ = ఈ విధముగా, ఋషిః = వేదము లేక ఈ విషయము నెఱింగిన ఒక మహర్షి, అధివిధాయ = చేసి, ఇదం సర్వం = ఈగనంబడు ప్రపంచమంతయు, పాంక్తం వా = పాంక్తమే, పాంక్తేన ఏవ=పాంక్తముచేతనే అనఁగా ఆధ్యాత్మిక

పాం_క్త త్రయముచేతనే, పాం క్తం=బాహ్య పాం క్త త్రయమును, స్పృణోతి ఇతి= విండించుచున్నాఁడు అని, అవోచత్ = పలికెను.

తా. ఇదివఱకు బ్రహ్మమును వ్యాహృత్యాత్మగా నుపాసించుట ౬-వ యను వాకమునందు చెప్పఁబడినది. ఈ ౭-వ యనువాకమునందు ఆ బ్రహ్మమునే పృథివ్యాది పాం క్తస్వరూపమున నుపాసించునట్టి విధానము చెప్పఁబడుచున్నది. ఐదు సంఖ్య కలిగియున్నయెడల పం క్తిచ్ఛందస్సు సిద్ధించును. కావున ముందుఁ జెప్పఁబోవు పృథివ్యాదికము పాం క్త మనంబడును. పంచసంఖ్యాయోగము వలన పం క్తిచ్ఛందస్సిద్ధియే కాదు. "పంచాక్షరా పం క్తిః, పాంక్తో యజ్ఞః" అను శ్రుతివలన యజ్ఞసామ్యము సైతము కలుగును. అట్టి పాం క్తమగుటచేత కలిగిన యజ్ఞసామ్యముచేత జగమునంతయు లోకాద్యాత్మాంతమగు బాహ్యపాంక్త త్రయముగను, ప్రాణాది మజ్జాంతమగు అధ్యాత్మ పాం క్త త్రయముగను శ్రుతి నిర్ణయించినది. ఇయ్యది యజ్ఞమునే నిర్ణయించినట్లగును. (ఈ విధముగా బ్రహ్మోపాధిభూతమగు ప్రపంచమునంతయు పం క్తిచ్ఛందోరూపముగను, యజ్ఞరూపముగను భావించుకొని పాం క్త జగదాత్మకమగు బ్రహ్మమే నేనని ఉపాసించువానికి) తదుపాసనముచేత స్థూలసర్వ ప్రపంచోపాధిస్వరూపుఁడగు ప్రజాపతి (హిరణ్యగర్భు)ని పొందుచున్నాడు.

పృథివ్యాదిక మగు జగత్తు పాం క్తము ఎట్లని ఆశంకించుకొని శ్రుతియే తత్సమాధానమును చెప్పుచున్నది:—

అ. ౧. పృథివి, అంతరిక్షము, ద్యులోకము, దిక్కులు, అవాంతర దిక్కులు, ఇవి లోకపాం క్తము.

౨. అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఇవి దేవతాపాం క్తము.

౩. జలములు, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, ఆత్మ (ఇచట ఆత్మ యనఁగా విరాట్పురుషుఁడు. ఏలయనఁగా ఈ ఆత్మపదము భూతాధికారమునందున్నది.) ఇది భూతపాం క్తము.

ఈ మూఁడును బాహ్యపాం క్త త్రయము.

ఆ. ౧. ప్రాణము, వ్యానము, అపానము, ఉదానము, సమానము, ఇవి వాయుపాం క్తము.

౨. చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు, త్వక్కు, ఇవి ఇంద్రియ పాం క్తము.

౩. చర్మము, మాంసము, స్నావ, అస్థి, మజ్జ, ఇవి ధాతుపాంక్తము.

ఈ మూఁడును అధ్యాత్మపాంక్తత్రయము.

(ఆత్మ యనఁగా దేహము. ఆ దేహమునం దున్నవానిని గుఱించి చెప్పెడి విషయము, ఆధ్యాత్మము, ప్రాణవ్యానాదికము, చక్షుశ్శ్రోత్రాదికము, చర్మమాంసాదికము, దేహ సంబంధమయినది కావున ఈ పంచకత్రయము ఆధ్యాత్మపాంక్తత్రయము అనంబడుట యుక్తము.)

శ్రుతియందు ప్రతిపాదింపఁబడిన బాహ్యము, ఆధ్యాత్మము అను పాంక్తత్రయమే సకల జగత్స్వరూపము (ఇంతకంటె భిన్నమయినది ప్రపంచమునందు లేదనుట.)

ఈ ప్రపంచము అంతయు పాంక్తరూపముచేతనే ఉన్నదను విషయమును భగవానుఁడగు వేదపురుషుఁడు నిర్ణయించినవాఁడై ఈ ప్రకారముగా చెప్పెను:— ఈ ప్రపంచమంతయు పాంక్తస్వరూపము ఆధ్యాత్మిక పాంక్తత్రయముచేత బాహ్య పాంక్తత్రయమును పూరించుచున్నాఁడు. (ఇచట పూరించుట యనఁగా ధాన్యాధికము చేత పాత్రాదికమును నిండించునటుల గాదని తెలుపుటకయి భాష్యకారులవారు "ఏకాత్మతయా ఉపలభ్యతే" అని చెప్పియున్నారు. బాహ్యపాంక్తత్రయము, ఆధ్యాత్మిక పాంక్తత్రయము ఒకటియే యనియు) ఇట్టి పాంక్త జగదాత్మకమగు బ్రహ్మమే నేనని ఎవఁ డెఱింగి ఉపాసించునో వాఁడు హిరణ్యగర్భుఁడే యగును. మూలమునందు గల 'ఋషిః' అను పదమునకు భాష్యకారులవారు. ౧. వేదమనియు, ౨. ఇట్టి విషయమును తపఃప్రభావముచేత నెఱింగిన ఒక ఋషి యనియు వ్యాఖ్యాన మొనర్చియున్నారు.

వివరణము:—యజ్ఞము పాంక్త మెట్లనఁగా:—

పత్నీ. యజమాన, పుత్ర, దైవ, మానుష (విత్త) ములు, అయిదింటిచేత యజ్ఞము సంపాదితమగుటచేత యజ్ఞము పాంక్తమగును. మఱియు తైత్తిరీయ బ్రాహ్మణము ప్రథమాష్టకము, ప్రథమ ప్రశ్నము ౧౦-వ యనువాకమునందు పంచాగ్న్యాధానవిధి చెప్పఁబడియున్నది. అచట ఇతిహాసమును చెప్పుచు:—"ప్రజాపతిః ప్రజా అసృజత, స రిరిచానోఽమన్యత,........సాతతః ప్రాచ్యుదక్రామత్,........ సాద్వితీయముదక్రామత్. ........సాతృతీయముదక్రామత్,...........సాచతుర్థముదక్రామత్,........సాపంచమముదక్రామత్,........అథోపంక్తిమేవ, పంక్తిర్వా ఏషా బ్రాహ్మణే ప్రవిష్టా. ౩. తామాత్మనోఽధి నిర్మిమీతే, యదగ్ని రాధీయతే, తస్మాత్

దేవతావంతో ఒగ్నయ ఆధీయంతే, పాంక్తంవా ఇదగ్ంసర్వం, పాంక్తనైవ పాంక్తగ్గ్ స్పృణోతి''

తై. బ్రా. ౧. ౧. ౧౦. ౧—౪.

అను శ్రుతిచేత నైతము యజ్ఞము పాంక్తమని సిద్ధించుచున్నదిగదా.

ఈ అనువాకమును గుఱించి వార్తికకారుఁ డొనర్చిన శ్లోకములు సుస్పష్టముగా అనువాకార్థమును బోధించుచుండుటచేత నిచట నుదాహరించుచున్నాఁడను :

శ్లో. పాంక్తస్వరూపే శైతస్య భూయో ఒప్యన్య దుపాసనమ్,
ఉదారఫలసిద్ధ్యర్థం పృథివీ త్యుచ్యతే ఒధునా. ౨౭

పంచభి ర్యత ఆరబ్ధం జగ త్పాంక్త మతో భవేత్,
యజ్ఞః క్లప్తో భవే దేవం పాంక్తో యజ్ఞ ఇతి శ్రుతిః. ౨౮

యజ్ఞేన పరిక్లప్తేన త్రైలోక్యాత్మాన మశ్నుతే,
పాంక్తత్వసిద్ధయే తస్మా దారబ్ధైషా పరా శ్రుతిః. ౨౯

దిగంతం లోకపాంక్తంస్యా న్నక్షత్రాంతం చ దైవతమ్,
ఆత్మాంతం భూతపాంక్తం చ విరాడాత్మా ఒధికారతః. ౩౦

ఉపలక్షణ మేతత్స్యా ద్దేవతా లోకపాంక్తయోః,
అధిభూత మితి వక్ష్యామో ఒథాధ్యాత్మ మతః పరమ్. ౩౧

వాయుపాంక్తం సమానాంతం త్వగంతం చేంద్రియం తథా,
చర్మాది ధాతుపాంక్తం చ విశ్వ మేతావ దుచ్యతే. ౩౨

పాంక్త మేవ జగత్సర్వ మితి దృష్ట్వా ఒభ్యధా దృషిః,
పాంక్తంవా ఇదమాబ్రహ్మస్తంబం నాన్యదితిస్మహ. ౩౩

ఆధ్యాత్మికేన పాంక్తేన సంఖ్యాసామాన్యకారణాత్,
బలయత్యాత్మభావేన పాంక్తం బాహ్య మశేషతః. ౩౪

## పాంక్తషట్కకోష్ఠకము

| బాహ్యపాంక్తత్రయము | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పృథివి | అంతరిక్షము | ద్యులోకము | దిశలు | అవాంతర దిశలు | లోక పాంక్తము | ౧ |
| అగ్ని | వాయువు | ఆదిత్యుఁడు | చంద్రుఁడు | నక్షత్రములు | దేవతా పాంక్తము | ౨ |
| జలము | ఓషధులు | వనస్పతులు | ఆకాశము | ఆత్మ | భూత పాంక్తము | ౩ |

ఆధ్యాత్మపాంక్తత్రయము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్రాణము | వ్యానము | అపానము | ఉదానము | సమానము | వాయు పాంక్తము | ౪ |
| చక్షుస్సు | శ్రోత్రము | మనస్సు | వాక్కు | త్వక్కు | ఇంద్రియ పాంక్తము | ౫ |
| చర్మము | మాంసము | వస | అస్థి | మజ్జ | ధాతు పాంక్తము | ౬ |

ఈ పైని వివరింపఁబడియున్న చక్రము ప్రకారము జీవుఁడనగు నేను పంచాత్మకుఁడ నగుటచేత పాంక్తశబ్దవాచ్యుఁడను. జగత్తుసైతము పంచాత్మకమగుటచేత పాంక్తమే యగుచున్నది. కావున నాయొక్కయు, ప్రపంచము యొక్కయు స్వరూపము ఒకటియే గాని వేఱుకాదు. అని విరాట్పురుషుని ఉపాసించువానికి విరాట్స్వరూపప్రాప్తి కలుగును.

౧. అను....

౨. ఆత్మ....

౩. భా. వా.... ౧౨౭-౧౩౪.



## ౮. అష్టమోఽనువాకః

(ప్రణవోపాసనము - శుద్ధబ్రహ్మోపాసనము)

మం. ఓ మితి బ్రహ్మ । ఓ మి తీదగ్ం సర్వమ్ । ఓ మిత్యే

తదను కృతిహస్మ వా అపో్యశ్రావయత్యాశ్రావయన్తి ।

ఓ మితి సామాని గాయన్తి । ఓగ్ం శోమితి శస్త్రాణి

శగ్ంసన్తి । ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి ।

ఓ మితి బ్రహ్మా ప్రసౌతి । ఓ మిత్యగ్నిహోత్ర మను

జనాతి । ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మో

పాప్నవానీతి । బ్రహ్మైవోపాప్నోతి ॥౧॥

ఓం దశ ॥౮॥

శాంకర భాష్యమ్ :—

వ్యాహృత్యాత్మనో బ్రహ్మణ ఉపాసనముక్తమ్। అనన్తరం చ పాఙ్క్త స్వరూపేణ తస్యైవోపాసనముక్తమ్। ఇదానీం సర్వోపాసనాఙ్గభూతస్య ఓంకారస్యోపాసనం విధిత్స్యతే। పరాపరబ్రహ్మదృష్ట్యా హి ఉపాస్యమాన ఓంకారః శబ్దమాత్రోఽపి పరాపరబ్రహ్మ ప్రాప్తి సాధనం భవతి; స హ్యాలమ్బనం బ్రహ్మణః పరస్యాపరస్య చ, ప్రతిమేవ విష్ణోః ‘‘ఏతేనైవాయతనేనైకతరమన్వేతి’’ ఇతి శ్రుతేః। ఓమితి, ఇతి శబ్దః స్వరూపపరిచ్ఛేదార్థః; ఓం ఇత్యేతచ్ఛబ్దరూపం బ్రహ్మ ఇతి మనసా ధారయేత్ ఉపాసీత; యతః ఓం ఇతి ఇదం సర్వం హి శబ్దస్వరూపమోంకారేణ వ్యాప్తమ్, ‘‘తద్యథా శఙ్కునా’’ ఇతి శ్రుత్యన్తరాత్। ‘‘అభిధానతన్త్రం హ్యభిధేయమ్’’ ఇత్యతః ఇదం సర్వమోంకార ఇత్యుచ్యతే। ఓంకారస్తుత్యర్థ ఉత్తరో గ్రన్థః, ఉపాస్యత్వాత్తస్య। ఓం ఇత్యేతత్ అనుకృతిః అనుకరణమ్। కరోమి యాస్యామి చేతికృతముక్త ఓమిత్యనుకరోత్యన్యః, అతః ఓంకారోఽను కృతిః।

హ స్మ వై ఇతి ప్రసిద్ధార్థద్యోతకాః। ప్రసిద్ధం హ్యోంకారస్యానుకృతిత్వమ్। అపి చ ఓశ్రావయ ఇతి ప్రేషపూర్వమాశ్రావయన్తి ప్రతిశ్రావయన్తి। తథా ఓం ఇతి సామాని గాయన్తి సామగాః। ఓం శోమితి శస్త్రాణి శంసన్తి శస్త్రశంసితారోఽపి। తథా ఓం ఇతి అధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి। ఓం ఇతి బ్రహ్మా ప్రసౌతి అనుజానాతి। ఓం ఇతి అగ్నిహోత్రమ్ అనుజానాతి జుహోమిత్యుక్తే ఓం ఇత్యేవ అనుజ్ఞాం ప్రయచ్ఛతి। ఓం ఇత్యేవ బ్రాహ్మణః ప్రవక్ష్యన్ ప్రవచనం కరిష్యన్ అధ్యేష్యమాణః ఓమిత్యాహ ఓమిత్యేవ ప్రతిపద్యతే అధ్యేతు మిత్యర్థః; బ్రహ్మ వేదమ్ ఉపాప్నవాని ఇతి ప్రాప్నుయ్యాం గ్రహీష్యామీతి ఉపాప్నోత్యేవ బ్రహ్మ। అథవా, బ్రహ్మపరమాత్మానమ్ ఉపాప్నవానీత్యాత్మానం ప్రవక్ష్యన్ ప్రాపయిష్యన్ ఓమిత్యేవాహ। స చ తేనోంకారేణ బ్రహ్మప్రాప్నోత్యేవ। ఓంకారపూర్వం ప్రవృత్తానాం క్రియాణాం ఫలవత్త్వం యస్మాత్, తస్మాదోంకారం బ్రహ్మేత్యుపాసీతేతి వాక్యార్థః॥

ఇత్యష్టమానువాకభాష్యమ్.

టీ. ఓం ఇతి=ఓం అను శబ్దముయొక్క రూపమును, బ్రహ్మ = పరబ్రహ్మమని (మనస్సుచేత ఉపాసింపవలయును), ఇదంసర్వం = ఈ సమస్తమైనదియు, ఓం ఇతి = ఓంకార మనియే (తలంపవలయును). ఓం ఇతి ఏతత్ = ఈ ఓంకారమనునది, అనుకృతి=అనుకరణమని, హస్మవై =సుప్రసిద్ధముగదా, అపి = మఱియు, ఓశ్రావయఇతి=ఓ శ్రావయ అని, ఆశ్రావయంతి=బదులు పలుకుచున్నారు. ఓం ఇతి=ఓం అనియే, సామాని=సామమంత్రములను, గాయన్తి=గానము చేయుచున్నారు, ఓగ్ంశోం ఇతి=ఓగ్ంశోం అని, శస్త్రాణి=శస్త్రమంత్రములను, శంసన్తి=చెప్పుచున్నారు, ఓం ఇతి=ఓం అని, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ప్రతిగరం=ప్రతిగరమును, అనఁగా "ఓఽధామోదఇవ" అను మంత్రమును, ప్రతిగృణాతి=బదులు పలుకుచున్నాఁడు. ఓం ఇతి = ఓం అని, బ్రహ్మ=బ్రహ్మయను ఋత్విక్కు, ప్రసౌతి= (ఇతర ఋత్విక్కులు ప్రోక్షణాది కర్మల నాచరించుటకు) అనుజ్ఞ నిచ్చుచున్నాఁడు, ఓం ఇతి=ఓం అని, అగ్నిహోత్రం=అగ్నిహోత్రమును చేయుటకు, అనుజానాతి = అంగీకారము నిచ్చుచున్నాఁడు, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, బ్రహ్మ=వేదమును, ఉపాప్నవాని ఇతి=పొందెదనని, ప్రవక్ష్యన్ = ప్రవచనము చేయఁదలఁచినవాఁడై, ఓం ఇతి=ఓం అని, ఆహ=పల్కెను, బ్రహ్మఏవ=బ్రహ్మమునే, ఉపాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. (షష్ఠానువాకము నందు వ్యాహృత్యాత్మకముగ బ్రహ్మోపాసనము విధింపఁబడినది. సప్తమానువాకమునందు పృథివ్యాదిపాంక్తస్వరూపముగా బ్రహ్మోపాసనము విధింపఁబడి యున్నది. ఇఁక అష్టమానువాకమునందు సర్వోపాసనములకు అంగభూతమగు ఓంకారోపాసనము విధింపఁబడుచున్నది. అచేతనమును శబ్దమాత్రమును అగు ఓంకారము ఫలము నిచ్చుటకు సమర్థము కాదుగదా? అట్టి ఓంకారమునుపాసించుటవలన ఫల మేమి యని సంశయింపఁ బనిలేదు. అచేతనమగు సాల గ్రామమునందు దేవభావము నుంచి పూజించువారికి బ్రహ్మము ఫలము నెటుల కలుగఁజేయునో అట్లే ఫలదాత ఇచ్చటను బ్రహ్మమే కావున పై సంశయము అక్కఱలేదు. ఇందులకు ప్రమాణము:—'ఏతేనైవాయతనేనైకతర మన్వేతి' ప్రశ్నో. ౫. ౨. అని శ్రుతి. అనఁగా ఓంకారమనుప్రాప్తిసాధనోపాయముచేతనే పరాపర రూప బ్రహ్మమును పొందును. అని కలదు; కావున ఓంకారోపాసన మీ యను వాకమునందు చెప్పఁబడుచున్నది:—ఓం అను అక్షరమే పరబ్రహ్మస్వరూపము. ఈ కనఁబడునవి అంతయు ఓంకారాత్మకమే. (ఓంకారము సర్వాత్మకము కావున అట్టి ఓంకారమునందు సర్వాత్మక బ్రహ్మదృష్టి నుంచుట యుక్తమే యని భావము) బ్రహ్మము సర్వాత్మకము, ఇది యంతయు బ్రహ్మమే అని శ్రుతులు బ్రహ్మము సర్వాత్మకమని ఘోషించుచున్నవి, గాని ఓంకారము సర్వాత్మకమని చెప్పలేదు గదా యని చెప్పెదరేని అట్లనకుఁడు. శబ్దస్వరూపమంతయు ఓంకారముచేత వ్యాపింపఁ బడిన దని "తద్యథా శంకునా" ఛాందో. ౨. ౨౩. ౩. శ్రుతి చెప్పుచున్నది. ఓంకారము సర్వశబ్దాత్మకమయిన కానిండు, శబ్దార్థరూపమగు ప్రపంచాత్మకముగా ఓంకార మెట్లగు ననఁగా అభిధేయ మెప్పుడును అభిధానాధీనము కావున అభిధానాభిధేయములకు తాదాత్మ్యమును తరుచుగా గ్రహించుచున్నారు. కావున అభిధానాత్మకము ఓంకారమను విషయము సుప్రసిద్ధమే కావున అభిధేయాత్మకము కూడా ఓంకారమే యని తాదాత్మ్యముచేత గ్రహించినారని భావము. ఇట్లని ఆచార్యులవారు భాష్యము నందు వ్యాఖ్యాన మొనర్చి యున్నారు. ఓంకారోపాసనము నీ యనువాకమునందు విధించియున్నారు కావున ఆ ఓంకారమును స్తుతించుటకుఁగాను పలువిధములుగా తన్మహిమను చెప్పుచున్నాఁడు. ఓం అనునది అనుకరణ మగుచున్నది. అనఁగా ఎవరైనా "ఆ పనిని చేసినావా? అచటికి వెళ్లెదవా?" అని ప్రశ్నించిన యెడల చేసినాఁడను, వెళ్ళగలను అనుటకు 'ఓం' అని యనును. సంస్కృత భాషయందు 'ఓం' అను పదము అనుకృతిబోధకము అను విషయము సుప్రసిద్ధముగదా.

౫. ఋత్విజియు "ఓం శ్రావయ" అని ఆగ్నీధ్రునిగూర్చి పల్కుచున్నారు. ఈ మాటకు తాత్పర్యము:— ఓ ఆగ్నీధ్రుఁడా! హవిస్సు నిచ్చెడి సమయమయినదని దేవతల కెఱింగింపుము. అని యగును.

౬. 'ఓం' అని యుపక్రమించియే సామగానము నుపక్రమింతురు.

౭. 'ఓగ్ం శోం' అని యుపక్రమించియే హోతలు శస్త్రములను పఠింతురు. శస్త్రములనఁగా గానములేని స్తోత్రఋక్కులు.

౮. "ఓం థామోద" అని యధ్వర్యుఁడు ప్రతిగరమును పలుకును. దీని యర్థమేమనఁగా. ఓ=ఓహోతా! అథ=అర్థర్చను నీవు చెప్పినపిదప. ఆమోద=మాకు సంతోషము కలిగినదని భావము.

౯. 'ఓం ప్రోక్ష' అని బ్రహ్మ ఇతర ఋత్విక్కులకు అనుజ్ఞ నిచ్చును. ఇతరఋత్విక్కులు "బ్రహ్మన్ ప్రోక్షిష్యామి" అని అనుజ్ఞను వేడఁగా బ్రహ్మ అతనికి 'ఓంప్రోక్ష' అని అనుజ్ఞ నిచ్చును.

౧౦. బ్రాహ్మణుఁడైనవాఁడు అధ్యయనమును ఉపక్రమించునపుడు "ఓం" అని ఉచ్చరించియే వేదాధ్యయనము నొనర్చును. ఆచార్యుఁ డగువాఁడు అధ్యాపనము చేయఁబోవుచు 'ఓం' అని పలికియే శిష్యునకు అధ్యయనమును బోధించును. ఇట్లు ఓంకారపూర్వకముగా వేదాధ్యయనాధ్యాపనముల నొనర్చువాఁడే తత్ఫలమును పొందును.

బ్రహ్మయజ్ఞ ప్రకరణమునందు అధ్యయన నియమముల నన్నిఁటిని వివరించి పిదప "దక్షిణోత్తరౌ పాణీపాదౌ కృత్వా ఓమితి ప్రతిపద్యతే" అని చెప్పి యుండుటచేత అధ్యయన కాలమునందు ఓంకారము నుచ్చరించి ఉపక్రమించుట శ్రుతిప్రతిపాదితమగు శిష్టాచారమే కాని కేవల శిష్టాచారము మాత్రముకాదు.

ఈ విధముగా అన్ని విషయములందు ఓంకారమును ప్రప్రథమమున నుంచి తమ తమ పనుల నాచరించుచు సఫలీకృతమనోరథు లగుచున్నారు కావున "ఓంకారమే బ్రహ్మము" అని ఉపాసించవలయునని తాత్పర్యము.

వివరణము: — భాష్యమునందు "ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి" అను మంత్రమును ద్వివిధముగా వ్యాఖ్యానమొనర్చియున్నారు. "ప్రవక్ష్యన్" అను పదము "వచ పరిభాషణే" అను ధాతువునుండియు, "వహ ప్రాపణే" అను ధాతువునుండియు పుట్టినది. ప్రథమ ధాతువునుండి పుట్టిన శబ్దమునకు గల యర్థమే ఇదివఱకు వివరింపఁబడినది. ఇపుడు రెండవ యర్థమును

వివరించెదను. 'బ్రహ్మవిత = పరమాత్మనే, ఉపాప్నవాని = పొందెదను.' ఇతి = ఇట్లని (తనను), ప్రవక్ష్యన్ = (బ్రహ్మమును గూర్చి) పొందింపఁజేయుటకు ఇచ్ఛగలవాఁడై, ఓం ఇతి = ఓం అని, బ్రాహ్మణః = బ్రహ్మవేత్త, ఆహ = పలికెను. అని యర్థమును చేసికొనవలయును.

౧. అమ....

౨. ఆత్మ....

౩. భా. వా ...౧౩౫-౧౪౨.



## ౯. నవమోఽనువాకః

### (ఉపాసక ధర్మములు)

మూలం. ౧ ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ । సత్యం చ స్వాధ్యాయప్రవచనే చ । తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ । దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ । శమశ్చ స్వాధ్యాయప్రవచనే చ । అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । అగ్నిహోత్రం చ స్వాధ్యాయప్రవచనే చ । అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ । మానుషం చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ । ౨ సత్యమితి సత్యవచా రథీతరః । తప ఇతి తపోనిత్యః పౌరు

శిష్టిః । స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః ।

తద్ధి తపస్తద్ధి తపః ॥౧॥

ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ షట్చ ॥౯॥

శాంకరభాష్యమ్:—

విజ్ఞానాదేవాప్నోతి స్వారాజ్యమిత్యుక్తత్వాత్ శ్రౌతస్మార్తానాం కర్మణామానర్థక్యం ప్రాప్తమిత్యేతన్మా ప్రాపదితి కర్మణాం పురుషార్థం ప్రతి సాధనత్వప్రదర్శనార్థ ఇహోపన్యాసః — ఋతమితి వ్యాఖ్యాతమ్ । స్వాధ్యాయః అధ్యయనమ్ । ప్రవచనమధ్యాపనం బ్రహ్మయజ్ఞో వా । ఏతాని ఋతాదీని, అనుష్ఠేయాని ఇతి వాక్యశేషః । సత్యం సత్యవచనం యథావ్యాఖ్యాతార్థం వా । తపః కృచ్ఛ్రాది । దమః బాహ్యకరణోపశమః । శమః అన్తః కరణోపశమః । అగ్నయశ్చ ఆధాతవ్యాః । అగ్నిహోత్రం చ హోతవ్యమ్ । అతిథయశ్చ పూజ్యాః । మానుషమితి లౌకికః సంవ్యవహారః । తచ్చ యథాప్రాప్తమనుష్ఠేయమ్ । ప్రజా చ ఉత్పాద్యా । ప్రజనశ్చ ప్రజననమ్; ఋతౌ భార్యాగమన మిత్యర్థః । ప్రజాతిః పౌత్రోత్పత్తిః; పుత్రో నివేశయితవ్య ఇత్యేతత్ । సర్వైరేతైః కర్మభిర్యుక్తస్యాపి స్వాధ్యాయప్రవచనే యత్నతోఽనుష్ఠేయే ఇత్యేవమర్థం సర్వేణ సహ స్వాధ్యాయ ప్రవచనగ్రహణమ్। స్వాధ్యాయాధీనం హ్యర్థజ్ఞానమ్ । అర్థజ్ఞానాధీనం చ పరం శ్రేయః । ప్రవచనం చ తదవిస్మరణార్థం ధర్మవృద్ధ్యర్థం చ । తతః స్వాధ్యాయ ప్రవచనయోరాదరః కార్యః । సత్యమితి సత్యమేవానుష్ఠేయమితి సత్యవచాః సత్యమేవ వచో యస్య సోఽయం సత్యవచాః, నామ వా సత్య; రాథీతరః రథీతరసగోత్రః రాథీతర ఆచార్యో మన్యతే। తప ఇతి తప ఏవ కర్తవ్యమితి తపోనిత్యః తపసి నిత్యః తపః పరః, తపోనిత్య ఇతి వా నామ; పౌరుశిష్టిః పురుశిష్టస్యాపత్యం పౌరుశిష్టిరాచార్యో మన్యతే। స్వాధ్యాయప్రవచనే ఏవ అనుష్ఠేయే ఇతి నాకో నామతః ముద్గలస్యాపత్యం మౌద్గల్య ఆచార్యో మన్యతే । తద్ధి తపస్తద్ధి తపః । యస్మాత్స్వాధ్యాయ ప్రవచనే ఏవ తపః, తస్మాత్తే ఏవానుష్ఠేయే ఇతి । ఉక్తానామపి సత్యతపః స్వాధ్యాయ ప్రవచనానాం పునర్గ్రహణ మాదరార్థమ్॥

ఇతి నవమానువాక భాష్యమ్॥

టీక. ౧. ఋతంచ = ఋతమున్నూ (ఋత మనఁగా శాస్త్రీయమైన దర్శ పూర్ణమాసాదికర్మజాతము), స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (ఏతాని = ఇవి, అనుష్ఠేయాని = అనుష్ఠింపఁదగినవి.) సత్యంచ = సత్యమున్నూ, స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయప్రవచనములున్నూ (అనుష్ఠింపదగినవి). తపశ్చ = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సున్నూ, స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయప్రవచనము లున్నూ (అనుష్ఠింపఁదగినవి). దమశ్చ = బహిరింద్రియనిగ్రహము, స్వాధ్యాయ ప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (అనుష్ఠింపఁదగినవి). శమశ్చ = అంత రింద్రియనిగ్రహము, స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (అను ష్ఠింపఁదగినవి). అగ్నయశ్చ = అగ్నులున్నూ, స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (అనుష్ఠింపఁదగినవి. అనఁగా శ్రౌతాగ్న్యాధానము చేయవలయును. స్వాధ్యాయప్రవచనముల నాచరింపవలయును.) అగ్నిహోత్రంచ = అగ్నిహోత్రము లున్నూ, స్వాధ్యాయ ప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (అనుష్ఠింపఁ దగినవి.) అతిథయశ్చ = అతిథులు (సత్కరింఁదగినవారు). స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయప్రవచనములు (అనుష్ఠింపఁదగినవి.) మానుషంచ = లౌకికసంవ్యవహారము (అనఁగా వివాహాది కాలములందు బంధువులు స్నేహితులు మున్నగువారలను శక్తికొలఁది సత్కరించుట మొదలగు వానిని చేయవలయును.), స్వాధ్యాయ ప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనములున్నూ (అనుష్ఠింపఁదగినవి.), ప్రజాచ = సంతానము (పొందఁదగినది), స్వాధ్యాయ ప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనము లున్నూ (అనుష్ఠింపఁదగినవి). ప్రజనశ్చ = ఋతుకాలమునందు భార్యతో సంగమము (చేయవలయును.) స్వాధ్యాయప్రవచనేచ = స్వాధ్యాయ ప్రవచనము లున్నూ (అనుష్ఠింపఁదగినది). ప్రజాతిశ్చ = ప్రజాతి అనఁగా పౌత్రోత్పత్తి నిమిత్తము పుత్రునకు వివాహ మొనర్చుట (చేయఁదగినది). స్వాధ్యాయ ప్రవచ నేచ = స్వాధ్యాయ ప్రవచనములు (చేయఁదగినవి).

౨. రాథీతరః = రథీతర గోత్రోత్పన్నుఁడగు, సత్యవచాః = సత్యవచుఁడను మహర్షి, సత్యం ఇతి = సత్యమును పలుకుటయే (ఆచరణీయమని పలికెను.) పౌరుశిష్టిః = పురుశిష్టియను మహర్షి పుత్రుఁడగు. తపోనిత్యః = తపోనిత్యుఁడను మహర్షి, తపఃఇతి = కృచ్ఛ్రచాంద్రాయణాది రూపమగు తపస్సే (ఆచరణీయమని వచించెను.) మౌద్గల్యః = ముద్గల మహర్షి పుత్రుఁడగు, నాకః = నాకుఁడను ఆచార్యుఁడు, స్వాధ్యాయ ప్రవచనే ఏవ ఇతి = స్వాధ్యాయ ప్రవచనములే, ఆచర

జీయములని (పలికెను కావున), తత్ హి = అస్వాధ్యాయ ప్రవచనములే, తపః = తపశ్శబ్దవాచ్యములు. తత్ హి = అస్వాధ్యాయ ప్రవచనములే. తపః = తపశ్శబ్ద వాచ్యములు (అని గ్రహింపవలయును).

తా. ౧. (విజ్ఞానము చేతనే అనఁగా ఉపాసనచేత వల్లనే స్వారాజ్యము కలుగు నను మంత్రవచన ముండుటచేత శ్రౌతస్మార్తకర్మలన్నియు నిరర్థకములే గదా అను సంశయము కలుగుట సహజము కావున తత్సంశయాపనోదార్థము కర్మలు ఉపాసనాసహకృతములయి స్వారాజ్య సిద్ధికి సహకారము లగుచున్నవను విషయ మీ యనువాకమునందు నిరూపింపఁబడుచున్నది:—

౧. ఋత మనఁగా శాస్త్రమునందు చేయఁదగినవిగా నిర్ణయింపఁబడిన దర్శపూర్ణమాసాది శ్రౌతస్మార్తకర్మలు. స్వాధ్యాయ మనఁగా తాను పఠించుట. ప్రవచన మనఁగా బోధించుటయు ఈ మూఁడున్ను అవశ్య మనుష్ఠింపఁదగినవి. ఇట్లే,

౨. సత్యమునే పలుకుట, స్వాధ్యాయ ప్రవచనములు. ఈ మూఁడున్ను అవశ్యము అనుష్ఠేయములు.

౩. కృచ్ఛ్రచాంద్రాయణాది తపశ్చర్యను సలుపుట, స్వాధ్యాయ ప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౪. దమ మనఁగా బహిరింద్రియ నిగ్రహము, స్వాధ్యాయ ప్రవచనములు. ఇవి అవశ్యానుష్ఠేయములు.

౫. శమ మనఁగా అంతరింద్రియ నిగ్రహము. స్వాధ్యాయ ప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౬. శ్రౌతాగ్న్యాధానము, స్వాధ్యాయ ప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౭. అగ్నిహోత్రాచరణము; స్వాధ్యాయప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౮. అతిథిపూజనము, స్వాధ్యాయప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౯. వివాహాది శుభకర్మలందు బంధుమిత్రాదుల సత్కరించుట యనెడి మానుషవ్యవహారము. స్వాధ్యాయప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౧౦. పుత్రోత్పత్త్యర్థము చేయఁబడెడి పుత్రకామేష్టి మున్నగు ప్రయత్నము, స్వాధ్యాయప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౧౧. ఋతుకాలములందు స్వస్త్రీయందు వ్యవహరించుట, స్వాధ్యాయప్రవచనములు, ఇవి అవశ్యానుష్ఠేయములు.

౧౨. పుత్రులకు వివాహ మొనర్చుట, స్వాధ్యాయ ప్రవచనములు. ఈ పైన చెప్పిన పనులన్నియు అవశ్య మాచరింపవలయును. ఈ పైని చెప్పఁబడిన పనుల నాచరించుచు స్వాధ్యాయ ప్రవచనములందు అధికమయిన శ్రద్ధకలిగి వాని నాచరించుచుండవలయునని తెలుపుటకుగాను ఇన్ని పర్యాయములు "స్వాధ్యాయ ప్రవచనేచ" అని చెప్పఁబడినదిగా గ్రహింపవలయును.

స్వాధ్యాయమున్నఁగాని అర్థజ్ఞానము కలుగదు. అర్థజ్ఞానమే శ్రేయస్సాధన భూత మగుచున్నది.

ప్రవచనము ఉత్పన్నమయిన అర్థజ్ఞానమును మరపునకు రానీయక ధర్మప్రవృద్ధిని కలుగఁజేయును కావున ఈ స్వాధ్యాయ ప్రవచనములందు అతిశయమైన ఆదరమును చూపవలయునని శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు భాష్యమునందు లిఖించియున్నారు.

౨—౧. రథీతర గోత్రోత్పన్నుఁడగు సత్యవచసుఁడను ఆచార్యుఁడు సత్యవచనమే అనుష్ఠేయమని పలికెను. (సత్యమునే పలికెడి స్వభావము గలవాఁ డగుటచేత నతనికి సత్యవచసుఁ డను సార్థకనామము కలిగెను.)

౨. పురుశిష్టి యను మహర్షియొక్క పుత్త్రుఁడగు తపోనిత్యుఁడను ఆచార్యుఁడు కృచ్ఛ్రచాంద్రాయణాది రూపమగు తపస్సే ఆచరణీయమని పలికెను. (ఎల్లప్పుడు తపస్సును ఆచరించువాఁడగుటచేత నతనికి 'తపోనిత్యుఁ' డను సార్థకనామము కలిగెను.)

౩. ముద్గలుఁ డను మహర్షియొక్క పుత్త్రుఁడగు నాకుఁ డను ఆచార్యుఁడు 'స్వాధ్యాయము, ప్రవచనము' అను ఈ రెండు అవశ్యము ఆచరింపఁదగినవని చెప్పెను.

ఈ స్వాధ్యాయ ప్రవచనములే తపస్సు, ఇవియే తపస్సు కావున అవశ్యమాచరించవలయును. ఆదరార్థము రెండు పర్యాయములు "తద్ధితపః" అని శ్రుతియందు చెప్పఁబడినదని గ్రహింపవలయును.

వివరణము:—

౧. సత్యవచాః — సత్యంవచతీతి సత్యవచాః.

(అర్థ. సత్యమునే పలుకునట్టివాడు.)

౨. తపోనిత్యః — తపసి నిత్యం వర్తత ఇతి తపోనిత్యః.

(అర్థ. ఎల్లప్పుడు తపస్సునం దుండువాఁడు.)

౩. పౌరుశిష్టిః — పురు బహువేలం మాతృపిత్రాచార్యైః శిష్టః పురు శిష్టః, తస్యాపత్యం పౌరుశిష్టిః.

(అర్థ. పలుసారులు మాతృపిత్రాచార్యులచేత సదాచారాది శిక్ష నందినవాఁడు పురుశిష్టుఁ డనంబడును. పురుశిష్టుని పుత్రుఁడు. పౌరుశిష్టి.)

౪. మౌద్గల్యః — ముదం శాస్త్రార్థనిర్ణయరూపాం గలతి స్రవతీతి ముద్గలః, ముద్గలస్యాపత్యం మౌద్గల్యః.

(అర్థ. శాస్త్రార్థనిర్ణయరూపమగు సంతసమును వెడల్రగక్కు నతఁడు ముద్గలుఁ డనంబడును. ముద్గలుని పుత్త్రుఁడు మౌద్గల్యుఁడు.

"తపోనిత్యః, సత్యవచాః, పౌరుశిష్టిః, మౌద్గల్యః.' మున్నగునవి నామధేయములు మాత్రమే అయినను మహర్షుల నామములు గుణవ్యంజకములయి యుండును. కావున వ్యుత్పత్త్యర్థమును సూచించితిమి.

ఇచట వ్రాయఁబడిన వ్యుత్పత్తులను శంకరానంద దీపిక నుండి సంగ్రహించితిని.

౧. అను ....

౨. ఆత్మ ....

౩. భా. వా. ౧౪౩-౧౫౦

# ౧౦. దశమోఽనువాకః

(బ్రహ్మజ్ఞాన ప్రకాశము)

మం. అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠం గిరేరివ ।

ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృత మస్మి । ద్రవిణగ్ంం

సవర్చసమ్ । సుమేధా అమృతోఽక్షితః । ఇతి త్రిశ

ఙ్కో ర్వేదానువచనమ్ ॥౧॥

అహగ్ం షట్ ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

అహం వృక్షస్యరేరివేతి స్వాధ్యాయార్థో మన్త్రామ్నాయః। స్వాధ్యాయశ్చ విద్యోత్పత్తయే, ప్రకరణాత్। విద్యార్థం హీదం ప్రకరణమ్; న చ అన్యార్థత్వమవ గమ్యతే। స్వాధ్యాయేన చ విశుద్ధ సత్త్వస్య విద్యోత్పత్తిరవ కల్పతే। అహం వృక్షస్య ఉచ్ఛేద్యాత్మకస్య సంసార వృక్షస్య రేరివా ప్రేరయితా అన్తర్యామ్యాత్మనా। కీర్తిః ఖ్యాతిః గిరేః పృష్ఠమివ ఉచ్ఛ్రితా మమ। ఊర్ధ్వ పవిత్రః ఊర్ధ్వం కారణం పవిత్రం పావనం జ్ఞానప్రకాశ్యం పరం బ్రహ్మ యస్య సర్వాత్మనో మమ, సోఽహ మూర్ధ్వ పవిత్రః; వాజిని ఇవ వాజపతీవ, వాజమన్నమ్, తద్వతి సవితరీపేత్యర్థః; యథా సవితరి అమృత మాత్మతత్త్వం విశుద్ధం ప్రసిద్ధం శ్రుతి స్మృతిశతేభ్యః ఏవం సు అమృతం శోభనం విశుద్ధ మాత్మతత్త్వమ్ అస్మి భవామి। ద్రవిణం ధనం సవర్చసం దీప్తిమత్ తదేవ ఆత్మతత్త్వమ్ అస్మీత్యనువర్తతే। బ్రహ్మజ్ఞానం వా ఆత్మతత్త్వ ప్రకాశకత్వాత్స వర్చసమ్, ద్రవిణ మివ ద్రవిణమ్, మోక్షసుఖ హేతు త్వాత్। అస్మిన్పక్షే ప్రాప్తం మయేత్యధ్యాహారః కర్తవ్యః। సుమేధాః శోభనా మేధా సర్వజ్ఞత్వ లక్షణా యస్య మమ, సోఽహం సుమేధాః సంసారస్థిత్యుత్పత్తి సంహార కౌశల యోగాత్సుమేధస్త్వమ్; అత ఏవ అమృతః అమరణధర్మా, అక్షితః అక్షీణః అవ్యయః అక్షతో వా; అమృతేన వా ఉక్షితః సిక్తః "అమృతోక్షితోఽహమ్" ఇత్యాది బ్రాహ్మణమ్। ఇతి ఏవం త్రిశఙ్కోః ఋషేః బ్రహ్మభూతస్య బ్రహ్మవిదః వేదానువచనమ్, వేదః వేదనమ్ ఆత్మైకత్వ విజ్ఞానమ్, తస్య ప్రాప్తిమను వచనం వేదాను వచనమ్; ఆత్మనః కృత కృత్యతాప్రఖ్యాపనార్థం వామదేవవత్రిశఙ్కునా ఆర్షేణ దర్శనేన దృష్టో మన్త్రామ్నాయ ఆత్మవిద్యాప్రకాశక ఇత్యర్థః। అస్య చ జపో విద్యోత్పత్త్యర్థోఽధిగమ్యతే। "ఋతం చ" ఇతి ధర్మోపన్యాసాదనన్తరం చ వేదానువచన పాఠాదే తదవగమ్యతే। ఏవం శ్రౌతస్మార్తేషు నిత్యేషు కర్మసు యుక్తస్య నిష్కామస్య పరంబ్రహ్మ వివిదిషోరార్షాణి దర్శనాని ప్రాదుర్భవన్త్యాత్మాది విషయాణీతి॥

ఇతి దశమానువాకభాష్యమ్॥

టీక. అహం = నేను. వృక్షస్య = సంసార వృక్షమునకు. రేరివా = అంతర్యామ్యాత్మగా ప్రేరకుడను. మమ = నాయొక్క. కీర్తిః = ఖ్యాతి, గిరేః = (మేరు) పర్వతముయొక్క, పృష్ఠంఇవ = శృంగమువలె (స్వర్గవ్యాపియై) వెలయు

చున్నది. ఊర్ధ్వపవిత్రః = పరమాత్మభూతుఁడను, పవిత్రుఁడను, లేక జ్ఞానప్రకాశ్యుఁడను, వాజిని ఇవ = సవితయందు వలె, స్వమృతం = విశుద్ధమయిన ఆత్మతత్త్వస్వరూపుఁడను, అస్మి = అగుచున్నాఁడను, సవర్చసం = దీప్తిగల, ద్రవిణం = ధనము, (అస్మి = అగుచున్నాఁడను.) సుమేధాః = సర్వజ్ఞత్వలక్షణమైన బుద్ధి గలవాఁడను. (అస్మి = అగుచున్నాఁడను.) అమృతః = మరణము లేనివాఁడను, అక్షితః = అక్షతుఁడను, (అస్మి = అగుచున్నాఁడను.) లేక, అమృతోక్షితః = అమృతముచేత తడుపఁబడినవాఁడను., (అస్మి = అగుచున్నాఁడను.) అని ఒకే పదము. ఇతి = ఈ విధముగా త్రిశంకోః = త్రిశంకు వను మహర్షియొక్క. వేదానువచనం = వేదవచనము.

తా. (ఈయనువాకము ఇచట జపార్థము చెప్పఁబడినది. ఈ స్వాధ్యాయజపమువలన చిత్తశుద్ధి కలిగి జ్ఞానోత్పత్తి కలుగును కావున ఈ యనువాకము ఈ యుపనిషత్ప్రకరణము ననుసరించి కర్మశేషము కాదనియు, బ్రహ్మవిద్యా సాధనభూత మనియు గ్రహింపవలయును.)

త్రిశంకు వను నామధేయము గల బ్రహర్షి ఈ చెప్పఁబోవు రీతిగా పలుకుచున్నాఁడు;—వృక్ష మనఁగా ఛేదింపుటకు యోగ్యమయిన దని తాత్పర్యము. (ప్రకరణము ననుసరించి ఇచట సంసారవృక్షముగా గ్రహింపవలయును.) అట్టి సంసారవృక్షమునకు ప్రేరకుఁడనై నవాఁడను నేనే. బ్రహ్మవేత్త సంసారవృక్షమునకు ప్రేరకుఁ డెట్లగునని సంశయి మవసరము లేదు. బ్రహ్మవేత్త సర్వాత్ముఁడు కావున అంతర్యామి రూపమున ప్రేరకుఁ డని భావము.) పర్వతశిఖరమువలె నా కీర్తి అత్యున్నతమయినదిగా నుండును. అనఁగా ఊర్ధ్వగతి సూచనమువలన సంసారాతీతమయిన స్థితి గలవాఁడ నని భావము. జ్ఞాన ప్రకాశ్యుఁడను, లేక పరమాత్మభూతుఁడను. పవిత్ర స్వరూపుఁడను. సూర్యునియందు అమృత స్వరూపమగు ఆత్మస్వరూప మెటుల నున్నదో అట్లే నా యందును ఆత్మతత్త్వము గలదు. దీప్తిమంతమగు ధనమును నేనే అగుచున్నాఁడను. నేనే సర్వజ్ఞుఁడను. అమరణధర్ముఁడను (అనఁగా షడ్భావవికార రహితుఁడను). ఇదియే త్రిశంకు మహర్షి యొక్క వేదాంతవచన బోధ యని గ్రహింపవలయును.

"ద్రవిణగ్ం సవర్చసం" అను వాక్యమునకు భాష్యమునందు మఱొక విధముగఁ గూడ అర్థము చేయఁబడినది:—సవర్చసం = బ్రహ్మస్వరూప వ్యంజకమగు, ద్రవిణం = బ్రహ్మజ్ఞానము, (మయా ప్రాప్తం = నాచేత పొందఁబడినది.)

"ఇతి త్రిశంకోర్వేదానువచనం" అను వాక్యము బ్రాహ్మణము.

వామదేవుఁడను ఋషిశ్రేష్ఠుఁడు కృతకృత్యుఁడై నట్టి 'అహం మనురభవం' అను వాక్య మెటుల తెలుపుచున్నదో అట్లే త్రిశంకు మహర్షియు కృతకృత్యుఁడైనాఁడు అను విషయమును 'అహం వృక్షస్య' యను మంత్రము బోధింపుచున్నది. కృతకృత్యతను కలుగఁజేయు బ్రహ్మవిచారమునందు ముముక్షువులకు ప్రవృత్తి కలుగుటకయి ఇచట ఈ మంత్రము పఠింపఁబడినది. త్రిశంకు మహర్షి తపఃప్రభావముచేత కలిగిన జ్ఞానముచేత చెప్పినాఁడు కావున ఇయ్యది విద్యాప్రకాశసామర్థ్యమయి యున్నది. తొమ్మిదవది యగు 'ఋతం చ' అను అనువాకమునందు కర్మల నాచరింపమని బోధించి వెంటనే ఈ పదియవ అనువాకమునందు త్రిశంకు మహర్షియొక్క ఆర్ష దర్శన విషయక వేదానువచన పాఠము చెప్పఁబడి యున్నదిగదా. దేని యభిప్రాయ మేమనఁగా:—

౧. శ్రౌతస్మార్తాది నిత్యకర్మలను నిష్కామ బుద్ధితో నాచరించుచు సాంసారిక ఫలము లందు నిస్పృహుఁడై బ్రహ్మమును తెలిసికొన ప్రయత్నించువానికి ఆత్మవిషయకము లగుదర్శనములు కలుగుననియు,

౨. శ్రౌతస్మార్తాదికర్మలను సకాముఁడై ఆచరించువానికి పితృలోకము కలుగుననియును సిద్ధించుచున్నది.

వివరణము:—ద్రవ్యము మానుషమనియు, దైవమనియు ద్వివిధము. కంటిచేత చూడఁబడెడి సువర్ణ రజతాదికము మానుష ద్రవ్యము. చెవులచేత వినఁబడుచు వేదాంతములందు ప్రతిపాదింపఁబడెడి బ్రహ్మజ్ఞానాదికము దైవద్రవ్యము. కావుననే బృహదారణ్యకమునందు ఒక ఉపాసనమునందు చక్షుశ్శ్రోత్రములకు మానుషదైవ ద్రవ్యదృష్టిని విధించియున్నారు:—"చక్షుర్మానుషం విత్తమ్, చక్షుషాహి తద్విందతే, శ్రోత్రం దైవమ్. శ్రోత్రేణహి తచ్ఛృణోతి" బృహ. ఉ. ౧. ౪. ౧౩. ఇచట మంత్రమునందు దైవవిత్తమునకు 'సువర్చసం' అను విశేషణమును చెప్పుటచేత దైవవిత్తము బలవత్తరమని సిద్ధించుచున్నది.

౧. అను ....

౨. ఆత్మ ....

౩. భా-వా. ౧౫౧-౧౬౦.



## ౧౧. ఏకాదశో ఽనువాకః

(అనుశాసనము)

మం. ౧ వేద మనూచ్యా ఽఽచార్యోఽంతేవాసిన మను
శాస్తి । సత్త్యం వద । ధర్మం చర । స్వాధ్యాయా న్మా ప్రమ
దః । ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజా
తంతుం మా వ్యవచ్ఛేత్సీః । ౨ సత్త్యా న్న ప్రమదిత
వ్యమ్ । ధర్మా న్న ప్రమదితవ్యమ్ । కుశలా న్న ప్రమ
దితవ్యమ్ । భూత్యైన ప్రమదితవ్యమ్ । స్వాధ్యాయ
ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ ॥౧॥

దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ । 3 మా
తృదేవో భవ । పితృదేవో భవ । ఆచార్యదేవో
భవ । అతిథిదేవో భవ । ౪ యాన్యనవద్యాని కర్మాణి ।
తాని సేవితవ్యాని । నో ఇతరాణి । యాన్యస్మాకగ్ం
సుచరితాని । తాని త్వయోపాస్యాని ॥౨॥

నో ఇతరాణి । ౫ యే కేచాస్మ చ్ఛ్రేయాగ్ంసో
బ్రాహ్మణాః । తేషాం త్వయా ఽఽసనే న ప్రశ్వసి
తవ్యమ్ । ౬ శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయా ఽదే

యమ్ । శ్రియా దేయమ్ । హ్రియా దేయమ్ । భియా దేయమ్ । సంవిదా దేయమ్ । ౩ అథ యది తే కర్మ విచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ ॥3॥

యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః । యుక్తా ఆయుక్తాః । అలూక్షా ధర్మ కామాస్స్యుః । యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్ర వర్తేథాః । ౭ అథాభ్యాఖ్యాతేషు । యే తత్ర బ్రాహ్మణాస్సంమర్శినః । యుక్తా ఆయుక్తాః । అలూక్షా ధర్మ కామాస్స్యుః । యథా తే తేషు వర్తేరన్ । తథా తేషు వర్తేథాః । ౯ ఏష ఆదేశః । ఏష ఉపదేశః । ఏషా వేదోపనిషత్ । ఏత దనుశాసనమ్ । ఏవ ముపాసితవ్యమ్ । ఏవ ముచైత దుపాస్యమ్ ॥४॥

స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం తాని త్వయోపాస్యాని విచికిత్సా వా స్యాత్తేషు వర్తేరన్నస్తథా చ ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

వేదమనూచ్యేత్యేవమాది కర్తవ్యతోపదేశారమ్భః ప్రాగ్బ్రహ్మాత్మ విజ్ఞానాన్ని యమేన కర్తవ్యాని శ్రౌతస్మార్తాని కర్మాణీ త్యేవమర్థః, అనుశాసనశ్రుతేః పురుష

సంస్కారార్థత్వాత్ । సంస్కృతస్య హి విశుద్ధ సత్త్వస్య ఆత్మజ్ఞాన మఞ్జసైవోప
జాయతే । "తపసా కల్మషం హన్తి విద్యయామృతమశ్నుతే" ఇతి హి స్మృతిః ।
వక్ష్యతి చ — "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" ఇతి । అతో విద్యోత్పత్త్యర్థ
మనుష్ఠేయాని కర్మాణి । అను శాస్తీత్యను శాసన శబ్దాదనుశాసనాతి క్రమే హి
దోషోత్పత్తిః । ప్రాగుపన్యాసాచ్చ కర్మణామ్, కేవల బ్రహ్మవిద్యారమ్భాచ్చ పూర్వం
కర్మాణ్యుపన్యస్తాని । ఉదితాయాం చ బ్రహ్మవిద్యాయామ్ "అభయం ప్రతిష్ఠాం
విన్దతే" "న బిభేతి కుతశ్చన" "కిమహం సాధు నాకరవమ్" ఇత్యాదినా
కర్మనైష్కించన్యం దర్శయిష్యతి । అతః అవగమ్యతే — — పూర్వోపచిత
దురితక్షయ ద్వారేణ విద్యోత్పత్త్యర్థాని కర్మాణీతి । మన్త్రవర్ణాచ్చ — "అవిద్యయా
మృత్యుం తీర్త్వా విద్యయా మృతమశ్నుతే" ఇతి ఋతాదీనాం పూర్వత్రోపదేశః
ఆనర్థక్యపరిహారార్థః; ఇహ తు జ్ఞానోత్పత్త్యర్థత్వాత్కర్తవ్యతా నియమార్థః ।
వేదమ్ అనూచ్య అధ్యాప్య ఆచార్యః అన్తేవాసినం శిష్యమ్ అనుశాస్తి గ్రన్థ
గ్రహణాత్ అను ప్రశ్చాత్ శాస్తి తదర్థం గ్రాహయతీత్యర్థః । అతోఽవగమ్యతే
అధీతవేదస్య ధర్మ జిజ్ఞాసామకృత్వా గురుకులాన్న సమావర్తితవ్యమితి । "బుద్ధ్వా
కర్మాణి కుర్వీత" ఇతి స్మృతేశ్చ । కథమనుశాస్తీత్యత ఆహ — సత్యం వద
యథా ప్రమాణావగతం వక్తవ్యం చ వద । తద్వత్ ధర్మం చర; ధర్మ ఇత్య
నుష్ఠేయానాం సామాన్యవచనమ్, సత్యాది విశేష నిర్దేశాత్ । స్వాధ్యాయాత్ అధ్యయ
నాత్ మా ప్రమదః ప్రమాదం మా కార్షీః । ఆచార్యాయ ఆచార్యార్థం ప్రియం
ఇష్టం ధనమ్ ఆహృత్య ఆనీయ దత్త్వా విద్యానిష్క్రయార్థమ్ ఆచార్యేణ చ అను
జ్ఞాతః అనురూపాన్దారానాహృత్య ప్రజాతన్తుం ప్రజాసంతానం మా వ్యవచ్ఛేత్సీః;
ప్రజాసంతతేర్విచ్ఛిత్తిర్న కర్తవ్యా; అనుత్పద్యమానేఽపి పుత్రే పుత్రకామ్యాది
కర్మణా తదుత్పత్తౌ యత్నః కర్తవ్య ఇత్యభిప్రాయః, ప్రజా ప్రజన ప్రజాతిత్రయ
నిర్దేశ సామర్థ్యాత్; అన్యథా ప్రజానశ్చేత్యేతదేకమేవావక్ష్యత్ । సత్యాత్ న ప్రమది
తవ్యం ప్రమాదో న కర్తవ్యః; సత్యాచ్చ ప్రమదనమనృత ప్రసఙ్గః; ప్రమాద శబ్ద
సామర్థ్యా ద్విస్మృత్యాప్యనృతం న వక్తవ్య మిత్యర్థః; అన్యథా అసత్యవదన ప్రతి
షేధ ఏవ స్యాత్ । ధర్మాత్ న ప్రమాదితవ్యమ్, ధర్మశబ్దస్యానుష్ఠేయ విశేష
విషయ త్వాదననుష్ఠానం ప్రమాదః, స న కర్తవ్యః, అనుష్ఠాతవ్య ఏవ ధర్మ ఇతి
యావత్ । ఏవం కుశలాత్ ఆత్మరక్షార్థాత్కర్మణః న ప్రమది తవ్యమ్ । భూతిః
విభూతిః తస్యై భూత్యై భూత్యర్థాన్మఙ్గల యుక్తాత్కర్మణః న ప్రమదితవ్యమ్ ।

స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్. తే హి నియమేన కర్తవ్యే ఇత్యర్థః।
తథా దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్, దైవ పిత్ర్యే కర్మాణి కర్తవ్యే।
మాతృదేవః మాతా దేవో యస్య సః, త్వం మాతృదేవః భవ స్యాః। ఏవం పితృ
దేవో భవ; ఆచార్య దేవో భవ; అతిథిదేవో భవ; దేవతావదుపాస్యా ఏతే ఇత్యర్థః।
యాన్యపి చ అన్యాని అనవద్యాని అనిన్దితాని శిష్టాచార లక్షణాని కర్మాణి, తాని సేవి
తవ్యాని కర్తవ్యాని త్వయా। నో న కర్తవ్యాని ఇతరాణి సావద్యాని శిష్ట కృతాన్యపి।
యాని అస్మాకమ్ ఆచార్యాణాం సుచరితాని శోభన చరితాని ఆమ్నాయాద్యవిరుద్ధాని,
తాన్యేవ త్వయా ఉపాస్యాని అదృష్టార్థాన్యనుష్ఠేయాని; నియమేన కర్తవ్యానీత్యేతత్।
నో ఇతరాణి విపరీతాన్యాచార్యకృతాన్యపి। యే కే చ విశేషితా ఆచార్యత్వాది ధర్మైః
అస్మత్ అస్మత్తః శ్రేయాంసః ప్రశస్తతరాః, తే చ బ్రాహ్మణాః, న క్షత్రియా
దయః, తేషామ్ ఆసనేన ఆసనదానాదినా త్వయా ప్రశ్వసితవ్యమ్, ప్రశ్వసనం
ప్రశ్వాసః శ్రమాపనయః; తేషాం శ్రమస్త్వయా అపనేతవ్య ఇత్యర్థః। తేషాం వా
ఆసనే గోష్ఠీనిమిత్తే సముదితే. తేషు న ప్రశ్వసితవ్యం ప్రశ్వాసోఽపి న కర్తవ్యః;
కేవలం తదుక్తసారగ్రాహిణా భవితవ్యమ్। కిం చ. యత్కించిద్దేయమ్, తత్ శ్రద్ధ
యైవ దాతవ్యమ్। అశ్రద్ధయా అదేయం న దాతవ్యమ్। శ్రియా విభూత్యా దేయం
దాతవ్యమ్॥ హ్రియా లజ్జయా చ దేయమ్। భియా భీత్యా చ దేయమ్। సంవిదా
చ మైత్ర్యాది కార్యేణ దేయమ్। అథ ఏవం వర్తమానస్య యది కదాచిత్ తే తవ
శ్రౌతే స్మార్తే వా కర్మణి వృత్తే వా ఆచారలక్షణే విచికిత్సా సంశయః స్యాత్
భవేత్, యే తత్ర తస్మిన్దేశే కాలే వా బ్రాహ్మణాః తత్ర కర్మాదౌ యుక్తా ఇతి వ్యవ
హితేన సంబన్ధః కర్తవ్యః; సంమర్శినః విచారక్షమాః, యుక్తాః అభియుక్తాః,
కర్మణి వృత్తే వా ఆయుక్తాః అపరప్రయుక్తాః, అలూక్షాః అరూక్షాః అక్రూరమతయః,
ధర్మకామాః అదృష్టార్థినః అకామహతా ఇత్యేతత్; స్యుః భవేయుః. తే బ్రాహ్మణాః
యథా యేన ప్రకారేణ తత్ర తస్మిన్కర్మణి వృత్తే వా వర్తేరన్, తథా త్వమపి
వర్తేథాః। అథ అభ్యాఖ్యాతేషు, అభ్యాఖ్యాతా అభ్యుక్తాః దోషేణ సందిహ్యమానే న
సంయోజితాః కేనచిత్, తేషు చ; యథోక్తం సర్వముపనయేత్-యే తత్రేత్యాది।
ఏషః ఆదేశః విధిః। ఏషః ఉపదేశః పుత్రాదిభ్యః పిత్రాదీనామపి। ఏషా వేదోప
నిషత్ వేదరహస్యమ్, వేదార్థ ఇత్యేతత్। ఏతదేవ అనుశాసనమ్ ఈశ్వర వచనమ్;
ఆదేశ వాచ్యస్య విధేరుక్తత్వాత్। సర్వేషాం వా ప్రమాణభూతానా మనుశాసన
మేతత్। యస్మాదేవమ్, తస్మాత్ ఏవం యథోక్తం సర్వమ్ ఉపాసితవ్యం కర్త

వ్యమ్ ॥ ఏవము చ ఏతత్ ఉపాస్యమ్ ఉపాస్యమేవ చైతత్ నానుపాస్యమ్ ఇత్యాద రార్థం పునర్వచనమ్॥

అత్రైతచ్చిన్త్యతే విద్యాకర్మణోర్వివేకార్థమ్ — కిం కర్మభ్య ఏవ కేవలేభ్యః పరం శ్రేయః, ఉత విద్యాసంవ్యపేక్షేభ్యః, ఆహోస్విద్విద్యాకర్మభ్యాం సంహతాభ్యామ్, విద్యయా వా కర్మాపేక్షయాః, ఉత కేవలాయా ఏవ విద్యయా ఇతి । తత్ర కేవలేభ్య ఏవ కర్మభ్యః స్యాత్, సమస్త వేదార్థ జ్ఞానవతః కర్మాధికారాత్ "వేదః కృత్స్నోఽధి గన్తవ్యః సరహస్యో ద్విజన్మనా" ఇతి స్మరణాత్ । అధిగమశ్చ సహోపనిషదర్థేనాత్మజ్ఞానాదినా । "విద్వాన్యజతే" "విద్వాన్యాజయతి" ఇతి చ విదుష ఏవ కర్మణ్యధికారః ప్రదర్శ్యతే సర్వత్ర జ్ఞాత్వానుష్ఠాన మితి చ । కృత్స్నశ్చ వేదః కర్మార్థ ఇతి హి మన్యన్తే కేచిత్ । కర్మభ్యశ్చేత్పరం శ్రేయో నావాప్యతే, వేదోఽనర్థకః స్యాత్ । న; నిత్యత్వాన్మోక్షస్య । నిత్యో హి మోక్ష ఇష్యతే । కర్మకార్యస్య చానిత్యత్వం ప్రసిద్ధం లోకే । కర్మభ్యశ్చేచ్ఛ్రేయ, అనిత్యం స్యాత్; తచ్చానిష్టమ్ । నను కామ్య ప్రతిషిద్ధయోరనారమ్భాత్ ఆరబ్ధస్య చ కర్మణ ఉప భోగేనైవ క్షయాత్ నిత్యానుష్ఠానాచ్చ ప్రత్యవాయానుపపత్తేః జ్ఞాన నిరపేక్ష ఏవ మోక్ష ఇతి చేత్, తచ్చ న; కర్మశేష సంభవాత్తన్నిమిత్తా శరీరాన్తరోత్పత్తిః ప్రాప్నోతీతి ప్రత్యుక్తమ్; కర్మ శేషస్య చ నిత్యానుష్ఠానేనావిరోధాత్ క్షయానుపపత్తిరితి చ । యదుక్తం సమస్తవేదార్థజ్ఞానవతః కర్మాధికారాదిత్యాది, తచ్చ న; శ్రుత జ్ఞాన వ్యతిరేకాదుపాసనస్య । శ్రుతజ్ఞాన మాత్రేణ హి కర్మణ్యధిక్రియతే, నోపాసనజ్ఞానమపేక్షతే । ఉపాసనం చ శ్రుతజ్ఞానాదర్థాన్తరం విధీయతే మోక్షఫలమ్; అర్థాన్తర ప్రసిద్ధేశ్చ స్యాత్; "శ్రోతవ్యః" ఇత్యుక్త్వా తద్వ్యతిరేకేణ "మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఇతి యత్నాన్తరవిధానాత్ మనన నిదిధ్యాసనయోశ్చ ప్రసిద్ధం శ్రవణ జ్ఞానాదర్థాన్తరత్వమ్ । ఏవం తర్హి విద్యా సంవ్యపేక్షేభ్యః కర్మభ్యః స్యాన్మోక్షః; విద్యాసహితానాం చ కర్మణాం భవేత్కార్యాన్తరారమ్భసామర్థ్యమ్; యథా స్వతో మరణజ్వరాదికార్యారమ్భసమర్థానామపి విష దధ్యాదీనాం మన్త్ర శర్కరాది సంయుక్తానాం కార్యాన్తరారమ్భసామర్థ్యమ్, ఏవం విద్యాసహితైః కర్మభిః మోక్ష ఆరభ్యత ఇతి చేత్, న; ఆరభ్యస్యానిత్యత్వా దిత్యుక్తో దోషః । వచనాదారభ్యోఽపి నిత్య ఏవేతి చేత్, న; జ్ఞాపకత్వాద్వచనస్య । వచనం నామ యథా భూతస్యార్థస్య జ్ఞాపకమ్, నావిద్యమానస్య కర్తృ । న హి వచన శతే

నాపి నిత్యమారభ్యతే. ఆరబ్ధం వా అవినాశి భవేత్ ; ఏతేన విద్యాకర్మణోః సంహ
తయో ర్మోక్షా రమ్భ కత్వం ప్రత్యుక్తమ్॥

విద్యాకర్మణీ మోక్ష ప్రతిబన్ధ హేతునివర్తకే ఇతి చేత్, న; కర్మణః ఫలాన్తర
దర్శనాత్ । ఉత్పత్తి వికార సంస్కారాప్తయో హి ఫలం కర్మణో దృశ్యన్తే ।
ఉత్పత్త్యాది ఫల విపరీతశ్చ మోక్షః। గతిశ్రుతేరాప్య ఇతి చేత్—"సూర్యద్వారేణ"
"తయోర్ధ్వమాయన్" ఇత్యేవమాదిగతి శ్రుతిభ్యః ప్రాప్యో మోక్ష ఇతి చేత్, న;
సర్వగత త్వాత్ గన్తృభ్యశ్చానన్యత్వాత్ । ఆకాశాదికారణ త్వాత్సర్వగతం బ్రహ్మ,
బ్రహ్మావ్యతిరిక్తాశ్చ సర్వే విజ్ఞానాత్మానః; అతో నాప్యో మోక్షః । గన్తురన్యద్విభిన్న
దేశం చ భవతి గన్తవ్యమ్ । న హి, యేనైవా వ్యతిరిక్తం యత్, తత్తేనైవ
గమ్యతే । తదనన్యత్వ సిద్ధిశ్చ "తత్సృష్ట్వా తదేవా నుప్రావిశత్" "క్షేత్రజ్ఞం
చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు" ఇత్యేవ మాదిశ్రుతిస్మృతిశతేభ్యః । గత్యైశ్వర్యాది
శ్రుతి విరోధ ఇతి చేత్ — అథాపి స్యాత్ యద్యప్రాప్యో మోక్షః, తదా గతిశ్రుతీ
నామ్ "స ఏకధా" "స యది పితృలోకకామః" "స్త్రీభిర్వా యానైర్వా" ఇత్యాది
శ్రుతీనాం చ కోపః స్యాత్ ఇతి చేత్, న; కార్యబ్రహ్మవిషయత్వాత్తాసామ్ । కార్యే
హి బ్రహ్మణి స్త్ర్యాదయః స్యుః, న కారణే; "ఏకమేవా ద్వితీయమ్" "యత్ర నాన్య
త్పశ్యతి" "తత్కేన కం పశ్యేత్" ఇత్యాది శ్రుతిభ్యః । విరోధాచ్చ విద్యాకర్మణోః
సముచ్చయా నుపపత్తిః । ప్రలీనకర్త్రాదికారక విశేషతత్త్వవిషయా హి విద్యా
తద్విపరీతకారక సాధ్యేన కర్మణా విరుధ్యతే । న హ్యేకం వస్తు పరమార్థతః కర్త్రాది
విశేషవత్ తచ్ఛూన్యం చేతి ఉభయథా ద్రష్టుం శక్యతే । అవశ్యం హ్యన్యతరన్మిథ్యా
స్యాత్ । అన్యతరస్య చ మిథ్యాత్వప్రసఙ్గే యుక్తం యత్స్వాభావికాజ్ఞాన విషయస్య
ద్వైతస్య మిథ్యాత్వమ్; "యత్ర హి ద్వైతమివ భవతి" "మృత్యోః స మృత్యు
మాప్నోతి" "అథ యత్రాన్యత్పశ్యతి తదల్పమ్" "అన్యోఽసావన్యోఽహమస్మి"
"ఉదర మన్తరం కురుతే" "అథ తస్య భయం భవతి" ఇత్యాదిశ్రుతిశతేభ్యః ।
సత్యత్వం చ ఏకత్వస్య "ఏకధై వానుద్రష్టవ్యమ్" "ఏకమేవాద్వితీయమ్" "బ్రహ్మై
వేదం సర్వమ్" "ఆత్మైవేదం సర్వమ్" ఇత్యాది శ్రుతిభ్యః । న చ సంప్రదానాది
కారక భేదాదర్శనే కర్మోపపద్యతే । అన్యత్వదర్శనాపవాదాశ్చ విద్యావిషయే సహ
స్రశః శ్రూయన్తే । అతో విరోధో విద్యాకర్మణోః । అతశ్చ సముచ్చయానుప
పత్తిః ॥

తత్ర యదుక్తం సంహతాభ్యాం విద్యాకర్మభ్యాం మోక్ష ఇత్యేతదనుపపన్న మితి, తదయుక్తమ్, తద్విహిత త్వాత్కర్మణాం శ్రుతివిరోధ ఇతి చేత్ — యద్యుపమృద్య కర్త్రాదికారక విశేష మాత్మైకత్వ విజ్ఞానం విధీయతే సర్పాదిభ్రాన్తి జ్ఞానోపమర్దకరజ్జ్వాది విషయ విజ్ఞానవత్, ప్రాప్తః కర్మవిధిశ్రుతీనాం నిర్విష యత్వాద్విరోధః । విహితాని చ కర్మాణి । స చ విరోధో న యుక్తః, ప్రమాణత్వా చ్ఛ్రుతీనామితి చేత్, న; పురుషార్థోపదేశ పరత్వాచ్ఛ్రుతీనామ్ । విద్యోపదేశపరాతావచ్ఛ్రుతిః సంసారాత్పురుషో మోక్షయి తవ్య ఇతి సాంసార హేతోరవిద్యాయాః విద్యయా నివృత్తిః కర్తవ్యేతి విద్యాప్రకాశకత్వేన ప్రవృత్తేతి న విరోధః । ఏవమపి కర్త్రాదికారక సద్భావ ప్రతిపాదన పరం శాస్త్రం విరుధ్యత ఏవేతి చేత్, న; యథాప్రాప్తమేవ కారకాస్తిత్వ ముపాదాయ ఉపాత్త దురితక్ష యార్థం కర్మాణి విదధచ్ఛాస్త్రం ముముక్షూణాం ఫలార్థినాం చ ఫలసాధనం న కారకాస్తిత్వే వ్యాప్రియతే । ఉపచిత దురిత ప్రతిబన్ధస్య హి విద్యోత్పత్తిర్నావ కల్పతే । తత్ క్షయే చ విద్యోత్పత్తిః స్యాత్, తతశ్చావిద్యానివృత్తిః, తత ఆత్యన్తికః సంసారోపరమః । అపి చ, అనాత్మదర్శినో హ్యనాత్మ విషయః కామః; కామయ మానశ్చ కరోతి కర్మాణి; తత స్తత్ఫలోప భోగాయ శరీరా ద్యుపాదానలక్షణః సంసారః । తద్వ్యతిరేకేణాత్మైకత్వదర్శినో విషయాభావా త్కామానుపపత్తిః. ఆత్మని చానన్యత్వాత్కామానుపపత్తౌ స్వాత్మన్యవస్థానం మోక్ష ఇత్యతోఽపి విద్యాకర్మణోర్విరోధః । విరోధాదేవ చ విద్యా మోక్షం ప్రతి న కర్మాణ్యపేక్షతే । స్వాత్మలాభేతు పూర్వోపచితదురితప్రతిబన్ధాపనయనద్వారేణ విద్యా హేతుత్వం ప్రతిపద్యన్తే కర్మాణి నిత్యానీతి । అత ఏవాస్మిన్ ప్రకరణే ఉపన్యస్తాని కర్మాణీత్యవోచామ । ఏవం చ అవిరోధః కర్మవిధిశ్రుతీనామ్ । అతః కేవలాయా ఏవ విద్యాయాః పరంశ్రేయ ఇతి సిద్ధమ్ ।

ఏవం తర్హి ఆశ్రమాన్తరానుపపత్తిః, కర్మనిమిత్త త్వాద్విద్యోత్పత్తేః । గృహస్థస్యైవ విహితాని కర్మాణీత్యైకాశ్రమ్యమేవ । అతశ్చ యావజ్జీవాదిశ్రుతయః అనుకూలతరాః స్యుః । న; కర్మానేకత్వాత్ । న హ్యగ్నిహోత్రాదీన్యేవ కర్మాణి; బ్రహ్మచర్యం తపః సత్యవచనం శమః దమః అహింసా ఇత్యేవమాదీన్యపి కర్మాణి ఇతరాశ్రమప్రసిద్ధాని విద్యోత్పత్తౌ సాధకతమాన్యసంకీర్ణాని విద్యన్తే ధ్యానధారణాది లక్షణాని చ । వక్ష్యతి చ — ''తపసా బ్రహ్మవి జిజ్ఞాసితవ్య'' ఇతి । జన్మాన్తర కృత కర్మభ్యశ్చ ప్రాగపి గార్హస్థ్యాద్విద్యోత్పత్తి సంభవాత్, కర్మార్థత్వాచ్చగార్హస్థ్య

ప్రతిపత్తేః, కర్మసాధ్యాయాం చ విద్యాయాం సత్యాం గార్హస్థ్యప్రతిపత్తిరనర్థికైవ। లోకార్థత్వాచ్చ పుత్రాదీనామ్। పుత్రాది సాధ్యేభ్యశ్చ అయం లోకః పితృలోకో దేవలోక ఇత్యేతేభ్యో వ్యావృత్త కామస్య, నిత్యసిద్ధాత్మదర్శినః, ।కర్మణి ప్రయోజన మపశ్యతః, కథం ప్రవృత్తిరుప పద్యతే? ప్రతిపన్నగార్హస్థ్యస్యాపి విద్యోత్పత్తౌ విద్యాపరిపాకాద్విరక్తస్య కర్మసు ప్రయోజనమపశ్యతః కర్మభ్యో నివృత్తిరేవ స్యాత్, "ప్రవ్రజిష్యన్వా అరేఽహమస్మాత్స్థానాదస్మి" ఇత్యేవమాది శ్రుతి లిఙ్గ దర్శనాత్। కర్మ ప్రతి శ్రుతేర్యత్నాధిక్య దర్శనాదయుక్తమితి చేత్, — అగ్నిహోత్రాది కర్మ ప్రతి శ్రుతేరధికోయత్నః; మహాంశ్చ కర్మణ్యాయాసః, అనేక సాధన సాధ్యత్వాదగ్నిహోత్రాదీనామ్; తపోబ్రహ్మచర్యాదీనాం చ ఇతరాశ్రమ కర్మణాంగార్హస్థ్యేఽపి సమానత్వాదల్పసాధనాపేక్షత్వాచ్చేతరేషాం న యుక్తస్తుల్య వద్వికల్ప ఆశ్రమిభిస్తస్య ఇతి చేత్, న; జన్మాన్తర కృతానుగ్రహాత్। అయుక్తం కర్మణి శ్రుతేరధికో యత్న ఇత్యాది, నాసౌ దోషః, యతో జన్మాన్తరకృత మప్యగ్నిహోత్రాదిలక్షణం కర్మ బ్రహ్మచర్యాది లక్షణంచానుగ్రాహకం భవతి విద్యోత్పత్తిం ప్రతి; యేన చ జన్మనైవ విరక్తాదృశ్యన్తే కేచిత్; కేచిత్తు కర్మసు ప్రవృత్తా అవిరక్తా విద్యావిద్వేషిణః। తస్మాజ్జన్మాన్తర కృతసంస్కారేభ్యో విరక్తానామాశ్రమాన్తర ప్రతిపత్తి రేవేష్యతే। కర్మఫల బాహుల్యాచ్చ। పుత్రస్వర్గ బ్రహ్మ వర్చసాది లక్షణస్య కర్మఫలస్యాసంఖ్యేయత్వాత్ తత్ప్రతి చ పురుషాణాం కామ బాహుల్యాత్తదర్థః శ్రుతేరధికో యత్నః కర్మసూపపద్యతే, ఆశిషాం బాహుల్య దర్శనాత్ — ఇదం మే స్యాదిదం మే స్యాదితి। ఉపాయత్వాచ్చ। ఉపాయ భూతాని హి కర్మాణి విద్యాం ప్రతి ఇత్యవోచామ। ఉపాయే చ అధికో యత్నః కర్తవ్యః, న ఉపేయే। కర్మనిమిత్తత్వా ద్విద్యాయా యత్నాన్తరానర్థక్యమితి చేత్— కర్మభ్య ఏవ పూర్వోపచితదురిత ప్రతిబన్ధక్షయా ద్విద్యోత్పద్యతే చేత్ కర్మభ్యః పృథగుపనిషచ్ఛ్రవణాది యత్నోఽనర్థక ఇతి చేత్, న; నియమాభావాత్। న హి, "ప్రతిబన్ధక్షయాదేవ విద్యోత్పద్యతే, న త్వీశ్వరప్రసాదతపోధ్యానాద్యనుష్ఠానాత్" ఇతి నియమోఽస్తి; అహింసా బ్రహ్మచర్యాదీనాం చ విద్యాం ప్రత్యుపకారకత్వాత్, సాక్షాదేవ చ కారణత్వాచ్ఛ్రవణమనన నిదిధ్యాసనా దీనామ్। అతః సిద్ధాన్యాశ్రమాన్తరాణి। సర్వేషాం చాధికారో విద్యాయామ్, పరం చ శ్రేయః కేవలాయా విద్యాయా ఏవేతి సిద్ధమ్॥

ఇత్యేకాదశానువాక భాష్యమ్॥

టీక. ౧. ఆచార్యః=ఆచార్యుఁడు, వేదం=వేదమును, అనూచ్య = అధ్యాపనము చేయించి (అనఁగా బోధించి), అంతేవాసినం=శిష్యుని, అనుశాస్తి = శాసించుచున్నాఁడు:—సత్యం=సత్యమును, వద=పలుకుము, ధర్మం = ధర్మమును, చర = చేయుము, స్వాధ్యాయాత్ = అధ్యయనము నుండి, మా ప్రమదః=ప్రమాదమును పొందకుము, ఆచార్యాయ=ఆచార్యుని కొఱకు, ప్రియం = ఇష్టమైన, ధనం= ధనమును, ఆహృత్య = తెచ్చియిచ్చి (అతనిచేత అనుజ్ఞాతుఁడవై), ప్రజాతంతుం= పుత్రపౌత్రాదిసంతతిని, మావ్యవచ్ఛేత్సీః=విచ్ఛిత్తిని చేయకుము.

౨. సత్యాత్ = సత్యము నుండి. నప్రమదితవ్యం=ప్రమాదమును పొందవలదు. ధర్మాత్=ధర్మము నుండి, నప్రమదితవ్యం = ప్రమాదమును పొందవలదు, కుశలాత్=కుశలమునుండి (కుశల మనఁగా ఆత్మసంరక్షణరూపమగు పని). నప్రమదితవ్యం = ప్రమాదమును పొందవలదు, భూత్యై=మంగళార్థమయిన పనివల్ల నుండి (పంచమ్యర్థమునందు చతుర్థి). నప్రమదితవ్యం=ప్రమాదమును పొందవలదు. స్వాధ్యాయప్రవచనాభ్యాం=అధ్యయనము అధ్యాపనము ఈ రెండిటి నుండి, నప్రమదితవ్యం=ప్రమాదమును పొందవలదు, దేవ పితృకార్యాభ్యాం=దేవ పితృకార్యముల నుండి. నప్రమదితవ్యం = ప్రమాదమును పొందవలదు.

౩. మాతృదేవః=తల్లియే దైవముగాఁ గలవాఁడవు. భవ=కమ్ము. పితృదేవః= తండ్రియే దైవముగాఁ గలవాఁడవు, భవ = కమ్ము, ఆచార్యదేవః=ఆచార్యుఁడే దైవముగాఁ గలవాడవు, భవ = కమ్ము, అతిథిదేవః = అతిథియే దైవముగాఁ గలవాఁడవు, భవ=కమ్ము.

౪. యాని = ఏ, కర్మాణి=పనులు, అనవద్యాని=నింద్యములు కావో, (తాని= అట్టి కర్మలే, త్వయా=నీ చేత), సేవితవ్యాని=సేవించఁదగినవి. ఇతరాణి=నింద్యములయినవి, నో = (చేయ)వలదు. అస్మాకం = మాయొక్క, యాని = ఏ, సుచరితాని=మంచి పనులుగలవో, తాని=ఆ మంచి పనులే, త్వయా=నీ చేత, ఉపాస్యాని= చేయఁదగినవి. ఇతరాణి=(మేము చేయు పనులలో) మంచివి కానివానిని, నో=(ఆచరింప) వలదు.

౫. యేకేచ = ఎవరైనా, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, అస్మత్ = మనకంటె, (లేక మాకంటె) శ్రేయాగ్ంసః = శ్రేష్ఠులో, తేషాం = వారికి, త్వయా = నీ చేత, ఆసనేన = ఆసన మిచ్చుట (మొదలగు పనుల) చేత, ప్రశ్వసితవ్యం=(వారి) శ్రమను పోఁగొట్టవలయును.

౬. శ్రద్ధయా = శ్రద్ధచేత, దేయం = ఇవ్వవలయును. అశ్రద్ధయా = అశ్రద్ధచేత, అదేయం = ఇవ్వకూడదు. శ్రియా = సంపదచేత, దేయం = ఇవ్వవలయును. హ్రియా = సిగ్గుచేత. దేయం = ఇవ్వవలయును. భియా = భయముచేత, దేయం = ఇవ్వవలయును. సంవిదా = సంవిత్తుచేత. దేయం = ఇవ్వఁదగినది.

౭. అథ = పిదప, తే = నీకు, కర్మవిచికిత్సావా = కర్మను గూర్చిన సందేహముగాని, వృత్తవిచికిత్సావా = ఆచారమును గూర్చిన సందేహముగాని, యది సంభవించిన యెడల, తత్ర = ఆదేశమునందు లేక ఆకాలమునందు. యే = ఏ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు. సంమర్శినః = విమర్శించుటకు సమర్థులును, యుక్తాః = (ఆయా కర్మలందు) ఆసక్తి గలవారలును. అయుక్తాః = ఇతర ప్రేరణము లేక స్వయముగా నాచరించుచున్నవారలును, అలూక్షాః = క్రూరస్వభావరహితులును. ధర్మకామాః = ధర్మాభిలాష గలవారలును. స్యుః = అగుచున్నారో, తే = వారు. తత్ర = ఆ విషయమునందు, యథా = ఏ విధముగా. వర్తేరన్ = ప్రవర్తించెదరో, తథా = ఆ ప్రకారముగా, తత్ర = ఆ విషయమునందు, వర్తేథాః = ప్రవర్తింపుము.

౮. అథ = ఇఁక, అభ్యాఖ్యాతేషు = దోషులని సంశయింపఁ బడుచున్న వారి విషయమయి, తత్ర = ఆదేశమునందు లేక ఆకాలమునందు, యే బ్రాహ్మణాః = ఏ బ్రాహ్మణులు, సంమర్శినః = విమర్శించుటకు తగినవారలును, యుక్తాః = (ఆయా కర్మలందు) ఆసక్తి గలవారలును, అయుక్తాః = ఇతర ప్రేరణము లేక స్వయముగా నాచరించుచున్నవారలును. అలూక్షాః = అక్రూర స్వభావులును. ధర్మకామాః = ధర్మాభిలాష గలవారలును, తే = వారు. తేషు = వారి విషయమై. యథా = ఏ విధముగా, వర్తేరన్ = ప్రవర్తించెదరో. తథా = ఆ విధముగా. తేషు = వారి విషయమై. (నీవు) వర్తేథాః = ప్రవర్తించుము.

౯. ఏషః = ఈ (పై చెప్పిన) విషయము, ఆదేశః = ఈశ్వరాజ్ఞ, ఏషః = ఈ విషయము. ఉపదేశః = ఉపదేశము. ఏషా = ఈ విషయము. వేదోపనిషత్ = వేదరహస్యము, ఏతత్ = ఇది, అనుశాసనం = ఈశ్వరవాక్యము, ఏవం ఉ = ఈ విధముగానే, ఉపాసితవ్యం = ఉపాసనము చేయందగినది. ఏవం ఉ = ఈ విధముగానే, ఏతత్ = ఇది. ఉపాస్యం = ఉపాసింపఁదగినది.

తా. ౧. ఆచార్యుఁడు తన శిష్యునకు ప్రథమమున వేదమునంతయు సమగ్రముగ బోధించి తదధ్యయనానంతరము తదర్థమును సంగ్రహముగ బోధించుచున్నాఁడు. (ఈ క్రిందఁ జెప్పఁబడునట్టి యుపదేశములన్నియు జ్ఞానోత్పత్తికంటె

ముందు అవశ్య మాచరింపఁదగినవి. ఇవి పురుషుని చిత్తమును సంస్కరించును. కర్మలచేత సంస్కరింపఁడిన హృదయము గలవానికి ఆత్మజ్ఞానము వెంటనే కలుగును. కావున ఈ చెప్పఁబోవు కర్మలు జ్ఞానోత్పత్తికి సాధకములు కావున తప్పక ఆచరింప వలయును. శాసించుచున్నాఁడు అని చెప్పుటచేత నీ యనుశాసనము నతిక్రమించు నెడల పాపము కలుగుననియు తాత్పర్యము. ఈ కర్మలు బ్రహ్మవిద్యకంటె పూర్వ ముపదేశింపఁబడినవి కావున విద్యోత్పత్తి యైనపిదప కర్మలవలన ఫలమేమియు లేదవి మున్ముందుఁ జెప్పఁబోవుచున్నాఁడు కావున పూర్వ మాచరించిన పాపమును పోఁగొట్టుచు జ్ఞానోత్పత్తిని కలుగఁజేయుటకే కర్మలు సమర్థము లగుచున్నవి. ''అవిద్యయా మృత్యుం తీర్త్వావిద్యయాఽమృత మశ్నుతే'' అను మంత్రము ఈ విషయమునే బోధించుచున్నది. కావున సత్యవచనము మున్నగు కర్మలు విద్యోత్పత్తికి సాధనములు కావున వానికి ఆనర్థక్యము లేదు. వేదాధ్యయనానంతరము శిష్యునకు ఆచార్యుఁ డీ యను శాసనమును చేయుటచేత 'వేదము చదివిన పిదప ధర్మజిజ్ఞాసను చక్కఁగా చేసియే గురుకులము నుండి స్నాతకుఁడై రావలయుననియు మంత్రార్థమును చక్కఁగా నెఱింగియే కర్మల నాచరింపవలయు ననియు' సిద్ధించుచున్నది. అని ఈ విధముగా శ్రీ శంకర భగవత్పాదులవారు భాష్యమునందు విమర్శించియున్నారు.

ఆ యనుశాసనము లేవియనఁగా—

౧. సత్యమును పలుకుము.

౨. ధర్మము నాచరింపుము.

౩. వేదాధ్యయనము నుండి ప్రమాదమును పొందకుము. అనఁగా పఠించిన వేదమును మఱచిపోవలదని తాత్పర్యము.

౪. ఇంతకాలము నీకు విద్యోపదేశ మొనర్చిన ఆచార్యునకు ప్రియమైన ధనము నొసంగి ప్రజాసంతానమునకు విచ్ఛిత్తిని కలుగఁజేయకుము. అనఁగా వివాహితుఁడవై సత్సంతానమును పొందుము. పుత్రోత్పత్తి కలుగనియెడల పుత్రకామేష్టి మున్నగు ప్రయత్నములను తదర్థముగా చేసి తీరవలయునని భావము.

౨—౫. పొరబాటుగానైనను అసత్యవాక్యమును పలుకకుము. (అనృతమును పలికినవాఁడు సమూలముగా నశించుననియు, అనృతవచనముకంటె పాతకము మఱొక్కటి లేదనియు అభిప్రాయముగల శ్రుతి:—'యోఽనృతం వదతి సమూలోవా ఏష పరిశుష్యతి;' (ప్రశ్నో. ౬.౧) స్మృతి:—'నసత్యాత్పరమోధర్మో నానృతాత్పాతకం

పరమ్' (భార. శాంతి. ౧౬౦. ౨౪.) అను శ్రుతి స్మృతులను శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు భాష్యమునం దుదహరించినారు.)

౬. ధర్మము నుండి ప్రమాదమును పొందవలదు. ధర్మ మనఁగా అవశ్య మాచరింపఁదగినది. దానినుండి ప్రమాదమును పొందుట యనఁగా అనుష్ఠానము లేక యుండుట. అట్టి ప్రమాదములేక నీకు విహితమయిన ధర్మము నాచరింపుము.

౭. కుశలమయిన కర్మము నుండి ప్రమాదమును పొందవలదు. (కుశల కర్మ యనఁగా దేహారోగ్య నిమిత్తము చేసికొనవలసిన ఔషధసేవనాది చికిత్సయని ఎఱుఁగవలయును.)

౮. భూతియనఁగా సంపద. అట్టి సంపత్సంపాదనమునకు ఆవశ్యకమగు న్యాయమైన వైదికములగు వాయవ్యేష్టి మున్నగు కర్మలను, లౌకికములగు సత్ప్రతిగ్రహములను ఆచరింపుము.

౯. స్వాధ్యాయ మనఁగా తాను చదువుట. ప్రవచన మనఁగా శిష్యులకు బోధించుట. ఈ రెండు పనులను నియమముగా చేయుము.

౧౦. దేవకార్యము లనఁగా యాగాదికర్మలు. పితృకర్మ లనఁగా శ్రాద్ధాది కర్మలు. ఈ దేవపితృకార్యములను నియమముగా చేయుము.

౩—౧౧. తల్లిని దేవతఁగా భావించి పూజింపుము.

౧౨. తండ్రిని దేవతఁగా భావించి పూజింపుము.

౧౩. ఆచార్యుఁ డనఁగా విద్యాగురువు. అతనిని దేవతఁగా భావించి పూజింపుము.

౧౪. అతిథిని దేవతఁగా భావించి పూజింపుము.

౪—౧౫. (ఈ ప్రకారము శ్రౌతస్మార్తకర్మలను గురించి ఆచరింపవలసిన నియమములను బోధించి ఆచార ప్రమాణమునందు గల విశేషవిధిని ఉపదేశించుచున్నాఁడు:—శిష్టులయిన వారియొక్క) నింద్యములు కాని పనులనే నీవు ఆచరింపుము. వారొక వేళ ప్రమాదముగా నింద్యములగువాని నాచరించియున్నను నీవు మాత్రము వా రొనర్చిన నింద్యకర్మల నాచరింపకుము.

౧౬. (వెనుక పూర్వులగు శిష్టు లాచరించిన సదాచారము నాచరించుచు దురాచారము నాచరింపవలదని చెప్పి ప్రకృతమునందు ఆచార్యుఁడై యున్న నేను చేయుచున్నట్టి కార్యము లన్నియు అనింద్యములే యని భావించి ఆచరింపవలదు. దీని యందును ప్రమాదముచేత కొన్ని నింద్యములయిన పను లుండవచ్చును. నీవు మాత్రము సదాచారమునే పరిగ్రహించి దురాచారమును విడువుము అని బోధించు

చున్నా(డు:—) ఆచార్యులమగు మా యొక్క కృత్యములలో నెయ్యవి వేదశాస్త్రము లకు విరుద్ధములు కావో అట్టి కృత్యములను మాత్రమే నీవు ఆచరింపుము. వేదశాస్త్ర ములకు విరుద్ధములగునవి మే మొనర్చినను వానిని నీవు ఆచరింపవలదు.

౩—౧౭ ఆచార్యు(డ నగు నాకంటె భిన్నులయిన యోగ్యులగు బ్రాహ్మ ణులు ఎవ్వరైనను వచ్చినయెడల వారికి ఆయాసము తీరునటుల ఆసనదానాది పరి చర్య నొనర్చి వారిని శక్తికొలది సత్కరింపుము. లేక అట్టివారలు ఏదేని శాస్త్రార్థము నొసంగుచున్న యెడల నీవు నిట్టూర్పునైనను వదలక వారు చెప్పుచున్న విషయము నందలి సారమును మాత్రము గ్రహింపుము. (నిట్టూర్పునైనను వదలవలదని చెప్పుటచేత అట్టి పెద్దలతో నేను(గూడ పండితు(డనని గర్వించి మీ శాస్త్రార్థమునందు ఇట్టి దోషమున్నదని వారితో దవాదింపకుము అనెడి బోధ చెప్పకయే బోధింప(బడిన దని భావము.)

౪—౧౮. శ్రద్ధతో దానము నివ్వవలయును. (సత్పాత్రమునందు దానము చేయుటయే ముఖ్యము. ఒకవేళ అపాత్రులగు వారలకు దాన మియ్యవలసి వచ్చుట ఒకప్పుడు తటస్థించినను తాను మాత్రము శ్రద్ధ కలిగియే అట్టివారలకున్నూ దానమివ్వ వలయును. ఈ విషయము సురేశ్వరాచార్యకృత తైత్తిరీయ భాష్య వార్తికము. శీక్షావల్ల్యధ్యాయము నందు శ్లో. ౭౭ ''శ్రద్ధయైవహిదాతవ్య మశ్రద్ధాభాజనేష్వపి'' అని చెప్ప(బడియున్నది.

౧౯. అశ్రద్ధతో దానము నాచరింప(గూడదు.

౨౦. తన విభవము ననుసరించి దానము చేయవలయును.

౨౧. లజ్జ కలిగి దానము చేయవలయును. (అన(గా తాను ఎక్కువ ధనము నొసంగుచున్నను నేను ఏమి యిచ్చుచున్నాను ఇంతకంటె ఎక్కువగా నివ్వలేక పోతినే అని సిగ్గుతో ఇవ్వవలయునని భావము.)

౨౨. పరలోక భయము కలిగి ఇవ్వవలయును.

౨౩. మిత్రులు మొదలగువారికి వివాహాది కార్యములందు చేయు సత్కారము సంవిత్తు. అట్టి సంవిత్ దాన మొనర్పవలయును.

౭—౨౪. ఈ ప్రకారము చరించుచున్న నీకు ఒకానొకప్పుడు శ్రౌతస్మార్త కర్మలయందు(గాని, లేక ఆచారము నందుగాని సంశయము కలిగినయెడల ఆ యా కర్మలను యథావిధిగా నాచరించుచున్నట్టియు, సూక్ష్మదర్శులును, ఒకరి బోధ లేకయే తామే స్వయముగ కర్మల నాచరించుచున్నవారలును, క్రూరస్వభావము లేనివారలును,

ధర్మాసక్తులును (ధర్మాసక్తు లనఁగా అతీంద్రియమైన ధర్మఫలమును మాత్రమే అపేక్షించినవారలు. కామాసక్తులయి లాభమును సన్మానమును అపేక్షించువారలు మాత్రము కారని భావము.) అగు బ్రాహ్మణులు ఆ కర్మలను ఏ విధముగా నాచరించెదరో వారే యాచారము నవలంబించెదరో నీవున్నూ అట్లే యాచరింపుము.

౮—౨౫. (పాపులని స్పష్టముగాఁ దెలిసినవారితోడ సంవ్యవహారము మున్నగునవి నిషిద్ధము లనుట శాస్త్రసిద్ధమే.) ఇఁక పాపులని స్పష్టముగాఁ దెలియక సందేహాస్పదులయిన పురుషుల విషయమై యుక్తులును, అయుక్తులును, అలూక్షులును, ధర్మకాములును అగు బ్రాహ్మణు లెట్లు చరించెదరో ఆ ప్రకారము చరింపుము.

౯. ఈ పైన చెప్పిన ౨౫ విషయములను ఆదేశములను భావింపుము. ఆదేశ మనఁగా విధి యని తాత్పర్యము. ఇది ఉపదేశము. ఉపదేశ మనఁగా శిష్యుఁడు పుత్త్రుఁడు మున్నగువారలకు ఆచార్యుఁడు తండ్రి మున్నగువారలు వారి శ్రేయస్సు కొఱకు బోధించెడి హితబోధ. ఇదియే వేదరహస్యము. ఇదియే ఈశ్వర వచనము- (ప్రప్రథమమున ''ఏష ఆదేశః'' అని చెప్పియుండుటచేత ఇచట ''అనుశాసన'' పదమునకే యర్థము గ్రహింపఁబడినది.) పైనఁ జెప్పిన వచనము లన్నియు ఈశ్వర వచనములు కావున అవి యన్నియు ఆచరింపఁదగినవియే యని మనస్సునందు దృఢముగా నమ్మి ఆచరింపవలయును. ఈ ప్రకారము వీని నాచరింపవలయును గాని ఆచరింపక యుండఁగూడదు.

''ఏవ ముపాసితవ్యం, ఏవముచైత దుపాస్యమ్'' రెండు పర్యాయములు చెప్పుట అవశ్య మాచరింపవలసిన విషయమని ఆదరార్థముగా గ్రహింపవలయును.

౧. అను....

౨. ఆత్మ...

౩. భా. వా....౧౬౧—౧౮౩.

**విద్యా కర్మ వివేకము:**—కర్మలే మోక్షమునకు సాధనభూతములు, జ్ఞానము మోక్షసాధనము కాదు, లేక కర్మ జ్ఞాన సముచ్చయము మోక్షహేతువు అనువారి మతమును ఖండించి జ్ఞానమే మోక్షహేతువని సిద్ధాంతీకరించుట:—

౧. కేవలము కర్మలవల్లనే మోక్షము లభించునా?

౨. లేక జ్ఞానముతో కూడిన కర్మలవలన మోక్షము లభించునా?

(ఇచట కర్మ ప్రధానము, జ్ఞానము అప్రధానము అని యెఱుంగునది.)

౩. విద్యాకర్మలు రెండింటిచేతను మోక్షము లభించునా?

(ఇచట విద్యయు [అనఁగా జ్ఞానము] కర్మయు సమ ప్రధానమని ఎఱుంగునది.

౪. కర్మతో కూడిన విద్యచేతనా?

(ఇచట జ్ఞానము ప్రధానము, కర్మ అప్రధానము అని యెఱుంగునది.)

౫. కేవలము జ్ఞానముచేతనా?

పూర్వపక్షము

౧. కర్మలవల్లనే మోక్షము సిద్ధించును. అనువారి యుక్తులు.)

కేవలము కర్మలచేతనే మోక్షము లభించును. ఏలయనఁగా సమస్త వేదార్థముల నెఱింగినవాఁడే కర్మాచరణమున కధికారి యగుచున్నాఁడు. అందులకు ప్రమాణము మనుస్మృతి:—౨. ౧౬౫.

శ్లో. 'వేదః కృత్స్నోఽధిగన్తవ్య స్సరహస్యో ద్విజన్మనా'

మఱియు వేదమునందు గల 'విద్వాన్ యజతే.' తై. సం. ౩-౨-౧-౧-౨. 'విద్వాన్ యాజయతి' మున్నగు వాక్యములు సైతము విద్వాంసుఁడే కర్మాధికారి యని పలుకుచున్నవి. కొందఱు వేదమంతయు కర్మార్థమే యని పలుకుచున్నారు. (ఇచట కొంద అనఁగా ప్రాభాకరులని తాత్పర్యము.) కర్మలచేత మోక్షము లభింపని యెడల వేదమంతయు అనర్థక మగును. (వేదము అనర్థక మగుట నీకును అనభిమతము కావున కర్మలచేతనే మోక్షము లభించునని పూర్వపక్షి యొక్క నిర్ణయము.)

సిద్ధాంతము

౧. కర్మ మోక్షసాధనము కాదు.

(కర్మ మోక్షసాధనము) కాదు. మోక్షము నిత్యము. నిత్యమయిన మోక్షమే మన కభిమతము. లోకమునందు కర్మచేత పుట్టినది అనిత్యమగుట సుప్రసిద్ధముగాఁ గనంబడుచున్నది. కర్మలచేతనే మోక్షము సిద్ధించునెడల మోక్షము అనిత్య మనుట నీకును అనభిమతమే గదా.

పూర్వపక్షము

ప్రకారాంతరముగా పూర్వపక్షమును ఆశంకించుకొని నిరాకరించుట.

ఒకఁడు కామ్య, నిషిద్ధకర్మలను చేయక కేవల నిత్యకర్మలను మాత్రము చేయుచుండును. ప్రారబ్ధకర్మము ఈ జన్మమునందు అనుభవముతో నశించిపోవును.

నిత్యకర్మాచరణమువలన (తదకరణమువలన కలుగునట్టి) ప్రత్యవాయము ఉత్పన్నము కాదు కావున జ్ఞానము లేకయే మోక్షము లభించును.

### సమాధానము

అట్లనరాదు. సంచిత కర్మజాత మంతయు ఈ జన్మమునందు అనుభవముతో నశించదు. (అనేక జన్మసంచితకర్మ యంతయు చేరి ఈ దేహము రాలేదు కావున) కర్మ శేషముకూడ నుండును. తత్కర్మానుభవ నిమిత్తము శరీరోత్పత్తి తప్పక కలుగవలసి యుండును. అని ఈ విషయమును పీఠిక యందే నిరాకరించి యున్నారము.

ఈ జన్మమునందు అనుభవింపఁగా మిగిలి కొద్దిగా కర్మము శేషించి యున్న యెడల) నిత్యకర్మాచరణమువలన ఆ కర్మము నశించును గదా యని కొందఱు తలఁచుట సరికాదు. ఏల యనఁగా నిత్యకర్మాచరణమువలన పాపకర్మము నశించును గాని పుణ్యకర్మము నశింపదు. పుణ్యకర్మానుభవార్థము మఱల జన్మము ఆవశ్యక మగును.

సమస్త వేదార్థ జ్ఞానము గలవానికే కర్మాధికారము అని వెనుక చెప్పిన విషయము సరిగాదు. (మోక్షసాధనభూత మగు) ఉపాసనము శ్రుతజ్ఞానముకంటె వేరయినది. కర్మలకు శ్రుతజ్ఞానము మాత్రముచేతనే అధికారి యగును. (శ్రుతజ్ఞాన మనఁగా గురుకులమునందు వేదార్థమును తెలిసికొనుట మాత్రమే యగును. కర్మాచరణమునకు ఉపాసన మక్కరలేదు.

ఉపాసనము మోక్షఫలకముగా శ్రుతులందు ప్రతిపాదితమయి యున్నది. శ్రుతులందు "శ్రోతవ్యః" అని వచించి అంతటితో నిలువక "మంతవ్యోనిదిధ్యాసితవ్యః" అని ఇతర ప్రయత్నములను చెప్పుటచేత (ఉపాసనము మోక్షసాధనమని శ్రుత్యను గృహీతము.)

మనననిదిధ్యాసనములు శ్రుతజ్ఞానభిన్నము లనుట సుప్రసిద్ధమే గదా. (కావున కేవల కర్మాచరణమువలన మోక్షము లభించుననుట నిరాకరింపఁబడినది.)

### ౨. కర్మము ప్రధానము, జ్ఞానము అప్రధానము అనువారి పూర్వపక్షము

ఇట్లయినయెడల (అనఁగా కర్మకార్య మగు మోక్షము అనిత్యమగు నెడల) విద్యాసమన్వితములగు కర్మలవలన మోక్షము సిద్ధించును. (విద్యా సమన్వితములగు కర్మలవలన జనించినది మాత్రము ఏల అనిత్యము కాకూడదు అని ఆశంకించుకొని సహకారి సామర్థ్యమువలన కార్యవైచిత్ర్యమును గనంబఱుచు నను విషయమును దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నాఁడు:—)

విద్యాసహితములగు కర్మలవలన కలిగిన కార్యము సహకార విశేషమువలన కర్మజన్యమయినను నిత్యము కావచ్చును. (అందులకు దృష్టాంతము.)

విషము, పెరుగు మున్నగు వస్తువులు మరణమును, జ్వరమును కలుగఁ జేయునట్టి స్వభావము గలవియే అయినను "మంత్రాభిమంత్రితమగు విషము మరణ రూపమగు తన కార్యమును ఆచరింపక పుష్టిరూపమగు విచిత్ర కార్యమును పలుపు చున్నది.

పెరుగును సమయవిశేషమునందు భక్షించినయెడల జ్వరమును కలుగఁజేయు స్వభావము గలది అయినను ఆ పెరుగునే బెల్లముతోడనో, చక్కెరతోడనో కలిపి భక్షించినయెడల తృప్తిని మాత్రము కలిగించుచున్నది.

ఇదేవిధముగా విద్యా సమన్వితములగు కర్మల వలన మోక్షము లభించును. (ఈ మోక్షము జ్ఞానసహిత కర్మారబ్ధ మయినను సహకారి సన్నిధాన వైచిత్ర్యము చేత నిత్యమే యగును.)

## ౨. పూర్వపక్షనిరాసనము

అట్లనరాదు. ఆరబ్ధమయినది అనిత్యము అను విషయము నిదివరకే చెప్పి యున్నారము.

"న చ పునరావర్తతే" (ఛాం. ౮. ౧౫. ౧) అని చెప్పఁబడియున్నది కనుక వచనముచేత "మోక్షము ఆరబ్ధమయినను నిత్యమే" అని చెప్పఁదలఁచితివేని అటుల చెప్పఁగూడదు. వచనము భూతార్థ జ్ఞాపకము కాని లేనిదానిని సృజించునది కాదు. నూరు మాటలు చెప్పినను నిత్యమగునది ఆరబ్ధము కాదు. ఆరబ్ధమయినది (ఘటాదికము నిత్యమగుఁ గాక యని నూరు వచనములు పలికినను) వినాశము లేకయుండదు.

దీనిచేత విద్య అప్రధానముగను, కర్మ ప్రధానముగను కలిసి మోక్షమును కలుగఁజేయును అను విషయము నిరాకరింపఁబడినది.

## 3. విద్యయు కర్మయు సమముగ సముచ్చయమయి మోక్షమును కలుగఁజేయును. (అనుపూర్వపక్షము)

వెనుక చెప్పిన విధముగా విద్యయు కర్మయు సమముగాఁ గలిసి మోక్షమును పుట్టించునను విషయము సైతము నిరాకరింపఁబడినది.

**పూర్వపక్షి:—**

"విద్యాకర్మలు మోక్ష ప్రతిబంధహేతు వగు అవిద్యను నివర్తింపఁజేయును" అని పూర్వపక్షి ఆశంకించుచున్నాఁడు.

౩. పూర్వపక్ష నిరాసము:—అట్లు కాదు. (అవిద్యానివృత్తికి విద్య యావశ్యకము గాని కర్మము అక్కఱలేదు.) కర్మకు ఫలాంతరము గనంబడుచున్నది. ఉత్పత్తి, సంస్కారము, వికారము, ఆప్తి ఇవి కర్మఫలములు. మోక్షము ఉత్పత్త్యాది విపరీతము.

పూర్వపక్షము

శ్రు. 'సూర్యద్వారేణతే విరజాః ప్రయాన్తి.' ముం. ఉ. ౨. ౧౧.

శ్రు. 'తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి.' ఛాం. ఉ. ౮. ౬. ౬.

ఇవి మొదలగు శ్రుతులవలన మోక్షము సైతము 'ఆప్యము' (పొందఁబడునది) అని సిద్ధించుచున్నది గదా.

సమాధానము

కాదు. మోక్షము సర్వగతము. గంతకంటె భిన్నముగా లేదు. బ్రహ్మము ఆకాశాదికమునకు కారణమగుటచేత సర్వగతమగుచున్నది. జ్ఞాను లందఱు బ్రహ్మముకంటె వ్యతిరిక్తులు కారు కావున మోక్షము ప్రాప్యము కాదు.

ప్రాప్య మెప్పుడును గంతకు విభిన్నమయిన ప్రదేశమనుట లోక ప్రసిద్ధము. ఏది ఎవనికంటె భిన్నము కాదో దానిని వాఁడు పొందుటలేదు. బ్రహ్మము గంతకంటె భిన్నమయినది కాదనుటకు శ్రుతి స్మృతిప్రమాణములు:—

శ్రు. 'త త్సృష్ట్వా తదేవానుప్రావిశత్.' తై. ఉ. ౨. ౬.

స్మృతి. 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత.'

భగవద్గీత. ౧౩. ౨.

మున్నగు శ్రుతిస్మృతులు అనేకములు గలవు.

పూర్వపక్షము

మీరు చెప్పిన సమాధానము గత్యైశ్వర్యశ్రుతులకు విరోధముగా నున్నది.

౧. గతిశ్రుతి:—వెనుక చెప్పఁబడిన "సూర్యద్వారేణతే విరజాః ప్రయాంతి" (ముండ. ౨. ౧౧.) ఇత్యాదికము.

౨. ఐశ్వర్యశ్రుతి:—౧. స ఏకధా భవతి త్రిధా భవతి.

ఛాం. ఉ. ౭. ౨౬. ౨.

౨. స యది పితృలోకకామీ భవతి.

ఛాం. ఉ. ౮. ౨. ౧.

౩. స్త్రీభి ర్వా యానై ర్వా. ఛాం. ఉ. ౮. ౧౨. ౩.

అనుచోట చెప్పఁబడిన అర్థమును విచారించితిమేని బ్రహ్మము గంతవ్య మనియే సిద్ధించుచున్నది. (మీరు చెప్పిన సమాధానము శ్రుతివిరోధము అని పూర్వపక్షి సప్రమాణముగ పలికినాఁడు.)

తత్సమాధానము

మీరు గనంబఱచిన శ్రుతివచనములు కార్యబ్రహ్మపరములు. కార్య బ్రహ్మయందు (అనఁగా సగుణుఁడగు హిరణ్యగర్భునియందు) ఫలా మున్నగునవన్నియు ప్రాప్తించును.

(ఈ విషయము ఛాందోగ్యము ౮-వ అధ్యాయము రెండవ ఖండయందు సమగ్రముగ చెప్పఁబడినది. "స యది పితృలోకకామీ భవతి సంకల్పా దేవాస్య పితర స్సము త్తిష్ఠంతి తేన పితృలోకేన సంపన్నో మహీయతే" అని ఉపక్రమించి "యం యమ న్తమభికామో భవతి యం కామం కామయతే సోఽస్య సంకల్పా దేవ సము త్తిష్ఠతి తేన సంపన్నో మహీయతే" అని ఖండ చివరవఱకు విపులముగ చెప్పఁబడియున్నది) కాని,

సమాధానము

కాని

౧. ఏక మేవాద్వితీయం బ్రహ్మ. ఛాం. ఉ. ౬. ౨. ౧.

౨. యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా. ఛాం. ఉ. ౭. ౨౪. ౧.

౩. యత్రత్వస్య సర్వ మాత్మైవాభూ త్త త్కేన కం పశ్యేత్. బృ. ఉ. ౪. ౫. ౧౫.

ఈ శ్రుతులవలన గత్యైశ్వర్యశ్రుతులు కార్యబ్రహ్మపరములు కాని కారణ బ్రహ్మపరములు కావని సిద్ధించును.

విద్యాకర్మలకు విరోధము కావున విద్యాకర్మ సమసముచ్చయము పైతము పొసఁగదు. మఱియు విద్య, కర్తృకర్మాదికారకశూన్యము, కర్మమన్ననో కర్తృకర్మాదికారక సాధ్యము, ఒకే వస్తువు వాస్తవముగా కర్తృకర్మాదికము కలిగియున్న దనియు, కర్తృకర్మాదిశూన్యమనియు ద్వివిధముగా నున్నదనుట న్యాయము కాజాలదు గదా. ఇందేదియో ఒకటి మిథ్యయయి తీరవలయును.

ఏదియో యొకటి మిథ్యయగు యుండునను విషయము నంగీకరించి నపుడు స్వాభావికాజ్ఞానమునకు విషయభూతమగు ద్వైతమే మిథ్యయనుట యుక్తము.

ఇందులకు శ్రుతిప్రమాణములు:—

౧. యత్రహి ద్వైత మివ భవతి. (బృ. ఉ. ४. ౧౫. ౧౫.)

౨. మృత్యోః స్స మృత్యు మాప్నోతి. (కఠ. ఉ. ౨. ౧౦.)

౩. అథ యత్రాన్య త్పశ్యతి తదల్పమ్. (ఛాం. ఉ. ౭. ౨४. ౧.)

४. అన్యో ఽసౌ వన్యో ఽహ మస్మీతి న స వేద.

(బృ. ఉ. ౧. ४. ౧౦.)

౫. ఉదర మన్తరం కురుతే, అథ తస్య భయం భవతి.

(తై. ఉ. ౨. ౭.)

(అర్థ. ౧. ఏయవిద్యాసమయమునందు మిథ్యయగు జగము భేదముగా గనంబడునో అపుడు 'ఒకఁడు ఒకనిని చూచును' అని అచటి శ్రుతికి అర్థము. ద్వైత శబ్దముచేత జగత్తు గ్రహింపఁబడును. ఇవశబ్దము మిథ్యావాచకము. సాదృశ్యవాచకము గాదు.)

౨. (బ్రహ్మమునందు మిథ్యాభూతమగు) జగత్తును కల్పించువాఁడు మృత్యువువల్ల నుండి మృత్యువును పొందును. (అనఁగా అనర్థపరంపరలు వానికి కలుగునని చెప్పఁబడి యున్నది కావున ద్వైతదర్శనము న్యాయము కాదనుట.)

౩. ('భూమ' యనుదాని లక్షణమును చెప్పి పిదప తద్విపరీతముగ ఎచట మఱొకదానిని గాంచునో అది అల్పము.

४. ఎవఁడు పరమాత్మ వేఱు, నేను వేఱు అని భావించునో వాఁడు పరమాత్మ నెఱుంగనివాఁడు.

౫. ఆత్మయందు కొంచెముగనైనను భేదబుద్ధిని గాంచునేని వానికి భయము కలుగును.)

(ఇదివఱకు ద్వైతమునకు నిందఁ జెప్పఁబడినది. ఇఁక ఏకత్వము యథార్థమని బోధించు శ్రుతుల నుదహరించుచున్నారము:—)

౧. ఏకధైవానుద్రష్టవ్యమ్. (బృ. ఉ. ४. ४. ౨౦.)

౨. ఏకమేవాద్వితీయమ్. (ఛాం. ఉ. ౬. ౨. ౧.)

౩. బ్రహ్మైవేదగ్ం సర్వమ్. (నృ. ఉ. తా. ఉ. ౭.)

४. ఆత్మైవేదగ్ం సర్వమ్. (ఛాం. ఉ. ౭. ౨౫. ౨.)

అర్థ. ౧. ఒక్కటియే యని చూచునది.

౨. ఒక్కటియేగాని రెండవది లేదు.

౩. ఇదంతయు బ్రహ్మమే.

౪. ఇదంతయు ఆత్మయే.

ఇట్టి యర్థముగల శ్రుతు లనేకములు గలవు.

మఱియు కర్మ, కర్తృ, సంప్రదానాది కారక భేదబుద్ధి యున్నఁగాని కర్మ సిద్ధించఁజాలదు. విద్యావిషయమునందు అన్యత్వమును చూచుట తగదను వచనములు వేలకొలఁది గనంబడుచున్నవి. కావున విద్యాకర్మలకు (అనఁగా జ్ఞానమునకు కర్మాచరణమునకు) విరోధము అని సుస్పష్టము కావున విద్యాకర్మసముచ్చయము వలన మోక్షము సిద్ధించదు. కనుక విద్యాకర్మలు కలసి మోక్షమును కలుగఁజేయు ననుట అనుపపన్నము.

## మఱొక సందేహము

ద్వైతము మిథ్య కావున ద్వైత శ్రుతులు ప్రమాణము కావు అవి యందు వేని 'కర్మలు ఆచరణీయములు' అని విధించిన శ్రుతులకు విరోధము గదా.

(ఎట్లనఁగా) సర్పాదికము భ్రాంతియని ఎఱుంగుటచేత సర్పభ్రాంతి జ్ఞానమును మిథ్యగా నొనర్చి రజ్జ్వాది విషయజ్ఞాన మే విధముగా గలిగినదో ఆట్లే, కర్తృ కర్మ సంప్రదానాది విశేషమును మిథ్యగా నెఱింగి ఆత్మైకత్వ విజ్ఞానమునే శ్రుతులు బోధించుచున్న వనుసెడల కర్మవిధిశ్రుతులు నిర్విషయము లగుచున్నవి. కర్మలు శ్రుతులందు విధింపఁబడి యున్నవి. శ్రుతులు ప్రమాణములు కావున తచ్ఛ్రుతి విరోధము న్యాయము కాదు.

## సమాధానము

(కర్మబోధక) శ్రుతులు పురుషార్థ (మార్గ)ము నుపదేశించును. విద్యోపదేశ శ్రుతి సంసారం నుండి పురుషుని విముక్తుని చేయవలయునని (తలంచి) సంసారమునకు హేతుభూతమగు అవిద్యవల్ల నుండి జ్ఞానముచేత నివృత్తుని చేయును. కావున కర్మప్రకాశక, జ్ఞానప్రకాశక శ్రుతులకు విరోధ మేమియు లేదు.

## మఱొక సందేహము

విద్యాశ్రుతి కర్మశ్రుతులకు విరోధము లేదని సాధించినను కర్తృ, కర్మ సంప్రదానాది కారకసద్భావమును ప్రతిపాదించునట్టి శ్రుతి (ద్వైతమును అంగీకరించనట్టి విద్యాశ్రుతికి) విరోధమగుచున్నది గదా.

## సమాధానము

కర్మశ్రుతి భ్రాంతిసిద్ధమగు కర్మ కర్త్రాదికారకము నంగీకరించి ఉపాత్తదురిత క్షయార్థము ముముక్షువులకు నిత్యకర్మలను, ఫలార్థులకు కామ్యకర్మలను విధించు చున్నది కాని కర్మకర్త్రాది ద్వైతబుద్ధి సత్యమని బోధించుటకు గాను చెప్పఁబడలేదు.

పాపప్రతిబంధ మున్న వానికి విద్యోత్పత్తి గలుగదు. ఇయ్యది శాస్త్ర ప్రసిద్ధము. తత్పాపము నశించిన జ్ఞానోత్పత్తి యగును. జ్ఞానోత్పత్తి వలన అవిద్య నశించును. అవిద్యానాశనమువలన సంసార నివృత్తి కలుగును.

## ప్రకారాంతర సమాధానము

(ఇదివరకు ఆత్మ ఏకమగుటచేతను, అనేకత్వమున్నఁగాని కర్మలు అనుష్ఠేయములు కావు కనుకను, విద్యాకర్మ సముచ్చయము నిరాకరింపఁబడినది. ఇప్పుడు ప్రకారాంతరముగా విద్యా కర్మలకు విరోధమును గనంబఱుచుచున్నాఁడు:—)

ఆత్మకాని దేహమునందు ఆత్మత్వమును గాంచి స్వవ్యతిరిక్తకములగు కామ్య పదార్థములు గలవని భావించువానికి తద్విషయకమగు కామము కలుగును. కామియై కర్మల నాచరించును, చేయఁబడిన కర్మఫలము ననుభవించుటకు శరీరమును పొందును. (ఇటుల) సంసారము (సిద్ధించును). (ఇది కామి యగువాని విషయము.)

(జ్ఞానికి) దేహాదికమునందు ఆత్మబుద్ధి లేక ఆత్మైకత్వమునే గాంచుచుండు వానికి కోరఁదగిన విషయాంతరము లేదు. కావున కామమే లేదు. ఆత్మయందు అన్యత్వ (భ్రాంతి) నివృత్తి యగుటచేత కామమే కలుగదు కావున ఆత్మావస్థానమే మోక్షము.

ఇందువలనను విద్యాకర్మలు కలసి మోక్షమును కలుగఁజేయు ననుటయు న్యాయము కాదు.

## ప్రకారాంతర పూర్వపక్షము

౪. జ్ఞానము ప్రధానము, కర్మము అప్రధానము. ఇటుల మోక్షమును కలుగఁజేయును.

## తన్నిరసనము

(కర్మయు, జ్ఞానము సమప్రధానమను పక్షమునందు పరస్పరము విరోధ మగుటచేత తగదని యెటుల నిర్ణయింపఁబడినదో అట్లే జ్ఞానము ప్రధానము, కర్మ

పహకారము అను పక్షము సైతము) విరోధము అగుటచేత జ్ఞానము మోక్షము నిమిత్తము కర్మల నపేక్షింపదు.

నిత్యకర్మలు అనేక జన్మసంచితదురితములను, ప్రతిబంధకములను నాశన మొనర్చి జ్ఞానోత్పత్తిని కలుగఁజేయుటకు హేతుభూతములు మాత్రమగును. అందు లకే ఈ వేదాంత శాస్త్రప్రకరణమునందు కర్మలు చెప్పఁబడినవను విషయమును మే మిదివఱకు చెప్పియుంటిమి. ఈ విధముగా చెప్పుటచేత కర్మవిధి శ్రుతులకు విరోధము లేదు. (అనఁగా శ్రుతులందు విధింపఁబడిన కర్మాచరణమువలన ఉపాత్త దురిత ప్రతిబంధకములు నశించి జ్ఞానోత్పత్తి కలుగుననియు, జ్ఞానమువలన మోక్షము కలుగుననియు, మోక్షహేతుభూతమగు జ్ఞానమునకు ప్రతిబంధకమగు పాపమును నశింపఁజేయు నిమిత్తము కర్మలు విధింపఁబడినవనియు, సమన్వయించుకొనుటవలన కర్మవిద్యాశ్రుతులకు విరోధమే లేదు )

## జ్ఞానముచేతనే మోక్షమను సిద్ధాంతము

౫. (అందువలన మోక్షమునందు కేవల కర్మలుగాని విద్యాకర్మసముచ్చయము గాని నిషేధింపఁబడినది కావున ననియర్థము.) కేవలము జ్ఞానముచేతనే మోక్షము సిద్ధించును.

## మఱొక సందేహము

కర్మలు విద్యోత్పత్తియందు హేతుభూతములగునెడల ఆశ్రమాంతరములు (అనఁగా నైష్ఠికబ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు) అనావశ్యకములగును. విద్యోత్పత్తికి కర్మలేగదా నిమిత్తము. కర్మలు గృహస్థాశ్రమికే విధింపఁబడినవి కావున ఒక గృహస్థాశ్రమమే గ్రాహ్యము. 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి' మున్నగు శ్రుతులు (ఆయువున్నంతవఱకు అగ్నిహోత్రము నొనర్పుము అని చెప్పు చున్నవి కావున గృహస్థాశ్రమమే జీవిత ముండునంతదనుక గ్రహింపవలయునను టకు) అనుకూలతరములగును.

## తత్సమాధానము

అట్లు కాదు. కర్మ లెన్నో విధములు. అగ్నిహోత్రాదికములు మాత్రమే కర్మలు కాదు. ఇతరాశ్రమములకు విధించిన బ్రహ్మచర్యము, తపస్సు, సత్యవచనము, శమము, దమము, అహింస మున్నగు అసంకీర్ణములగు కర్మము లెన్నో విద్యో త్పత్తికి ప్రధానసాధనములయి యున్నవి. ధ్యాన, ధారణ, సమాధిలక్షణములగు

కర్మలు సైతము విద్యోత్పత్తికి ప్రధానసాధనములు. 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' అని ముమ్ముందు ఈ యుపనిషత్తునందే చెప్పఁబడగలవు. పూర్వజన్మకృత పుణ్య కర్మ (పరిపాక)మువలన గార్హస్థ్యాశ్రమముకంటె ముందే జ్ఞానము కలుగవచ్చును. గార్హస్థ్యాశ్రమము కర్మాచరణార్థమే కావున కర్మసాధ్య మగు జ్ఞానమున్నవానికి గార్హస్థ్యాశ్రమప్రాప్తి నిష్ఫలము.

(మఱియు) పుత్త్రులు (కర్మ) మున్నగునవి లోకార్థము. "సోఽయం మనుష్యలోకః పుత్రేణైవ జయ్యః నాన్యేన కర్మణా కర్మణా పితృలోకః" బృ. ఉ. ౧-౫-౧౬. అని శ్రుతి. ఇట్టి లోకములనుండి నివృత్తకాముఁడై నిత్య సిద్ధమగు ఆత్మను అనుసంధానము చేసికొనుచు కర్మయందు ప్రయోజనము లేదని తలంచువానికి కర్మలనుండి నివృత్తియే కలుగును.

శ్రు. 'ప్రవ్రజిష్య న్వాఅరేఽహ మస్మాత్ స్థానా దస్మి.' బృ. ఉ. ౪-౫-౨. అని శ్రుతి ఈ విషయమునే బోధించుచున్నది.

(శ్రుత్యర్థము. అరే = ఓ మైత్రేయీ! అహం = నేను, అస్మాత్ = ఈ, స్థానాత్ = గృహస్థాశ్రమము నుండి, ప్రవ్రజిష్యన్వా = పారివ్రజ్యాశ్రమమును స్వీక రించు అభిప్రాయము గలవాఁడనై, అస్మి = అగుచున్నాఁడను. అని విద్వాంసుఁడగు యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయితో చెప్పెను.)

## మఱొక సందేహము

అగ్నిహోత్రాది కర్మలను గూర్చి శ్రుతి ప్రయత్నపూర్వకముగ బోధించి యున్నది. కర్మాచరణమునం దెంతయో ఆయాసము గలదు. అగ్నిహోత్రాది కర్మల నాచరించుటకు అనేక సాధనములు ఆవశ్యకములు. బ్రహ్మచర్యము, తపస్సు, అహింస మున్నగు ఇతరాశ్రమధర్మము లనునవి గృహస్థులకును ఒక విధముగ నుండియే యున్నవి. ఇతరాశ్రమ కర్మలకు ఋత్విగాదులను వ్రీహ్యాజ్యాది ద్రవ్యము లను అపేక్ష లేదు. కావున (బహ్వాయాస సాధ్యమగు) గృహస్థాశ్రమమునకు (అల్పాయాససాధ్యములగు ఇతరాశ్రమములకు) సమాన వికల్పము చెప్పుట సరిగాదు.

## సమాధానము

అట్లనరాదు. జన్మాంతరకృత సుకృతపరిపాకమువలన (అట్టి జ్ఞానము సిద్ధించును.) కర్మల విషయమై శ్రుతి అత్యధిక ప్రయత్నము కలిగియుండుట తప్పు కాదు. జన్మాంతరమునందు చేయఁబడిన అగ్నిహోత్రాదిలక్షణరూప (మగు కర్మ పరి

పాక) ము బ్రహ్మచర్యాది లక్షణరూప(మగు కర్మపరిపాక)ము విద్యోత్పత్తికి హేతు భూత మగుచున్నది.

ఏలయనఁగా:—కొందఱు పుట్టుక నుండియే విరక్తి కలిగియున్నారు.

కొందఱు కర్మల నాచరించుచున్నను విరక్తి లేనివారలయి (మీఁదు మిక్కిలి) జ్ఞానమును ద్వేషించుచున్నారు.

కావున జన్మాంతరకృత పుణ్యకర్మ పరిపాకమువలన (ప్రతిబంధకరూప మగు దురితము నశించుటచేత) విరక్తులయినవారలకు (కర్మల నాచరించవలసిన గార్హస్థ్యాశ్రమముకంటె భిన్నమయిన) సన్న్యాసాశ్రమప్రాప్తియే తగియున్నది.

పుత్ర (ప్రాప్తి), స్వర్గ (ప్రాప్తి), బ్రహ్మవర్చస (ప్రాప్తి) మున్నగు ఫలములు అసంఖ్యాకములగుటచేతను, అట్టి ఫలములమ గూర్చి పురుషులకు కోరికలు పైతము మిక్కుటమగుటచేతను అట్టి ఫలములను పొందింపఁజేయుటకయి శ్రుతి కర్మలవిషయమై ఎక్కువ ప్రయత్నమునే చేయుట తగియున్నది. అభిమతఫలములి యసంఖ్యేయత పిద్ధమయి యుండుటచేత "ఇది నాకు కావలయును. ఇది నాకు కావలయును" అని తత్సాధనానుష్ఠానము పైతను గృహస్థాశ్రమమున నుండియే తీరును. విద్యకు కర్మాచరణము ఉపాయభూతము కావున తప్పక యత్నాతిశయము ఆవశ్యకమే. "ఉపాయమునందు అధిక యత్న మావశ్యకము కాని ఉపేయమునందు గాదు."

## మఱొక సందేహము

జ్ఞానమునకు (పూర్వార్జితదురితరూప ప్రతిబంధక నివృత్తిద్వారా) కర్మాచరణము హేతువగుటచేత యత్నాంతరము వ్యర్థము కావున కర్మాచరణముచేతనే పూర్వజన్మార్జిత దురితరూప ప్రతిబంధనివృత్తివలన జ్ఞాన ముత్పన్నమగును. కర్మలకంటె వేఱుగా ఉపనిషచ్ఛ్రవణమనననిదిధ్యాసనాదికము అనావశ్యకము.

## తత్సమాధానము

అట్లనరాదు. అట్టి నియమ మెచ్చటను లేదు. ప్రతిబంధభూతమగు దురితము నశించుటచేతనే జ్ఞానము కలుగును. 'ఈశ్వరానుగ్రహభూత ఉపనిషచ్ఛ్రవణాదికము చేతను, తపోధ్యానాదికముచేతను జ్ఞానము కలుగదు' అను నియమ మెచ్చటను లేదు. (మఱియు) అహింసా బ్రహ్మచర్యాదికము విద్యకు అంతరంగసాధనభూతమయినను సాక్షాత్కారణ మగుటచేత ఉపనిషచ్ఛ్రవణమనన నిదిధ్యాసాదికము (పైవానికంటె) అత్యావశ్యకమయి యున్నది. కావున (అనఁగా శాస్త్రవిహిత మగుటచేతను బహిరంగ

సాధన భూతములగు అగ్నిహోత్రాదికముకంటె ఉపనిషచ్ఛ్రవణమననాదికము జ్ఞానము వకు సాక్షాత్సాధన మగుటచేతను అని భావము.) ఆశ్రమాంతరములు పైతము సిద్ధించుచున్నవి. సర్వాశ్రమములకు బ్రహ్మవిద్యయందు అధికారము గలదు.

మోక్షము కేవల జ్ఞానమువల్లనే సిద్ధించును. అను విషయము సిద్ధాంతితము.

వివరణము:—శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు మోక్షము కర్మలచేత సిద్ధించునా? లేక జ్ఞానముచేత సిద్ధించునా? యని ఇచట చాలవఱకు విమర్శించి యున్నారు. కర్మలచేతనా? జ్ఞానసహితకర్మలచేతనా? కర్మ జ్ఞానముల రెంటిచేతనా? కర్మసహిత జ్ఞానముచేతనా? లేక జ్ఞానముచేతనా? యని ప్రశ్నములు వైచికొని చివరకు జ్ఞానముచేతనే మోక్షము లభించునని నిర్ణయించిరి. వీనిలో ప్రథమ ద్వితీయ పక్షముల గుఱించి పీఠికయందు వివరించియున్నారు. తద్వివరణ మచట వ్రాయఁబడి యున్నది. ఇపుడు విద్యాకర్మ సముచ్చయమును గుఱించి వివరింపఁబడు చున్నది:— విద్యయు కర్మయు కలసి అవిద్యను నశింపఁజేయునని పూర్వపక్షి పలుకఁగా అవిద్యానాశనమునకు విద్య యావశ్యకముగాని కర్మ మాత్రము కాదు. కర్మ యవిద్యానివర్తనము కాదు. కర్మఫలములు, ఉత్పత్తి, సంస్కారము, వికారము, ఆప్తి అనునవి యగుచున్నవికాని అవిద్యానివర్తకము మాత్రము కాదు.

౧. కర్మవలన పురోడాశము మున్నగునవి ఉత్పత్తి యగుచున్నవి.

౨. కర్మవలన వ్రీహి మున్నగునవి సంస్కరింపఁబడుచున్నవి.

౩. కర్మవలన సోమలతనుండి తద్వికారమగు రసము ఏర్పడుచున్నది.

౪. కర్మవలన పయస్సు ప్రాప్తమగుచున్నది.

ఇవియే కర్మఫలములు.

## పూర్వపక్షము

సూర్యద్వారముగ నిష్పాపులయి బయలువెడలి పోవుచున్నారు. అని శ్రుతి గలదు. కావున బ్రహ్మము పైతము పైని చెప్పిన ఉత్పత్త్యాది చతుష్టయములో ఆప్యమగుచున్నది.

## సమాధానము

బ్రహ్మము సర్వగతము కావున గంతకంటె యభిన్నముగ నున్నది కావునను ప్రాప్యము కాదు.

## పూర్వపక్షము

ఆయా ఉపనిషత్తులందు 'సూర్యద్వారముగా పోవుదురు.' మున్నగు వాక్యములు, స్త్రీలతోడను యానములతోడను కలసియుందురు అను గత్యైశ్వర్య శ్రుతులును మీరు చెప్పెడి యంశము విరుద్ధముగదా.

## సమాధానము

ఆ వాక్యములు కార్యబ్రహ్మపరములు. కార్యబ్రహ్మ మనఁగా హిరణ్యగర్భుఁడు. సత్యలోకవాసి. సగుణబ్రహ్మోపాసకులగువారలు సత్యలోకస్థ కార్యబ్రహ్మమును పొందెదరని చెప్పిన వాక్యముగాని నిర్గుణబ్రహ్మోపాసకులగువారలు పరబ్రహ్మమును పొందెదరని చెప్పెడి వాక్యము మాత్రము కాదు. స్త్రీలు, వాహనములు మున్నగు విషయములు కార్యబ్రహ్మపరముగా సమన్వయ మొనర్చిన ఇచట న్యాయముగా నుండునుగాని లేనియెడల యుక్తమని తోఁచవుగదా.

---

## ౧౨. ద్వాదశోఽనువాకః

మం. ౧ శం నో మిత్రశ్శం వరుణః । శం నో భవ త్వర్యమా ।
శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః ॥
౨ నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వ మేవ ప్ర
త్యక్షం బ్రహ్మాసి । త్వాం మేవ ప్రత్యక్షం బ్రహ్మావాది
షమ్ । ఋతమవాదిషమ్ । సత్త్యమవాదిషమ్ । తన్మా
మావీత్ । తద్వక్తారమావీత్ । ఆవీన్మామ్ । ఆవీద్వక్తా
రమ్ । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥
సత్యమవాదిషం పంచచ ॥౧౨॥

టీక. ౧. మిత్రః = మిత్రుఁడు (ప్రాణవృత్తికిని పగటికి అభిమాని యగు దేవత), నః = మాకు, శం = సుఖమును (కలుగఁజేయువాఁడు అగుఁగాక). వరుణః = వరుణుఁడు (అపానవృత్తికిని రాత్రికిని అభిమానియగు దేవత), శం = సుఖమును (కలుగఁజేయువాఁడు అగుఁగాక.) అర్యమా = అర్యముఁడు (సూర్యమండలమునకును నేత్రములకును అభిమానియగు దేవత), నః = మాకు, శం = సుఖమును (కలుగఁజేయువాఁడు), భవతు = అగుఁగాక. ఇంద్రః = ఇంద్రుఁడు (బలాభిమానియగు దేవత), నః = మాకు, శం = సుఖమును (కలుగఁజేయువాఁడు అగుఁగాక). బృహస్పతిః = బృహస్పతి (వాక్కునకును బుద్ధికిని అభిమానియగుదేవత సుఖకరుఁడు అగుఁగాక). ఉరుక్రమః = త్రివిక్రమావతారమునందు విపులమయిన పాదక్రమణముగల, విష్ణుః = విష్ణువు (పాదాభిమానియగు దేవత), నః = మాకు, శం = సుఖమును (కలుగఁజేయువాఁడు).



౨. బ్రహ్మణే = వాయుస్వరూపునికొఱకు, నమః = నమస్కారము, వాయో = ఓ వాయూ, తే = నీకొఱకు, నమః = నమస్కారము, త్వం ఏవ = నీవే, ప్రత్యక్షం = ప్రత్యక్షమయిన, బ్రహ్మ అసి = బ్రహ్మము అగుచున్నాఁడవు, త్వాం ఏవ = నిన్నే, ప్రత్యక్షం = ప్రత్యక్షముగ, బ్రహ్మ = బ్రహ్మము అని, అవాదిషం = పలికితిని. ఋతం = ఋతముగా (మనఃపూర్వకముగా), అవాదిషం = పలికితిని. సత్యం = సత్యముగా, అవాదిషం = పలికితిని. తత్ = అందువలన, మాం = నన్ను, ఆవీత్ = రక్షించెను. వక్తారం = వక్తయగు ఆచార్యుని, ఆవీత్ = రక్షించెను. మాం = నన్ను, ఆవీత్ = రక్షించెను. వక్తారం = వక్తయగు ఆచార్యుని, ఆవీత్ = రక్షించెను. ఓం శాంతిః శాంతిః శాంతిః = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయము ఉపశమించుఁగాక.



తా. ప్రథమానువాకమునందు విపులముగ తాత్పర్యము వ్రాయఁబడి యున్నది. అచట చూడవలయును. అచట లేనివిశేషముల నిచట సంగ్రహముగ తెలిపెదము.

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి" అని భవిష్యదర్థకమగు "వదిష్యామి" అను లకారము ప్రథమానువాకమునం దుండఁగా నిచట "త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్" అని అందులకు భిన్నముగ భూతకాలికములగు లకారములే ఇచట శాంతియందు చెప్పఁబడి యున్నవి. దీనివలన ఇచట తాత్పర్య మీ విధముగా నగును:—

ఓ బ్రహ్మస్వరూపుఁడవగు వాయూ! నిన్నే నేను ప్రత్యక్షబ్రహ్మము అని తలంచి కొనియాడితిని. (నా స్తోత్రముచేత సంతుష్టుఁడవైన నీవు) నన్ను నా యాచా

ర్యని సంరక్షించితివి అని తనకు బ్రహ్మవిద్యాసమయమునందు విఘ్నములు కలుగకుండఁ జేసినందులకు కృతజ్ఞతాపూర్వకముగ పరమేశ్వరుని పరామర్శము నిచట ముముక్షువు చేయుచున్నాఁడని భావించునది.

ప్రథమానువాకమునకు టీకయు, తాత్పర్యమును వ్రాయునపుడు కొన్ని విషయములను వివరించియున్నాఁడను. కావున అచ్చటనే వివరమును గూర్చి చూడవలయును.

౧. అను....

౨. ఆత్మ ....

౩. భా. వా.... ౧౯౪-౧౯౬.



శ్రీమదాచార్యులవారు ఈ శాంతిపాఠమును అనుసరించియే ముందు చెప్పఁబోవునట్టి "సహనావవతు" అను శాంతిమంత్రమును పఠించి వెంటనే భాష్యమును లిఖించియున్నారు. ఆంధ్రసంప్రదాయపాఠమునందు అట్టిపాఠము లేకపోవుటచేత నేను ఇచట "సహనావవతు" అనెడి శాంతిపాఠమును లిఖించి తద్వివరణమును ముద్రించలేదు. బ్రహ్మవల్లియొక్క ఆరంభమునందు ఆశాంతిమంత్రమును పఠించి తద్వివరణమును వివరించగలను.

ఉత్తర శాంతిపాఠము

మం. శం నో మిత్ర శ్శం వరుణః । శం నో భవత్వర్యమా ।
శం న ఇంద్రో బృహస్పతిః । శం నో విష్ణు రురుక్రమః ।
నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వ మేవ ప్ర
త్యక్షం బ్రహ్మసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాది
షమ్ । ఋతమవాదిషమ్ । సత్యమవాదిషమ్ । తన్మా
మావీత్ । తద్వక్తారమావీత్ । ఆవీన్మామ్ । ఆవీద్వక్తా
రమ్ ॥ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

(శంన శ్శీక్షాగ్ం సహ నౌ యశ్ఛన్దసాం భూ స్స

యః పృథివ్యోమిత్యృతం చాహం వేదమనూచ్య శం

నో ద్వాదశ.

శం నో మహ ఇత్యాదిత్యో నో ఇతరాణి త్రయో

విగ్ంశతిః ॥

*ద్రావిడాస్తుశిక్షావల్యానన్దవల్లీ భృగువల్లీ త్రయస్యై

కప్రపాఠకత్వమఙ్గీకృత్య 'సత్యమవాదిషం పఞ్చ చ'

ఇత్యుత్తరం 'సహ నావవతు' ఇత్యాద్యేవ పఠన్తి ॥

హరిః ఓం శ్రీకృష్ణార్పణమస్తు.

సమాప్తాచేయం శిక్షావల్లీ.



శ్రీ ర స్తు

# తైత్తిరీయోపనిషత్

## ౨. బ్రహ్మవల్లీ - ఆనందవల్లీ

ఆంధ్ర టీకాతాత్పర్య సమన్వితము

**అతీత** విద్యాప్రాప్త్యుపసర్గ ప్రశమనార్థా శాన్తిః పఠితా । ఇదానీం తు **వక్ష్యమాణ** బ్రహ్మవి ద్యాప్రాప్త్యుపసర్గోపశమనార్థా శాన్తిః పఠ్యతే

శాంతిపాఠః

హరిః ఓమ్

మం. సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహవీర్యం

కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా

విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

శాంకరభాష్యమ్:—

సహ నావవత్వితి। సహ నావవతు, నౌ శిష్యాచార్యౌ సహైవ అవతు రక్షతు। సహ నౌ భునక్తు బ్రహ్మ భోజయతు। సహవీర్యం విద్యానిమిత్తం సామర్థ్యం కరవావహై నిర్వర్తయావహై। తేజస్వి నౌ తేజస్వినోరావయోః అధీతం స్వధీతమ్ అస్తు అర్థజ్ఞానయోగ్యమస్త్విత్యర్థః। మా విద్విషావహై, విద్యాగ్రహణ నిమిత్తం శిష్యస్య ఆచార్యస్య వా ప్రమాదకృతా దన్యాయాద్విద్వేషః ప్రాప్తః; తచ్ఛమనాయేయమాశీః - మా విద్విషావహై ఇతి। మైవ నావితరేతరం 'విద్వేషమాపద్యావహై। శాన్తిః శాన్తిః శాన్తిరితి త్రిర్వచనముక్తార్థమ్। వక్ష్యమాణవిద్యావిఘ్నప్రశమనార్థా చేయం శాన్తిః। అవిఘ్నేనాత్మవిద్యాప్రాప్తిరాశాస్యతే, తన్మూలం హి పరం శ్రేయ ఇతి॥

(టీక. నౌ=(శిష్యాచార్యులమగు) మమ్ములనిద్దఱను, సహ=కూడా, **అవతు**= (బ్రహ్మము) సంరక్షించుగాక. నౌ = (శిష్యాచార్యులమగు) మమ్ములనిద్దఱను, సహ = కూడా, భునక్తు = (బ్రహ్మము) పరిపాలించుగాక. వీర్యం — విద్యానిమిత్త

మగు సామర్థ్యమును, సహ = కూడా, కరవావహై = (మేము) చేసెదముగాక. నౌ = మాయొక్క, అధీతం = అధ్యయనము చేయఁబడిన ఉపనిషద్విద్య, తేజస్వి = తేజో వంతమయినది, అస్తు = అగుఁగాక. మావిద్విషావహై = (ప్రమాదకృతాపరాధాదికము వలన మా యిద్దఱకు) ద్వేషము కలుగకుండుఁగాక. ఓం శాంతి శాంతిః శాంతిః = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయశాంతి కలుగుఁగాక.

తా. శిష్యాచార్యులమగు మమ్ముల నిద్దఱను పరబ్రహ్మము సంరక్షించుఁగాకః మమ్ముల నిద్దఱను పరబ్రహ్మము పరిపాలించుగాక. మే మిద్దఱమును విద్యాసంబంధ మగు సామర్థ్యమును కలిగియుందుముగాక. శిష్యాచార్యులమగు మాచేత అధ్యయ నము చేయఁబడినది అర్థజ్ఞానయోగమగుఁగాక. మే మిద్దఱము పరస్పరము ద్వేషము లేక యుందుముగాక. విద్యాగ్రహణసమయమునందు శిష్యునకు ఆచార్యునకు ప్రమా దముచేత సంభవించునట్టి అపరాధమువలన ద్వేషము కలిగిన అట్టి ద్వేషము పోవుఁ గాక యని 'మావిద్విషావహై' అని చెప్పఁబడినది: మే మిద్దఱమును పరస్పరము ద్వేషములేక యుందుముగాక. శాంతిశబ్దము ముమ్మారు పఠింపఁబడినది కావున ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయము శాంతించుఁగాక యని భావము.

ఈ శాంతి చెప్పఁబోవునట్టి నిర్గుణబ్రహ్మవిద్యోపదేశసమయమునందు విఘ్న ములు కలుగకుండుటకయి చెప్పఁబడినది. ఆత్మవిద్యాప్రాప్తివలననే నిరతిశయమగు మోక్షము లభించుచున్నది. కావున అట్టి బ్రహ్మవిద్య నిర్విఘ్నముగ లభించు నిమిత్త మయి ఈ శాంతిపాఠము పఠింపఁబడినది.

వివరణము:—'సహ నౌ భునక్తు భోజయతు' అని భాష్యమునం దుండుట చేతను, వ్యాఖ్యాతలు 'పాలయిత్విత్యర్థః' అని వ్రాయుటచేతను "పరిపాలించుఁగాక" అని వ్రాయఁబడినది. "గురువేవిధముగా ఆలస్యములేక ఉపదేశించునో, ఆ యుపదే శించిన విషయమును నేనను అజ్ఞానముచేత గ్రహింపలేకపోవుటగాని, లేక విపరీత జ్ఞానముచేత వేఱుగాగాని గ్రహింపక చక్కఁగా గ్రహించునట్లు చేసి మమ్ములను పరిపాలించుఁగాక.' అని వ్యాఖ్యాత వివరించియున్నాఁడు.

వీర్య మనఁగా విద్యానిమిత్తమయిన సామర్థ్యము అనఁగా ఊహాపోహాదికము, విషయపరిగ్రహణపాటవము మున్నగునవి యని గ్రహించునది.

## ౧. ప్రథమో௨నువాకః

ప్రహ్మసూత్రం, అనువ్యాఖ్యానం, లక్షణాదికంచ

మం. బ్రహ్మవిదాప్నోతి పరమ్ । తదేషా௨భ్యుక్తా । సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ । యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సో௨శ్నుతే సర్వా న్కామా న్త్సహ । బ్రహ్మణా విపశ్చి తేతి । తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యో௨న్నమ్ । అన్నా త్పురుషః । స వా ఏష పురుషో ௨న్నరసమయః । తస్యేద మేవ శిరః । అయం దక్షిణః పక్షః । అయ ముత్తరః పక్షః । అయ మాత్మా । ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ।౧॥

శాంకరభాష్యమ్:—

సంహితాది విషయాణి కర్మభిరవిరుద్ధాన్యుపాసనాన్యుక్తాని। అనన్తరం చ అన్తఃసోపాధిక మాత్మదర్శనముక్తం వ్యాహృతిద్వారేణ స్వారాజ్యఫలమ్। న చైతావతా అశేషతః సంసారబీజస్య ఉపమర్దనమస్తి । అతః అశేషోపద్రవబీజస్య అజ్ఞానస్య నివృత్త్యర్థం విధూతసర్వోపాధి విశేషాత్మదర్శనార్థమిదమారభ్యతే-బ్రహ్మవిదాప్నోతి పరమిత్యాది । ప్రయోజనం చాస్యా బ్రహ్మవిద్యాయా అవిద్యానివృత్తిః, తతశ్చ ఆత్యన్తికః సంసారాభావః । వక్ష్యతి చ—"విద్వాన్న బిభేతి కుతశ్చన" ఇతి । సంసార

నిమిత్తే చ సతి అభయం ప్రతిష్ఠాం విన్దత ఇత్యనుపపన్నమ్, కృతాకృతే పుణ్యపాపే న తపత ఇతి చ । అతోఽవ గమ్యతే — అస్మాద్విజ్ఞానాత్సర్వాత్మ బ్రహ్మవిషయా దాత్యన్తికః సంసారాభావ ఇతి । స్వయమేవాహ ప్రయోజనమ్ "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదావేవ సంబన్ధప్రయోజనజ్ఞాపనార్థమ్ । నిర్జ్ఞాతయోర్హి సంబన్ధప్రయోజనయోః విద్యాశ్రవణగ్రహణధారణాభ్యాసార్థం ప్రవర్తతే । శ్రవణాదిపూర్వకం హి విద్యాఫలమ్, "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాది శ్రుత్యన్తరేభ్యః । బ్రహ్మవిత్, బ్రహ్మేతి వక్ష్యమాణలక్షణమ్. బృహత్తమత్వాత్ బ్రహ్మ, తద్వేత్తి విజానాతీతి బ్రహ్మవిత్, ఆప్నోతి ప్రాప్నోతి పరం నిరతిశయమ్; తదేవ బ్రహ్మ పరమ్; న హ్యన్యస్య విజ్ఞానాదన్యస్య ప్రాప్తిః । స్పష్టం చ శ్రుత్యన్తరం బ్రహ్మప్రాప్తిమేవ బ్రహ్మవిదో దర్శయతి — "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఇత్యాది ॥

నను, సర్వగతం సర్వస్య చాత్మభూతం బ్రహ్మ వక్ష్యతి । అతోనాప్యమ్ । ఆప్తిశ్చ అన్యస్యాన్యేన పరిచ్ఛిన్నస్య చ పరిచ్ఛిన్నేన దృష్టా । అపరిచ్ఛిన్నం సర్వాత్మకం చ బ్రహ్మేత్యతః పరిచ్ఛిన్నవత్ అనాత్మవచ్చ తస్యాప్తిరనుపపన్నా । నాయం దోషః । కథమ్? దర్శనాదర్శనాపేక్షత్వా ద్బ్రహ్మణ ఆప్త్యనాప్త్యోః, పరమార్థతో బ్రహ్మస్వరూపస్యాపి సతః అస్యజీవస్య భూతమాత్రాకృత బాహ్యపరిచ్ఛిన్నాన్నమయాద్యాత్మదర్శినః తదాసక్త చేతసః । ప్రకృత సంఖ్యాపూరణస్యాత్మనః అవ్యవహితస్యాపి బాహ్యసంఖ్యేయ విషయాసక్తచిత్తతయా స్వరూపాభావదర్శనవత్ పరమార్థ బ్రహ్మస్వరూపాభావ దర్శన లక్షణయా అవిద్యయా అన్నమయాదీన్బాహ్యానాత్మన ఆత్మత్వేన ప్రతిపన్నత్వాత్ అన్నమయాద్యనాత్మభ్యో నాన్యోఽహమస్మీత్యభిమన్యతే । ఏవ మవిద్యయా ఆత్మభూతమపి బ్రహ్మ అనాప్తం స్యాత్ । తస్యైవ మవిద్యయా అనాప్త బ్రహ్మస్వరూపస్య ప్రకృత సంఖ్యాపూరణస్యాత్మనః అవిద్యయా నాప్తస్య సతః కేనచిత్స్మారితస్య పునస్తస్యైవ విద్యయా ఆప్తిర్యథా, తథా శ్రుత్యుపదిష్టస్య సర్వాత్మ బ్రహ్మణ ఆత్మత్వదర్శనేన విద్యయా తదాప్తిరుపపద్యత ఏవ । బ్రహ్మవిదాప్నోతి పరమితి వాక్యం సూత్రభూతం సర్వస్య వల్ల్యర్థస్య । బ్రహ్మవిదాప్నోతి పరమిత్యనేన వాక్యేన వేద్యతయా సూత్రితస్య బ్రహ్మణోఽనిర్ధారిత స్వరూప విశేషస్య సర్వతో వ్యావృత్తస్వరూప విశేషసమర్పణ సమర్థస్య లక్షణస్యాభిధానేన స్వరూప నిర్ధారణాయ అవిశేషేణ చ ఉక్తవేదనస్య బ్రాహ్మణో వక్ష్యమాణలక్షణస్య విశేషేణ ప్రత్యగాత్మతయా అనన్యరూపేణ విజ్ఞేయత్వాయ, బ్రహ్మవిద్యాఫలం చ బ్రహ్మవిదో

యత్పర ప్రాప్తిలక్షణ ముక్తమ్. స సర్వాత్మభావః సర్వసంసారధర్మా తీత బ్రహ్మ స్వరూపత్వమేవ, నాన్యదిత్యేతత్ప్రదర్శనాయ చ ఏషా ఋగుదాహ్రియతే—తదేషా భ్యుక్తేతి । తత్ తస్మిన్నేవ బ్రాహ్మణ వాక్యోక్తార్థే ఏషా ఋక్ అభ్యుక్తా ఆమ్నాతా। సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ ఇతి బ్రహ్మణో లక్షణార్థం వాక్యమ్ । సత్యాదీని హి త్రీణి విశేషణార్థాని పదాని విశేష్యస్య బ్రహ్మణః । విశేష్యం బ్రహ్మ, వివక్షితత్వా ద్వేద్యతయా । వేద్యత్వేన యతో బ్రహ్మ ప్రాధాన్యేన వివక్షితమ్, తస్మాద్విశేష్యం విజ్ఞేయమ్ । అతః అస్మాద్విశేషణ విశేష్యత్వాదేవ సత్యాదీని ఏకవిభక్త్యన్తాని పదాని సమానాధికరణాని। సత్యాదిభిస్త్రిభిర్విశేషణై విశేష్యమాణం బ్రహ్మ విశేష్యాన్తరేభ్యో నిర్ధార్యతే । ఏవం హి తజ్జాతం భవతి, యదన్యేభ్యో నిర్ధారితమ్; యథా లోకే నీలం మహత్సుగన్ధ్యు త్పలమితి । నను, విశేష్యం విశేషణాన్తరం వ్యభిచరద్విశేష్యతే, యథా నీలం రక్తం చోత్పలమితి; యదా హ్యనేకాని ద్రవ్యాణి ఏకజాతీయాన్యేక విశేషణ యోగీని చ, తదా విశేషణస్యార్థవత్త్వమ్; న హ్యేకస్మిన్నేవ వస్తుని, విశేషణాన్తరాయోగాత్; యథా అసావేక ఆదిత్య ఇతి, తథా ఏకమేవ బ్రహ్మ, న బ్రహ్మాన్తరాణి, యేభ్యో విశేష్యేత నీలోత్పలవత్ । న; లక్షణార్థత్వాద్విశేషణానామ్। నాయం దోషః । కస్మాత్? లక్షణార్థ ప్రధానాని విశేషణాని, న విశేషణ ప్రధానాన్యేవ। కః పునర్లక్షణ లక్ష్యయో ర్విశేషణ విశేష్యయోర్వా విశేషః? ఉచ్యతే । సజాతీయేభ్య ఏవ నివర్తకాని విశేషణాని విశేష్యస్య; లక్షణం తు సర్వత ఏవ, యథా అవకాశ ప్రదాత్రాకాశమితి । లక్షణార్థం చ వాక్యమిత్యవోచామ ॥

సత్యాదిశబ్దా న పరస్పరం సంబధ్యన్తే, పరార్థత్వాత్; విశేష్యార్థా హి తే అత ఏవ ఏకైకో విశేషణశబ్దః పరస్పరం నిరపేక్షో బ్రహ్మశబ్దేన సంబధ్యతే— సత్యం బ్రహ్మ జ్ఞానం బ్రహ్మ అనన్తం బ్రహ్మేతి । సత్యమితి యద్రూపేణ యన్ని శ్చితం తద్రూపం న వ్యభిచరతి, తత్సత్యమ్ । యద్రూపేణ యన్నిశ్చితం తద్రూపం వ్యభిచరతి, తదనృతమిత్యుచ్యతే । అతో వికారోఽనృతమ్, "వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్", ఏవం సదేవ సత్యమిత్యవధారణాత్ । అతః "సత్యం బ్రహ్మ" ఇతి బ్రహ్మ వికారాన్నివర్తయతి । అతః కారణత్వం ప్రాప్తం బ్రహ్మణః । కారణస్య చ కారకత్వమ్, వస్తుత్వాత్ మృద్వత్ అచిద్రూపతా చ ప్రాప్తా; అత ఇదముచ్యతే—జ్ఞానం బ్రహ్మేతి । జ్ఞానం జ్ఞప్తిః అవబోధః, — భావసాధనో జ్ఞానశబ్దః—న తు జ్ఞానకర్తృ, బ్రహ్మవిశేషణ త్వాత్సత్యానన్తాభ్యాం సహ । న హి సత్యతా అనన్తతా చ జ్ఞానకర్తృత్వే సత్యుపపద్యేతే । జ్ఞానకర్తృత్వేన హి విక్రియ

మాణం కథం సత్యం భవేత్, అనన్తం చ? యద్ధి న కుతశ్చిత్ప్రవిభజ్యతే, తద నన్తమ్। జ్ఞానకర్తృత్వే చ జ్ఞేయ జ్ఞానాభ్యాం ప్రవిభక్తమిత్య నన్తతా న స్యాత్, "యత్ర నాన్యద్విజానాతి స భూమా, అథ యత్ర అన్యద్విజానాతి తదల్పమ్" ఇతి శ్రుత్యన్తరాత్। "నాన్యద్విజానాతి" ఇతి విశేషప్రతిషేధాత్ ఆత్మానం విజానాతీతి చేత్, న; భూమ లక్షణ విధిపరత్వాద్వాక్యస్య। "యత్ర నాన్యత్పశ్యతి" ఇత్యాది భూమ్నోలక్షణవిధిపరం వాక్యమ్। యథా ప్రసిద్ధమేవ అన్యోఽన్యత్పశ్యతీత్యేత దుపాదాయ యత్ర తన్నాస్తి, స భూమా ఇతి భూమస్వరూపం తత్ర జ్ఞాప్యతే। అన్య గ్రహణస్య ప్రాప్తప్రతిషేధార్థత్వాత్ న స్వాత్మని క్రియాస్తిత్వపరం వాక్యమ్। స్వాత్మని చ భేదాభావాద్విజ్ఞానానుపపత్తిః। ఆత్మనశ్చ విజ్ఞేయత్వే జ్ఞాత్రభావప్రసఙ్గః, జ్ఞేయత్వేనైవ వినియుక్తత్వాత్ ॥

ఏక ఏవాత్మా జ్ఞేయత్వేన జ్ఞాతృత్వేన చ ఉభయథా భవతీతి చేత్, న; యుగపద నంశత్వాత్। న హి నిరవయవస్య యుగపజ్జ్ఞేయజ్ఞాతృత్వోపపత్తిః। ఆత్మనశ్చ ఘటాదివద్విజ్ఞేయత్వే జ్ఞానోపదేశానర్థక్యమ్। న హి ఘటాదివత్ప్రసిద్ధస్య జ్ఞానోపదేశః అర్థవాన్। తస్మాత్ జ్ఞాతృత్వే సతి ఆనన్త్యానుపపత్తిః। సన్మాత్రత్వం చానుపపన్నం జ్ఞాన కర్తృత్వాది విశేషవత్త్వే సతి; సన్మాత్రత్వం చ సత్యమ్, "తత్సత్యమ్" ఇతి శ్రుత్యన్తరాత్। తస్మాత్స త్యానన్త శబ్దాభ్యాం సహ విశేషణ త్వేన జ్ఞానశబ్దస్య ప్రయోగాద్భావసాధనే జ్ఞానశబ్దః। "జ్ఞానం బ్రహ్మ" ఇతి కర్తృత్వాదికారకనివృత్త్యర్థం మృదాది వద చిద్రూపతానివృత్త్యర్థం చ ప్రయుజ్యతే। "జ్ఞానం బ్రహ్మ" ఇతి వచ నాత్ప్రాప్తమన్తవత్త్వమ్, లౌకికస్య జ్ఞానస్య అన్తవత్త్వదర్శనాత్। అతః తన్నివృత్త్యర్థ మాహ — అనన్తమితి। సత్యాదీనామనృతాది ధర్మనివృత్తిపరత్వాద్విశేష్యస్య చ బ్రహ్మణః ఉత్పలాదివదప్రసిద్ధత్వాత్ "మృగతృష్ణామ్భసి స్నాతః ఖపుష్పకృతశేఖరః। ఏష వన్ధ్యాసుతో యాతి శశశృఙ్గధనుర్ధరః" ఇతివత్ శూన్యార్థత్వేవ ప్రాప్తా సత్యాది వాక్యస్యేతి చేత్, న; లక్షణార్థత్వాత్। విశేషణత్వేఽపి సత్యాదీనాం లక్షణార్థ ప్రాధాన్యమిత్యవోచామ। శూన్యే హి లక్ష్యే అనర్థకం లక్షణవచనమ్। అతః లక్షణార్థ త్వాన్మన్యామహే న శూన్యార్థతేతి। విశేషణార్థత్వేఽపి చ సత్యాదీనాం స్వార్థాపరిత్యాగ ఏవ। శూన్యార్థత్వే హి సత్యాదిశబ్దానాం విశేష్యనియన్తృత్వానుపపత్తిః। సత్యాద్యర్థైరర్థవత్త్వే తు తద్విపరీత ధర్మవద్భ్యో విశేష్యేభ్యో బ్రహ్మణో విశేష్యస్య నియన్తృత్వముపపద్యతే। బ్రహ్మశబ్దోఽపి స్వార్థేనార్థవానేవ। తత్ర అనన్తశబ్దః

అన్తవత్త్వప్రతిషేధద్వారేణ విశేషణమ్। సత్యజ్ఞానశబ్దౌ తు స్వార్థసమర్పణేనైవ విశేషణే భవతః॥

“తస్మాద్వా ఏతస్మాదాత్మనః” ఇతి బ్రహ్మణ్యేవ ఆత్మశబ్దప్రయోగాత్ వేదితురాత్మైవ బ్రహ్మ। “ఏతమానన్దమయమాత్మాన ముపసంక్రామతి” ఇతి చ ఆత్మతాం దర్శయతి। తత్ప్రవేశాచ్చ; “తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్” ఇతి చ తస్యైవ జీవరూపేణ శరీరప్రవేశం దర్శయతి। అతో వేదితుః స్వరూపం బ్రహ్మ। ఏవం తర్హి, ఆత్మత్వాజ్జ్ఞానకర్తృత్వమ్; “ఆత్మా జ్ఞాతా” ఇతి హి ప్రసిద్ధమ్, “సోఽకామయత” ఇతి చ కామినో జ్ఞానకర్తృత్వప్రసిద్ధిః, అతో జ్ఞానకర్తృత్వాత్ జ్ఞప్తిర్బ్రహ్మేత్యయుక్తమ్; అనిత్యత్వప్రసఙ్గాచ్చ; యది నామ జ్ఞప్తిర్జ్ఞానమితి భావరూపతా బ్రహ్మణః, తదాప్యనిత్యత్వం ప్రసజ్యేత; పారతన్త్ర్యంచ, ధాత్వర్థానాం కారకాపేక్షిత్వాత్, జ్ఞానం చ ధాత్వర్థః; అతోఽస్య అనిత్యత్వం పరతన్త్రతా చ। న; స్వరూపావ్యతిరేకేణ కార్యత్వోపచారాత్। ఆత్మనః స్వరూపం జ్ఞప్తిః న తతో వ్యతిరిచ్యతే। అతో నిత్యైవ। తథాపి బుద్ధేరుపాధిలక్షణాయాశ్చక్షురాదిద్వారైర్విషయాకారపరిణామిన్యాః యే శబ్దాద్యాకారావభాసాః, తే ఆత్మవిజ్ఞానస్య విషయభూతా ఉత్పద్యమానా ఏవ ఆత్మవిజ్ఞానేనవ్యాప్తా ఉత్పద్యన్తే। తస్మాదాత్మవిజ్ఞానావభాస్యాశ్చ తే విజ్ఞాన శబ్దవాచ్యాశ్చ ధాత్వర్థభూతా ఆత్మన ఏవ ధర్మా విక్రియారూపా ఇత్యవివేకిభిః పరికల్ప్యన్తే। యత్తు బ్రహ్మణో విజ్ఞానమ్, తత్ సవితృప్రకాశవత్ అగ్న్యుష్ణత్వవచ్చ బ్రహ్మస్వరూపావ్యతిరిక్తం స్వరూపమేవ తత్। న తత్కారణాన్తరసవ్యపేక్షమ్, నిత్యస్వరూపత్వాత్, సర్వభావానాం చ తేనావిభక్తదేశకాలత్వాత్ కాలాకాశాదికారణత్వాత్ నిరతిశయసూక్ష్మత్వాచ్చ। న తస్యాన్యదవిజ్ఞేయం సూక్ష్మం వ్యవహితం విప్రకృష్టం భూతం భవద్భవిష్యద్వా అస్తి। తస్మాత్సర్వజ్ఞం తద్బ్రహ్మ। మన్త్రవర్ణాచ్చ “అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః। స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్” ఇతి। “న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి” ఇత్యాది శ్రుతేశ్చ। విజ్ఞాతృస్వరూపావ్యతిరేకాత్కరణాదినిమిత్తానపేక్షత్వాచ్చ బ్రహ్మణో జ్ఞానస్వరూపత్వేఽపి నిత్యత్వప్రపిద్ధిః। అతో నైవ ధాత్వర్థస్తత్, అక్రియా రూపత్వాత్। అత ఏవ చ న జ్ఞానకర్తృ; తస్మాదేవ చ న జ్ఞానశబ్దవాచ్యమపి తద్బ్రహ్మ। తథాపి తదాభాసవాచకేన బుద్ధిధర్మవిశేషేణ జ్ఞానశబ్దేన తల్లక్ష్యతే; న తు ఉచ్యతే, శబ్దప్రవృత్తిహేతుజాత్యాది ధర్మరహితత్వాత్। తథా సత్యశబ్దేనాపి। సర్వవిశేషప్రత్యస్తమితస్వరూపత్వా

బ్రహ్మణః బాహ్యసత్తాసామాన్యవిషయేణ సత్యశబ్దేన లక్ష్యతే "సత్యం బ్రహ్మ" ఇతి; న తు సత్యశబ్దవాచ్యం బ్రహ్మ। ఏవం సత్యాదిశబ్దా ఇతరేతరసంనిధానాదన్యోన్య నియమ్యనియామకాః సన్తః సత్యాదిశబ్దవాచ్యాత్ నివర్తకా బ్రహ్మణః, లక్షణార్థాశ్చ భవన్తీతి। అతః సిద్ధమ్ "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" "అనిరుక్తేఽనిలయనే" ఇతి చ అవాచ్యత్వమ్, నీలోత్పలవదవాక్యార్థత్వం చ బ్రహ్మణః॥

తద్యథావ్యాఖ్యాతం బ్రహ్మ యః వేద విజానాతి నిహితం స్థితం గుహాయామ్. గూహతేః సంవరణార్థస్య నిగూఢా అస్యాం జ్ఞానజ్ఞేయజ్ఞాతృపదార్థా ఇతి గుహాబుద్ధిః, గూఢావస్యాం భోగాపవర్గౌ పురుషార్థావితి వా. తస్యాం పరమే ప్రకృష్టే వ్యోమన్ వ్యోమ్ని ఆకాశే అవ్యాకృతాఖ్యే; తద్ధి పరమం వ్యోమ, "ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గ్యాకాశః" ఇత్యక్షరసంనికర్షాత్; "గుహాయాం వ్యోమన్" ఇతి వా సామానాధికరణ్యాదవ్యాకృతాకాశమేవ గుహా; తత్రాపి నిగూఢాః సర్వే పదార్థాస్త్రిషు కాలేషు, కారణత్వాత్సూక్ష్మతరత్వాచ్చ; తస్మిన్నన్తర్నిహితం బ్రహ్మ। హార్దమేవ తు పరమం వ్యోమేతి న్యాయ్యమ్, విజ్ఞానాఙ్గత్వేన వ్యోమ్నో వివక్షితత్వాత్। "యో వై స బహిర్ధా పురుషాదాకాశో యో వై సోఽన్తః పురుష ఆకాశో యోఽయమన్తర్హృదయ ఆకాశః" ఇతి శ్రుత్యన్తరాత్ప్రసిద్ధం హార్దస్య వ్యోమ్నః పరమత్వమ్। తస్మిన్హార్దే వ్యోమ్ని యా బుద్ధిర్గుహా, తస్యాం నిహితం బ్రహ్మ తద్వృత్త్యా వివిక్తతయోపలభ్యత ఇతి। న హ్యన్యథా విశిష్ట దేశకాల సంబన్ధోఽస్తి బ్రహ్మణః, సర్వగతత్వాన్నిర్విశేషత్వాచ్చ। సః ఏవం బ్రహ్మ విజానన్; కిమిత్యాహ—అశ్నుతే భుఙ్క్తే సర్వాన్ నిరవశేషాన్ కామాన్ కామ్యభోగానిత్యర్థః। కిమస్మదాదివత్పుత్ర స్వర్గాదీన్పర్యాయేణ? నేత్యాహ—సహ యుగపత్ ఏకక్షణోపారూఢానేవ ఏకయోపలబ్ధ్యా సవితృప్రకాశవన్నిత్యయా బ్రహ్మస్వరూపావ్యతిరిక్తయా, యామవోచామ "సత్యం జ్ఞానమ్" ఇతి। ఏతత్తదుచ్యతే—బ్రహ్మణా సహేతి। బ్రహ్మభూతో విద్వాన్ బ్రహ్మస్వరూపేణైవ సర్వాన్కామాన్ సహ అశ్నుతే। న తథా యథోపాధికృతేన స్వరూపేణాత్మనో జలసూర్యకాది వత్ప్రతిబిమ్బభూతేన సాంసారికేణ ధర్మాదినిమిత్తాపేక్షాంశ్చ చక్షురాది కరణాపేక్షాంశ్చ సర్వాన్కామాన్పర్యాయేణాశ్నుతే లోకః। కథం తర్హి? యథోక్తేన ప్రకారేణ సర్వజ్ఞేన సర్వగతేన సర్వాత్మనా నిత్యబ్రహ్మాత్మ స్వరూపేణ ధర్మాదినిమిత్తానపేక్షాన్ చక్షురాది కరణానపేక్షాంశ్చ సర్వాన్కామాన్సహాశ్నుత ఇత్యర్థః। విపశ్చితా మేధావినా సర్వజ్ఞేన। తద్ధి వైపశ్చిత్యమ్, యత్సర్వజ్ఞత్వమ్। తేన సర్వజ్ఞస్వరూపేణ బ్రహ్మణా అశ్నుత ఇతి। ఇతిశబ్దో మన్త్రపరిసమాప్త్యర్థః॥

సర్వ ఏవ వల్ల్యర్థః ''బ్రహ్మవిదాప్నోతి పరమ్'' ఇతి బ్రాహ్మణ వాక్యేన సూత్రితః। స చ సూత్రితోఽర్థః సంక్షేపతో మన్త్రేణ వ్యాఖ్యాతః। పునస్తస్యైవ విస్తరేణార్థనిర్ణయః కర్తవ్య ఇత్యుత్తరస్తద్వృత్తిస్థానీయో గ్రన్థ ఆరభ్యతే— తస్మాద్వా ఏతస్మాదిత్యాదిః। తత్ర చ ''సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'' ఇత్యుక్తం మన్త్రాదౌ; తత్కథం సత్యమనన్తం చేత్యత ఆహ। త్రివిధం హ్యానన్త్యమ్—దేశతః కాలతో వస్తుతశ్చేతి। తద్యథా—దేశతోఽనన్త ఆకాశః; న హి దేశతస్తస్య పరిచ్ఛేదోఽస్తి। న తు కాలతశ్చానన్త్యం వస్తుతశ్చ ఆకాశస్య। కస్మాత్? కార్యత్వాత్। నైవం బ్రహ్మణ ఆకాశవత్కాలతోఽప్యనన్తత్వమ్, అకార్యత్వాత్। కార్యం హి వస్తు కాలేన పరిచ్ఛిద్యతే। అకార్యం చ బ్రహ్మ। తస్మాత్కాలతోఽస్యానన్త్యమ్। తథా వస్తుతః। కథం పునర్వస్తుత ఆనన్త్యమ్? సర్వానన్యత్వాత్। భిన్నం హి వస్తు వస్త్వన్తరస్య అన్తో భవతి; వస్త్వన్తరబుద్ధిర్హి ప్రసక్తాద్వస్త్వన్తరాన్నివర్తతే। యతో యస్య బుద్ధేర్నివృత్తిః, స తస్యాన్తః। తద్యథా గోత్వబుద్ధిరశ్వత్వాన్నివర్తత ఇత్యశ్వత్వాన్తం గోత్వమిత్యన్తవదేవ భవతి। స చాన్తో భిన్నేషు వస్తుషు దృష్టః। నైవం బ్రహ్మణో భేదః। అతో వస్తుతోఽప్యానన్త్యమ్। కథం పునః సర్వానన్యత్వం బ్రహ్మణ ఇతి, ఉచ్యతే—సర్వవస్తుకారణత్వాత్। సర్వేషాం హి వస్తూనాం కాలాకాశాదీనాం కారణం బ్రహ్మ। కార్యాపేక్షయా వస్తుతోఽన్తవత్త్వమితి చేత్, న; అనృతత్వాత్కార్యస్య వస్తునః। న హి కారణవ్యతిరేకేణ కార్యం నామ వస్తుతోఽస్తి, యతః కారణబుద్ధిర్వినివర్తేత; ''వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్'' ఏవం సదేవ సత్యమితి శ్రుత్యన్తరాత్। తస్మాదాకాశాది కారణత్వాద్దేశతస్తావదనన్తం బ్రహ్మ। ఆకాశో హ్యనన్త ఇతి ప్రసిద్ధం దేశతః; తస్యేదం కారణమ్; తస్మాత్సిద్ధం దేశత ఆత్మన ఆనన్త్యమ్। న హ్యసర్వగతాత్సర్వగతముత్పద్యమానం లోకే కించిద్దృశ్యతే। అతో నిరతిశయమాత్మన ఆనన్త్యం దేశతః। తథా అకార్యత్వాత్కాలతః; తద్భిన్నవస్త్వన్తరాభావాచ్చ వస్తుతః। అత ఏవ నిరతిశయసత్యత్వమ్॥

తస్మాత్ ఇతి మూలవాక్యసూత్రితం బ్రహ్మ పరామృశ్యతే; ఏతస్మాత్ ఇతి మన్త్రవాక్యేన అనన్తరం యథాలక్షితమ్। యద్బ్రహ్మ ఆదౌ బ్రాహ్మణవాక్యేన సూత్రితమ్, యచ్చ ''సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'' ఇత్యనన్తరమేవ లక్షితమ్, తస్మాదేతస్మాద్బ్రహ్మణ ఆత్మనః ఆత్మశబ్దవాచ్యాత్; ఆత్మా హి తత్ సర్వస్య, ''తత్సత్యం స ఆత్మా'' ఇతి శ్రుత్యన్తరాత్; అతో బ్రహ్మ ఆత్మా; తస్మాదేతస్మా

ద్బ్రహ్మణ ఆత్మస్వరూపాత్ ఆకాశః సంభూతః సముత్పన్నః। ఆకాశో నామ శబ్దగుణః అవకాశకరో మూర్తద్రవ్యాణామ్। తస్మాత్ ఆకాశాత్ స్వేన స్పర్శగుణేన పూర్వేణ చ ఆకాశగుణేన శబ్దేన ద్విగుణః వాయుః, సంభూత ఇత్యనువర్తతే। వాయోశ్చ స్వేన రూపగుణేన పూర్వాభ్యాం చ త్రిగుణః అగ్నిః సంభూతః। అగ్నేశ్చ స్వేన రసగుణేన పూర్వైశ్చ త్రిభిః చతుర్గుణా ఆపః సంభూతాః। అద్భ్యః స్వేన గన్ధగుణేన పూర్వైశ్చ చతుర్భిః పఞ్చగుణా పృథివీ సంభూతా। పృథివ్యాః ఓషధయః। ఓషధీభ్యః అన్నమ్। అన్నాత్ రేతోరూపేణ పరిణతాత్ పురుషః శిరః పాణ్యాద్యాకృతిమాన్। స వై ఏష పురుషః అన్నరసమయః అన్నరసవికారః పురుషాకృతిభావితం హి సర్వేభ్యోఽఙ్గేభ్యస్తేజః సంభూతం రేతో బీజమ్। తస్మాద్యో జాయతే, సోఽపి తథా పురుషాకృతిరేవస్యాత్; సర్వజాతిషు జాయమానానాం జనకాకృతి నియమదర్శనాత్। సర్వేషామప్యన్నరసవికారత్వే బ్రహ్మవంశ్యత్వే చ అవిశిష్టే. కస్మాత్పురుష ఏవ గృహ్యతే? ప్రాధాన్యాత్। కిం పునః ప్రాధాన్యమ్? కర్మజ్ఞానాధికారః। పురుష ఏవ హి శక్తత్వాదర్థిత్వాదపర్యుదస్తత్వాచ్చ కర్మజ్ఞానయోరధిక్రియతే, "పురుషే త్వేవావిస్తరామాత్మా స హి ప్రజ్ఞానేన సంపన్నతమో విజ్ఞాతం వదతి విజ్ఞాతం పశ్యతి వేదశ్వస్తనం వేద లోకాలోకౌ మర్త్యేనామృతమీక్షతీత్యేవం సంపన్నః; అథేతరేషాం పశూనామశనాయాపిపాసే ఏవాభి విజ్ఞానమ్" ఇత్యాది శ్రుత్యన్తరదర్శనాత్॥

స హి పురుషః ఇహ విద్యయా ఆన్తరతమం బ్రహ్మ సంక్రామయితుమిష్టః। తస్య చ బాహ్యాకారవిశేషేష్వనాత్మసు ఆత్మభావితాబుద్ధిః వినా ఆలమ్బనవిశేషం కించిత్ సహసా ఆన్తరతమప్రత్యగాత్మవిషయా నిరాలమ్బనా చ కర్తుమశక్యేతి దృష్టశరీరాత్మసామాన్య కల్పనయా శాఖాచన్ద్రనిదర్శనవదన్తః ప్రవేశయన్నాహ—తస్యేదమేవ శిరః। తస్య అస్య పురుషస్యాన్నరసమయస్య ఇదమేవ శిరః ప్రసిద్ధమ్। ప్రాణమయాదిష్వశిరసాం శిరస్త్వదర్శనాదిహాపి తత్ప్రసఙ్గో మా భూదితి ఇదమేవ శిర ఇత్యుచ్యతే। ఏవం పక్షాదిషు యోజనా। అయం దక్షిణో బాహుః పూర్వాభిముఖస్య దక్షిణః పక్షః। అయం సవ్యో బాహుః ఉత్తరః పక్షః। అయం మధ్యమో దేహభాగః ఆత్మా అఙ్గానామ్, "మధ్యం హ్యేషామఙ్గానామాత్మా" ఇతి శ్రుతేః। ఇదమితి నాభేరధస్తాద్యదఙ్గమ్. తత్ పుచ్ఛం ప్రతిష్ఠా। ప్రతితిష్ఠత్యనయేతి ప్రతిష్ఠా। పుచ్ఛమివ పుచ్ఛమ్, అధోలమ్బనసామాన్యాత్, యథా గోః పుచ్ఛమ్। ఏతత్ప్రకృత్య ఉత్త

రేషాం ప్రాణమయాదీనాం రూపకత్వసిద్ధిః, మూషానిషిక్తద్రుతతామ్రప్రతిమావత్ । తదప్యేష శ్లోకో భవతి । తత్ తస్మిన్నేవార్థే బ్రాహ్మణోక్తే అన్నమయాత్మప్రకాశకే ఏష శ్లోకః మన్త్రః భవతి ॥

ఇతి ప్రథమానువాక భాష్యమ్ ॥

టీక. బ్రహ్మవిత్ = బ్రహ్మవేత్త, పరం = మోక్షమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. తత్ = ఆ విషయమునుగూర్చి, ఏషా = ఈ చెప్పఁబోవునట్టి మంత్రము, అభ్యుక్తా = చెప్పఁబడినది. బ్రహ్మ = బ్రహ్మము, సత్యం = సత్యమనియు, జ్ఞానం = జ్ఞానమనియు, అనన్తం = అనంతమనియు (చెప్పఁబడును.) యః = ఎవ్వఁడు. గుహాయాం = బుద్ధిగుహయందు, (గల) పరమేవ్యోమన్ = శ్రేష్ఠమయిన హృదయావకాశమునందు, నిహితం = ఉన్నట్టి (ఆత్మను) వేద = ఎఱుంగునో, సః = వాఁడు. సర్వాన్ కామాన్ = సకలమనోరథములను, విపశ్చితా బ్రహ్మణా = బ్రహ్మవిదాత్మస్వరూపముతో, సహ అశ్నుతే = ఒక్కపర్యాయమే అనుభవించుచున్నాఁడు. ఇతి = ఈ మంత్రము సమాప్తమయినది.

తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, ఆత్మనః = బ్రహ్మమువల్ల నుండి, ఆకాశః = ఆకాశము. సంభూతః = పుట్టెను. ఆకాశాత్ = ఆకాశమువల్ల నుండి, వాయుః = వాయువు (పుట్టెను) వాయోః = వాయువువల్ల నుండి. అగ్నిః = అగ్ని (పుట్టెను). అగ్నేః = అగ్నివల్ల నుండి. ఆపః = జలములు (పుట్టెను). అద్భ్యః = జలములవల్ల నుండి, పృథివీ = భూమి (పుట్టెను). పృథివ్యాః = భూమివల్ల నుండి. ఓషధయః = ఓషధులు (పుట్టెను). ఓషధీభ్యః = ఓషధులవల్ల నుండి, అన్నం = అన్నము (పుట్టెను). అన్నాత్ = అన్నమువల్ల నుండి, పురుషః = పురుషుఁడు (పుట్టెను). సః = ఆ, ఏషః = ఈ, పురుషః = పురుషుఁడు, అన్నరసమయః = అన్నరసవికారము గలవాఁడు. తస్య = ఆ పురుషునకు, ఇదంఏవశిరః = ఈ శిరస్సే శిరస్సు, అయం దక్షిణః పక్షః = ఈ కుడిచెయ్యి, దక్షిణపక్షము. అయం ఉత్తరః పక్షః = ఈ ఎడమచెయ్యి. ఉత్తరపక్షము, అయం = ఈ మధ్యభాగము, ఆత్మా = ఆత్మ, ఇదం = ఈ, పుచ్ఛం = నాభికి దిగువభాగము. ప్రతిష్ఠా = ప్రతిష్ఠ, తదపి = ఆ విషయమునుగూర్చి, ఏష శ్లోకః = ఈ చెప్పఁబోవు శ్లోకము - మంత్రము, భవతి = అగుచున్నది.

తా. శిక్షాప్రశ్నమునందు కర్మలకు విరుద్ధములు కానట్టియు, జ్ఞానసాధనములును అగు సంహితాద్యుపాసనములు ప్రథమమున చెప్పఁబడినవి. తరువాత వ్యాహృత్యు

ద్యుపాసనలచేత మోక్షమే ఫలముగాఁగల సోపాధి కాత్మదర్శనము బోధింపఁబడినది. ఇట్టి సోపాధికాత్మదర్శనముచేత సంసార బీజమగు అవిద్యనిశ్శేషముగ నశింపఁజాలదు కావున సకలోపద్రవములకు బీజభూతమగు అజ్ఞానము నశించుట కొఱకు నిరుపాధి కాత్మ ప్రదర్శనరూపమగు "బ్రహ్మవిదాప్నోతి పరం" మున్నగు మంత్రసముదాయముగల "ఆనందవల్లి" యను అధ్యాయము ప్రారంభింపఁబడుచున్నది.

బ్రహ్మవిద్యాప్రయోజనము అవిద్యానివృత్తియే, కావున ఈ అధ్యాయ ప్రతిపాదితమగు బ్రహ్మవిద్యకు కూడ ప్రయోజనము అవిద్యానివృత్తియే. అవిద్యానివృత్తి చేతనే జననమరణరూపమగు సంసారము నిశ్శేషముగ నశించును. ఈ విషయమే ముమ్ముందు:—

విద్వాఞ్ నబిభేతి కుతశ్చన (తై. బ్రహ్మవల్లి. అను ౯.) అని ఈ యుపనిషత్తునందే చెప్పఁబడఁగలదు. జననమరణరూపసంసారమునకు నిమిత్తమగు అవిద్య నిశ్శేషముగ నశింపనియెడల ఈ యుపనిషత్తునందు చెప్పఁబడిన "అభయం ప్రతిష్ఠాం విందతే." (తై. బ్రహ్మ. అను. ౭.) కృతాకృతే పుణ్యపాపే న తపతః (బ్రహ్మ. అ. ౯.) అను వచనములకు సార్థకత్వము లేదు. కావున సర్వాత్మ బ్రహ్మవిషయకమగు నిరుపాధిక బ్రహ్మాత్మవిజ్ఞానము వలన ఆత్యంతికమగు అవిద్యానివృత్తి కలుగును. ఈ విషయము ఉపనిషత్తుయొక్క ప్రారంభమునందే "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అని నిరుపాధికాత్మ విజ్ఞాన ప్రయోజనము చెప్పఁబడినది. ఉపనిషత్ప్రారంభమునందే "బ్రహ్మవేత్త మోక్షమును పొందును" అను అర్థముగల 'బ్రహ్మవిదాప్నోతి పరం' అను వాక్యమును చెప్పుటచేత ఆదియందే విద్యాసంబంధప్రయోజనము లివియని తెలుపఁబడినవి. బ్రహ్మవిద్యయొక్క సంబంధ ప్రయోజనము లివియని తెలిపినయెడల ముముక్షువులు బ్రహ్మవిద్యాశ్రవణ గ్రహణధారణాభ్యాసార్థము ప్రవర్తింతురు.

శ్రు. శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః (బృహ. ఉ. ౨: ౪.౫.)

అను శ్రుతియు బ్రహ్మవిద్య శ్రవణమనననిదిధ్యాసాదికము చేత పొందఁదగినదని ప్రతిపాదించుచున్నది.

బ్రహ్మమన నేమియో ముందు చెప్పఁబడును. బ్రహ్మమన మిక్కిలి వృద్ధి గలది, అట్టి బ్రహ్మము నెఱింగినవాఁడగు బ్రహ్మవిదుఁడు నిరతిశయమును పరమును అగు బ్రహ్మమును పొందును. బ్రహ్మమే ఇచట "పర" మని చెప్పఁబడినది. ఒక

దానిని తెలిసికొనిన యింకొకదానిని పొందునని చెప్పుట యుక్తమే కాదు కావున ఇచట పరమనఁగా బ్రహ్మమే. బ్రహ్మవేత్తకు బ్రహ్మప్రాప్తియే కలుగుననుటకు శ్రుతిప్రమాణము:—

"స యో హ వై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"
(ముండకోపనిషత్తు. ౩. ౨. ౯.)

(ఎవఁడు నిరతిశయ బ్రహ్మము నెఱుంగునో వాఁడు బ్రహ్మమే తానగుచున్నాఁడని యర్థము.)

## పూర్వపక్షము

బ్రహ్మము సర్వాత్మభూతమని ముందుఁ జెప్పఁబోవుచున్నారుగదా. అంతట నిండియున్న బ్రహ్మమును పొందుట యనునది సంభవింపదుగదా. లోకమునందు పరిచ్ఛిన్నమును భిన్నమును అగు వస్తువును పొందుచుండుట అనుభవసిద్ధముకదా. కావున అపరిచ్ఛిన్నమును సర్వాత్మకమును అగు బ్రహ్మమును పొందునని చెప్పుట అసంగతము.

## సమాధానము

బ్రహ్మమును పొందుచున్నాఁడని చెప్పుటయందు దోషమేమియు లేదు. పొందుట యనునది యిట ఔపచారికముగాని పారమార్థికము కాదు. ఎట్లనఁగా ఇచట పొందుట పొందకపోవుటయనునవి తెలిసికొనుట, తెలిసికొనకపోవుట యను నర్థమునందు ప్రయుక్తములయి యున్నవి. జీవుఁడ ననుకొను తాను వాస్తవముగ బ్రహ్మస్వరూపుఁ డయినప్పటికిన్నీ, పంచీకృతములును, అపంచీకృతములును అగు భూతాంశములచేత చేయఁబడినట్టియు, బాహ్యములయినట్టియు, అన్నమయాదికోశములనే ఆత్మనుగా భావించి తదాసక్తచిత్తుఁడగువానికి "తనకంటె బాహ్యులయిన — వేఱయిన వారిని లెక్కించుటయందే ఆసక్తిగల చిత్తము గలవాఁడగుటచేత ప్రకృత సంఖ్యాపూరకుఁ డగు - దశమ సంఖ్యాపూరకుఁడగు తాను అచ్చటనే ఉన్నప్పటికిన్నీ ౧౦-వ వాఁడు లేడని ఎటుల దుఃఖించుచున్నాఁడో" అట్లే పరమార్థమయిన బ్రహ్మస్వరూపమును తెలిసికొనఁజాలక పోవుటయే లక్షణముగాఁగల యవిద్య చేత అనాత్మలగు అన్నమయాది కోశములను ఆత్మనుగా తలంచుటచేత అన్నమయాదికోశములకంటె తాను వేఱని తలంచుటలేదు. అవిద్యచేత యీ విధముగా బ్రహ్మము ఆత్మభూతము—తానే అయినప్పటికిన్నీ పొందఁబడనిది యగుచున్నది. అవిద్యచేత

బ్రహ్మస్వరూపమును పొందనివానికి అజ్ఞానముచేత ౧౦-వ వాఁడగు తాను లేనటుల దుఃఖించుచున్న వానికి ఒకానొకని యొక్క యథార్థోపదేశముచేత తానే ౧౦-వ వాఁడని తెలిసికొనుట పొందుట యెట్లగుచున్నదో, అట్లే శ్రుత్యుపదిష్టమయిన సర్వాత్మబ్రహ్మము తానే యని యెఱుంగుటయే యిట విద్యచేత పొందఁబడినదవి గ్రహించునది.

ఈ ఆనందవల్లి కంతయు "బ్రహ్మవిదాప్నోతిపరం" అనునది సూత్ర భూత మగు సారాంశము. "బ్రహ్మవిదాప్నోతిపరం" అను వాక్యముచేత బ్రహ్మమనునది ఒకటిగలదనియు, అది తెలిసికొనఁదగినదనియు సూత్రప్రాయముగ చెప్పఁబడినది. కాని ఆ బ్రహ్మ మిట్టి స్వరూపముగలదని (ఇదివఱకు) తెలుపఁబడియుండలేదు. కనుక అట్టి బ్రహ్మముయొక్క లక్షణమిట్టిదని చెప్పి బ్రహ్మస్వరూపనిర్ధారణ కొఱకును, ముందు ముందు చెప్పఁబోవు లక్షణముగల బ్రహ్మమిట్టిదని తెలిసినపిదప ఆ బ్రహ్మము ప్రత్యగాత్మయేగాని తద్భిన్నము గాదని తెలిసికొనుటకొఱకును, బ్రహ్మవేత్తయగు వానికి బ్రహ్మవిద్యవలన లభించునట్టి ఫలము పరమాప్తి లక్షణరూపమేయని ఎయ్యది చెప్పఁబడినదో అట్టి సర్వాత్మభావమనునది సర్వసంసారాతీతమగు బ్రహ్మస్వరూప భావమే గాని అన్యముగాదని చెప్పుటకొఱకును, ఈ చెప్పఁబోవు "సత్యం జ్ఞాన మనం తం బ్రహ్మ....బ్రహ్మణా విపశ్చితేతి" యను మంత్రము సమామ్నాతమయి నది—చెప్పఁబడినది.

## బ్రహ్మముయొక్క లక్షణము

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను వాక్యము 'బ్రహ్మవిదాప్నోతి పరం' అను వాక్యమునందు ప్రథమమునఁగల 'బ్రహ్మ'మను పదమున కర్థ మిదియని చెప్పెడి లక్షణవాక్యము, సత్యము, జ్ఞానము, అనంతము అను మూడు పదములు తెలిసికొనఁ దగినదిగా చెప్పఁబడిన విశేష్యమగు బ్రహ్మమునకు విశేషణపదములు; కాఁబట్టియే 'సత్యం, జ్ఞానం, అనంతం' అని పదములన్నియు ఒకే విభక్తి కలిగి సమానాధి కరణములయి యున్నవి. సత్య, జ్ఞాన, అనంతములను మూఁడు విశేషణములచేత చెప్పఁబడుచున్న బ్రహ్మము తదితర విశేష్యముల నుండి వేఱు చేయఁబడినది అగు చున్నది. 'నీలం మహత్ సుగంధి ఉత్పలం, (=నల్లగ ఉన్నట్టియు, పరిమళముగ లట్టియు పెద్ద కలువ అని చెప్పినయెడల తద్భిన్నములయిన సకల విశేష్యములకంటె వేఱుగ చెప్పఁబడినది యగుచున్నది గదా.

మతొక పూర్వపక్షము

లోకమునందు ఒక్క జాతికి సంబంధించిన ద్రవ్యములు అనేక విశేషణము లకు తగినవి యున్నప్పుడు మతొక విశేషణమును నిరసించుటకయి విశేషణము సార్థక మగుచున్నది.

ఉదాహరణము:— నీలోత్పలము అని చెప్పినయెడల రక్తోత్పలము కాదు అను విషయమును తెలుపును కావున 'నీల' మను విశేషణము సార్థకమగుచున్నది. కాని ఒకే వస్తువునందు మతొక విశేషణమే సంబంధించఁజాలదు. "అసావేక ఆదిత్యః" అని చెప్పినయెడల మతొక సూర్యుఁడు లేడు. కావున ఆ విశేషణ మెటుల సార్థకముగాదో అదేవిధముగ నీలోత్పల రక్తోత్పలములవలె గాక బ్రహ్మ మొక్కటే గాని అనేక బ్రహ్మములు లోకమున లేవు గావున బ్రహ్మమునకు విశేషణములు చెప్పుట నిరర్థకము.

సమాధానము

మీరు చెప్పినది సరికాదు. ఏలయందురా? ఈ విశేషణములు లక్షణార్థమే ప్రధానముగా గలవిగాని విశేషణ ప్రధానము గలవిగావు. లక్షణమునకు విశేషణము నకు భేదము గలదు. లక్షణలక్ష్యములకును విశేషణవిశేష్యమునకుఁ గల భేద మేమనఁగా?

విశేషణము:—సమానజాతీయములగు విశేష్యములకంటె విశేష్యము భిన్న మయినదని తెలుపుటచేత విశేషణము సార్థకమగుచున్నది. ఉదా:—ఎఱ్ఱగలువ కలువ యను సమానజాతియందుఁగల నల్లగలువ కంటె భిన్నమయిన దను విషయమును "ఎఱ్ఱ" యను విశేషణము తెలుపుచున్నది.

లక్షణము:—దీనికంటె భిన్నములగు అన్నిటికంటె భేదమును తెలుపునది యగుచున్నది.

ఉదాహరణము:— ఆకాశము అవకాశము గలది. అట్లనుటచేత అవకాశ వత్త్వము భూజలాగ్ని వాయువులకంటె విలక్షణమ యినదని సిద్ధించుచున్నది.

ఈ సత్య, జ్ఞాన, అనంత, శబ్దములు పరస్పరము విశేషణవిశేష్యభావము గలవికావు. తెలిసికొనఁదగినదని చెప్పఁబడిన బ్రహ్మమునకు విశేషణభూతములు కావున సత్యం. జ్ఞానం. అనంతం అను ఒక్కొక్క శబ్దము పరస్పర సంబంధము లేక బ్రహ్మశబ్దమునకే సంబంధము గలిగియున్నది. అనఁగా సత్యం బ్రహ్మ, జ్ఞానం బ్రహ్మ, అనంతంబ్రహ్మ, అని; ఏది ఏ రూపముచేత నిశ్చితమయి తర్వాత తద్రూ

పము నుండి వేఱుబాటును పొందదో అది సత్యము. ఎయ్యది ఒక రూపముచేత నిశ్చితమయి తర్వాత తద్రూపమును వదలుచున్నదో అది అనృతమనియు నిశ్చయింప బడి యున్నది. కావుల వికారము అనృతము, వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం'' (ఛాందో. ౬. ౧. ४) అను శ్రుతి ప్రమాణానుసారము సత్తే సత్యమయినదని నిర్ణీతము కావున 'సత్యం బ్రహ్మ' యని బ్రహ్మమును వికారమునుండి వారించుచున్నది. కావున బ్రహ్మము సర్వమునకు కారణభూతమగు చున్నది. కారణమని చెప్పినప్పుడు కారకత్వమగుచున్నది. ఎప్పుడు కారకత్వమగు చున్నదో అప్పుడు మృత్తికవలె అచిద్రూపత్వము కావలసివచ్చుచున్నది. తన్నిరాసార్థము 'జ్ఞానం బ్రహ్మ' అని చెప్పఁబడినది. జ్ఞానమనఁగా ఇచట జ్ఞప్తి-అవబోధము ఇచ్చటి జ్ఞానశబ్దము భావసాధనముగాని జ్ఞానకర్తృకముగాదు. సత్య, అనంతశబ్దములు ఎట్లు బ్రహ్మవిశేషణములో, అట్లే యీ జ్ఞానశబ్దమున్నూ బ్రహ్మమునకు విశేషణ మగుచున్నది. జ్ఞానకర్తృకమయినయెడల సత్యత్వ, అనంతత్వములు ఉపపన్నము కాఁజాలవు; ఎప్పుడు జ్ఞానకర్తృత్వమగునో అప్పుడు వికారించును కావున వికారించునది సత్యమున్నూ అనంత్యమున్నూ ఎన్నటికిన్నీ కాఁజాలదు: ఎయ్యది దేని వల్లనుండియు విభజించుటకు వీలు కాదో అయ్యది అనంతమని చెప్పఁబడును. జ్ఞానకర్తృత్వమయినయెడల జ్ఞేయజ్ఞానములతో ప్రవిభక్తము తీరవలయును. అట్టి ప్రవిభక్తమగునది అనంత మెన్నటికిని కాఁజాలదు. ''యత్ర........నాన్యద్విజానాతి సభూమా, అథ....యత్ర....అన్యద్విజానాతి తదల్పం (ఛాందో. ७. ౨. ४. ౧.) అను శ్రుతియు పైయర్థమునే ప్రతిపాదించుచున్నది.

'నాన్యద్విజానాతి' అను శ్రుతి విశేషమును ప్రతిషేధించుటచేత ఆత్మను తెలిసికొనునది అని చెప్పుట యుక్తము కావచ్చునుగదా యను యెడల అట్లనరాదు. ''యత్రనాన్యద్విజానాతి స భూమా'' అను శ్రుతివాక్యము 'భూమలక్షణ విధిపర' మయి యున్నది. 'యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా' ఎచ్చట మఱొకదానిని చూడదో మఱొకదానిని వినదో మఱొకదానిని తెలిసికొనదో అది భూమ) అనునది భూమ లక్షణము. ఒకఁడు మఱొకదానిని చూచుట లోకప్రసిద్ధము. లోకప్రసిద్ధమయిన ఈ భేదమును అనువదించుచు అట్టి విషయము ఏ వస్తువునకు లేదో అది భూమ యని భూమస్వరూపము తెలుపఁబడినది. అన్యగ్రహణము ప్రాప్త ప్రతిషేధార్థమేగాని ఆత్మయందు క్రియాస్తిత్వపరముగాదు. భూమలక్షణ వాక్యము నందు ఆత్మయందు భేదము లేదు కావున విజ్ఞానమునకు అనుపపత్తి యగుచున్నది.

(బ్రహ్మము జ్ఞానకర్మమయినయెడల వచ్చునట్టి విరోధమేమందువా?) ఆత్మవిజ్ఞేయము. తెలిసికొనఁదగినది అయినయెడల జ్ఞాత లేకపోవును గదా!

ఒక ఆత్మయే జ్ఞేయుఁడును. జ్ఞాతయు అని ద్వివిధముగా నుండవచ్చును (అసలీ మతము భాట్టమతమువారిది. వారు ఆత్మ చిజ్జడ రూపాంశములు గలవాఁడనియు, చిదంశచేత జ్ఞాతగను జడాంశచేత జ్ఞేయముగను ఉండవచ్చును అని యుందురు. అనునెడల అది అసంగతము. విభాగము లేకపోవుటచేత అట్టిస్థితి సంభవింపజాలదు. అవయవవిహీనమయినది ఒకేసారి జ్ఞేయము గను జ్ఞాతగను ఉండఁజాలదు. ఆత్మ ఘటాదికమువలె తెలిసికొనఁదగినయెడల జ్ఞానోపదేశము సార్థకము కాఁజాలదు. జ్ఞాతృత్వము నంగీకరించినయెడల అనంతత్వము ఉపపన్నము కాదు. జ్ఞానకర్తృత్వాదివిశేషణముగలది సన్మాత్రము కాజాలదు. తత్సత్యం (తై. ఉ. ౨. ౬. ౨ ౩.) అను శ్రుతి సన్మాత్రమే సత్యమని చెప్పుచున్నది. ఇచట గల జ్ఞానశబ్దము సత్య. అనంత, శబ్దములతో చేర్చి ప్రయోగింపఁబడుటచేత యీ జ్ఞానశబ్దము 'భావసాధనము' 'జ్ఞానం బ్రహ్మ' అను ప్రయోగ మిచట కర్తృత్వాదికారక నివృత్త్యర్థము మృదాదికమువలె జడరూపనివారణార్థము ప్రయుక్తమయినది.

'జ్ఞానం బ్రహ్మ' యని ఇచట చెప్పఁబడినది. లౌకికజ్ఞానము అంతవత్తు అగుటవలన జ్ఞానశబ్దవాచ్యమగు బ్రహ్మము కూడ అంతవత్తేయని సిద్ధించుచుండఁగా తన్నిరాసార్థము 'అనంతం' అని చెప్పఁబడినది.

## పూర్వపక్షము

సత్యాదిశబ్దములు, అనృతనివృత్తిపరములుగాఁ గనఁబడుచుండుటచేతను, విశేష్యమగు బ్రహ్మము ఉత్పలాదికమువలె ప్రసిద్ధమయినది గాకపోవుటచేతను.

శ్లో. మృగతృష్ణాంభసిస్నాతః ఖపుష్పకృతశేఖరః,
ఏషవంధ్యాసుతో యాతి శశశృంగధనుర్ధరః.

అను ప్రమాణమువలె సత్యాది శబ్దములు శూన్యార్థప్రతిపాదకములే కావలసి వచ్చుచున్నవి.

## సమాధానము

అట్లనరాదు. ఇచట చెప్పఁబడిన సత్య, జ్ఞాన, అనంతశబ్దములు లక్షణార్థకములు. సత్యాది శబ్దములు విశేషణము లయినప్పటికిన్ని లక్షణార్థప్రధానములని యిద్దివణికే చెప్పియున్నారము. లక్ష్యము శూన్యమగునెడల లక్షణప్రవచనము నిరర్థక

మగునుగదా. సత్యాదిశబ్దములు లక్షణార్థప్రధానపరములగుటచేత శూన్యార్థప్రతిపాదకములనుట పొసగదు, సత్యాది శబ్దములు విశేషణార్థపరమయినప్పటికిన్నీ స్వార్థపరిత్యాగ మిట లేదు. సత్యాది శబ్దములు శూన్యార్థ ప్రతిపాదకము లగునెడల విశేష్యమునందు నియంతృత్వమును పొందఁజాలవు. సత్యాది పదములు శూన్యార్థప్రతిపాదకములుగాక అర్థవత్త్వము లగునెడల తద్విపరీత ధర్మములు గల విశేష్యముల నుండి విశేష్యమయిన బ్రహ్మమునకు నియంతృత్వముపపన్న మగుచున్నది. బ్రహ్మశబ్దము కూడ స్వార్థముచేత ఇచట సార్థకమగుచున్నది. (అనఁగా బ్రహ్మము 'బృహబృంహి వృద్ధౌ 'అను ధాతువువల్ల నుండి పుట్టినది కావున నిరతిశయమహత్త్వ ధర్మసంపన్నమైనది అను అర్థము గలది యగుచున్నది) అనంతశబ్దము అంతవత్త్వమును ప్రతిషేధించుచు బ్రహ్మమునకు విశేషణమగుచున్నది. సత్యజ్ఞానశబ్దములు స్వార్థసమర్పణముగ విశేషణము లగుచున్నవి.

'తస్మాద్వా ఏతస్మాదాత్మనః' (తై. ఉ. ౨. ౧.) అని మున్ముందు బ్రహ్మమునకు ఆత్మశబ్దమును ప్రయోగించి యుండుటచేత వేదితయొక్క ఆత్మయే బ్రహ్మము. 'ఏతమానందమయ మాత్మాన ముపసంక్రామతి' అని ఆత్మత్వమును శ్రుతియే గనంబఱుచుచున్నది. (తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్. (తై. ఉ. ౨-౬) ఆ యాత్మయే జీవరూపముతో శరీరమును ప్రవేశించినటుల శ్రుతి ప్రతిపాదించుచున్నది. కనుక వేదితయొక్క స్వరూపమే బ్రహ్మము.

## పూర్వపక్షము

బ్రహ్మమన్నను ఆత్మయన్నను ఒక్కటియే యను నెడల అనఁగా బ్రహ్మము ఆత్మ యగునెడల జ్ఞానమునకు కర్తృత్వము వచ్చి తీరును. ఆత్మజ్ఞాతయనుట సుప్రసిద్ధముగదా. సోఽకామయత (తై. ఉ. ౨. ౬. బృహ. ౧. ౨. ౪.) యను శ్రుతి ఆత్మ కామించినటుల తెలుపుచున్నది. కామి యనఁగా జ్ఞానకర్త యని ప్రసిద్ధము. జ్ఞానకర్తృత్వమగుటవలన జ్ఞప్తి బ్రహ్మమనుట ఉపపన్నముగాదు. మఱియు అనిత్యము కూడ అగుచున్నది ఒకవేళ జ్ఞప్తి - జ్ఞానము భావరూపత్వమును బ్రహ్మమున కంగీకరించునెడల అప్పటికిన్నీ అనిత్యత్వము పోఁజాలదు. పారతంత్ర్యమును కూడ బ్రహ్మమునకు అంగీకరించితీరవలయును.

## సమాధానము

అట్లనరాదు. ఆత్మస్వరూపముకంటె వేఱుగాని జ్ఞప్తియందు కార్యత్వము ఔపచారికముగాని వాస్తవము కాదు. ఆత్మయొక్క స్వరూపమగు జ్ఞప్తి ఆత్మకంటె

భిన్నమనుటకు ప్రమాణము లేదు కావున నిత్యమే యగుచున్నది. అయినప్పటికిన్ని ప్రత్యగాత్మోపాధిభూతమయినట్టియు, చక్షురాదిద్వారములచేత విషయాకారముగ పరిణమించినట్టి బుద్ధియొక్క విషయభూతము లయిన యేశబ్దాద్యాకారావభాసములు పుట్టుచున్నవో, అవి ఆత్మజ్ఞానమునకు విషయభూతములయి పుట్టింపఁబడుచున్నవానివలె ఆత్మ విజ్ఞానముచేత వ్యాప్తములయి పుట్టుచున్నవి. ఆత్మజ్ఞానభాస్యములును, విజ్ఞాన శబ్దవాచ్యములును, ధాత్వర్థభూతములును అగు ఆధర్మములు ఆత్మయొక్క వికార రూపములే యని అవివేకులు తలంచుచున్నారు. బ్రహ్మము యొక్క విజ్ఞానము మాత్రము సూర్యప్రకాశమువలెను అగ్న్యుష్ణత్వమువలెను బ్రహ్మస్వరూపముకంటె వేఱుగాని స్వరూపమేగాని బ్రహ్మస్వరూపమునకు వేఱయినది మాత్రము కాఁజాలదు. నిత్యాత్మస్వరూపమగుటవలన కారణాంతరాధీనము కాఁజాలదు. సకలపదార్థములు ఆ బ్రహ్మముకంటె వేఱయిన దేశకాల విభాగములు లేని వగుటవల్లను, కాలాకాశాదికమునకు కూడ ఆ బ్రహ్మమే కారణమగుటవల్లను, నిరతిశయ సూక్ష్మస్వరూపుఁడగుటవల్లను ఆ బ్రహ్మముకంటె వేఱయినది తెలిసికొన శక్యముకానిది. సూక్ష్మమయినది సమీపమునందున్నది దూరమునందున్నది భూతవర్తమానభవిష్యత్కాలము లందుండజాలదు. కావుననే ఆ బ్రహ్మము సర్వజ్ఞము. ఈ విషయమునే యీ క్రింది శ్రుతులు ప్రతిపాదింపుచున్నవి:—

౧. మం. అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షు స్సశృణోత్యకర్ణః,
సవేత్తి వేద్యం నచతస్యాస్తి వేత్తా
తమాహు రగ్ర్యం పురుషం మహాన్తమ్. శ్వేతాశ్వ. ౩-౧౯

౨. న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్నతు తద్ద్వితీయ మస్తి. బృహదార. ౪-౩-౩౦.

విజ్ఞాతృ స్వరూపముకంటె వేఱుగాకపోవుటవల్లను, కరణాదిసాధన సమగ్రియొక్క అపేక్ష లేకపోవుటవల్లను, బ్రహ్మము జ్ఞానస్వరూపమయినప్పటికిన్ని నిత్యత్వముగలదియని ప్రసిద్ధిగలదు. అందువలన ఆ బ్రహ్మము ధాత్వర్థము కాదు, మఱియు క్రియారూపమున్నూ గాదు. అందువల్లనే జ్ఞానకర్తృకముకాదు.

## బ్రహ్మము శబ్దవాచ్యము కాదు

అందువల్లనే బ్రహ్మము జ్ఞానశబ్దవాచ్యముకూడ కాజాలదు. అయినప్పటికిన్ని జ్ఞానాభాసవాచకమయినట్టియు, బుద్ధిధర్మ విషయమైనట్టియు, జ్ఞానశబ్దముచేత ఆ

బ్రహ్మము సూచింపఁబడుచున్నది కాని చెప్పఁబడుట లేదు. బ్రహ్మము శబ్దప్రవృత్తి హేతుభూతమయిన జాత్యాదిధర్మరహితమగుటచేత శబ్దముచేత ప్రతిపాదింపఁబడ శక్యముకాదు. ఇట్లే సత్యానంతశబ్దముల విషయమునుకూడ గ్రహించవలయును. బ్రహ్మము సర్వవిశేషప్రత్యస్తమితస్వరూపము గలది యగుటచేత బాహ్యసత్తా సామాన్యవిషయకమయిన సత్యశబ్దము చేత బ్రహ్మము సూచింపఁబడుచున్నది కాని సత్యశబ్దవాచ్యము మాత్రము బ్రహ్మము కాఁజాలదు. ఇటుల సత్యాదిశబ్దములు ఇతరేతర సన్నిధియందు అన్యోన్యము నియమ్యనియామకభావమును పొందినవై సత్యాదిశబ్ద వాచ్యము నుండి నివర్తకములయి బ్రహ్మముయొక్క లక్షణార్థము గల వగుచున్నవి. అందువల్లనే

౧. యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ. తై. ఉ. ౨. ౪. ౧.

౨. అనిరుక్తేఽనిలయనే. తై. ఉ. ౨. ౭.

అను శ్రుత్యనుసారము, బ్రహ్మము శబ్దార్థవాచ్యము కాఁజాలదని సిద్ధించును. మఱియు బ్రహ్మము నీలోత్పలమువలె వాక్యార్థముకూడ కాఁజాలదు, పైన చెప్పఁబడిన లక్షణముగల బ్రహ్మమును గుహయందు ఉన్నదానినిగా ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో అట్టి వాఁడు సకల కామములను పొందును. ఇచట గుహాశబ్దము 'గుహసంవరణే' అను ధాతువువల్లనుండి పుట్టినది, "నిగూఢా అస్యాం జ్ఞానజ్ఞేయజ్ఞాతృపదార్థా ఇతి గుహా-బుద్ధిః = జ్ఞానజ్ఞేయ జ్ఞాతృపదార్థత్రయము దేనియందు లీనమై యున్నదో అది గుహ-అనగా బుద్ధి (బుద్ధి నిరోధసమయమునందు జ్ఞాత్రాదిపదార్థములు భేదముగాఁ గనంబడుట లేదు గావున దానియందు (బుద్ధియందు) లీనమయియున్నదవి తలంచవలయును. (గుహాశబ్దమునకే మఱొక వ్యుత్పత్తి చెప్పఁబడుచున్నది) లేక "నిగూఢా అస్యాం భోగాపవర్గౌ పురుషార్థౌ ఇతివా"—(భోగాపవర్గములను పురుషార్థములు దీనియందు లీనమయియున్నవి కనుక గుహ యనంబడును, భోగాపవర్గములు బుద్ధి పరిణామము లగుటచేత అవి బుద్ధియందు నిలీనములయి యున్నవని భావము) ఆ బుద్ధి యను గుహయందు గల పరమమయిన ఆకాశమునందు—అవ్యాకృతాఖ్యమునందు—అవ్యాకృతాకాశము పరమవ్యోమమగును గాని భూతాకాశము పరమవ్యోమశబ్దవాచ్యము కాదు. "ఎతస్మిన్నుఖల్వక్షరే గార్గ్యాకాశః" (బృ ౩-౮-౧౧) అను శ్రుతి పై విషయమును సూచించుచున్నది.

లేక 'గుహాయాం వ్యోమన్' అని సామానాధికరణ్యము చేసి పరమ వ్యోమ యనఁగా అవ్యాకృతాకాశమనే గుహయందు ఉన్నటువంటి బ్రహ్మము నెవ్వఁ డెఱుఁ

గునో అనియు అర్థమును గ్రహించవచ్చును. గుహాశబ్దమును అవ్యాకృతాకాశపరముగా అర్థమును చెప్పినప్పుడు ఆ గుహాశబ్దమునకు "నిగూఢాః సర్వే పదార్థాః త్రిషు కాలేషు కారణత్వాత్ సూక్ష్మతరత్వాచ్చ" అని వ్యుత్పత్తి. ఇచ్చట ద్వివిధమయిన వ్యుత్పత్తిని ఆచార్యులవారు భాష్యమునందు చెప్పియున్నను రెండవ యర్థమును ఇతరులు చెప్పెడి పక్షమును అనువదించుటకు చెప్పిరిగాని వారి స్వాభిప్రాయము ప్రథమవ్యుత్పత్తియందే యని స్పష్టము కనుక హార్దమయిన పరమవ్యోమ యని చెప్పుటయే న్యాయము. ఏల యనఁగా ఇచట 'హృదయాకాశము విజ్ఞానాంగముగా వివక్షితమయి యున్నది. హృదయాకాశమే పరమవ్యోమ యని శ్రుత్యంతరము కూడ గలదు:—

యో వై స బహిర్ధా పురుషా దాకాశః .... యో వై సో ఽంతః పురుష ఆకాశః.... యోఽయ మంతర్హృదయ ఆకాశః.

ఛాందో. ౩. ౧౨. ౭. ౮, ౯.

(హృదయాకాశమునందున్న ఇట్టి బ్రహ్మము నెవ్వఁ డెఱుంగునో వాఁడు బ్రహ్మస్వరూపముతో సకలానందముల ననుభవించును. ఇచట హృదయాకాశమునే గుహ యని శ్రుతి ప్రతిపాదించెను. స్థూలదేహమే అన్నమయకోశము, దానిలోపల ప్రాణమయకోశము, ప్రాణమయకోశము లోపల మనోమయకోశము, మనోమయ కోశము లోపల విజ్ఞానమయకోశము, విజ్ఞానమయకోశము లోపల ఆనందమయ కోశము. ఈ పంచకోశ పరంపరయే గుహ యనంబడుచున్నది. ఈ పంచకోశ గుహ యందున్న సర్వకారణమగు ఏ యవిద్యగలదో అదియే హృదయాకాశము. అదియే పరమవ్యోమ.) అట్టి బుద్ధి గుహయందు బ్రహ్మము స్ఫుటముగా పొందఁబడును. (అనఁగా బుద్ధి గుహయందు ద్రష్టృ, శ్రోతృ, మంతృ, విజ్ఞాతృ మున్నగు విశేషములతో గనంబడు నని భావము) లేనియెడల బ్రహ్మము సర్వగతమగుటచేత విశిష్ట దేశకాల సంబంధము గలదని చెప్పుట యుక్తము కాదు గదా.

ఎవ్వఁ డీ విధముగా బ్రహ్మము నెఱుంగునోవాఁడు సకల భోగములను పొందు చున్నాఁడు. ఇచట భోగములను పొందుటయనఁగా అస్మదాదుల వలె దారాపుత్రధన స్వర్గాది భోగము లను అభిప్రాయము కాదు. బ్రహ్మభూతుఁ డయిన విద్వాంసుఁడు సూర్యప్రకాశమువలె నిత్యమయినట్టియు, బ్రహ్మస్వరూపమునకు వేఱుకానట్టియు, జ్ఞానస్వరూపముతో సకల కామములను ఒకే పర్యాయము పొందును. లోకమునందు సాంసారికులగు జీవులు ధర్మాది నిమిత్తాపేక్షములును, చక్షురాది కరణాపేక్షములును అగు కామములను క్రమముగా ఎటుల పొందుచున్నారో అట్లుగాక సర్వజ్ఞుఁడును

సర్వగతుఁడును నిత్యబ్రహ్మస్వరూపుఁడును అగు ఆత్మతో ధర్మాదినిమిత్తాపేక్షములు కానట్టియు, చక్షురాదీంద్రియముల నపేక్షింపనట్టియు, సకల కామములను మేధావి యగు బ్రహ్మముతోడ సర్వజ్ఞస్వరూపముతో పొందుచున్నాఁడు. ఇతి శబ్దము మంత్రము సమాప్తమయినదని సూచించును.

౧. బ్రహ్మ = సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.

౨. విత్ = యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్.

౩. ఆప్నోతి = సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహ.

౪. పరమ్ = బ్రహ్మణా విపశ్చితేతి.

అను నాల్గు పదములకు నాల్గు వాక్యములు వ్యాఖ్యానరూపము లని యెఱుంగ వలయును.

సంగ్రహముగ "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" యను మంత్రము చేత వ్యాఖ్యానము చేయఁబడిన విషయమునే విస్తారముగ వ్యాఖ్యానము చేయుటకుఁగాను "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" మున్నగు గ్రంథ మారభింపఁ బడినది.

'బ్రహ్మవిదాప్నోతి పరం' అని సూత్రితమయిన వాక్యమునకు వివరణభూత మయిన 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని మంత్ర ప్రథమపాదమునందు చెప్పఁ బడియున్నది. ఆ మంత్రమునందు చెప్పఁబడిన సత్యము, అనంత్యము అనుట యెట్లు? అందు అనంతత్వము దేశ, కాల. వస్తు సంబంధముచేత త్రివిధము. ఉదాహరణము- దేశసంబంధముచేత అనంతమున కుదాహరణము ఆకాశము. ఆకాశమునకు దేశ సంబంధముచేత పరిచ్ఛేదము లేదుగదా. కాని ఆకాశము కార్యమగుటచేత కాలము చేతను, వస్తువుచేతను (ఆకాశమునకు) పరిచ్ఛిన్నత్వమున్నది. బ్రహ్మము అకార్య మగుటచేత ఆకాశమువలె కాల, వస్తువులచేత పరిచ్ఛిన్నమగునదికాదు. కార్యమయిన వస్తువు కాలముచేత పరిచ్ఛిన్నమగును, బ్రహ్మము అకార్యమగుటచేత కాలపరిచ్ఛిన్నము కాఁజాలదు. అదేవిధముగా బ్రహ్మము వస్తుపరిచ్ఛిన్నము కూడ కాఁజాలదు. వస్తు పరిచ్ఛిన్నము కాని దనుట యెట్లనఁగా సర్వస్వరూపమయినదగుటవలన. భిన్నమయిన వస్తువు వస్త్వంతరమునకు అంతమగుచున్నది. వస్త్వంతరబుద్ధి మఱొక వస్తువు ప్రసక్తమయినప్పుడు నివృత్తియగుచున్నది. దేనివల్లనుండి దేనియొక్క బుద్ధి నివృత్తి యగుచున్నదో అది దానికి అంత మని చెప్పవలయును. అదెట్లనఁగా గోత్వ

బుద్ధి అశ్వత్వమును చూడగనే నివృత్తి యగుచున్నది కావున గోత్వము అశ్వత్వాంత మని అంతము గలది యగుచున్నది. ఇట్టి అంతవత్త్వము భిన్నములయిన వస్తువు లందు గనంబడుచున్నది. బ్రహ్మమునకిట్టి భేదము లేదు కావున బ్రహ్మము వస్తుత్వము చేత కూడ అనంతమని గ్రహించవలయును.

ప్రశ్న:—బ్రహ్మమునకు సర్వానన్యత్వమనుట యెట్లు?

సమా:—చెప్పెదను, బ్రహ్మము కాలాకాశాది సర్వవస్తువులకు కారణభూత మయియున్నది. కార్యాపేక్షచేత వస్తువునకు అంతవత్త్వము కలుగకూడదా? యను నెడల అట్లనరాదు. కార్యమగు వస్తువు అనృతముగదా? నిజమునకు చూడఁగా కార్య మనునది కారణముకంటె భిన్నముగా వాస్తవముగా లేదుగదా. 'వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యం (ఛాందో. ౬. ౧. ౪.) అను యీ విషయమునే శ్రుతి ప్రతిపాదించుచున్నది. ఇదేవిధముగ 'సదేవ....సత్యం' అను శ్రుతియు గలదు. ఆకాశాదికమునకు కారణభూతమగుట వలన 'దేశతః' ఆనంత్యము బ్రహ్మమునకు సంభవించును. ఆకాశము 'దేశతః' అనంత మని లోకమునందు ప్రసిద్ధికూడఁగలదు గదా. అట్టి యాకాశమునకు కూడ బ్రహ్మము కారణమగుటచేత బ్రహ్మము కూడ 'దేశతః' అనంతమని సిద్ధమగుచున్నది, లోకమునందు కూడ సర్వ గతము కాని దానివల్లనుండి సర్వగతమగునది పుట్టుచుండుట లేదుగదా. కావున బ్రహ్మము దేశతః-నిరతిశయముగ ఆనంత్యమని యంగీకరించి తీరవలయును. అకార్య మగుటచేత కాలతః - ఆనంత్యమగుచున్నది. బ్రహ్మముకంటె భిన్నమయిన వస్త్వం తరము లేకపోవుటచేత వస్తుతః - ఆనంత్యము సిద్ధమగుచున్నది. అందువల్ల బ్రహ్మము నిరతిశయ సత్యమయినది.

## సృష్టివిషయము

'తస్మాత్ వా ఏతస్మాత్ ఆత్మనః' అను మంత్రమునందుఁగల 'తస్మాత్' అను పదమువలన 'బ్రహ్మవిదాప్నోతి పరం' అను సూత్రభూతమూల మంత్రమునందు సూచింపఁబడిన బ్రహ్మము పరామర్శింపఁబడుచున్నది. 'ఏతస్మాత్' అను పదము వలన 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను మంత్ర వాక్యముచేత లక్షితమయిన బ్రహ్మ ముపలక్షితమగుచున్నది. అనఁగా ఏ బ్రహ్మము ఆదియందు 'బ్రహ్మవిదా ప్నోతి పరం' యను బ్రాహ్మణవాక్యముచేత సూత్రితమైనదో. ఏ బ్రహ్మము తరువాత 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యని లక్షణనిరూపణచేత లక్షితమైనదో, అట్టి యీ బ్రహ్మము ఆత్మశబ్దవాచ్యము, ఆ బ్రహ్మము సర్వమునకు ఆత్మభూతము 'తత్సత్యం

స ఆత్మా. (ఛాందో. ౬. ౮. ౭) అను శ్రుతి యీ విషయమును తెలుపుచున్నది. కావున బ్రహ్మయే ఆత్మ.

అట్టి బ్రహ్మమువల్ల నుండి శబ్దగుణము గలదియు, మూర్తద్రవ్యములకు అవకాశము నొసంగునదియు నగు ఆకాశము జనించెను.

అట్టి యాకాశస్వరూపమును పొందిన బ్రహ్మమువల్ల నుండి వాయువు జనించెను. ఈ వాయువు స్పర్శగుణము గలది. ఈ వాయువునకు కారణమగు ఆకాశము యొక్క గుణమగు శబ్దగుణము గూడ కలసి వాయువు ద్విగుణమగుచున్నది.

అట్టి వాయుస్వరూపమును పొందిన బ్రహ్మమువల్ల నుండి అగ్ని పుట్టెను. ఈ అగ్నికి స్వగుణము రూపము, వెనుకటి ఆకాశవాయువులయొక్క గుణములగు శబ్దస్పర్శములతోడఁ గలసి మూడు గుణములు గలది యగ్ని యగుచున్నది.

ఇట్టి యగ్నిస్వరూపమును పొందిన బ్రహ్మమువల్ల నుండి జలము పుట్టెను. ఈ జలమునకు స్వగుణము రసము. వెనుకటి ఆకాశము వాయువు అగ్నులయొక్క గుణములగు శబ్దస్పర్శరూపములను మూడు గుణములతోడఁ గలసి జలము నాల్గు గుణములు గలది యగుచున్నది.

ఇట్టి జలస్వరూపమును పొందిన బ్రహ్మమువల్ల నుండి పృథివి పుట్టెను. ఈ పృథివియొక్క స్వగుణము గంధము. వెనుకటి ఆకాశ, వాయు, అగ్ని, జలముల యొక్క గుణములగు శబ్ద, స్పర్శ, రూప, రసములను నాల్గు గుణములతోడ గలసి ౫ గుణములు గలది పృథివి యగుచున్నది.

బ్రహ్మస్వరూపమును పొందిన ఇట్టి పృథివివల్ల నుండి ఓషధులు పుట్టెను.

ఓషధుల నుండి అన్నము కలిగెను.

(ఇట్లే సర్వత్ర గ్రహించునది.)

రేతోరూపముగ పరిణమించిన అన్నమువల్ల నుండి కరచరణాద్యవయవ విశిష్టుఁడగు పురుషుఁడు జన్మించెను. లోకమునందుఁగల సకల ప్రాణులును ఆ పురుషుఁడును అన్నరసమయులే గదా.

పూర్వపక్షము:— బ్రహ్మము నుండి ఆకాశాదిక్రమముగ అందఱు జన్మించియుండుటచేత అందఱు బ్రహ్మవంశమునకు చేరియున్నారుగదా. అట్టిస్థితిలో ''పురుషుఁడు అన్నరసమయుఁడు'' అని ఏల గ్రహించినారు?

సమాధానము:— ప్రాణు లందఱు బ్రహ్మవంశమునకు చేరినవారైనను కర్మజ్ఞానాధికారి యగు పురుషుఁడు ప్రాధాన్యము కావున 'సవా ఏషపురుషః' అని పురుషుఁడు చెప్పఁబడినాఁడు.

పురుషుని యందు ఆత్మ జ్ఞానాతిశయ రూపమున ప్రకటముగ నుండుననియు, తదితరగవాశ్వాది ప్రాణి జాతమునందు ఇట్టి ప్రకటస్థితి యుండదనియు, ఆకలి దప్పులుమాత్ర మవి ఎఱింగి తన్నివారణార్థము మాత్రము ప్రయత్నించుననియు ఐతరేయశ్రుతి యీ విధముగ వచించుచున్నది:—

పురుషేత్వేవాఽఽవిస్తరామాత్మా; సహిప్రజ్ఞానేన సంపన్నతమో విజ్ఞాతం వదతి, విజ్ఞాతం పశ్యతి. వేద శ్వస్తనం, లోకాలోకౌ, మర్త్యేనామృత మీప్సత్యేవం సంపన్నః; అథేతరేషాం పశూనా మశనాపిపాసే ఏవాభివిజ్ఞానమ్, న విజ్ఞాతం వదంతి న విజ్ఞాతం పశ్యంతి నవిదు శ్వస్తనం న లోకా లోకౌ త ఏతావంతో భవంతి యథా ప్రజ్ఞంహి సంభవాః. (ఐత. ఆరణ్య. ౨-౩-౨.)

అట్టి కర్మజ్ఞానాధికారియగు పురుషుఁడు బ్రహ్మవిద్యాసహాయముచేత ఆత్మ నెఱుంగుటకు ప్రయత్నించుచున్నాఁడు. ఈ పురుషుడు ఆత్మగాని అన్నమయాది కోశములను ఆత్మనుగా స్వభావముగా తలంచుచున్నాఁడు. చిరకాలమునుండి ఇట్టి యభిప్రాయముతో నున్నవానికి ఒకే పర్యాయము నిరాలంబనమగు ఆత్మస్వరూపమును బోధించుట అశక్యము కావున శాఖాచంద్రన్యాయరీతిగ క్రమముగ ఆత్మను బోధింపఁదలఁచి 'తస్యేదమేవశిరః' ఇత్యాదికముగ అన్నరసమయుఁడగు పురుషునకు శిరస్సు మున్నగునవి ఇవి యివి యని చెప్పుచున్నాఁడు-శిరస్సు భుజములు దేహమధ్యభాగము పుచ్ఛభాగము కలిగి పక్షి యుండును కావున అట్లే బ్రహ్మస్వరూపానుసంధానార్థము పక్ష్యాకారముతో ఉపాసించవలసిన అన్నమయరసరూప పరమాత్మకు ప్రాణమయాద్యాత్మ సందర్భమునందు శిరస్సు, పక్షము కానివానియందు శిరస్త్వపక్షత్వాదికము ముందు ముందు శ్రుతియందు విధింపఁబడి యున్నది. కావున ఇచ్చట కూడ అట్లే యగునేమో అని తలంచి అట్టిది లేదనుటకయి ఈ గనంబడు మన శిరస్సే శిరస్సనియు, కుడిచెయ్యి కుడిఱెక్క యనియును, ఎడమచెయ్యి యెడమఱెక్క యనియు, దేహ మధ్యభాగము ఆత్మయనియు, (మధ్యంహ్యేషామంగా నామాత్మా, ఐత. ఆర. ౨.౩.౫. అని శ్రుతి.) నాభికంటె క్రిందిభాగము పుచ్ఛమనియు, ఇటుల భావించి యుపాసించవలయును. అన్నరసమయుఁడును స్థూలదేహాత్మకుఁడును అగు ఉపాసించఁదగిన పక్షిస్వరూప పరమాత్మకు శిరఃకల్పనమునందు శిరస్సును చెప్పుట సరిపోవుచున్నది. ముందు ముందు చెప్పఁబోవు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాత్మలకు శిరఃపక్షాది కల్పనము రూపకముగ చెప్పఁబడుచున్నది. మూసయందు కరిగించిపోసిన తామ్రాదికము ఆ మూసయందు సంఘటితమయియున్న

ప్రతిమాదిస్వరూపము నెట్లు పొందుచున్నదో అట్లే అన్నమయకోశములోపల, ప్రాణమయ కోశము, దానిలోపల మనోమయకోశము, ఆ మనోమయకోశము లోపల విజ్ఞానమయకోశము, ఆ విజ్ఞానమయకోశము లోపల ఆనందమయకోశము ఇటుల తదాకారమును భజించుచున్నదని భావము.

ఈ అన్నమయాత్మను గూర్చియే ఒక మంత్రము - పై యనువాకము ''అన్నాద్వైప్రజాః ప్రజాయంతే'' అనునది చెప్పఁబడ బోవుచున్నది.

వివరణము:—౧. సాయణాచార్యులవారు తా నొనర్చిన ఉపనిషద్భాష్యమునం దీ యుపనిషత్తుల గుఱించి ఇట్లు వ్రాసిరి:—

''సేయం తైత్తిరీయోపనిషత్ త్రివిధా—సాంహితీ, వారుణీ, యాజ్ఞికీచేతి, తత్ర ప్రథమప్రపాఠకే సంహితాధ్యాయస్యోక్తత్వాత్ తద్రూపోపనిషత్ సాంహితీ; ద్వితీయ తృతీయయోః ప్రపాఠకయోః యా బ్రహ్మవిద్యా అభిహితా తస్యాః సంప్రదాయ ప్రవర్తకో వరుణః, తస్మాత్తదుభయరూపోపనిషత్ వారుణీ, చతుర్థప్రపాఠకే యజ్ఞోపయుక్తా అపి మంత్రాః తత్ర తత్ర ఆమ్నాతాః, అతః తద్రూపోపనిషత్ యాజ్ఞికీ (మహానారాయణోపనిషత్) తాసాం తిసృణాంమధ్యేవారుణీముఖ్యా; తస్యాం పరమపురుషార్థస్య బ్రహ్మప్రాప్తి లక్షణస్య సాక్షాదేవ సాధనభూతాయాః బ్రహ్మవిద్యాయాః ప్రతిపాదితత్వాత్'' యాతుదేశవిశేషే 'బ్రహ్మవిత్' ఇత్యారభ్యనవానువాకా ఇతి ప్రసిద్ధిః సాత్వధ్యాపకైః పాఠసౌకర్యాయ పరికల్పితా, నత్వర్థానుసారిణీ, తేహి తదప్యేషశ్లోకోభవతి, ఇత్యస్యాః ప్రతిజ్ఞాయాః శ్లోకపాఠస్యచ మధ్యేతంతమనువాకం సమాపయంతి, నచైతద్యుక్తం కస్యచిదప్యర్థస్యపర్యవసానాభావాత్, తస్మాదితరదేశగతాధ్యాపక ప్రసిద్ధ్యా కృత్స్నాఽప్యయమేక ఏవానువాకః ...యేషాం పునర్నవానువాక కల్పనా తేషామప్యేకవల్లీ ప్రసిద్ధిరస్తి 'బ్రహ్మవల్లీ' ఇత్యేవం తైః అపివ్యాహృతత్వాత్, భగవద్భిఃభాష్యకారైరపి 'ఆనందవల్లీ' ఇత్యేవం వ్యాహృతం. అతోబహుస్కంధ యుక్తవల్లీవత్ బహువిధావాంతరపాఠ భేదయుక్తోఽప్యేక ఏవాయమనువాకః'' (ఈ తైత్తిరీయోపనిషత్తు సాంహితి, వారుణి, యాజ్ఞికి అని త్రివిధము. వీనిలో మొదటి ప్రపాఠకమునందు 'సంహితాధ్యాయ విషయము ప్రతిపాదింపఁబడియుండుటచేత అది 'సాంహితి' యని చెప్పఁబడినది. ద్వితీయ తృతీయ ప్రపాఠకములందు ప్రతిపాదింపఁబడిన బ్రహ్మవిద్యయొక్క సంప్రదాయ ప్రవర్తకుఁడు వరుణుఁడగుటచేత ఆ ప్రపాఠకద్వయము 'వారుణి' యని చెప్పఁబడినది. చతుర్థప్రపాఠకమునందు యజ్ఞోపయుక్తములగు మంత్రములు కూడ చెప్పఁబడి

యుండుటచేత 'యాజ్ఞికి' అని చెప్పఁబడినది. ఈ మూడింటిలో 'వారుణియే' ముఖ్యమయినది. 'బ్రహ్మవిదాప్నోతి పరం' అనునది నవానువాకము లని అధ్యాపకులు పాఠ సౌకర్యార్థము విభజించి చెప్పుచున్నారు కాని అయ్యది ఒక్క అనువాకమనుటయే యుక్తి యుక్తము. ఈ ప్రపాఠకమును శ్రీశంకర భగవత్పాదులవారు 'ఆనందవల్లి' యని వ్యవహరించిరి.

౨. బ్రహ్మణః విశేషాః సత్యాదయః; తై॥ యదా బ్రహ్మవిశేషితం తదా సత్యాది విరుద్ధేభ్యః అసత్యజాడ్యపరిచ్ఛిన్నేభ్యః నిరాకృతం బ్రహ్మసిద్ధ్యతి, యథా— నీలం ఉత్పలం, రక్తం ఉత్పలం, ఇత్యాది ప్రయోగేష్వ క్త్యంతరేభ్యః వ్యావృత్త ముత్పల మవగమ్యతే, తథా యదన్యేభ్యః అసత్యాదిభ్యః అవధార్యతే తద్బ్రహ్మ - ఇత్యేవం వ్యావృత్తత్వే సతి సచ్చిదేకతానం పరిపూర్ణం తదితి జ్ఞాతం భవతి. వ్యావృత్తిశ్చేన్న జ్ఞాయతే తదా అనృతాదిభ్యః వ్యావృత్త్యసిద్ధేః నబ్రహ్మ జ్ఞాతం స్యాదిత్యర్థః.

(అర్థ. అసత్య, జాడ్య, పరిచ్ఛిన్నములయిన దానికంటె వ్యావృత్తమయినది- భిన్నమయినది బ్రహ్మమనుటకు, సత్య, జ్ఞాన, అనంత శబ్దములు ఇచట విశేషితములయిన వని భావము.

౩. లక్షణను గూర్చి శాస్త్రజ్ఞుల యభిప్రాయము:—
'సర్వం హి లక్షణ మితరపదార్థవ్యవచ్ఛేదకమ్.'

(న్యాయవార్తిక. ౧. ౧. ౧౪.)

వ్యావృత్తి వ్యవహారోవా లక్షణస్య ప్రయోజనమ్. తత్రవ్యవహారః=శబ్దవ్యవహారః=శబ్దశక్తి గ్రహః లక్షణజ్ఞానస్యప్రయోజనం యథా-సాస్నాదిమాన్ గౌః-ఇతి లక్షణజ్ఞానేసతి యంయం సాస్నాదిమంతం పిండంపశ్యతి తంతం గోశబ్దవాచ్యం ప్రత్యేతి. ఇతి వ్యావృత్తేః ప్రయోజనవత్త్వే (అభిధేయత్వవ్యావర్తకత్వాదివర్జం) వ్యతిరేకి హేతుర్భవతి ఏతచ్చ 'వ్యావృత్తిర్వ్యవహారోవాలక్షణస్య ప్రయోజనమ్' ఇతి పరోక్తమేకం పక్షమాశ్రిత్యోక్తం, నతు స్వమతం. లక్షణవాక్యమాత్రస్య సిద్ధాంతిభిః అఖండార్థతాభ్యుపగమాత్. ఈ విషయమును గూర్చి సంక్షేపశారీరకగ్రంథమునందు ౧. ౨౧౫ - ౨౩౦ శ్లోకముల గాంచునది.

౪. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాది సందర్భమునందు ఆకాశాది పురుషాంతమగు సృష్టి మంత్రమునందు ప్రతిపాదింపఁబడియున్నది. కాని యీ సృష్టి ప్రదర్శనము ఆత్మకంటె భిన్నముగ ఆకాశాదికము వాస్తవముగ

నున్నది అని తెలుపుటకుఁగాను చెప్పఁబడియుండలేదు. కార్యమెప్పుడున్నా కారణము కంటె భిన్నమయిన సత్త గలది కాదు. బ్రహ్మమెప్పుడు జగద్రూపకార్యమునకు కారణమని చెప్పినారమో అప్పుడే అద్వయత్వము స్ఫుటమగుచున్నది. పరిణామియగు కారణముయొక్క గుణములు కార్యమునందు గనంబడుట సహజమయియున్నది. జ్ఞానము ఆత్మగుణ మగునెడల ఆత్మకార్యములగు భూతములందు గుణము కూడ కనంబడు చుండును. కాని జ్ఞానము ఆత్మస్వరూపముగాని గుణముకాదు. కనుక ప్రపంచమునకు పరమాత్మ వివర్తోపాదానకారణ భూతుఁడగుచున్నాఁడు. వివర్తోపాదానత్వము కల్పితమయిన మాయాశబలితరూపముచేత అగుచున్నది.

శ్రుతియం దచ్చటచ్చట చెప్పఁబడిన సృష్టివిషయకానువాదము బ్రహ్మైవ బోధమునకు ద్వారభూతముగ తెలుపఁబడినది కాని సృష్టిని ఉపాసించుటకుగాని జ్ఞేయమని కాని ప్రదర్శించి యుండలేదు. గౌడపాదాచార్యులవారు కూడ మాండూక్యకారికలయం దిట్లే తెలిపియున్నారు:—

శ్లో. మృల్లోహ విస్ఫులింగాద్యైః సృష్టిర్యాచోదితాఽన్యథా,
ఉపాయస్సోఽవతారాయ నాస్తిభేదః కథంచన. మాండూక్యకారికా ౩. ౧౫.

బృహదారణ్యభాష్యవార్తికము నందు కూడ సృష్టివిషయ మిట్లే అంగీకృతమయినది:—

శ్లో. యథా యథాభవేత్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని,
సా సైవ ప్రక్రియేహస్యాత్సాధ్వీ సాచానవస్థితా.
బృహదారణ్య. భా. వార్తిక. ౧. ౪. ౪౦౨.

సూతసంహితయందు బ్రహ్మగీతలయం దిట్లే చెప్పఁబడినది. వ్యాఖ్యానసహితముగ నీ శ్లోకమును పాఠకులు పఠించిన చాల విషయములను గ్రహించఁగలరు:—

శ్లో. బ్రహ్మరూపాత్మన స్తస్మా దేతస్మాచ్ఛక్తి మిశ్రితాత్,
అపంచీకృత ఆకాశః సంభూతో రజ్జుసర్పవత్. ౩. ౩౪.

బ్రహ్మసూత్రములం దీ క్రింది సూత్రములం దీ విషయము విమర్శింపఁబడియున్నది. ఈ సూత్రములయొక్క శంకరభాష్యమునం దీ విషయము విపులముగ విమర్శింపఁబడియున్నది కావున నచట గాంచునది:—

సూ. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్. (౧. ౪. ౨౩.)
సూ. నవియదశ్రుతేః. ౨. ౩. ౧—౭.
,, కృత్స్నప్రసక్తి ర్నిరవయవత్వశబ్దకోపోవా. (౨. ౧. ౨౬.)

౩. పదియవవాఁడు లేడని దుఃఖించుటయనఁగా:—

పరమానందయ్యగారి శిష్యులు ౧౦ రు కలసి ఒక యూరికిఁ బోవుచు దారిలో ఒక నది ప్రవహించుచుండఁగా వారానదిని దాటి అందఱు అవతలి యొడ్డునకు చేరిరి. ౧౦ రము చేరితిమో లేదో యని వారిలో నొకఁడు ఇతరుల నందఱను లెక్కించి తన్ను మఱచి ౧౦ వ వాఁడు ప్రవాహమున కొట్టుకొని పోయెనని ఏడ్వసాగెను. తక్కినవారందఱు మొదటివానివలెనే తన్నువదలి లెక్కపెట్టుకొని ౧౦ గురిలో ఒకఁడు కొట్టుకొని పోయెనని ఏడ్చుచుండఁగా త్రోవను బోవుచున్న నేర్పరి యొకఁడు వీరి రోదనమునకు కారణము తెలిసికొని వీరి తెలివితక్కువకు చింతించి వారిని వేఱ్వేఱుగ నిలువఁబెట్టి లెక్కించి ౧౦ గురు సుఖముగా నున్నారని తెలుపగా ౧౦ గురము సుఖముగా నున్నామని తర్వాత వారందఱు సంతసించిరఁట. ఆ కథను యిచట దృష్టాంతముగఁ గైకొనవలయును.

౪. శాఖాచంద్రన్యాయ మనఁగా:— విదియనాటి చంద్రుఁ డతి సూక్ష్మముగ నుండుటచేత అందఱకుఁ గనంబడుట కష్టము. అట్టి చంద్రుని చూచినవాఁడు చంద్రుని చూడఁదలఁచిన మఱొకనికి అదుగో చంద్రుఁడని చెప్పిన ఈ ప్రదేశమున చంద్రుఁ డున్నాడని తెలిసికొనజాలఁడు కావున అతనికి ఒక వృక్షమును చూపి ఆ వృక్షముయొక్క పశ్చిమదిశయందున్న ఒకానొక కొమ్మను చూపి అచ్చట చంద్రుఁ డున్నాడని చెప్పును. ఆ శాఖయం దతని దృష్టి చక్కఁగా చేరిన పిదప ఆ కొమ్మ యందున్న మఱొక రెమ్మను చూపి క్రమక్రమముగ చంద్రుఁ డిచట నున్నాఁడని బోధించును. అదేవిధముగ అన్నరసమయాత్మకమగు శరీరమే బ్రహ్మమని బోధించిన తద్భిన్నమగు పుత్రకళత్రాదికమునందు ఆత్మ బుద్ధి నశించును. ఇదేవిధముగ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములను ఆత్మలని నిరూపించినప్పుడు ప్రాణమయకోశమును బోధించినప్పుడు అన్నమయకోశమునందు ఆత్మబుద్ధి నశించును. మనోమయకోశమును బోధించినప్పుడు ప్రాణమయకోశమునందును, విజ్ఞానమయకోశమును బోధించినప్పుడు మనోమయకోశమునందును, ఆనందమయకోశమును బోధించినప్పుడు విజ్ఞానమయకోశమునందును ఆత్మబుద్ధి నశించును. పిదప ఆనందమయకోశమునకున్ను ప్రతిష్ఠాభూతమగు బ్రహ్మమును బోధించినప్పుడు ఆనందమయకోశమునందు బ్రహ్మత్వబుద్ధి నశించుచున్నది.

౧. జీవునకు ౩ శరీరములుండును, వానిలో అన్నరసపరిణామరూపమును, పంచవింశతితత్త్వాత్మకమును, షట్కౌశికమును (త్వక్, అసృక్, మాంస, మేదో, ఒస్థి. మజ్జాత్మకము) అగు స్థూలదేహము అన్నమయకోశమని చెప్పఁబడుచున్నది.

౨. ఈ స్థూలదేహమధ్యభాగమునందు సప్తదశతత్త్వాత్మకమగు సూక్ష్మశరీరము గలదు. ఈ సూక్ష్మశరీరమునందు ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు అంతర్భూతములయి యున్నవి.

౩. ఈ స్థూలసూక్ష్మశరీరములకు హేతుభూతమగు మలినసత్త్వ ప్రధానమగు అవిద్య సుషుప్తియందు ప్రకాశించుచుండును. ఆ యవిద్యయే కారణశరీర మనం బడును. ఈ కారణశరీరము ఆనందమయకోశ మనంబడును.

౬. ఇచట అన్నరసమయశబ్దము చెప్పఁబడినను అంతమునందు 'యేఽన్నం బ్రహ్మోపాసతే' అని ధ్యానము నుపదేశించియుండుటచేతను, శిరఆదికల్పన ముండుటచేతను, విరాడాత్మనుగా గ్రహించుటయే యుక్తమని విమర్శకులు తలంచుచున్నారు.

ఈ బ్రహ్మవల్లియందు అన్నబ్రహ్మ, ప్రాణబ్రహ్మ, మనోబ్రహ్మ, విజ్ఞానబ్రహ్మ, ఆనందబ్రహ్మల యుపాసనము చెప్పఁబడినప్పటికిన్నీ ఉపక్రమాది షల్లింగ విచారానుసారము ఉపనిషత్తాత్పర్యమును పరిశీలించి చూచిన యెడల నిరుపాధిక బ్రహ్మప్రాప్తియే ఉపనిషత్తాత్పర్యమని సిద్ధించుచున్నది.

## షల్లింగసూచక బ్రహ్మవల్లీ వాక్యములు

౧. అ. ఉపక్రమము:—బ్రహ్మవిదాప్నోతిపరమ్ (౧-౧).

౧. ఆ ఉపసంహారము:—ఆనందో బ్రహ్మేతివ్యజానాత్ (౩-౬).

౨. అభ్యాసము:—సయశ్చాయంపురుషే (౨-౮).

౩. అపూర్వత:—యో వేద నిహితం గుహాయామ్ (౨-౧).

౪. ఫలము:—అభయం ప్రతిష్ఠాం విన్దతే, అథసోఽభయఙ్గతో భవతి (౨-౭)

౫. అర్థవాదము:సోఽకామయత.

౬. ఉపపత్తి:—అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతివేదచేత్ (౨-౬) కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ (౨-౫).

## ఈ అనువాకమునకు సంబంధించిన ఇతర గ్రంథములు

భాష్యవార్తికము:—బ్రహ్మ. శ్లో. ౧—౫౬.

అనుభూతిప్రకాశము. అధ్యా. ౨. శ్లో. ౧—౪౮.

ఆత్మపురాణము. అధ్యా. ౧౦. శ్లో. ౧—౧౦౮.



# ౨. ద్వితీయో௨నువాకః



## అన్నమయకోశ వివరణమ్

మం. అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే। యాఃకాశ్చ పృథి
వీగ్ంశ్రితాః। అథో అన్నే నైవ జీవన్తి। అథైనదపి
యన్త్యన్తతః। అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్।
తస్మా త్సర్వౌషధ ముచ్యతే। సర్వం వైతే௨న్నమా
ప్నువన్తి। యే௨న్నం బ్రహ్మోపాసతే। అన్నగ్ంహి
భూతానాం జ్యేష్ఠమ్। తస్మాత్సర్వౌషధ ముచ్యతే।
అన్నాద్భూతాని జాయన్తే। జాతాన్యన్నేన వర్ధన్తే।
అద్యతే௨త్తి చ భూతాని। తస్మాదన్నం తదుచ్యత
ఇతి। తస్మాద్వా ఏతస్మా దన్నరసమయాత్। అన్యో௨
న్తర ఆత్మా ప్రాణమయః। తేనైషపూర్ణః। సవా ఏష
పురుషవిధ ఏవ। తస్య పురుషవిధతామ్। అన్వయం
పురుషవిధః। తస్య ప్రాణ ఏవ శిరః। వ్యానో దక్షిణః
పక్షః। అపాన ఉత్తరః పక్షః ఆకాశ ఆత్మా। పృథి
వీపుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి ॥౨॥

శాంకర భాష్యమ్:—

అన్నాత్ రసాదిభావ పరిణతాత్, వై ఇతి స్మరణార్థః, ప్రజాః స్థావరజఙ్గమాత్మకాః, ప్రజాయన్తే। యాః కాశ్చ అవిశిష్టాః పృథివీం శ్రితాః పృథివీమాశ్రితాః, తాః సర్వా అన్నాదేవ ప్రజాయన్తే। అథో అపి, జాతాః అన్నేనైవ జీవన్తి ప్రాణాన్ధారయన్తి, వర్ధన్త ఇత్యర్థః। అథ అపి, ఏనత్ అన్నమ్, అపియన్తి అపిగచ్ఛన్తి, అపిశబ్దః ప్రతిశబ్దార్థే, అన్నం ప్రతి లీయన్త ఇత్యర్థః; అన్తతః అన్తే జీవన లక్షణాయా వృత్తేః పరిసమాప్తౌ। కస్మాత్? అన్నం హి యస్మాత్ భూతానాం ప్రాణినాం జ్యేష్ఠం ప్రథమజమ్। అన్నమయాదీనాం హి ఇతరేషాం భూతానాం కారణమన్నమ్; అతః అన్నప్రభవా అన్నజీవనా అన్నప్రలయాశ్చ సర్వాః ప్రజాః। యస్మాచ్చైవమ్, తస్మాత్ సర్వౌషధం సర్వప్రాణినాం దేహదాహప్రశమనమన్నముచ్యతే॥

అన్నబ్రహ్మవిదః ఫలముచ్యతే—సర్వం వై తే సమస్తమన్నజాతమ్ ఆప్నువన్తి। కే? యే అన్నం బ్రహ్మ యథోక్తమ్ ఉపాసతే। కథమ్? అన్నజోఽన్నాత్మాన్నప్రలయోఽహమ్, తస్మాదన్నం బ్రహ్మ ఇతి। కుతః పునః సర్వాన్నప్రాప్తి ఫలమన్నాత్మోపాసనమితి, ఉచ్యతే—అన్నం హి భూతానాం జ్యేష్ఠం భూతేభ్యః పూర్వముత్పన్నత్వాజ్జ్యేష్ఠం హి యస్మాత్, తస్మాత్సర్వౌషధముచ్యతే; తస్మాదుపపన్నా సర్వాన్నాత్మోపాసకస్య సర్వాన్నప్రాప్తిః। అన్నాద్భూతాని జాయన్తే, జాతాన్యన్నేన వర్ధన్తే ఇతి ఉపసంహారార్థం పునర్వచనమ్। ఇదానీమన్నశబ్దనిర్వచనముచ్యతే —అద్యతే భుజ్యతే చైవ యద్భూతైః అత్తి చ భూతాని స్వయమ్, తస్మాత్ భూతైర్భుజ్యమానత్వా ద్భూతభోక్తృత్వాచ్చ అన్నం తత్ ఉచ్యతే। ఇతి శబ్దః ప్రథమకోశపరిసమాప్త్యర్థః। అన్నమయాదిభ్య ఆనన్దమయాన్తేభ్య ఆత్మభ్యః అభ్యన్తరతమం బ్రహ్మవిద్యయా ప్రత్యగాత్మత్వేన దిదర్శయిషు శాస్త్రమ్ అవిద్యాకృతపఞ్చకోశాపనయనేన అనేక తుషకోద్రవవితుషీకరణేనేవ తణ్డులాన్ ప్రస్తౌతి—తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాదిత్యాది। తస్మాద్వై ఏతస్మాత్ యథోక్తాత్ అన్నరసమయాత్పిణ్డాత్ అన్యః వ్యతిరిక్తః అన్తరః అభ్యన్తరః ఆత్మా పిణ్డవదేవ మిథ్యాపరికల్పిత ఆత్మత్వేన ప్రాణమయః, ప్రాణః వాయుః, తన్మయః తత్ప్రాయః। తేన ప్రాణమయేన ఏషః అన్నరసమయ ఆత్మా పూర్ణః వాయునేవ దృతిః। స వై ఏష ప్రాణమయ ఆత్మా పురుషవిధ ఏవ పురుషాకార ఏవ శిరఃపక్షాదిభిః। కిం స్వత ఏవ? నేత్యాహ—ప్రసిద్ధం తావదన్నరసమయస్యాత్మనః పురుషవిధత్వమ్; తస్య అన్నరసమయస్య పురుషవిధతాం పురుషాకారతామ్ అను అయం ప్రాణమయః పురుషవిధః మూషానిషిక్త

ప్రతిమావత్, న స్వత ఏవ। ఏవం పూర్వస్య పూర్వస్య పురుషవిధతా; తామను ఉత్తరోత్తరః పురుషవిధో భవతి, పూర్వః పూర్వశ్చోత్తరోత్తరేణ పూర్ణః। కథం పునః పురుషవిధతా అస్యేతి, ఉచ్యతే—తస్య ప్రాణమయస్య ప్రాణ ఏవ శిరః ప్రాణమయస్య వాయువికారస్యప్రాణః ముఖనాసికానిః సరణో వృత్తివిశేషః శిర ఇతి కల్ప్యతే, వచనాత్। సర్వత్ర వచనాదేవ పక్షాదికల్పనా। వ్యానః వ్యానావృత్తిః దక్షిణః పక్షః। అపానః ఉత్తరః పక్షః। ఆకాశ ఆత్మా, య ఆకాశస్థో వృత్తివిశేషః సమానాఖ్యః, స ఆత్మేవ ఆత్మా ప్రాణవృత్త్యధికారాత్। మధ్యస్థత్వాదితరాఃపర్యన్తా వృత్తీరపేక్ష్య ఆత్మా; "మధ్యం హ్యేషామఙ్గానామాత్మా" ఇతి ప్రసిద్ధం మధ్యస్థస్యాత్మత్వమ్। పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా। పృథివీతి పృథివీ దేవతా ఆధ్యాత్మికస్య ప్రాణస్య ధారయిత్రీ స్థితిహేతుత్వాత్। "సైషా పురుషస్యా పానమవష్టభ్య" ఇతి హి శ్రుత్యన్తరమ్। అన్యథా ఉదానవృత్త్యా ఊర్ధ్వగమనం గురుత్వాత్పతనం వా స్యాచ్ఛరీరస్య। తస్మాత్పృథివీ దేవతా పుచ్ఛం ప్రతిష్ఠా ప్రాణమయస్య ఆత్మనః। తత్ తస్మిన్నేవార్థే ప్రాణమయాత్మ విషయే ఏష శ్లోకో భవతి॥

ఇతి ద్వితీయానువాక భాష్యమ్॥

టీక. యాః కాః చ = ఏయవి, పృథివీం = భూమిని, శ్రితాః, = ఆశ్రయించి యున్నవో, (తాః = ఆ సమస్తమయిన,) ప్రజాః=స్థావరజంగమాత్మక ప్రజలు, అన్నాత్ = రసాదిభావముగా పరిణమించిన) అన్నమువలన, ప్రజాయంతేవై = పుట్టుచున్నారు. అథో = మఱియు, అన్నేనైవ = అన్నముచేతనే, జీవంతి=(ప్రాణములను ధరించి) వృద్ధిని పొందుచున్నారు. అథ = తరువాత; ఏనత్ = ఈ యన్నమును గూర్చి, అపియంతి = లయమును పొందుచున్నారు. (యస్మాత్ = ఎందువలన,) అన్నం=అన్నము, భూతానాం = ప్రాణులలో, జ్యేష్ఠం = శ్రేష్ఠమయినదో, తస్మాత్ = అందువలన, (అన్నం = అన్నము) సర్వౌషధం=అందఱకు (క్షుద్బాధానివారకమగు) ఔషధమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

యే = ఎవరు, అన్నం = అన్నమును, బ్రహ్మ = బ్రహ్మముగా, ఉపాసతే= ఉపాసించుచున్నారో, తే = వారు, సర్వం = సకలమయిన, అన్నం = అన్నమును, ఆప్నువంతి = పొందుచున్నారు. (యస్మాత్ = ఎందువలన), అన్నం = అన్నమే, భూతానాం = భూతములలోపల, జ్యేష్ఠంహి = ప్రథమముననే పుట్టినదో, తస్మాత్ = అందువలన, (అన్నం=అన్నము) సర్వౌషధం=సర్వౌషధమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, యే = ఎవ్వరు, అన్నం బ్రహ్మ = అన్నబ్రహ్మమును, ఉపాసతే =

ఉపాసించుచున్నారో, తే = వారు, సర్వం = సమస్తమును, అప్నువంతివై = పొందుచున్నారుగదా, అన్నాత్ = అన్నమువలన, భూతాని = ప్రాణులు, జాయంతే = పుట్టుచున్నవి, జాతాని = పుట్టిన (ప్రాణులు) అన్నేన = అన్నముచేత, వర్ధన్తే = వృద్ధిని పొందుచున్నవి, అద్యతే = (అన్నము) భూతములచేత భక్షింపఁబడుచున్నది, భూతాని = భూతములు, అత్తిచ = (అన్నమును) తినుచున్నవి, తస్మాత్ = అందువలననే, తత్ = అది, అన్నం = అన్నము అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, ఇతి = (అన్నమయకోశ విషయమును వివరించిన మంత్రము) సమాప్తిని పొందినది.

తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, అన్నరసమయాత్ = అన్నరసవికారమయిన ఆత్మకంటె, అన్యః = ఇతరుఁడగు, ప్రాణమయః = ప్రాణమయుఁడగు, అంతరః = అభ్యంతరుఁడగు, ఆత్మా = ఆత్మ కలఁడు. తేన = అట్టి ప్రాణమయాత్మచేత, ఏషః = ఈ అన్నరసమయమగు ఆత్మ, పూర్ణః = పరిపూర్ణుఁడు.

సః = ఆ, ఏషః = ఈ ప్రాణమయాత్మ, పురుషవిధః ఏవవై = పురుషాకారుఁడే గదా, తస్య = ఆ అన్నరసమయునియొక్క, పురుషవిధతాం = పురుషవిధత్వమును, అను = అనుసరించియే, అయం = ఈ ప్రాణమయాత్మ. పురుషవిధః = పురుషవిధుఁడగుచున్నాఁడు.

తస్య = ఆ ప్రాణమయ పురుషునకు, ప్రాణఃఏవ = ముఖమునుండియు నాసికమునుండియు వెడలెడి వాయురూపమగు ప్రాణమే, శిరః = శిరస్సు, వ్యానః = వ్యానవాయువు, దక్షిణఃపక్షః = దక్షిణపు బాహువు, (కుడిచేయి) అపానః = అపానవాయువు, ఉత్తరఃపక్షః = ఎడమచేయి, అకాశః = సమానవాయువు, ఆత్మా = మధ్యభాగము, పృథివీ = భూమి, ప్రతిష్ఠా = అవస్థానభూతమగు. పుచ్ఛం = పుచ్ఛము, తదపి = ఆ విషయమును గూర్చి, ఏషః = ఈ చెప్పబోవునట్టి, శ్లోకః = శ్లోకము - మంత్రము, భవతి = అగుచున్నది.

తా. రసాదిభావముగా పరిణమించిన అన్నమువల్ల నుండి స్థావరజంగమాత్మకమగు ప్రజాసమూహము పుట్టుచున్నది. మఱియు ఏయవి అవశిష్టములయి భూమి నాశ్రయించియున్నవో అవన్నియు అన్నమువల్లనుండియే జన్మించుచున్నవి. అట్లు జన్మించినవన్నియు అన్నముచేతనే జీవించుచున్నవి. మఱియు జీవలక్షణమగువృద్ధి అయిన పిదప అన్నమునందే లీనమయి పోవుచున్నవి.

అన్నము ప్రాణులకంటె ముందుగా జన్మించినది కావున అన్నమయములగు ఇతర భూతములన్నింటికిని అన్నము కారణము. కావున ప్రజలందఱు అన్నమునుండి

పుట్టినవారు. అన్నమే జీవనముగాఁ గలవారలు, అన్నమే ప్రలయముగాఁ గలవారలు. అన్నము సకల ప్రాణులకును ఔషధము - అనఁగా జఠరాగ్నికృతక్షుద్దాహమును శమింపఁజేయునది అని చెప్పఁబడును.

ఎవ్వ రీవిధముగా అన్నబ్రహ్మము నుపాసింతురో వారు సకలవిధమగు అన్న జాతమును పొందెదరు. ఎట్లనఁగా—

నేను అన్నజుఁడను, అన్నాత్మకుఁడను, అన్నప్రలయుఁడను, కావున అన్నము బ్రహ్మము. అన్నాత్మోపాసనమువలన సర్వాన్నప్రాప్తిరూపఫల మెట్లు కలుగుననఁగా చెప్పఁబడుచున్నది.

అన్నమే భూతములకంటె జ్యేష్ఠము. అనఁగా భూతములకంటె ముందు పుట్టినది కావున జ్యేష్ఠమగుచున్నది. అందువలననే "సర్వౌషధ" మనియు చెప్పఁబడుచున్నది. కావున అన్నబ్రహ్మోపాసకునకు సర్వాన్న ప్రాప్తి ఉపపన్నమే యగుచున్నది.

అన్నమువల్ల నుండియే భూతములన్నియు పుట్టుచున్నవనియు, పుట్టిన భూతములు అన్నముచేతనే వృద్ధిని చెందుచున్నవనియు, ఉపసంహారార్థము మఱల చెప్పఁబడినది.

ఇఁక అన్నశబ్దనిర్వచనము చెప్పఁబడుచున్నది:—భూతములచేత భక్షింపఁబడుచున్నది కనుకను, భూతములను భక్షించుచున్నది కావునను అన్నమని చెప్పఁబడుచున్నది. మూలమునందు "తస్మా దన్నం తదుచ్యత ఇతి" అనుచోటగల 'ఇతి' శబ్దము అన్నమయకోశవిషయమయిన మంత్రము సమాప్తమయినదని సూచించుచున్నది.

అన్నమయము మొదలుకొని ఆనందమయమువఱకు గల (కల్పిత) ఆత్మలకంటె అభ్యంతరతమమగు బ్రహ్మమును జ్ఞానముచేత ప్రత్యగాత్మగా శాస్త్రము గనంబఱుచ దలఁచి పెక్కుపొఱలుగల కొట్టుబియ్యముపై ఉండు పొరలను తీసివేసి బియ్యమును గనంబఱుచునటుల అవిద్యాకృత పంచకోశములను క్రమముగా (ఆత్మయని ప్రథమమున బోధించి పిదప) ఆత్మ గాదని నిరసించుచున్నది.

ఆ ఈ అన్నరసమయపిండముకంటె భిన్నమయి, అభ్యంతరమై, పిండమువలె మిథ్యాపరికల్పితమగు ఆత్మ ప్రాణమయమైనది గలదు. ప్రాణమనఁగా వాయువు, తన్మయమనఁగా తత్ప్రాయము, తద్వికారమని భావము.

ఆ ప్రాణమయాత్మచేత ఈ అన్నరసమయాత్మ వాయువుచేత తిత్తివలె పరిపూర్ణమయి యున్నది. ఆ ఈ ప్రాణమయాత్మకు శిరః, పక్ష, మధ్య పుచ్ఛాదికము (చెప్పఁబడియుండుట) చేత పురుషాకారము గలవాఁడే.

అన్నరసమయాత్మకు శిరఃపక్షాదికము ఎటుల సుప్రసిద్ధమో అట్లే (ఈ ప్రాణమయాత్మకు శిరఃపక్షాదికము) స్వయముగా లేదు కాని ఆ అన్నరసమయాత్మయొక్క పురుషాకారము ననుసరించి మూసయందు సంలగ్నమగు ప్రతిమవలె ఈ ప్రాణమయాత్మ పురుషవిధుఁడై యున్నాఁడు. స్వయముగా మాత్రము (పురుషాకారము గలవాఁడు) కాఁడు. ఈ విధముగా పూర్వ పూర్వ పురుషాకారము ననుసరించి ఉత్తరోత్తరమగు పురుషాకారము అగును. పూర్వపూర్వమగు ఆత్మ ఉత్తరోత్తరమగు ఆత్మచేత పూర్ణమయి యుండును. (అనఁగా ప్రాణమయాత్మచేత అన్నమయాత్మ ఎటుల పూర్ణమయినదో, అట్లే ప్రాణమయాత్మ మనోమయాత్మచేత, మనోమయాత్మ విజ్ఞానమయాత్మచేత, విజ్ఞానమయాత్మ ఆనందమయాత్మచేత పరిపూర్ణమయినదని భావము.)

ఈ ప్రాణమయాత్మకు పురుషవిధత్వ మెట్లనఁగా:—

౧. ప్రాణమయమయిన అనఁగా వాయువికారమగు ఆత్మకు ప్రాణము అనఁగా ముఖమునుండియు నాసికాద్వారములనుండియు బయలువెడలెడి విశ్వాసమే 'శిరస్సు' అని కల్పించబడుచున్నది. (ఇటుల కల్పించుటకు నియామకమేమనఁగా) వచనమే - వేదవాక్యమే (ఇందులకు ప్రమాణము.) ముున్ముందు పక్షాదికల్పనము పైతము వచనముచేతనే - వేదవాక్యముచేతనే,

౨. వ్యానమనఁగా - వ్యానవాయువృత్తి విశేషము దక్షిణపక్షము.

౩. అపానవాయువృత్త విశేషము ఉత్తరపక్షము.

౪. ఆకాశము అనఁగా ఆకాశమునందు 'సమాన' మను పేరుగల ఏ వృత్తి విశేషముగలదో అయ్యది ఆత్మ. ప్రాణవృత్త్యధికారమువలన (ఇచట ఆకాశమనఁగా సమానమని గ్రహించవలయును) ఈ సమానవాయువృత్తి మధ్యస్థమగుటచేత ఇతరత్ర ఉండు వృత్తులకంటె (గణనీయమై ఆత్మయగుచున్నది. "మధ్యంహ్యేషా మఙ్గానామాత్మా" శ్రు. బృ. ఆరణ్య. ౨.౩.౫. అను శ్రుతియందు ఆత్మ మధ్యమునం దుండునది అనుట సుప్రసిద్ధము.

౫. పృథివీదేవత ఆధ్యాత్మికమగు ప్రాణమయాత్మను ధరించునది. కావున అనఁగా స్థితిహేతువగుటచేత పుచ్ఛము - ప్రతిష్ఠ యగుచున్నది. ఇందులకు శ్రుతి ప్రమాణము:—

శ్రు. (పృథివ్యాం యా దేవతా) సైషా పురుషస్యాపాన మవష్టభ్య,

ప్రశ్నోపనిషత్. ౩. ౮.

(అర్థ. పృథివియందు ఏ దేవత గలదో ఆ దేవత పురుషునియొక్క అపానమును (అనఁగా ప్రాణమయకోశమును) అవలంబించి.)

లేనియెడల (అనఁగా పృథివీదేవత అవష్టంభనము జేసి శరీరమును నిలిపి యుంచని యెడల) ఉదానవాయువృత్తిచేత ఊర్ధ్వగమనముగాని, గురుత్వముచేత పతనముగాని శరీరమునకు సంభవించును. కావున ప్రాణమయాత్మకు పృథివీదేవత ప్రతిష్ఠాహేతువగు పుచ్ఛము, ఈ ప్రాణమయాత్మ విషయమునందు ఒక శ్లోకము (మంత్రము) చెప్పఁబడుచున్నది.

వివరణము:—౧. 'తదప్యేషశ్లోకోభవతి' అని ప్రథమానువాకాంతమునం దొక వాక్యము గలదు. ఆ యనువాకాదియందు చెప్పఁబడిన "బ్రహ్మవిదాప్నోతి పరం" యను సూత్రభూతార్థమునకు వివరణప్రాయముగ 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని ఒక మంత్రము చెప్పఁబడినది. ఆ ఋక్కుతో సముచ్చయముగ 'తదప్యేషశ్లోకః' అని అపిశబ్దము చెప్పఁబడినది. ఈ "అన్నాద్వైప్రజాః ప్రజాయంతే" అను శ్లోకము—మంత్రము ౧౪ పాదములు కలిగియున్నది. లోకమునం దిన్ని పాదములు గల మంత్రము ప్రసిద్ధిగ లేకపోయినను దీనిని వైదికమయిన అతిచ్ఛందస్సునుగా గ్రహించవలయును.

౨. సత్త్వరజస్తమోగుణాత్మకమాయాకార్యము లగుటచేత పంచభూతములు గుణత్రయాత్మకము లగుచున్నవి. అందు ఆకాశాది పంచభూతములయొక్క ఏ రజోంశములు గలవో అట్టి రజోంశములచేత వాక్పాణి పాదపాయూపస్థలను పంచకర్మేంద్రియములు ఆరబ్ధము లయినవి. తద్రజోంశ సముదాయారబ్ధమయి ప్రాణనాది క్రియాహేతువయి, క్రియాశక్త్యాత్మకమయినది ప్రాణము:— లింగశరీరమునందు జ్ఞానశక్తి, క్రియాశక్తి యని శక్తిద్వయము గలదు. వానిలో క్రియాశక్తి కార్యభూతమయినది ప్రాణము. దానికి ప్రాణాపానాది పంచవృత్తులు వ్యాపారవిశేషములు. ఇటుల పంచప్రాణ కర్మేంద్రియరూప ప్రాణమయకోశ విశిష్టమయిన ఆత్మను "తస్మాద్వా ఏతస్మాత్" అని శ్రుతి ఉపదేశించి బాహ్యమయిన ఆత్మను— స్థూలదేహమును అనాత్మ యని ప్రతిపాదించుచున్నది. ప్రాణమయాత్మయందు "అహం ప్రాణిమి, అహం ఉచ్ఛ్వసిమి" మున్నగు ఆత్మధర్మములు ఆరోపితములయి యుండుటచేత ఆత్మత్వము నెఱుంగవలయును. మఱియు దేహమధ్యమునందుండి ప్రాణమయాత్మ అనుభవించుచున్నాఁడు కావున బాహ్యమయిన స్థూలదేహముకంటె వేఱుగా ప్రాణమయాత్మను ఉపాయముచేత నెఱుంగవలయును. కత్తికి ఒర వలె

అన్నమయమయిన యీ స్థూలదేహము ప్రాణమయాత్మకు ఆచ్ఛాదక మగుటచేత కోశమని చెప్పఁబడినది. ఇట్లే. మనోమయాత్మ నుపదేశించినప్పుడు మనోమయాత్మ కంటె బాహ్యమయిన పూర్వ పూర్వ ప్రాణమయాదికమును కోశములుగా గ్రహించ వలయును.

౩. అన్నమయ కోశమునకు శిరస్సు మున్నగు అవయవములున్నవి. ప్రాణ మయకోశము పురుషాకారము గలది కాకపోవుటచేత స్వయముగా శిరస్సు మున్నగు అవయవము లుండఁజాలవు. అయినను ఉపాసనా సౌకర్యార్థము శిర ఆద్యవయవ కల్పనమును శ్రుతి కల్పించి యున్నది.

శ్రుతియందు "ఆకాశ ఆత్మా" యని గలదు. ఆ వాక్యమునకు శ్రీమచ్ఛంకరా చార్యులవారు వ్యాఖ్యాన మొనర్చుచు "ఆకాశ ఆత్మా, య ఆకాశస్థో వృత్తి విశేషః సమానాఖ్యః స ఆత్మేవ ఆత్మా. ప్రాణవృత్త్యధికారాత్" అని చెప్పియున్నారు. దాని ననుసరించియే మేము "సమానవృత్తి" యని గ్రహించితిమి. కాని "పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా" అను శ్రుతివాక్య వ్యాఖ్యానమును "పృథివీతి పృథివీదేవతా ఆధ్యాత్మికస్య ప్రాణస్యధారయిత్రీ స్థితిహేతుత్వాత్" అని వ్యాఖ్యాన మొనర్చి యున్నారు.

శ్రీసాయనాచార్యులవారు మాత్రము "పృథివీశబ్దేన అవశిష్ట ఉదానవాయు రుపలక్ష్యతే. ముఖ్యార్థస్వీకారేహి ప్రాణమయకోశాధికారో బాధ్యేత, యథా పృథివీ ప్రాణినాం అవస్థానహేతుత్వాత్ ప్రతిష్ఠా, తథైవోదానవాయుః ప్రాణాదివాయూనాం దేహే అవస్థానహేతుః. యావదయముదానవాయు రుత్క్రాంతిం న జనయతి తావ త్ప్రాణాపానాదీనాం దేహే అవస్థానం" అని వ్యాఖ్యాన మొనర్చి యున్నారు.

దీనివలన 'పృథివి' యనఁగా ప్రాణమయకోశాధికారము ననుసరించి ఉదాన వాయువని గ్రహించవలసినదని సాయణాచార్యాభిప్రాయమై యున్నది.

వార్తికకారులగు సురేశ్వరాచార్యులవారు: —

శ్లో. "పృథివీదేవతాపుచ్ఛం పైషేతి శ్రుతిదర్శనాత్,
అస్యో రాధ్యాత్మికస్యైషాస్థితిహేతుః ప్రకీర్తితా." వార్తిక. ౨. ౩. ౭౬.

అని చెప్పియున్నారు. వార్తికకారులవారు భాష్యకారవచనము ననుసరించియే వ్రాసి యున్నారు.

దీనివలన శ్రీశంకరభగవత్పాద సురేశ్వరాచార్యుల యభిప్రాయమునకు సాయణాచార్యాభిప్రాయము విరుద్ధముగ నున్నదని స్ఫురించుచున్నను ఈ విరోధాభాసమునకు ఒక విధముగ పరిహారము గలదు ―

శ్రీ శంకరానందులవారు శ్రుతులకు వ్యాఖ్యానరూపముగ తా మొనర్చిన ఆత్మపురాణగ్రంథమునందు ఈ శ్రుతివాక్యమున కీ విధముగా వ్యాఖ్యాన మొనర్చిరి. అయ్యది ఈ విరోధమునకు పరిహారరూపమని చెప్పవచ్చును: ―

శ్లో. "ప్రాణరూపేచ కోశేఽస్మిఞ్ శిరః ప్రాణ ఉదీరితః,
అపాన ఉత్తరః పక్షో వ్యానో దక్షిణ ఏవచ. ౧౨౯

ఆకాశేన స్సమానో య ఉదరం సతు కీర్తితః,
పృథివీన ఉదానోఽయం ప్రతిష్ఠా పుచ్ఛ మీరితః. ౧౩౦

ఉదాననిర్గమా ద్యాతి ప్రాణ స్సర్వో బహి ర్యతః,
ఉదాన స్తత ఏవాయం ప్రతిష్ఠా పరికీర్తితః." ౧౩౧

ఆత్మపురాణ. అధ్యా. ౧౦.

ఉదానవృత్తి ఊర్ధ్వగమనహేతుకమనుటకు శ్రుతిప్రమాణము: ―

అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యలోకం నయతి పాపేన పాప ముభాభ్యామేవ మనుష్యలోకమ్. ప్రశ్నోపనిషత్. ౩. ౭.

ఇతర గ్రంథ భాగములు

భాష్యవార్తికము: ― బ్రహ్మ. ౫౩-౬౩.

అనుభూతి: ― అధ్యా. ౨. ౪౯-౫౦.

ఆత్మపురాణము: ― అధ్యా. ౧౦ శ్లోక. ౧౯౯-౧౨౪.



## 3. తృతీయో<sub></sub>ఽనువాకః



ప్రాణమయశ్లోకః, మనోమయకోశః, తస్యోపాస్యస్వరూపమ్.

ఓం. ప్రాణం దేవా అను ప్రాణన్తి । మనుష్యాః పశవశ్చయే ।
ప్రాణో హి భూతానా మాయుః । తస్మా త్సర్వా
యుష ముచ్యతే । సర్వమేవ త ఆయు ర్యన్తి । యే
ప్రాణం బ్రహ్మోపాసతే । ప్రాణో హి భూతానా మా
యుః । తస్మా త్సర్వాయుష ముచ్యత ఇతి । తస్యైష
ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మా ద్వా
ఏతస్మా త్ప్రాణమయాత్ । అన్యోఽన్తర ఆత్మా మనో
మయః । తేనైష పూర్ణః । స వా ఏష పురుషవిధ
ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః ।
తస్య యజురేవ శిరః । ఋగ్దక్షిణః పక్షః । సామో
త్తరః పక్షః । ఆదేశ ఆత్మా । అథర్వాఙ్గిరసః పుచ్ఛం
ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి ॥3॥

శాంకర భాష్యమ్:—

ప్రాణం దేవా అను ప్రాణన్తి। అగ్న్యాదయః దేవాః ప్రాణం వాయ్వాత్మానం ప్రాణనశక్తిమన్తమ్ అను తదాత్మభూతాః సన్తః ప్రాణన్తి ప్రాణనకర్మ కుర్వన్తి, ప్రాణనక్రియయా క్రియావన్తో భవన్తిః । అధ్యాత్మాధికారాత్ దేవాః ఇన్ద్రియాణి ప్రాణమను ప్రాణన్తి ముఖ్యప్రాణమను చేష్టన్త ఇతివా। తథా మనుష్యాః పశవశ్చయే, తే ప్రాణన కర్మణైవ చేష్టావన్తో భవన్తి। అతశ్చ నాన్నమయేనైవ పరిచ్ఛిన్నాత్మనా ఆత్మవన్తః ప్రాణినః। కిం తర్హి? తదన్తర్గతప్రాణమయేనాపి సాధారణేనైవ సర్వపిణ్డవ్యాపినా ఆత్మవన్తో మనుష్యాదయః। ఏవం మనోమయాదిభిః పూర్వపూర్వవ్యాపిభిః ఉత్తరోత్తరైః సూక్ష్మైః ఆనన్దమయాన్తై రాకాశాది భూతారబ్ధై రవిద్యాకృతైః ఆత్మవన్తః సర్వే ప్రాణినః; తథా, స్వాభావికేనప్యాకాశాదికారణేన నిత్యేనావికృతేన సర్వగతేన సత్యజ్ఞానానన్తలక్షణేన పఞ్చకోశాతిగేన సర్వాత్మనా ఆత్మవన్తః; స హి పరమార్థత ఆత్మా సర్వేషామిత్యేతదప్యర్థాదుక్తం భవతి। ప్రాణం దేవా అను 'ప్రాణన్తీత్యాద్యుక్తమ్; తత్కస్మాదిత్యాహ—ప్రాణః హి యస్మాత్ భూతానాం ప్రాణినామ్ ఆయుః జీవనమ్, "యావద్ధ్యస్మిఞ్ఛరీరే ప్రాణో వసతి తావదేవాయుః" ఇతి శ్రుత్యన్తరాత్। తస్మాత్ సర్వాయుషమ్, సర్వేషామాయుః సర్వాయుః, సర్వాయురేవ సర్వాయుషమ్ ఇత్యుచ్యతే; ప్రాణాపగమే మరణప్రసిద్ధేః ప్రసిద్ధం హి లోకే సర్వాయుష్ట్వం ప్రాణస్య। అతః అస్మాద్బాహ్యాదసాధారణాదన్నమయాదాత్మనోఽపక్రమ్య అన్తః సాధారణం ప్రాణమయమాత్మానం బ్రహ్మ ఉపాసతే యే "అహమస్మి ప్రాణః సర్వభూతానామాత్మా ఆయుః, జీవనహేతుత్వాత్" ఇతి, తే సర్వమేవ ఆయుః అస్మిన్ల్లోకే యన్తి; నాపమృత్యునా మ్రియన్తే ప్రాక్ప్రాప్తాదాయుష ఇత్యర్థః। శతం వర్షాణీతి తు యుక్తమ్, "సర్వమాయురేతి" ఇతి శ్రుతిప్రసిద్ధేః। కిం కారణమ్?—ప్రాణోహి భూతానామాయుః తస్మాత్సర్వాయుషముచ్యత ఇతి। యో యద్గుణకం బ్రహ్మోపాస్తే, సతద్గుణభాగ్భవతీతి విద్యాఫలప్రాప్తేర్హేత్వర్థం పునర్వచనమ్ — — ప్రాణోహీత్యాది। తస్య పూర్వస్య అన్నమయస్య ఏష ఏవ శరీరే అన్నమయేభవః శారీరః ఆత్మా। కః? య ఏష ప్రాణమయః। తస్మాద్వా ఏతస్మాదిత్యాద్యుక్తార్థమన్యత్। అన్యోఽన్తర ఆత్మా మనోమయః। మన ఇతి సంకల్పవికల్పాత్మకమన్తఃకరణమ్, తన్మయో మనోమయః; సోఽయం ప్రాణమయస్యాభ్యన్తర ఆత్మా। తస్య యజురేవ శిరః। యజురితి అనియతాక్షరపాదావసానో మన్త్రవిశేషః; తజ్జాతీయ వచనో యజుః శబ్దః; తస్య శిరస్త్వమ్, ప్రాధాన్యాత్।

ప్రాధాన్యం చ యాగాదౌ సంనిపత్యోపకారకత్వాత్ యజుషా హి హవిర్దీయతే స్వాహాకారాదినా॥

వాచనికీ వా శిరఆదికల్పనా సర్వత్ర। మనసో హి స్థాన ప్రయత్ననాదస్వర వర్ణపదవాక్యవిషయా తత్సంకల్పాత్మికా తద్భావితావృత్తిః శ్రోత్రకరణద్వారా యజుః సంకేతేన విశిష్టా యజురిత్యుచ్యతే। ఏవం ఋక్; ఏవం సామ చ। ఏవం చ మనోవృత్తిత్వే మన్త్రాణామ్, వృత్తిరేవ ఆవర్త్యత ఇతి మానసో జప ఉపపద్యతే। అన్యథా అవిషయత్వాన్మన్త్రో నావర్తయితుం శక్యః ఘటాదివత్ ఇతి మానసో జపో నోపపద్యతే। మన్త్రావృత్తిశ్చోద్యతే బహుశః కర్మసు। అక్షరవిషయ స్మృత్యావృత్త్యా మన్త్రావృత్తిః స్యాత్ ఇతి చేత్, న; ముఖ్యార్థా సంభవాత్। "త్రిః ప్రథమామన్వాహ త్రిరుత్తమామ్" ఇతి ఋగావృత్తిః శ్రూయతే। తత్ర ఋచః అవిషయత్వే తద్విషయ స్మృత్యావృత్త్యా మన్త్రావృత్తౌ చ క్రియమాణాయామ్ "త్రిః ప్రథమామన్వాహ" ఇతి ఋగావృత్తిర్ముఖ్యోఽర్థశ్చోదితః పరిత్యక్తః స్యాత్। తస్మాన్మనోవృత్త్యుపాధి పరిచ్ఛిన్నం మనోవృత్తి నిష్ఠమాత్మచైతన్యమనాదినిధనం యజుః శబ్దవాచ్యమ్ ఆత్మ విజ్ఞానం మన్త్రా ఇతి। ఏవం చ నిత్యత్వోపపత్తిర్వేదానామ్। అన్యథావిషయత్వే రూపాదివదనిత్యత్వం చ స్యాత్; నైతద్యుక్తమ్। "సర్వే వేదా యత్రైకం భవన్తి స మానసీన ఆత్మా" ఇతి చ శ్రుతిః నిత్యాత్మనైకత్వం బ్రువన్తీ ఋగాదీనాం నిత్యత్వే సమఞ్జసా స్యాత్। ఋచోఽక్షరే పరమే వ్యోమన్యస్మిన్దేవా అధి విశ్వేనిషేదుః" ఇతి చ మన్త్రవర్ణాః। ఆదేశః అత్ర బ్రాహ్మణమ్, ఆదేష్టవ్యవిశేషానాదిశతీతి। అథర్వణాఙ్గిరసా చ దృష్టా మన్త్రా బ్రాహ్మణం చ శాన్తిక పౌష్టికాది ప్రతిష్ఠాహేతుకర్మ ప్రధానత్వాత్ పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి మనోమయాత్మ ప్రకాశకః పూర్వవత్॥

ఇతి తృతీయానువాక భాష్యమ్॥

టీక. దేవాః = అగ్ని మున్నగు దేవతలు, ప్రాణం = వాయ్వాత్మకుఁడును ప్రాణనశక్తియుక్తుఁడునగు ప్రాణమును, అను = అనుసరించి, ప్రాణన్తి = ప్రాణన కర్మను చేయుచున్నారు. లేక, దేవాః = ఇంద్రియములు, ప్రాణం అను = ముఖ్య ప్రాణమునుగూర్చి, ప్రాణంతి = చలించుచున్నవి. యే = ఏ, మనుష్యాః పశవః చ = మనుష్యులు పశువులు గలరో, (తే ప్రాణం అను ప్రాణంతి = వారును ప్రాణము ననుసరించియే చలించుచున్నారు.) ప్రాణః = ప్రాణము, భూతానాం = భూతములకు, ఆయుః = జీవనము, తస్మాత్ = అందువలన, సర్వాయుషం = అందఱకు జీవనమవి,

ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఇతి = (ప్రాణమయకోశమునకు సంబంధించిన మంత్రము) సమాప్తమయినది.

తస్య = ఆ వెనుకఁ జెప్పఁబడిన, పూర్వస్య=అన్నమయాత్మునకు, శారీరః= అన్నమయశరీరమునందు పుట్టిన, యః ఏషః = ఏ ఈ ప్రాణమయుఁడు గలఁడో, సః = వాఁడే. ఆత్మా = ఆత్మ.

తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, ప్రాణమయాత్ = ప్రాణమయాత్మకంటె, అన్యః=వేఱయిన, మనోమయః ఆత్మా=మనోమయుఁడగు ఆత్మ, అంతరః=లోపల నుండువాఁడు (గలఁడు), తేన = ఆమనోమయాత్మచేత, ఏషః=ఈ ప్రాణమయాత్మ, పూర్ణః=పరిపూర్ణుఁడైనాఁడు.

సః ఏషః = ఆ ఈ ప్రాణమయాభ్యంతరాత్మయగు మనోమయాత్మ, పురుష విధః ఏవ = పురుషాకారము గలవాఁడే, తస్య పురుషవిధతాం అను = ఆ ప్రాణ మయాత్మయొక్క పురుషాకారము ననుసరించి, అయం పురుష విధః = ఈ మనో మయాత్మ పురుషాకారము గలవాఁడు. తస్య = ఆ మనో మయాత్మునకు, యజుః = యజుస్సు, శిరః = శిరస్సు, ఋక్ = ఋక్కు, దక్షిణః పక్షః = దక్షిణపుపక్షము, సామ = సామము, ఉత్తరః పక్షః = ఉత్తరపు పక్షము, ఆదేశః = విధి - అనఁగా బ్రాహ్మణము, ఆత్మా = ఆత్మ, అథర్వాంగి రసః = అథర్వాంగిరో మహర్షిచేత గనుం గొనఁబడిన మంత్రబ్రాహ్మణములు, పుచ్ఛంప్రతిష్ఠా = ప్రతిష్ఠావహమగు పుచ్ఛము, తత్ అపి = ఆ విషయమును గూర్చి, ఏషశ్లోకః = ఈ చెప్పఁబోవు శ్లోకము - మంత్రము, భవతి = అగుచున్నది.

తా. అగ్న్యాది దేవతలు వాయుస్వరూపము కలిగి ప్రాణనశక్తిగల ప్రాణము ననుసరించియే తదాత్మగలవారలయి ప్రాణనకర్మను చేయుచున్నారు, ప్రాణనక్రియ చేత క్రియగలవారలు అగుచున్నారు. (ఈ యర్థము శబ్దశక్తిని పట్టి చెప్పఁబడినది.) ఇది అధ్యాత్మప్రకరణము కావున దేవశబ్దము ఇంద్రియవాచకము. కనుక ఇంద్రియములు ముఖ్య ప్రాణము ననుసరించి చేష్టలు కలిగియున్నవి. అట్లే మనుష్యులు పశువులు మున్నగు ప్రాణులు ప్రాణన కర్మచేతనే చేష్టలు గలవారలయి గనంబడుచున్నారు. కావున ప్రాణిసమూహము కేవలము పరిచ్ఛిన్నమైన అన్నమయాత్మచేతనే ఆత్మవంతు లయి యుండలేదు. ఇఁక నేమనఁగా తదన్నమయదేహమునకు అంతర్గతుఁడైనట్టియు, సాధారణముగ సకల దేహములందు వ్యాపించియున్నట్టియు ప్రాణమయాత్మచేత మనుష్యాదులందఱు ఆత్మవంతులయి గనంబడుచున్నారు. ఈ విధముగా పూర్వ

పూర్వమును వ్యాపించినట్టియు, ఉత్తరోత్తరము సూక్ష్మములయినట్టియు, అవిద్యా కృత్యములయినట్టియు, ఆకాశాది భూతారబ్ధములయినట్టియు, మనోమయాదికమును, ఆనందమయాంతమును అగు కోశసంఘముచేత సకల ప్రాణులు అనేకములగు పొరలు గల కొట్టిగింజవలె ఆత్మవంతులయి యున్నారు.

అట్లే స్వాభావికమైనట్టియు, ఆకాశాదికమునకు కారణమయినట్టియు, నిత్యమయినట్టియు, అవికృతమయినట్టియు, సర్వగతమయినట్టియు, సత్యజ్ఞానానంతలక్షణమయినట్టియు, పంచకోశాతిగమయినట్టియు సర్వాత్మచేత (సర్వప్రాణులు) ఆత్మవంతులయి యున్నారు. (ఏలయనఁగా) అతఁడే యథార్థముగా అందఱకు ఆత్మయను విషయమే స్ఫుటముగా చెప్పఁబడినది అగుచున్నది.

"ప్రాణం దేవా అను ప్రాణంతి" మున్నగు శ్రుతివాక్యములు చెప్పఁబడినవి. ఇట్లేల చెప్పఁబడినది? ఇందులకు సమాధానము:—ప్రాణమే సకల ప్రాణులకు జీవనభూతము. ఇందులకు శ్రుతిప్రమాణము:—

శ్రుతి. "యావద్ధ్యస్మిఞ్ఛరీరే ప్రాణో వసతి తావ దేవాయుః"

కౌషీతక్యుపనిషత్. ౩. ౨.

అందఱకు ఆయువగునది సర్వాయువనం బడును. ఆ సర్వాయువే సర్వాయుష మనంబడును. అందువలన ప్రాణమే సర్వాయుష మనంబడును.

ప్రాణములు పోవుట యనఁగా మరణించుట యని లోకమునందు ప్రసిద్ధము గదా. ప్రాణమునకు సర్వాయుష్ట్వము లోకమునందును ప్రసిద్ధియేగదా. అందువలన బాహ్యమయినట్టియు, అసాధారణమయినట్టియు అన్నమయాత్మను పరిత్యజించి, ఆంతరమయినట్టియు సాధారణమయినట్టియు ప్రాణమయాత్మ రూపుఁడును అగు బ్రహ్మమును "సర్వభూతములయొక్క జీవనమునకు హేతుభూతమగు ప్రాణమే నేను" అని ఎవ్వరు ఉపాసనమును సలిపెదరో వారు ఆయుస్సునంతయు (అనఁగా ౧౦౦ సంవత్సరముల ఆయుస్సును) ఈ లోకమునందు పొందెదరు. నిర్ణీతమగు ఆయుస్సునందుఁగాక (ఈ లోపల) అపమృత్యువుచేత చావరు. శ్రుతియందు "శతాయుః పురుషః" అని ప్రసిద్ధియుండుటచేత మూలమునందుగల 'సర్వమాయుః' ఆను పదమునకు "నూరు సంవత్సరములు" అని అర్థమును చెప్పుట న్యాయమే. ఏలయనఁగా:—ప్రాణమే భూతములకు ఆయుస్సుగదా. అందువల్లనే ప్రాణము 'సర్వాయుష' మని చెప్పఁబడుచున్నది. ఎవ్వఁడు ఏగుణము గలవానినిగా బ్రహ్మమునుపాసించుచున్నాఁడో వాఁడు అట్టి గుణములను పొందినవాఁ డగుచున్నాఁడు, అని

విద్యాఫలమును పొందునమటకు హేతువుగా "ప్రాణో హి భూతానా మాయుః" అని మఱల చెప్పఁబడినది.

ఆ వెనుక చెప్పఁబడిన అన్నమయాత్మకు అన్నమయ శరీరమునందు పుట్టిన ఆత్మ ప్రాణమయాత్మయే.

## మనోమయకోశ వివరణము

ఆ ఈ ప్రాణమయాత్మకంటె అభ్యంతరుఁడై మనోమయాత్మ గలఁడు. మనస్సనఁగా సంకల్పవికల్పాత్మకమగు అంతఃకరణము. తన్మయుండనఁగా తద్వికారుఁడు, ఆ మనోమయుఁడు ప్రాణమయునకు అభ్యంతరాత్మ.

౧. ఆ మనోమయాత్మునకు యజుస్సు (యజుర్వేదము) శిరము.

౨. ఋక్కు (ఋగ్వేదము) దక్షిణపక్షము.

౩. సామము (సామవేదము) ఉత్తరపక్షము.

౪. అథర్వాంగిరస్సులు (అధర్వణవేదము) ప్రతిష్ఠావహమగు పుచ్ఛము.

యజుస్సనగా పాదమునకు ఇన్ని అక్షరములని నిర్ణయము లేని మంత్ర విశేషము. అట్టి ధర్మముగల మంత్రములందు యజుశ్శబ్దము వర్తించును. అట్టి మంత్రము శిరస్సు. యాగాదికమునందు స్వస్వరూపముగ ఉపకారము చేయునట్టి అంగము యజుస్సగుటచేత (ఇతర వేదములకంటె ప్రధానమగుటచేత (శిరస్సనుట యుక్తమే) యజుర్వేదమంత్రముచేతనే స్వాహాకారమును పలికి హవిస్సు హుత మొనర్పఁబడును ఇచట శిరస్సు, దక్షిణపక్షము మున్నగు కల్పనము శ్రుతియందు ప్రతిపాదింపఁబడినది. ఇట్లే సర్వత్ర గ్రహించునది.

మనస్సువల్ల నుండి స్థాన, ప్రయత్న, నాద, స్వర, వర్ణ, పద, వాక్య, విషయమయినట్టియు, తత్సంకల్పనాత్మకమును అగు వృత్తి విశేషము తద్భావితమై శ్రోత్రకరణమార్గముచేత యజుస్సంకేత విశిష్టమగుటచేత యజుస్సని చెప్పఁబడు చున్నది.

ఇట్లే, ఋక్, సామ అను పదములను గూర్చి ఎఱుంగునది. ఈ విధముగా మంత్రములు మనోవృత్తిరూపములగుటచేత మంత్రముల ఆవృత్తియే (అనఁగా సంఖ్యాక్రమముగ మంత్రములు ఆవర్తింపఁబడిన యెడల) 'మానస జపము' అగు చున్నది; లేనియెడల ఘటాదికమువలె మంత్రావృత్తియే జరుగజాలదు. అప్పుడు మానసమగు జపమే లేకపోవును.

అసంఖ్యాకము లగు కర్మలందు "మంత్రావృత్తి" (శాస్త్రములందు) చెప్పఁబడియున్నది.

అక్షరవిషయకమగు స్మృతిని ఆవృత్తి చేసినను మంత్రావృత్తి యగునని యనునెడల అట్లనరాదు. అటుల అక్షరావృత్తిని చేయునెడల ముఖ్యార్థము నాచరించినట్లు కాదు.

మఱియు —

శ్రు. త్రిః ప్రథమా మన్వాహ త్రిరుత్తమామ్.

తై. సం. ౨. ౫. ౩. ౧.
శత. బ్రా. ౧. ౩. ౨. ౬.
ఐత. బ్రా. ౧. ౩. ౨. ౫.

అను శ్రుతి ఋగావృత్తిని విధించుచున్నది గాని అక్షరావృత్తిని విధించుట లేదు. అక్షరావృత్తి యని యర్థమును గ్రహించిన యెడల "త్రిఃప్రథమామన్వాహ" అను మంత్రమునందు విధించిన ముఖ్యార్థమును పరిత్యజించినట్లగును.

కావున మనోవృత్త్యుపాధిపరిచ్ఛిన్నమును, మనోవృత్తినిష్ఠమును అగు ఆత్మచైతన్యము, ఆద్యంతరహితము, యజుశ్శబ్దవాచ్యమగు ఆత్మవిజ్ఞానమే మంత్రములని చెప్పఁబడుచున్నవి. కావుననే వేదములు నిత్యములు అని సుప్రసిద్ధి ఉపపన్నమగుచున్నది.

లేనియెడల (అనఁగా వేదములు మనోవృత్తి మాత్రము లనిగాని శబ్దరాశి మాత్రములు అనిగాని తలంచిన యెడల) రూపాదికమువలె అనిత్యము కావలసి వచ్చును. అయ్యది యుక్తము కాదుగదా.

"సర్వే వేదా యత్రైకం భవంతి, సర్వే హోతారో యత్రైకం భవంతి, స మానసీన ఆత్మా." తై. ఆర. ౩. ౧౧. ౧.

అను శ్రుతి ఋగాదివేదములు నిత్యాత్మవలెనే నిత్యములని చెప్పుచున్నది. (అట్లయిననేగాని పై శ్రుతి) యుక్తము కాదు.

"ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వేనిషేదుః" (తై. బ్రా. ౩. ౧౦. ౯.) అను మంత్ర మీ విషయమునే ప్రతిపాదించుచున్నది. ఆదేశ మనఁగా ఇచట బ్రాహ్మణము, ఇందు చెప్పఁదగిన విశేషముల నతిదేశించుట చేత బ్రాహ్మణభాగము (ఆదేశమనంబడుచున్నది) అథర్వాంగిరసునిచేత దృష్టములగు మంత్రములున్నూ, బ్రాహ్మణమున్నూ శాంతిక పౌష్టికాదిప్రతిష్ఠాహేతుకర్మప్రధానము

లగుటచేత ఆ మనోమయాత్మకు పుచ్ఛమువలె ప్రతిష్ఠాహేతుక మగుచున్నవి. ఆ విషయమును గూర్చియే శ్లోకము—మంత్రము మనోమయాత్మ ప్రకాశకము చెప్పఁబడుచున్నది.

వివరణము:—౧. ఈ ప్రాణమయవివరణరూపమగు మంత్రము అష్ట పాదాత్మకమగు అతిచ్ఛందస్సని గ్రహించునది.

౨. "పూర్వపూర్వమును వ్యాపించినట్టియు...." యున్నగు వాక్యముయొక్క వివరణము.

కోశములు-అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ. ఆనంద మయములు అని ఐదు. అందు —

౧. అన్నమయకోశము ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములచేత వ్యాప్తమయి యుండును.

౨. ప్రాణమయకోశము మనోమయ, విజ్ఞానమయ. ఆనందమయ కోశముల చేత వ్యాప్తమయియుండును.

౩. మనోమయకోశము విజ్ఞానమయ, ఆనందమయ కోశములచేత వ్యాప్త మయి యుండును.

౪. విజ్ఞానమయకోశము ఆనందమయ కోశముచేత వ్యాప్తమయి యుండును.

అనఁగా అన్నమయకోశము ౪ కోశములచేతను, ప్రాణమయకోశము ౩ కోశములచేతను, మనోమయకోశము ౨ కోశములచేతను, విజ్ఞానమయకోశము ౧ కోశము చేతను వ్యాప్తమయియుండును.

ఈ యర్థమునే భాష్యవార్త్తికకారులు ఇటుల చెప్పిరి:—

శ్లో. కోశై శ్చతుర్భిః సంవ్యాప్తో యథైవాన్నమయః పురా,
జాసీయా దుత్తరా నేవం త్రిద్వ్యేకార్థ సమన్వయాత్.

తై. తి. భాష్య. వార్తి. బ్రహ్మ. ఖండ. ౨. ౩౧.

ఇతర గ్రంథ భాగములు

| | |
|---|---|
| భాష్యవార్త్తికము. | బ్రహ్మవల్లి. శ్లో. ౩౮-౧౦౩ |
| అనుభూతిప్రకాశము. | అధ్యా. ౨. శ్లో. ౫౧-౫౮. |
| ఆత్మపురాణము. | అధ్యా. ౧౦. శ్లో. ౧౨౫-౧౩౬. |



## ४. చతుర్థోఽనువాకః



మనోమయేశ్లోకః, విజ్ఞానమయకోశః, తస్య ఉపాస్యస్వరూపః.

మం. యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ

ఆనందం బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కదాచనేతి

తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య । తస్మా

ద్వా ఏతస్మాన్మనోమయాత్ । అన్యోఽన్తర ఆత్మా

విజ్ఞానమయః । తేనైష పూర్ణః । స వా ఏష పురుష

విధ ఏవ । తస్యపురుషవిధతామ్ । అన్వయం పురుష

విధః । తస్య శ్రద్ధైవ శిరః । ఋతం దక్షిణః పక్షః

సత్య ముత్తరః పక్షః । యోగ ఆత్మా । మహః పుచ్ఛం

ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

శాంకరభాష్యమ్:—

**యతో** వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహేత్యాది। తస్య పూర్వస్య ప్రాణమయస్య ఏష ఏవ ఆత్మా శారీరః శరీరే ప్రాణమయే భవః శారీరః। కః? య ఏష మనోమయః। తస్మాద్వా ఏతస్మాదితి పూర్వవత్। అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః మనోమయస్యాభ్యన్తరో విజ్ఞానమయః। మనోమయో వేదాత్మా ఉక్తః। వేదార్థ విషయా బుద్ధిర్నిశ్చయాత్మికా విజ్ఞానమ్, తచ్చాధ్యవసాయ లక్షణమన్తః కరణస్య ధర్మః, తన్మయః నిశ్చయవిజ్ఞానైః ప్రమాణస్వరూపైర్నిర్వర్తితః ఆత్మా విజ్ఞానమయః ప్రమాణ విజ్ఞానపూర్వకో హి యజ్ఞాదిః తాయతే। యజ్ఞాదిహేతుత్వం చ

వక్ష్యతి శ్లోకేన। నిశ్చయవిజ్ఞానవతో హి కర్తవ్యేష్వర్థేషు పూర్వం శ్రద్ధా ఉపపద్యతే। సా సర్వకర్తవ్యానాం ప్రాథమ్యాత్ శిర 'ఇవ శిరః। ఋతసత్యే యథావ్యాఖ్యాతే ఏవ। యోగః యుక్తిః సమాధానమ్ ఆత్మైవ ఆత్మా। ఆత్మవతో హి యుక్తస్య సమాధానవతః అఙ్గానీవ శ్రద్ధాదీని యథార్థప్రతిపత్తిక్షమాణి భవన్తి। తస్మాత్సమాధానం యోగ ఆత్మా విజ్ఞానమయస్య। మహః పుచ్ఛం ప్రతిష్ఠా। మహ ఇతి మహత్తత్త్వం ప్రథమజమ్. ''మహద్యక్షం ప్రథమజం వేద'' ఇతి శ్రుత్యన్తరాత్, పుచ్ఛం ప్రతిష్ఠా కారణత్వాత్। కారణం హి కార్యాణాం ప్రతిష్ఠా, యథా వృక్షవీరుధాం పృథివీ। సర్వ విజ్ఞానానాం చ మహత్త్వం కారణమ్। తేన తద్విజ్ఞానమయస్యాత్మనః ప్రతిష్ఠా। తద ప్యేష శ్లోకోభవతి పూర్వవత్। యథా అన్నమయాదీనాం బ్రాహ్మణోక్తానాం ప్రకాశకాః శ్లోకాః, ఏవం విజ్ఞానమయస్యాపి॥

ఇతి చతుర్థానువాక భాష్యమ్॥

టీక. యతః=ఏ యానందస్వరూపునివల్లనుండి, వాచః = వాక్కులు, మనసా సహ=మనస్సుతో కూడా, అప్రాప్య=పొందక, నివర్తన్తే=మఱలుచున్నవో (అట్టి), బ్రహ్మణః = బ్రహ్మముయొక్క (స్వరూపభూతమగు), ఆనందం = ఆనందమును (మనోమయాత్మ యొక్క శిరఃపక్షాది రూపమగుదానిని), విద్వాన్=ఉపాసించుచున్న వాఁడు, కదాచన=ఒకప్పుడును, న బిభేతి= భయంపడఁడు, ఇతి= మనోమయకోశ మును వివరించిన మంత్రము సమాప్తమయినది.

తస్య=ఆ, పూర్వస్య=పూర్వుఁడయిన ప్రాణమయాత్మునకు, శారీరః= ప్రాణమయశరీరమునందు పుట్టిన, ఆత్మా ఏషః ఏవ=మనోమయాత్మ ఇతఁడే.

తస్మాత్ = ఆ, ఏతస్మాత్=ఈ, మనోమయాత్ = మనోమయాత్మకంటె, అన్యః = వేఱయినట్టి, అంతరః ఆత్మా = అభ్యంతరుఁడగు ఆత్మ, విజ్ఞానమయఃవై= విజ్ఞానమయుఁడు గదా, తేన=ఆవిజ్ఞానమయాత్మచేత, ఏషః = ఈ మనోమయాత్మ, పూర్ణః=పరిపూర్ణుఁడై యున్నాఁడు.

సః=ఆ, ఏషః=ఈ విజ్ఞానమయాత్మ, పురుషవిధః ఏవ=పురుషవిధము గల వాఁడే, తస్య=ఆ మనోమయాత్మ యొక్క, పురుషవిధతాం అను=పురుషవిధత్వము ననుసరించి, అయం=ఈ విజ్ఞానాత్మ, పురుషవిధః = పురుషవిధుఁ డగుచున్నాఁడు. తస్య=ఆవిజ్ఞానమయాత్మకు, శ్రద్ధా ఏవ=శ్రద్ధయే. శిరః=శిరస్సు, ఋతం= ఋతము, దక్షిణః పక్షః= దక్షిణపక్షము, సత్యం= సత్యము, ఉత్తరః పక్షః=ఉత్తరపక్షము,

యోగః=సమాధానము, ఆత్మా=ఆత్మ. మహః = మహత్తత్త్వము, పుచ్ఛం ప్రతిష్ఠా = ప్రతిష్ఠావహమగు పుచ్ఛము.

తదపి = ఆ విజ్ఞానమయుని గూర్చి, ఏషః శ్లోకః = ఈ చెప్పఁబోవునట్టి శ్లోకము - మంత్రము, భవతి = కలదు.

తా. ఏ యానందాత్మను గుఱించి వర్ణింపఁదలఁచి వాక్కు మనస్సు సైతము ఆ యానందాత్మను పొందకయే వెనుకకు మరలుచున్నవో, అట్టి బ్రహ్మముయొక్క ఆనంద స్వరూపమును ఉపాసించువానికి దేనివల్ల నుండియు భయము లేదు. ఆ వెనుక చెప్పఁబడిన ప్రాణమయాత్మునకు ప్రాణమయశరీరము నందు పుట్టినవాఁడు మనోమయాత్మయే. ఆ యీ మనోమయాత్మకంటె వేఱయి, మనోమయాత్మకు అభ్యంతరుఁడై, విజ్ఞానమయాత్మ గలఁడు, వెనుకటి యనువాకమునందు మనోమయుఁడు వేదాత్మయని చెప్పఁబడినది. వేదార్థవిషయమగు బుద్ధి నిశ్చయాత్మకమగు నెడల విజ్ఞాన మనంబడును. నిశ్చయాత్మకమైన ఆ విషయపరిచ్ఛేదమే అంతఃకరణముయొక్క ధర్మము. నిశ్చయవిజ్ఞానములను ప్రమాణస్వరూపములచేత నిర్ణయింపఁబడినవాఁడే విజ్ఞానమయుఁడగు ఆత్మ.

లోకమునందు యజ్ఞాదికర్మజాతము ప్రమాణభూతమగు విజ్ఞానము కలిగియే ఆచరింపఁబడుచున్నది. విజ్ఞానముచేతనే యజ్ఞాదిక మాచరింపఁబడు చున్నదని పై యనువాకమునందే చెప్పఁబడఁగలదు.

౧. అట్టి నిశ్చయజ్ఞానముగలవానికి చేయఁదగిన పనులయందు ప్రథమమున ఏ శ్రద్ధ జనించునో అట్టి శ్రద్ధ చేయఁదగినవాని కన్నిఁటి కంటె మొట్టమొదటిది కావున అయ్యది శిరమువలె శ్రేష్ఠమగుటచేత శిరమని చెప్పఁబడుచున్నది. (గురువుచేతను శాస్త్రము చేతను చెప్పఁబడినే తత్త్వమునందును, దానిని తెలిసికొనుటయందును, తదుపాయములందును గల పరమవిశ్వాసము శ్రద్ధ యనంబడును. శ్రద్ధాదులు వృత్తిరూపములగుటచేత మనోమయుని యొక్క కార్యములయినప్పటికిన్నీ విజ్ఞానమయుఁడు కర్తయగుట చేత మనోవృత్తులు కూడ విజ్ఞానమయసంబంధములయినవి కావచ్చునను అభిప్రాయముతో విజ్ఞానమయునకు శ్రద్ధయే శిరస్సని చెప్పఁబడుట ఇట ఉపపన్నమయినది.)

౨. ఋతము దక్షిణపక్షము. (ఋతమనఁగా శాస్త్రానుసారము కర్తవ్యమని నిశ్చయింపఁబడిన విషయము.)

౩. సత్యము ఉత్తరపక్షము. (పయిన జెప్పఁబడిన ఋతము వాక్కాయములచేత అనుష్ఠితమయినది. సత్యమనంబడును.)

౪. యోగము అనఁగా సమాధి ఆత్మ. దేహికి బాహ్వాది అవయవము లున్నయెడల తత్తత్కార్యము లెటుల సానుకూలములయి యుండునో అట్లే సమాధిస్థుఁడగు వానికి శ్రద్ధా, ఋత, సత్యము లనునవి బ్రహ్మప్రాప్తికి సాధనభూతములయి యుండును. (దేహావయవములలోపల మధ్యకాయ మెటుల ప్రధానమో, అట్లే బ్రహ్మప్రాప్తికి సాధనభూతములగు శ్రద్ధ, ఋతము, సత్యము మున్నగు వానిలో సమాధి ప్రధానమయిన దని గ్రహించునది.) కావున విజ్ఞానమయాత్మనకు సమాధానము—అనఁగా యోగము మధ్యావయవము.

౫. మహత్తత్త్వము అనఁగా హిరణ్యగర్భుఁడు ప్రతిష్ఠ. మహత్తత్త్వమే మొట్ట మొదట పుట్టినది. ఇందులకు శ్రుతిప్రమాణము:— శ్రు. మహ ద్యక్షం ప్రథమజం వేద. బృ. ఉ. ౫. ౪. ౧.

కార్యములకు కారణము ప్రతిష్ఠ యగుచున్నది. లోకమునందు లతలకు వృక్షములకు పృథివి ప్రతిష్ఠ యగుట ప్రత్యక్షానుభవసిద్ధముగదా. అదే విధముగా సర్వబుద్ధి విజ్ఞానములకు మహత్తత్త్వము కారణము. కావున ఆ విజ్ఞానమయాత్మకు మహత్తత్త్వము ప్రతిష్ఠ యగుచున్నది ఆ విజ్ఞానమయాత్మను గుఱించిన వర్ణనము ఈ క్రింది మంత్రమునం దిటుల చెప్పఁబడుచున్నది. అన్నమయాదికోశములను గుఱించిన మంత్రము లిదివఱకు ఎటుల చెప్పఁబడినవో అదేవిధముగా విజ్ఞానమయాత్మను గుఱించియు మంత్రము గలదు.



# ౫. పంచమోఽనువాకః



విజ్ఞానమయేశ్లోకః, ఆనందమయకోశః, తస్యోపాస్యస్వరూపః.

మం. విజ్ఞానం యజ్ఞం తనుతే । కర్మాణి తనుతేఽపి చ ।
విజ్ఞానం దేవా స్సర్వే । బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే ।
విజ్ఞానంబ్రహ్మ చేద్వేద । తస్మాచ్చే న్న ప్రమాద్యతి ।
శరీరే పాప్మనో హిత్వా । సర్వా న్కామాన్సమశ్ను
తఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య ।
తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాత్ । అన్యోఽన్తర
ఆత్మాఽఽనన్దమయః । తేనైష పూర్ణః । స వా ఏష
పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం
పురుషవిధః । తస్యప్రియ మేవ శిరః । మోదో దక్షిణః
పక్షః ప్రమోద ఉత్తరః పక్షః । ఆనంద ఆత్మా ।
బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

శాంకర భాష్యమ్: —

విజ్ఞానం యజ్ఞం తనుతే, విజ్ఞానవాన్హి యజ్ఞం తనోతి శ్రద్ధాపూర్వకమ్; అతో విజ్ఞానస్య కర్తృత్వం తనుత ఇతి। కర్మాణి చ తనుతే। యస్మాద్విజ్ఞానకర్తృకం సర్వమ్, తస్మాద్యుక్తం విజ్ఞానమయ ఆత్మా బ్రహ్మేతి। కించ, విజ్ఞానం బ్రహ్మ

సర్వే దేవాః ఇన్ద్రాదయః జ్యేష్ఠమ్, ప్రథమజత్వాత్; సర్వవృత్తీనాం వా తత్పూర్వకత్వాత్ప్రథమజం విజ్ఞానం బ్రహ్మ ఉపాసతే ధ్యాయన్తి. తస్మిన్విజ్ఞానమయే బ్రహ్మణ్యభిమానం కృత్వా ఉపాసత ఇత్యర్థః। తస్మాత్తే మహతో బ్రహ్మణ ఉపాసనాత్ జ్ఞానైశ్వర్యవన్తో భవన్తి। తచ్చ విజ్ఞానం బ్రహ్మ చేత్ యది వేద విజానాతి; న కేవలం వేదైవ, తస్మాత్ బ్రహ్మణః చేత్ న ప్రమాద్యతి; బాహ్యేష్వనాత్మస్వాత్మాభావితః; తస్మాత్ప్రాప్తం విజ్ఞానమయే బ్రహ్మణ్యాత్మభావనాయాః ప్రమదనమ్; తన్నివృత్త్యర్థముచ్యతే — తస్మాచ్చేన్న ప్రమాద్యతీతి। అన్నమయాదిష్వాత్మభావం హిత్వా కేవలే విజ్ఞానమయే బ్రహ్మణ్యాత్మత్వం భావయన్నాస్తే చేదిత్యర్థః। తతః కిం స్యాదితి, ఉచ్యతే — శరీరే పాప్మనో హిత్వా; శరీరాభిమాననిమిత్తా హి సర్వే పాప్మానః; తేషాం చ విజ్ఞానమయే బ్రహ్మణ్యాత్మాభిమానాత్ నిమిత్తాపాయే హానముపపద్యతే, ఛత్రాపాయ ఇవచ్ఛాయాయాః। తస్మాత్ శరీరాభిమాననిమిత్తాన్సర్వాన్ పాప్మనః శరీరప్రభవాన్ శరీరే ఏవ హిత్వా విజ్ఞానమయ బ్రహ్మస్వరూపాపన్నః తత్స్థాన్ సర్వాన్ కామాన్ విజ్ఞానమయేనైవాత్మనా. సమశ్నుతే సమ్యగ్భుఙ్క్తే ఇత్యర్థః। తస్య పూర్వస్య మనోమయస్య ఆత్మా ఏష ఏవ శరీరే మనోమయే భవః శారీరః। కః? య ఏష విజ్ఞానమయః। తస్మాద్వా ఏతస్మాదిత్యుక్తార్థమ్। ఆనన్దమయ ఇతి కార్యాత్మప్రతీతిః, అధికారాత్ మయట్శబ్దాచ్చ। అన్నాదిమయా హి కార్యాత్మనో భౌతికా ఇహాధికృతాః। తదధికారపతితశ్చాయమానన్దమయః। మయట్ చాత్ర వికారార్థే దృష్టః, యథా అన్నమయ ఇత్యత్ర। తస్మాత్కార్యాత్మా ఆనన్దమయః ప్రత్యేతవ్యః। సంక్రమణాచ్చ। ''ఆనన్దమయమాత్మానముపసంక్రామతి'' ఇతి వక్ష్యతి। కార్యాత్మనాం చ సంక్రమణమన్నాత్మనాం దృష్టమ్। సంక్రమణకర్మత్వేన చ ఆనన్దమయ ఆత్మా శ్రూయతే, యథా ''అన్నమయమాత్మానముపసంక్రామతి'' ఇతి। న చ ఆత్మన ఏవోపసంక్రమణమ్, అధికారవిరోధాత్। అసంభవాచ్చ। న హ్యాత్మనైవ ఆత్మన ఉపసంక్రమణం సంభవతి, స్వాత్మని భేదాభావాత్; ఆత్మభూతం చ బ్రహ్మ సంక్రమితుః। శిర ఆది కల్పనానుపపత్తేశ్చ। న హి యథోక్తలక్షణే ఆకాశాదికారణే అకార్యపతితే శిర ఆద్యవయవరూపకల్పనా ఉపపద్యతే; ''అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే'' ''అస్థూలమనణు'' ''నేతి నేత్యాత్మా'' ఇత్యాదివిశేషాపోహశ్రుతిభ్యశ్చ। మన్త్రోదాహరణానుపపత్తేశ్చ। న హి, ప్రియశిరఆద్యవయవవిశిష్టే ప్రత్యక్షతోఽనుభూయమానే ఆనన్దమయే ఆత్మని బ్రహ్మణి నాస్తి బ్రహ్మేత్యాశఙ్కాభావాత్ ''అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్'' ఇతి మన్త్రోదాహరణముపపద్యతే। ''బ్రహ్మ

పుచ్ఛం ప్రతిష్ఠా'' ఇత్యపి చానుపపన్నం పృథగ్గ్రహ్మణః ప్రతిష్ఠాత్వేన గ్రహణమ్। తస్మాత్కార్యపతిత ఏవానన్దమయః, న పర ఏవాత్మా। ఆనన్ద ఇతి విద్యాకర్మణోః ఫలమ్, తద్వికార ఆనన్దమయః। స చ విజ్ఞానమయాదాన్తరః, యజ్ఞాదిహేతోర్విజ్ఞానమయాదస్యాన్తరత్వశ్రుతేః। జ్ఞానకర్మణోర్హి ఫలం భోక్త్రర్థత్వాదాన్తరతమం స్యాత్; ఆన్తరతమశ్చ ఆనన్దమయ ఆత్మా పూర్వేభ్యః। విద్యాకర్మణోః ప్రియాద్యర్థత్వాచ్చ। ప్రియాదిప్రయుక్తే హి విద్యాకర్మణీ; తస్మాత్ప్రియాదీనాం ఫలరూపాణామాత్మసంనికర్షాత్ విజ్ఞానమయాదస్యాభ్యన్తరత్వముపపద్యతే; ప్రియాదివాసనానిర్వర్తితో హ్యాత్మా ఆనన్దమయో విజ్ఞానమయాశ్రితః స్వప్నే ఉపలభ్యతే। తస్య ఆనన్దమయస్యాత్మనః ఇష్టపుత్రాదిదర్శనజం ప్రియం శిర ఇవ శిరః, ప్రాధాన్యాత్। మోద ఇతి ప్రియలాభనిమిత్తో హర్షః। స ఏవ చ ప్రకృష్టో హర్షః ప్రమోదః। ఆనన్ద ఇతి సుఖసామాన్యమ్ ఆత్మా ప్రియాదీనాం సుఖావయవానామ్, తేష్వనుస్యూతత్వాత్। ఆనన్ద ఇతి పరం బ్రహ్మ; తద్ధి శుభకర్మణా ప్రత్యుపస్థాప్యమానే పుత్రమిత్రాది విషయవిశేషోపాధౌ అన్తఃకరణవృత్తివిశేషే తమసా అప్రచ్ఛాద్యమానే ప్రసన్నే అభివ్యజ్యతే। తద్విషయ సుఖమితి ప్రసిద్ధం లోకే। తద్వృత్తి విశేషప్రత్యుపస్థాపకస్య కర్మణోఽనవస్థితత్వాత్ సుఖస్య క్షణికత్వమ్। తద్యదన్తః కరణం తపసా తమోఘ్నేన విద్యయా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా చ నిర్మలత్వమాపద్యతే యావత్, తావత్ వివిక్తే ప్రసన్నే అన్తః కరణే ఆనన్దవిశేష ఉత్కృష్యతే విపులీభవతి। వక్ష్యతి చ— ''రసోవై సః, రసమ్ హ్యేవాయం లబ్ధ్వానన్దీ భవతి, ఏష హ్యేవానన్దయాతి, ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి'' ఇతి శ్రుత్యన్తరాత్। ఏవం చ కామోపశమోత్కర్షాపేక్షయా శతగుణోత్తరోత్తరోత్కర్షః ఆనన్దస్య వక్ష్యతే। ఏవం చ ఉత్కృష్యమాణస్య ఆనన్దమయస్యాత్మనః పరమార్థ బ్రహ్మవిజ్ఞానాపేక్షయా బ్రహ్మ పరమేవ యత్ప్రకృతం సత్యజ్ఞానానన్తలక్షణమ్, యస్య చ ప్రతిపత్త్యర్థం పఞ్చ అన్నాదిమయాః కోశా ఉపన్యస్తాః, యచ్చ తేభ్య అభ్యన్తరమ్, యేన చ తే సర్వే ఆత్మవన్తః, తత్ బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా। తదేవ చ సర్వస్యావిద్యా పరికల్పితస్య ద్వైతస్య అవసానభూతమ్ అద్వైతం బ్రహ్మ ప్రతిష్ఠా, ఆనన్దమయస్య ఏకత్వావసానత్వాత్। అస్తి తదేకమవిద్యా కల్పితస్య ద్వైతస్యావసానభూతమద్వైతం బ్రహ్మ ప్రతిష్ఠా పుచ్ఛమ్। తదేతస్మిన్నప్యర్థే ఏష శ్లోకో భవతి॥

ఇతి పఞ్చమానువాక భాష్యమ్॥

టీక: విజ్ఞానం = విజ్ఞానము, యజ్ఞం=యజ్ఞమును, తనుతే=చేయుచున్నది. అపిచ = మఱియున్నూ, కర్మాణి = లౌకిక కృత్యములను, తనుతే = చేయుచున్నది, సర్వేదేవాః = దేవతలందఱున్నూ, జ్యేష్ఠం=అందఱికంటె పెద్దది అయినట్టి, విజ్ఞానం బ్రహ్మ = విజ్ఞానమను బ్రహ్మమును, ఉపాసతే = ఉపాసించుచున్నారు. విజ్ఞానం బ్రహ్మ = విజ్ఞానబ్రహ్మమును. వేద చేత్=ఎఱింగి, తస్మాత్ = ఆ విజ్ఞానబ్రహ్మము నుండి, న ప్రమాద్యతి చేత్ = ప్రమాదమును పొందనియెడల, శరీరే = శరీరము నందుఁగల, పాప్మనః = పాపములను, హిత్వా=వదలి, సర్వాన్కామాన్ = సమస్త కామములను, సమశ్నుతే = పొందుచున్నాఁడు.

యః = ఏ విజ్ఞానమయుఁడు (ఇపుడు చెప్పఁబడినాడో), (సః = ఆ), ఏషః ఏవ = ఈ విజ్ఞానమయుఁడే, తస్య = ఆ, పూర్వస్య = వెనుక చెప్పఁబడిన మనోమయునకు, శారీర = మనోమయ శరీరమునందు పుట్టిన, ఆత్మా = ఆత్మ.

తస్మాత్ = ఆ, ఏతస్మాత్ = ఈ, విజ్ఞానమయాత్ = విజ్ఞానమయుని కంటె, అన్యః = ఇతరుఁడగు, ఆనందమయః = ఆనందమయుఁడు, అంతరః = అంతరుఁడగు, ఆత్మా = ఆత్మ, తేన = అంతరుఁడగు ఆ యానందమయునిచేత, ఏషః = ఈ విజ్ఞానమయుఁడు, పూర్ణః = పూర్ణముగా వ్యాప్తుఁడయి యున్నాఁడు.

స ఏషః = ఆ ఈ ఆనందమయుఁడు, పురుషవిధః ఏవవై = పురుషాకారము గలవాఁడే అగుచున్నాఁడు. తస్య = ఆ విజ్ఞానమయునియొక్క, పురుషవిధతాం = పురుషాకారత్వమును. అను = అనుసరించియే, అయం = ఈ యానందమయుఁడు, పురుషవిధః = పురుషాకారము గలవాఁ డగుచున్నాఁడు.

తస్య=ఆ యానందమయునకు, ప్రియం ఏవ = ప్రియమే, శిరః = శిరస్సు, మోదః=మోదమే, దక్షిణః పక్షః = దక్షిణపుపక్షము, ప్రమోదః = ప్రమోదము, ఉత్తరః పక్షః=ఉత్తరపు పక్షము, ఆనందః=ఆనందము, ఆత్మా=ఆత్మ, బ్రహ్మ = బ్రహ్మము, పుచ్ఛం ప్రతిష్ఠా=పుచ్ఛమువలె ప్రతిష్ఠావహము, తత్ అపి=ఆ యానంద మయుని గూర్చి, ఏషఃశ్లోకము=ఈ చెప్పఁబోవునట్టి శ్లోకము—మంత్రము, భవతి = కలదు.

తా. లోకమునందు విజ్ఞానవంతుఁడే శ్రద్ధాభక్తులు కలిగి యజ్ఞము నాచరించు చున్నాఁడు కావున విజ్ఞానమే యజ్ఞమును చేయుచున్నది. (అని చెప్పఁబడినది.) మఱియు విజ్ఞానమే లౌకికములగు పనులను చేయుచున్నది. లోకమునందు చేయఁబడు

చున్న సకల కార్యజాతమును విజ్ఞానమే ఆచరించుచున్నది. కావున విజ్ఞానమయుఁడే ఆత్మ—అనఁగా బ్రహ్మమనుట యుక్తము.

మఱియు ప్రథమమున పుట్టినదగుటచేత జ్యేష్ఠము అగు విజ్ఞాన బ్రహ్మమునే ఇంద్రాది దేవతలందఱు ఉపాసించుచున్నారు — అనఁగా ఆ విజ్ఞానమయ మగు బ్రహ్మమునందు అభిమానము గలిగి యుపాసించుచున్నారని భావము. ఆ ఇంద్రాది దేవతలు అట్టి బ్రహ్మము నుపాసించుటచేతనే జ్ఞానైశ్వర్యవంతులయి యున్నారు.

అట్టి విజ్ఞాన బ్రహ్మమును చక్కఁగా ఉపాసించినను, కేవలము ఉపాసించుటయే గాదు, ఆ విజ్ఞానబ్రహ్మము నుండి ప్రమాదమును పొందకపోయినను, విజ్ఞాన బ్రహ్మమునందు ప్రమాదమును పొందుటయనఁగా బాహ్యములును అనాత్మములును అగు అన్నమయాదికోశములందు ఆత్మయను తలంపు కలుగుటయే. కావున అన్నమయాదికోశములందు ఆత్మభావమును వదలి కేవలము విజ్ఞానమయ బ్రహ్మమునందే బ్రహ్మభావము నుంచి ఉపాసించుచున్న యెడల శరీరాభిమాన నిమిత్తకములగు సకల పాపములను జీవించియున్నప్పుడే వదలి విజ్ఞానమయ బ్రహ్మస్వరూపమును, పొందినవాఁడయి ఆ విజ్ఞాన మయాత్మస్వరూపముచేత సకలాభిలాషలను పొందుచున్నాఁడు.

శరీరాభిమాన నిమిత్తమువలన సకల పాపములు కలుగుచున్నవి. అట్టి సకల పాపములు విజ్ఞానమయుఁడు బ్రహ్మ మని తలంచుట వలన నిమిత్తము లేకపోవుట వలన గొడుగుపోయిన యెడల గొడుగుయొక్క నీడ సైతము ఎటుల లేకపోవునో, ఆదేవిధముగా నశించుచున్నవి. కావున సకల పాపములు నశించును. శరీరాభిమాన నిమిత్తములయినట్టియు, శరీరప్రభవములయినట్టియు సకల పాపములను ఆ శరీరమునందే వదలినవాఁడయి, విజ్ఞానమయ బ్రహ్మస్వరూపమును పొందినవాఁడై, ఆ విజ్ఞానమయ బ్రహ్మమునందున్న సకల కామములను తదాత్మకుఁడయి చక్కఁగా అనుభవించును.

పూర్వోక్తమగు ఆ మనోమయశరీరమునకు ఈ మనోమయశరీరమునందు పుట్టిన విజ్ఞానమయుఁడే ఆత్మ.

ఈ చెప్పఁబడిన విజ్ఞానమయునికంటె వేఱుగా అభ్యంతరుఁడయి ఆనందమయుఁడు కలఁడు. ఆ యీ యానందమయునిచేత ఈ విజ్ఞానమయ కోశము పూర్ణమయి యున్నది.

## ఆనందమయ నిర్ణయము

ఇచట చెప్పఁబడిన ఆనందమయ శబ్దము కార్యబ్రహ్మవాచకము. ఇందులకు ఉపపత్తులు ఏవియనఁగా:—

౧. ప్రకరణము ననుసరించి ఇచట చెప్పఁబడిన ఆనందమయ శబ్దము కార్యబ్రహ్మవాచకము (జీవవాచకము) గాని పరమాత్మవాచకముగాదు. ఏలయనఁగా ఇచట అన్నమయ, ప్రాణమయాది భౌతిక కార్యాత్మలే ప్రకరణమునందు చెప్పఁబడియున్నవి.

౨. ఆనందమయ శబ్దమునందుఁగల మయట్ శబ్దమువలన ఆనందమయ శబ్దము పరమాత్మవాచకముగాదు. మయట్ శబ్దము వికారవాచకము. అన్నమయము అనునప్పుడు అన్నవికారము అనెడి అర్థము ఎటుల స్ఫురించుచున్నదో అదేవిధముగా ఆనందమయుఁడనఁగా ఆనందవికారుఁడగు కార్యాత్మయే అని గ్రహింపవలయును.

౩. సంక్రమణము—అనఁగా 'ఆనందమయ మాత్మాన ముపసంక్రామతి' అని పైనఁజెప్పఁబడగలదు. కార్యాత్మకులయిన అన్నాత్మకులకే సంక్రమణము—పొందుట - ఉపపన్నమగుచున్నది. ఆనందమయ ఆత్మను ఇచట మంత్రమునందు సంక్రమణమునకు కర్మగా శ్రుతి చెప్పుచున్నది. ఆత్మకే సంక్రమణమనుట ప్రకృతమునకు సంగతముకాదు. మఱియు నిది యసంభవము, బ్రహ్మము సంక్రమణము చేయువానికి ఆత్మభూత మగుట చేతను.

౪. శిర ఆదికల్పనము అనుపపత్తి యగుటచేతను—అనఁగా సత్యజ్ఞానానంత లక్షణముగాఁగల అకార్యబ్రహ్మమునందు శిర ఆద్యవయవరూపకల్పనము ఉపపన్నము కాఁజాలదు. మఱియు అకార్యబ్రహ్మముమ—నిర్గుణ బ్రహ్మమును శ్రుతులు—

౧. అదృశ్యే అనాత్మ్యే అనిరుక్తే అనిలయనే. తై. ఉ. ౨. ౭.
౨. అస్థూల మనణు. బృహ. ౩. ౮. ౮.
౩. నేతినేత్యాత్మా. బృహ. ౩. ౯. ౨౬.

త్యాది విశేషనిషేధపూర్వకముగ తెలుపుచుండుటచేతను,

౫. ఇదియునుఁగాక ఇందే ముందు 'అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్. (తై. ఉ. ౨-౬.) అని చెప్పఁబడుచున్నది, ప్రియశిర ఆద్యవయవ విశిష్టుఁడగు ఆనందమయాత్మ బ్రహ్మము బ్రత్యక్షముగాఁ గనంబడుచుండఁగా

'బ్రహ్మము లేదను' ఆ శంకకు అవకాశమే లేదు. అప్పుడు 'అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతివేదచేత్.' అను మంత్రమును చెప్పుటకు అవకాశమే ఉండజాలదు. మఱియు 'బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా' అని వేఱుగా బ్రహ్మమును ప్రతిష్ఠగా గ్రహించుటయు ఉపపన్నము కాఁజాలదు.

కావున ఇచట చెప్పఁబడిన ఆనందమయుఁడు కార్యబ్రహ్మముగాని పరమాత్మ కాఁజాలఁడు.

ఆనందమయకోశవివరణము:—

౧. ప్రియము శిరస్సు
౨. మోదము దక్షిణపక్షము
౩. ప్రమోదము ఉత్తరపక్షము
౪. ఆనందము ఆత్మ
౫. బ్రహ్మము ప్రతిష్ఠావహమగు పుచ్ఛము

వివరణము:—సగుణబ్రహ్మవేత్తకు దేహపాతముకంటె ముందే పుణ్య పాప పరిత్యాగము కలుగునను విషయము బ్ర. సూ. ౩. ౩. ౨౮. "సాంపరాయేత ర్తవ్యాభావా త్తథాహ్యన్యే" అని సాంపరాయాధికరణమునందు నిర్ణయింపఁబడినది.

ఈ మంత్రము ౮ పాదములుగల వైదికమయిన అతిచ్ఛందస్సునకు సంబంధించినది.

# ౬. షష్ఠో ఽనువాకః



మం. అసన్నేవ స భవతి । అస ద్బ్రహ్మేతి వేద చేత్ ।
అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంత మేనం తతో విదు
రితి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య ।
అథాతోఽనుప్రశ్నాః । ఉతావిద్వా నముం లోకం
ప్రేత్య । కశ్చన గచ్ఛతీ3 । ఆహో విద్వా నముం
లోకం ప్రేత్య । కశ్చి త్సమశ్ను తా3 ఉ । సో ఽకామ
యత । బహు స్యాం ప్రజాయేయేతి । స తపో ఽత
ప్యత । సతప స్తప్త్వా । ఇదగ్ం సర్వ మసృజత । యది
దం కించ । తత్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్ । తద
నుప్రవిశ్య । సచ్చ త్యచ్చాభవత్ । నిరుక్తం చాని
రుక్తంచ । నిలయనం చానిలయనం చ । విజ్ఞానం చా
విజ్ఞానం చ । సత్యం చానృతం చ సత్య మభవత్ ।
యదిదం కించ । తత్సత్యమిత్యాచక్షతే । తదప్యేష
శ్లోకో భవతి ॥౬॥

శాంకరభాష్యమ్:—

అసన్నేవ అసత్సమ ఏవ. యథా అసన్ అపురుషార్థ సంబంధీ. ఏవం సః భవతి అపురుషార్థ సంబంధీ। కోఽసౌ? యః అసత్ అవిద్యమానం బ్రహ్మ ఇతి వేద విజానాతి చేత్ యది। తద్విపర్యయేణ యత్సర్వ వికల్పాస్పదం సర్వప్రవృత్తి బీజం సర్వవిశేష ప్రత్యస్తమితమపి, అస్తి తత్ బ్రహ్మ ఇతి వేద చేత్, కుతః పునరాశఙ్కా తన్నాస్తిత్వే వ్యవహారాతీతత్వం బ్రహ్మణ ఇతి బ్రూమః। వ్యవహార విషయే హి వాచారమ్భణమాత్రే అస్తిత్వభావిత బుద్ధిః తద్విపరీతే వ్యవహారాతీతే నాస్తిత్వమపి ప్రతిపద్యతే। యథా "ఘటాదిర్వ్యవహార విషయ తయోప పన్నః సన్, తద్విపరీతః అసన్" ఇతి ప్రసిద్ధమ్, ఏవం తత్సామాన్యాదిహాపి స్యాద్బ్రహ్మణో నాస్తిత్వం ప్రత్యాశఙ్కా। తస్మాదుచ్యతే — అస్తి బ్రహ్మేతి చేద్వేదేతి। కిం పునః స్యాత్తదస్తీతి విజానతః? తదాహ—సన్తం విద్యమానం బ్రహ్మస్వరూపేణ పరమార్థ సదాత్మాపన్నమ్ ఏనమ్ ఏవం విదం విదుః బ్రహ్మ విదః। తతః తస్మాత్ అస్తిత్వవేదనాత్ సః అన్యేషాం బ్రహ్మవద్విజ్ఞేయో భవతీ త్యర్థః। అథవా యో నాస్తి బ్రహ్మేతి మన్యతే, స సర్వస్యైవ సన్మార్గస్య వర్ణాశ్రమాది వ్యవస్థా లక్షణస్య నాస్తిత్వం ప్రతిపద్యతే; బ్రహ్మప్రతిపత్త్యర్థ త్వాత్తస్య। అతః నాస్తికః సః అసన్ అసాధురుచ్యతే లోకే। తద్విపరీతః సన్ యః అస్తి బ్రహ్మేతి చేద్వేద. స తద్బ్రహ్మప్రతిపత్తిహేతుం సన్మార్గం వర్ణాశ్రమాది వ్యవస్థా లక్షణం శ్రద్దధానతయా యాథావత్ప్రతిపద్యతే యస్మాత్. తతః తస్మాత్ సన్తం సాధుమార్గస్థమ్ ఏనం విదుః సాధవః. తస్మాదస్తీత్యేవ బ్రహ్మ ప్రతిపత్తవ్య మితి వాక్యార్థః। తస్య పూర్వస్య విజ్ఞానమయస్య ఏష ఏవ శరీరే విజ్ఞానమయే భవః శారీరః ఆత్మా। కోఽసౌ? య ఏష ఆనన్దమయః। తం ప్రతి నాస్త్యాశఙ్కా నాస్తిత్వే। అపోఢ సర్వవిశేషత్వాత్తు బ్రహ్మణో నాస్తిత్వం ప్రత్యాశఙ్కా యుక్తా; సర్వ సామ్యాచ్చ బ్రహ్మణః। యస్మాదేవమ్, అతః తస్మాత్ అథ అనన్తరం శ్రోతుఃశిష్యస్య అనుప్రశ్నాః ఆచార్యోక్తిమను ఏతే ప్రశ్నాః। సామాన్యం హి బ్రహ్మ ఆకాశాది కారణత్వాత్ విదుషః అవిదుషశ్చ; అతః అవిదుషోఽపి బ్రహ్మప్రాప్తిరాశఙ్క్యతే— ఉత అపి అవిద్వాన్ అముం లోకం పరమాత్మానమ్ ఇతః ప్రేత్య కశ్చన. చనశబ్దః అప్యర్థే, అవిద్వానపి గచ్ఛతి ప్రాప్నోతి? "కిం వా న గచ్ఛతి?" "ఇతి ద్వితీ యోఽపి ప్రశ్నో ద్రష్టవ్యః, అనుప్రశ్నా ఇతి బహువచనాత్। విద్వాంసం ప్రత్యన్యౌ ప్రశ్నౌ—యద్యవిద్వాన్సామాన్యం కారణమపి బ్రహ్మ న గచ్ఛతి, అతో విదుషోఽపి

బ్రహ్మగమనమాశఙ్క్యతే; అతస్తం ప్రతి ప్రశ్నః—ఆహో విద్వానితి। ఉకారం చ వక్ష్యమాణ మథస్తాదప కృష్య తకారం చ పూర్వస్మాదుతశబ్దాద్వ్యాసజ్య ఆహో ఇత్యేతస్మాత్పూర్వముత శబ్దం సంయోజ్య పృచ్ఛతి—ఉతాహో విద్వానితి। విద్వాన్ బ్రహ్మవిదపి కశ్చిత్ ఇతః ప్రేత్య అముం లోకం సమశ్నుతే ప్రాప్నోతి। సమశ్నుతే ఉ ఇత్యేవం స్థితే, అయాదేశే యలోపే చ కృతే, అకారస్య ప్లుతిః—సమశ్నుతా ౩ ఉ ఇతి। విద్వాన్సమశ్నుతే అముం లోకమ్; కిం వా, యథా అవిద్వాన్, ఏవం విద్వానపి న సమశ్నుతే ఇత్యపరః ప్రశ్నః। ద్వావేవ వా ప్రశ్నౌ విద్వద విద్వద్విషయౌ; బహువచనం తు సామర్థ్యప్రాప్త ప్రశ్నాన్తరాపేక్షయా ఘటతే। "అసద్బ్రహ్మేతి పేద చేత్" "అస్తి బ్రహ్మేతి చేద్వేద" ఇతి శ్రవణాదస్తి నాస్తీతి సంశయః। తతః అర్థప్రాప్తః కిమస్తి, నాస్తీతి ప్రథమోఽను ప్రశ్నః। బ్రహ్మణః అపక్షపాతిత్వాత్ అవిద్వాన్గచ్ఛతి న గచ్ఛతీతి ద్వితీయః। బ్రహ్మణః సమత్వేఽపి అవిదుష ఇవ విదుషోఽప్యగమన మాశఙ్క్య కిం విద్వాన్సమశ్నుతే న సమశ్నుతే ఇతి తృతీయోఽను ప్రశ్నః॥

ఏతేషాం ప్రతివచనార్థ ఉత్తరో గ్రన్థ ఆరభ్యతే। తత్ర అస్తిత్వమేవ తావదుచ్యతే। యచ్చోక్తమ్ "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇతి, తత్ర చ కథం సత్యత్వమిత్యేత ద్వక్తవ్యమితి ఇదముచ్యతే। సత్త్వోక్త్యైవ సత్యత్వముచ్యతే। ఉక్తం హి సదేవ సత్యమితి; తస్మాత్సత్త్వోక్త్యైవ సత్యత్వముచ్యతే। కథమేవమర్థతా అవగమ్యతే అస్య గ్రన్థస్య? శబ్దానుగమాత్। అనేనైవ హ్యర్థేనాన్వితాని ఉత్తర వాక్యాని—"తత్సత్య మిత్యాచక్షతే" "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" ఇత్యాదీని। తత్ర అసదేవ బ్రహ్మేత్యాశఙ్క్యతే। కస్మాత్? యదస్తి, తద్విశేషతో గృహ్యతే; యథా ఘటాది। యన్నాస్తి, తన్నోపలభ్యతే; యథా శశవిషాణాది। తథా నోప లభ్యతే బ్రహ్మ; తస్మాద్విశేషతః అగ్రహణాన్నాస్తీతి। తన్న, ఆకాశాది కారణత్వా ద్బ్రహ్మణః। న నాస్తి బ్రహ్మ। కస్మాత్? ఆకాశాది హి సర్వం కార్యం బ్రహ్మణో జాతం గృహ్యతే; యస్మాచ్చ జాయతే కించిత్, తదస్తీతి దృష్టం లోకే, యథా ఘటాఙ్కురాది కారణం మృద్బీజాది; తస్మాదాకాశాది కారణత్వాదస్తి బ్రహ్మ। న చాసతో జాతం కించిద్గృహ్యతే లోకే కార్యమ్। అసతశ్చేన్నామరూపాది కార్యమ్, నిరాత్మకత్వాన్నోప లభ్యేత; ఉపలభ్యతే తు; తస్మాదస్తి బ్రహ్మ। అసతశ్చేత్కార్యం గృహ్యమాణమపి అసదన్వితమేవ స్యాత్; న చైవమ్; తస్మాదస్తి బ్రహ్మ। తత్ర "కథమసతః సజ్జాయేత" ఇతి శ్రుత్యన్తరమసతః సజ్జన్మాసంభవమన్వాచష్టే

న్యాయతః। తస్మాత్సదేవ బ్రహ్మేతి యుక్తమ్। తద్యది మృద్బీజాదివత్ కారణం
స్యాత్, అచేతనం తర్హి। న; కామయితృత్వాత్। న హి కామయిత్రచేతనమస్తి లోకే।
సర్వజ్ఞం హి బ్రహ్మేత్యవోచామ; అతః కామయితృత్వోపపత్తిః। కామయితృత్వా
దస్మదాదివదనాప్తకామమితి చేత్, న; స్వాతన్త్ర్యాత్। యథా అన్యాన్పరవశీకృత్య
కామాదిదోషాః ప్రవర్తయన్తి, న తథా బ్రహ్మణః ప్రవర్తకాః కామాః। కథం
తర్హి? సత్యజ్ఞానలక్షణాః స్వాత్మభూతత్వాద్విశుద్ధాః। న తైర్బ్రహ్మ ప్రవర్త్యతే;
తేషాం తు తత్ప్రవర్తకం బ్రహ్మ ప్రాణికర్మాపేక్షయా। తస్మాత్స్వాతన్త్ర్యం
కామేషు బ్రహ్మణః; అతో న అనాప్తకామం బ్రహ్మ। సాధనాన్తరానపేక్షత్వాచ్చ।
యథా అన్యేషామనాత్మభూతా ధర్మాదినిమిత్తాపేక్షాః కామాః స్వాత్మవ్యతిరిక్తకార్య
కరణసాధనాన్తరాపేక్షాశ్చ, న తథా బ్రహ్మణః। కిం తర్హి? స్వాత్మనోఽనన్యాః। తదేత
దాహ — సోఽకామయత। సః ఆత్మా యస్మాదాకాశః సంభూతః, అకామయత కామిత
వాన్। కథమ్? బహు ప్రభూతం స్యాం భవేయమ్। కథమేకస్యార్థాన్తరాననుప్రవేశే
బహుత్వం స్యాదితి, ఉచ్యతే — ప్రజాయేయ ఉత్పద్యేయ। న హి పుత్రోత్పత్తిరివా
ర్థాన్తరవిషయం బహుభవనమ్। కథం తర్హి? ఆత్మస్థానభివ్యక్తనామరూపాభివ్యక్త్యా।
యదా ఆత్మస్థే అనభివ్యక్తే నామరూపే వ్యాక్రియేతే, తదా ఆత్మస్వరూపాపరిత్యాగే
నైవ బ్రహ్మణః అప్రవిభక్తదేశకాలే సర్వావస్థాసు వ్యాక్రియేతే। తదేతన్నామరూప
వ్యాకరణం బ్రహ్మణో బహుభవనమ్। నాన్యథా నిరవయవస్య బ్రహ్మణో బహుత్వా
పత్తిరుపపద్యతే అల్పత్వం వా, యథా ఆకాశస్యాల్పత్వం బహుత్వం చ వస్త్వన్తర
కృతమేవ। అతః తద్ద్వారేణైవాత్మా బహు భవతి। న హ్యాత్మనోఽన్యదనాత్మభూతం
తత్ప్రవిభక్తదేశకాలం సూక్ష్మం వ్యవహితం విప్రకృష్టం భూతం భవద్భవిష్యద్వా
వస్తు విద్యతే। అతః నామరూపే సర్వావస్థే బ్రహ్మణైవాత్మవతీ। న బ్రహ్మ తదాత్మ
కమ్। తే తత్ప్రత్యాఖ్యానే న స్త ఏవేతి తదాత్మకే ఉచ్యేతే। తాభ్యాం చ ఉపాధిభ్యాం
జ్ఞాతృజ్ఞేయజ్ఞానశబ్దార్థాది సర్వసంవ్యవహారభాగ్బ్రహ్మ। సః ఆత్మా ఏవంకామః సన్
తపః అతప్యత। తప ఇతి జ్ఞానముచ్యతే, "యస్య జ్ఞానమయం తపః" ఇతి శ్రుత్యన్త
రాత్। ఆప్తకామత్వాచ్చ ఇతరస్య అసంభవ ఏవ తపసః। తత్తపః అతప్యత తప్తవాన్,
సృజ్యమానజగద్రచనాదివిషయామాలోచనామకరోదాత్మేత్యర్థః। సః ఏవమాలోచ్య
తపః తప్త్వా ప్రాణికర్మాదినిమిత్తానురూపమ్ ఇదం సర్వం జగత్ దేశతః కాలతః
నామ్నా రూపేణ చ యథానుభవం సర్వైః ప్రాణిభిః సర్వావస్థైరనుభూయమానమ్

అసృజత సృష్టవాన్। యదిదం కించ యత్కించేదమవిశిష్టమ్, తత్ ఇదం జగత్ సృష్ట్వా, కిమకరోదితి, ఉచ్యతే—తదేవ సృష్టం జగత్ అనుప్రావిశదితి॥

తత్రైతచ్చిన్త్యమ్— —కథమనుప్రావిశదితి। కిమ్. యః స్రష్టా, స తేనైవాత్మనానుప్రావిశత్, ఉత అన్యేనేతి? కిం తావద్యుక్తమ్? క్త్వాప్రత్యయ శ్రవణాత్, యః స్రష్టా. స ఏవానుప్రావిశదితి। నను న యుక్తం మృద్వచ్చేత్కారణం బ్రహ్మ, తదాత్మకత్వాత్కార్యస్య, కారణమేవ హి కార్యాత్మనా పరిణమతే; అతః అప్రవిష్టస్యైవ కార్యోత్పత్తే రూర్ధ్వం పృథక్కారణస్య పునః ప్రవేశోఽనుపపన్నః। న హి ఘటపరిణామ వ్యతిరేకేణ మృదో ఘటే ప్రవేశోఽస్తి। యథా ఘటే చూర్ణాత్మనా మృదోఽనుప్రవేశః. ఏవమనేన ఆత్మనా నామరూపకార్యే అనుప్రవేశ ఆత్మనః ఇతి చేత్, శ్రుత్యన్తరాచ్చ "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" ఇతి; నైవ యుక్తమ్. ఏకత్వాద్బ్రహ్మణః। మృదాత్మనస్త్వనేకత్వాత్ సావయవత్వాచ్చ యుక్తో ఘటే మృదశ్చూర్ణాత్మనాను ప్రవేశః, మృదశ్చూర్ణస్య అప్రవిష్టదేశత్వాచ్చ। న త్వాత్మన ఏకత్వే సతి నిరవయవత్వాదప్రవిష్టదేశాభావాచ్చ ప్రవేశ ఉపపద్యతే; కథం తర్హి ప్రవేశః స్యాత్? యుక్తశ్చ ప్రవేశః, శ్రుతత్వాత్—"తదేవానుప్రావిశత్" ఇతి। సావయవమేవాస్తు; తర్హి సావయత్వాత్ ముఖే హస్తప్రవేశవత్ నామరూపకార్యే జీవాత్మనానుప్రవేశో యుక్త ఏవేతి చేత్, న; అశూన్య దేశత్వాత్। న హి కార్యాత్మనా పరిణతస్య నామరూప కార్యదేశ వ్యతిరేకేణ ఆత్మశూన్యః ప్రదేశోఽస్తి, యం ప్రవిశే జ్జీవాత్మనా। కారణమేవ చేత్ప్రవిశేత్, జీవాత్మత్వం జహ్యాత్, యథా ఘటో మృత్ప్రవేశే ఘటత్వం జహాతి। "తదేవానుప్రావిశత్" ఇతి చ శ్రుతేర్న కారణాను ప్రవేశో యుక్తః। కార్యాన్తరమేవ స్యాదితి చేత్—తదేవాను ప్రావిశదితి జీవాత్మరూపం కార్యం నామరూప పరిణతం కార్యాన్తర మేవ ఆపద్యత ఇతి చేత్, న; విరోధాత్। న హి ఘటో ఘటాన్తర మాపద్యతే. వ్యతిరేక శ్రుతి విరోధాచ్చ। జీవస్య నామ రూప కార్య వ్యతిరేకానువాదిన్యః శ్రుతయో విరుధ్యేరన్; తదాపత్తౌ మోక్షా సంభవాచ్చ। న హి యతో ముచ్యమానః. తదేవ ఆపద్యతే। న హి శృఙ్ఖలాపత్తిః బద్ధస్య తస్కరాదేః। బాహ్యాన్తర్భేదేన పరిణమితి చేత్—తదేవ కారణం బ్రహ్మ శరీరాద్యాధారత్వేన తదన్తర్జీవాత్మనా ఆధేయత్వేన చ పరిణతమితి చేత్, న; బహిష్ఠస్య ప్రవేశోపపత్తేః। న హి యో యస్యాన్తఃస్థః స యేవ తత్ప్రవిష్ట ఉచ్యతే। బహిష్ఠస్యాను ప్రవేశః స్యాత్, ప్రవేశ శబ్దార్థస్యైవం దృష్టత్వాత్—యథా గృహం కృత్వా ప్రావిశదితి। జలసూర్యకాది ప్రతిబిమ్బవత్ ప్రవేశః స్యాదితి చేత్, న; అపరిచ్ఛిన్నత్వాద

మ్మూర్తత్వాచ్చ। పరిచ్ఛిన్నస్య మూర్తస్యాన్యస్య అన్యత్ర ప్రసాద స్వభావకే జలాదౌ సూర్యకాది ప్రతిబిమ్బోదయః స్యాత్, న త్వాత్మనః; అమూర్తత్వాత్. ఆకాశాది కారణస్య ఆత్మనః వ్యాపకత్వాత్। తద్విప్రకృష్ట దేశ ప్రతిబిమ్బాధార వస్త్వన్తరా భావాచ్చ ప్రతిబిమ్బవత్ప్రవేశో న యుక్తః। ఏవం తర్హి నైవాస్తి ప్రవేశః; న చ గత్యన్తరముపలభా మహే, ''తదేవాను ప్రావిశత్'' ఇతి శ్రుతేః। శ్రుతిశ్చ నోఽతీన్ద్రియ విషయే విజ్ఞానోత్పత్తౌ నిమిత్తమ్। న చాస్మాద్వాక్యాత్ యత్నవతా మపి విజ్ఞాన ముత్పద్యతే। హన్త తర్హ్యనర్థ కత్వాదపోహ్యమేత ద్వాక్యమ్ ''తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్'' ఇతి; న, అన్యార్థత్వాత్। కిమర్థమస్థానే చర్చా? ప్రకృతో హ్యన్యో వివక్షితోఽస్య వాక్యార్థః అస్తి; స స్మర్తవ్యః—''బ్రహ్మవిదాప్నోతి పరమ్'' ''సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ'' ''యో వేద నిహితం గుహాయామ్'' ఇతి। తద్వి జ్ఞానం చ వివక్షితమ్; ప్రకృతం చ తత్। బ్రహ్మస్వరూపావగ మాయ చ ఆకాశా ద్యన్నమయాన్తం కార్యం ప్రదర్శితమ్; బ్రహ్మావగమశ్చ ఆరబ్ధః। తత్ర అన్నమయా దాత్మనోఽన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః, తదన్తర్మనోమయో విజ్ఞానమయ ఇతి విజ్ఞాన గుహాయాం ప్రవేశితః; తత్ర చ ఆనన్దమయో విశిష్ట ఆత్మా ప్రదర్శితః। అతః పరమానన్దమయ లిఙ్గాధిగమ ద్వారేణ ఆనన్ద వివృద్ధ్యవసాన ఆత్మా। బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా సర్వవికల్పాస్పదో నిర్వికల్పోఽస్యామేవ గుహాయామధి గన్తవ్య ఇతి తత్ప్రవేశః ప్రకల్ప్యతే। న హ్యన్యత్రోప లభ్యతే బ్రహ్మ, నిర్విశేషత్వాత్; విశేష సమ్బన్ధో హ్యుపలబ్ధిహేతు ర్దృష్టః—యథా రాహోశ్చన్ద్రార్క విశేష సంబన్ధః। ఏవమన్తఃకరణ గుహాత్మ సంబన్ధో బ్రహ్మణ ఉపలబ్ధిహేతుః, సంనికర్షాత్, అవ భాసాత్మకత్వాచ్చ అన్తఃకరణస్య। యథా చ ఆలోక విశిష్టఘటాద్యుప లబ్ధిః, ఏవం బుద్ధి ప్రత్యయాలోక విశిష్టాత్మోప లబ్ధిః స్యాత్; తస్మాత్ ఉపలబ్ధిహేతౌ గుహాయాం నిహితమితి ప్రకృతమేవ। తద్వృత్తి స్థానీయేత్విహ పునస్తత్సృష్ట్వా తదేవానుప్రావిశ ద్దిత్యుచ్యతే॥

తదేవేద మాకాశాది కారణం కార్యం సృష్ట్వా తదను ప్రవిష్టమివాన్త ర్గుహాయాం బుద్ధౌ ద్రష్టృ శ్రోతృ మన్తృ విజ్ఞాత్రిత్యేవం విశేషవదుప లభ్యతే। స ఏవ తస్య ప్రవేశః తస్మాదస్తి తత్కారణం బ్రహ్మ। అతః అస్తిత్వాదస్తీత్యేవోప లబ్ధవ్యం తత్। తత్ కార్యమనుప్రవిశ్య; కిమ్? సచ్చ మూర్తం త్యచ్చ అమూర్తమ్ అభవత్। మూర్తామూర్తే హ్యవ్యాకృత నామరూపే ఆత్మస్థే అన్తర్గతేన ఆత్మనా వ్యాక్రియేతే మూర్తామూర్త శబ్దవాచ్యే। తే ఆత్మనా త్వప్రవిభక్త దేశకాలే ఇతి కృత్వా

ఆత్మా తే అభవదితి త్యుచ్యతే। కించ, నిరుక్తం చానిరుక్తం చ, నిరుక్తంనామ నిష్కృష్య సమాన సమాన జాతీయేభ్యః దేశకాల విశిష్టతయా ఇదం తదిత్యుక్తమ్; అనిరుక్తం తద్విపరీతం; నిరుక్తానిరుక్తే అపి మూర్తామూర్తయోరేవ విశేషణే। తథా సచ్చ త్యచ్చ ప్రత్యక్షపరోక్షే, తథా నిలయనం చానిలయనం చ। నిలయనం నీడమ్ ఆశ్రయః మూర్తస్యైవ ధర్మః; అనిలయనం తద్విపరీతమ్ అమూర్తస్యైవ ధర్మః। త్యదనిరుక్తా నిలయనాని అమూర్త ధర్మత్వేఽపి వ్యాకృతవిషయాణ్యేవ, సర్గోత్తర కాల భావ శ్రవణాత్। త్యదితి ప్రాణాద్య నిరుక్తం తదేవానిలయనం చ। అతో విశేషణాని అమూర్తస్య వ్యాకృత విషయాణ్యేవైతాని। విజ్ఞానం చేతనమ్; అవిజ్ఞానం తద్రహిత మచేతనం పాషాణాది। సత్యం చ వ్యవహార విషయమ్, అధికారాత్, న పరమార్థ సత్యమ్; ఏకమేవ హి పరమార్థ సత్యం బ్రహ్మ। ఇహ పునః వ్యవహార విషయ మాపేక్షికమ్ సత్యమ్, మృగ తృష్ణికాద్యనృతాపేక్షయా ఉదకాది సత్య ముచ్యతే। అనృతం చ తద్విపరీతమ్। కిం పునః? ఏతత్సర్వమభవత్, సత్యం పరమార్థ సత్యమ్; కిం పునస్తత్? బ్రహ్మ, "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇతి ప్రకృత త్వాత్। యస్మాత్ సత్త్యదాదికం మూర్తామూర్త ధర్మజాతం యత్కించేదం సర్వమ విశిష్టం వికారజాతమేకమేవ సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మాభవత్, తద్వ్యతిరేకేణాభావా న్నామరూప వికారస్య, తస్మాత్ తత్ బ్రహ్మ సత్యమిత్యాచక్షతే బ్రహ్మవిదః। అస్తి నాస్తీత్యను ప్రశ్నః ప్రకృతః; తస్య ప్రతివచన విషయే ఏతదుక్తమ్—"ఆత్మాకామ యత బహుస్యామ్" ఇతి। స యథా కామం చ ఆకాశాది కార్యం సత్త్యదాది లక్షణం సృష్ట్వాతదనుప్రవిశ్య పశ్యఞ్ఛృణ్వన్మన్వానో విజానన్ బహ్వాభవత్; తస్మాత్ తదేవేద మాకాశాదికారణం కార్యస్థం పరమే వ్యోమన్ హృదయగుహా యాం నిహితం తత్ప్రత్యయావభాస విశేషేణోపలభ్యమానమస్తీత్యేవం విజానీయా దిత్యుక్తం భవతి। తత్ ఏతస్మిన్నర్థే బ్రాహ్మణోక్తే ఏషః శ్లోకః మన్త్రః భవతి। యథా పూర్వేష్వన్నమయాద్యాత్మ ప్రకాశకాః పఞ్చస్వపి, ఏవం సర్వాన్తరత మాత్మాస్తిత్వ ప్రకాశకోఽపి మన్త్రః కార్యద్వారేణ భవతి॥

ఇతి షష్ఠానువాక భాష్యమ్॥

టీక. (యః=ఎవ్వఁడు) బ్రహ్మ=బ్రహ్మము, అసత్=లేదు. ఇతి=అని, వేద చేత్=తెలిసికొనిన యెడల, అసఏవ = లేనివాఁడే, సః=వాఁడు, భవతి = అగు చున్నాఁడు. బ్రహ్మ = బ్రహ్మము, అస్తి ఇతి=కలదని, వేద చేత్=తెలిసికొనిన

యెడల, తతః=అందువలన, సంతం=ఉన్నవానినిగానే, విదుః=తెలిసికొనుచున్నారు. ఇతి=ఈ మంత్రము సమాప్తమయినది.

(లేక మఱొక విధముగా అర్థము).

[యః=ఎవ్వఁడు), బ్రహ్మ=బ్రహ్మము, అసత్=లేదు. ఇతి=అని, వేద చేత్=తెలిసికొనినయెడల, సః=వాఁడు, అసన్ ఏవ=దుర్మార్గుఁడే, భవతి=అగుచున్నాఁడు. బ్రహ్మ=బ్రహ్మము, అస్తి ఇతి=కలదని, వేదచేత్=తెలిసికొనిన యెడల. ఏనం=వీనిని, తతః=అందువలన, సంతం=సత్పురుషునిగా, విదుః=తెలిసికొనుచున్నారు. ఇతి=మంత్రము సమాప్తమయినది.]

యః=ఏ యానందమయుఁడు గలఁడో, సః=ఆ, ఏషః, ఏవ=ఈ యానందమయుఁడే, తస్య=ఆ, పూర్వస్య=పూర్వుఁడగు విజ్ఞానమయునకు, శారీరః=శరీరభవుఁడగు, ఆత్మా=ఆత్మ.

అథ=పిమ్మట. అతః=(ఆచార్యోపదేశానంతరము శిష్యునకు కొన్ని సంశయములు కలుగవచ్చును) కావున, అను ప్రశ్నాః=అను ప్రశ్నములు, (వివరింపఁబడుచున్నవి.)

(౧-వ ప్రశ్న) అవిద్వాన్=అవిద్వాంసుఁడు, ప్రేత్య=మరణించి, అముం లోకం=ఈ పరమాత్మను, గచ్ఛతీ ౩ ఉత=పొందునా? లేక పొందఁడా?

(౨-వ ప్రశ్న) కశ్చిత్ విద్వాన్=విద్వాంసుఁ డగువాఁడు; ప్రేత్య=మరణించి, అముంలోకం=ఈ పరమాత్మను, ఆహోసమశ్నుతా ౩ ఉ=పొందునా? లేక పొందఁడా?

సః=ఆ బ్రహ్మము, బహు=అనేకముగా, స్యాం=కావలయును, ప్రజాయేయ=పుట్టవలయును, ఇతి=ఈ విధముగా, అకామయత=కోరెను.

సః=ఆ బ్రహ్మము, తపః=తపస్సును, అతప్యత=చేసెను. సః=ఆ బ్రహ్మము, తపః=తపస్సును, తప్త్వా=ఒనర్చి, ఇదం=ఈ కనంబడుచున్న, సర్వం=సమస్తమును అగు జగత్తును, అసృజత=సృజించెను. యత్=ఏ, ఇదం కించ=ఈ సృజింపఁబడినది గలదో, తత్=దానిని, సృష్ట్వా=సృజించి, తత్ ఏవ=ఆ సృజించిన దానినే, అను ప్రావిశత్=అనుసరించి ప్రవేశించెను.

తత్=ఆ సృజింపఁబడిన ప్రపంచమును, అనుప్రవిశ్య=ప్రవేశించి, సత్ చ=మూర్తమున్నూ (మూర్తమనఁగా పృథివి, జలము, అగ్ని అనుభూతత్రయము), త్యత్ చ=అమూర్తమున్నూ (అమూర్త మనఁగా వాయువు, ఆకాశము అనుభూత ద్వయము), అభవత్=ఆయెను. (ఈ క్రింద చెప్పఁబోవునవి ఈమూర్తామూర్తముల యొక్క విశేషణములే యని గ్రహించునది.)

నిరుక్తం చ = దేశకాల విశిష్టముగ ఇది యని చెప్పఁబడినదియు, అనిరుక్తంచ = తద్విపరీతమయినదియు, నిలయనంచ = ఆశ్రయము గలదియు, అనిలయనంచ = ఆశ్రయవిహీనమైనదియు, విజ్ఞానంచ = చేతనసంయుతమగు జంగమాదికమున్నూ, అవిజ్ఞానం చ = చైతన్య విరహితమగు పాషాణాదికమున్నూ, సత్యంచ = వ్యవహారసత్యము గలదియు, అనృతం చ = వ్యవహార సత్యము లేని ఎండమావులు మున్నగునవియు, సత్యం = బ్రహ్మము, అభవత్ = ఆయెను. యత్ = ఏ, ఇదం కించ = ఈ చెప్పఁబడిన మూర్తామూర్తాదికమంతయు గలదో, తత్ = అదియే. సత్యం ఇతి = బ్రహ్మము అని, ఆచక్షతే = బ్రహ్మవేత్తలు పలుకుచున్నారు. తత్ అపి = ఆ విషయము నందే. ఏషః = ఈ, శ్లోకః = శ్లోకము - మంత్రము, భవతి = కలదు.

తా. ఎవ్వఁడు బ్రహ్మము లేదని భావించునో వాఁడున్నూ (వంధ్యా పుత్రుని వలె) లేనివాఁడే యగుచున్నాఁడు. వానికి పురుషార్థ సంబంధ మేమియు నుండఁజాలదు, బ్రహ్మము లేదని తలంపక తద్విరుద్ధముగా బ్రహ్మము సర్వప్రవృత్తికి బీజభూతమనియు, సర్వ వికల్పాస్పదమనియు, సర్వ విశేషశూన్యమనియు తెలిసికొనుచున్నాఁడో, వానిని సదాత్మస్వరూపునిగ తలంతురు.

ప్రశ్న:—మీకు బ్రహ్మము లేదని సంశయమేల కలిగినది?

సమా:—బ్రహ్మము వ్యవహారము నతిక్రమించినది కావున (ఉన్నదా లేదా! యని సంశయించు టయుక్తమే,) వాచారంభణమాత్రమైన వ్యవహార విషయమునందు ఆస్తిత్వ బుద్ధియు, వ్యవహారాతీతమయిన విషయమునందు నాస్తిత్వబుద్ధియు, లోకమునందు సహజముగాఁ గనంబడుచున్నది. లోకమునందు కూడ వ్యవహార విషయముగానున్న ఘటాదికము సత్ (ఉన్నద) నియు, తద్విపరీతమయిన వంధ్యాపుత్రాదికము అసత్ (లేనిదని)నియు ప్రసిద్ధము గదా. కనుక అదే విధముగా (వ్యవహార విషయముగాని) బ్రహ్మమునందు కూడ నాస్తిత్వ బుద్ధి కలుగుటకు అవకాశమున్నది. కనుకనే 'అస్తి బ్రహ్మ ఇతి చేద్వేద' అని చెప్పఁబడినది. బ్రహ్మమున్నదని తెలిసికొన్న యెడల బ్రహ్మమున్నదని తెలిసికొన్నవాని కేమి లాభము కలుగును? బ్రహ్మవేత్తలు వీనిని కూడ పరమార్థ సదాత్మ స్వరూపునిగ భావింతురు. అనఁగా బ్రహ్మమున్నదని తలంచువాఁడు బ్రహ్మమువలె ఇతరులకు తెలిసికొనఁదగినవాఁడగును?

ఇందులకు మఱొక విధముగా కూడ అర్థము చెప్పఁబడుచున్నది:—

ఎవ్వఁడు బ్రహ్మమే లేదని తెలిసికొనునో వాఁడున్నూ లేనివాఁడే యగును. ఎవ్వఁడు బ్రహ్మము గలదని తెలుసుకొనునో అట్టివానిని బ్రహ్మవేత్తనుగా విద్వాం

సులు పరిగ్రహించుచున్నారు. లేక ఎవ్వఁడు బ్రహ్మమే లేదని భావించుచున్నాఁడో, అట్టివాఁడు బ్రహ్మప్రాప్తికి సాధనభూతమును, వర్ణాశ్రమవ్యవస్థా రూపమును అగు సన్మార్గమును గూడ అంగీకరించనివాఁ డగుచున్నాఁడు. వేదశాస్త్ర సిద్ధాంత నిశ్చితమగు అట్టి వ్యవస్థను అంగీకరించని నాస్తికశిఖామణి లోకమునందు దుర్మార్గుఁడని ప్రసిద్ధి కెక్కును. లోకశాస్త్ర విరుద్ధమగు ఇట్టి నాస్తికాభిప్రాయమును విడిచి ఎవ్వఁడు బ్రహ్మమును ఉన్నదానినిగా భావించునో వాఁడు తద్బ్రహ్మప్రాప్తికి సాధనభూతమగు వర్ణాశ్రమవ్యవస్థాపరిపాలన రూపమగు సదాచారమును శ్రద్ధాపూర్వకముగ నాచరించును. కావున లోకమునందు సన్మార్గుఁడని ప్రసిద్ధిని గాంచును. ఈ విజ్ఞానమయునకు ఆనందమయుఁడు శారీరాత్మ యగుచున్నాఁడు.

శిష్యుఁ డాచార్యుని కొన్ని సంశయములను ప్రశ్నించుచున్నాఁడు. ఇవి అనుప్రశ్నలని శ్రుతి వచించినది. ఆచార్యుఁడు చెప్పినదాని ననుసరించి శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు. కావున ఇవి అనుప్రశ్నలు.

ఆకాశాదికమునకు కారణమయిన బ్రహ్మము విద్వాంసునకు అవిద్వాంసునకు కూడ సాధారణము కావున అవిద్వాంసునకు కూడ బ్రహ్మప్రాప్తి కలిగితీరవలయునను సంశయముతో ప్రశ్నము చేయఁబడుచున్నది.

౧. అ. అవిద్వాంసుఁడు మరణించిన పిదప బ్రహ్మమును పొందునా?

౨. ఆ. లేక పొందఁడా?

౧. అ. విద్వాంసుఁడు మరణించిన పిదప బ్రహ్మమును పొందునా?

౨. ఆ. లేక పొందఁడా?

అవిద్వాంసుఁడు ఆకాశాదికమునకు సామాన్య కారణమగు బ్రహ్మమును పొందనియెడల విద్వాంసుఁడు కూడ బ్రహ్మమును పొందునా? పొందఁడా యని సంశయించుట కవకాశము గలదు కావున ఈ క్రింది ప్రశ్నలు విద్వాంసునకు సంబంధించినవి.

౧. అవిద్వాంసుఁడు ఆకాశాదికమునకు సామాన్య కారణమగు బ్రహ్మమును పొందనియెడల విద్వాంసుఁడుగూడ బ్రహ్మమును పొందునా? పొందఁడా? యని ప్రశ్న.

౨. లేక బ్రహ్మవేత్త యగు విద్వాంసుఁడు మరణించిన పిదప బ్రహ్మమును పొందునా?

౩. లేక అవిద్వాంసుఁ డెటుల బ్రహ్మమును పొందఁడో, అట్లే విద్వాంసుఁడు కూడ బ్రహ్మమును పొందఁడా?

లేక

విద్వ దవిద్వ ద్విషయముగా రెండే ప్రశ్నలనుగా గ్రహించవచ్చును. 'అథాతోఽనుప్రశ్నాః' అని బహువచనము శ్రుతియందు చెప్పియున్నది గదా. రెండు ప్రశ్నలెట్లు? అని సంశయింప నక్కరలేదు. బహువచనము సామర్థ్యప్రాప్తములయిన ఇతర ప్రశ్నల నుద్దేశించి చెప్పఁబడినది. 'అసత్ బ్రహ్మ ఇతి చేత్ వేద' — బ్రహ్మము అసత్తు - శూన్యమయినది అని తెలిసికొనిన యెడల, అస్తి బ్రహ్మ ఇతి చేత్ వేద — బ్రహ్మము సద్వస్తువు అని తెలిసికొన్నయెడల; అని ద్వివిధముగా శ్రుతియందు చెప్పఁబడి యుండుటచేత (సత్తా? అసత్తా?) అని సంశయము. తరువాత అర్థప్రాప్తము:—

౧. బ్రహ్మమునకు పక్షపాతము లేదు కావున విద్వాంసునకు బ్రహ్మప్రాప్తి కలదా? లేదా? అని మొదటిప్రశ్న.

౨. అవిద్వాంసునకు బ్రహ్మప్రాప్తి కలదా? లేదా? యని రెండవ ప్రశ్న.

బ్రహ్మమునకు పక్షపాతము లేదు కావున అవిద్వాంసునకు బ్రహ్మప్రాప్తి యెట్లు లేదో, అట్లే విద్వాంసునకుకూడ బ్రహ్మప్రాప్తి లేదని శంకించుకొని—

౩. విద్వాంసుఁడు బ్రహ్మమును పొందునా? పొందఁడా? యని మూఁడవ ప్రశ్న.

ఈ ప్రశ్నలకు సమాధానార్థ ముత్తరగ్రంథము ప్రారంభింపఁబడుచున్నది.—

బ్రహ్మము యొక్క 'అస్తిత్వమే — ఉండుటయే' అంగీకరింపఁబడుచున్నది. ఉపనిషత్తునందు బ్రహ్మముయొక్క లక్షణము 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని చెప్పఁబడియున్నది. బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతమని మంత్రార్థము. 'సదేవ సత్యం' అని ఉపనిషత్తులందు చెప్పఁబడియుండుటచేత సత్తన్నను సత్యమని చెప్పినను ఒక్కటియే. ఇచ్చట ఈ యర్థమున్నటుల ఎట్లు తెలియవచ్చుచున్నది? అని సంశయింపనక్కరలేదు. ఉత్తరత్ర చెప్పఁబడిన శబ్దము లీ యర్థమునే సూచించుచున్నవి. ఉత్తరవాక్యములం దీసత్యాది శబ్దములు "తత్సత్య మిత్యాచక్షతే; యదేష ఆకాశ ఆనందో న స్యాత్" ఇత్యాదికములు పై విషయమునే ప్రతిపాదించుచున్నవి.

## పూర్వపక్షము

బ్రహ్మ సద్వస్తువు కాదు. సద్వస్తువే అయిన యెడల ఘటాదివస్తువుల వలెఁ గనంబడును. అసద్వస్తువగు శశవిషాణము (కుందేటికొమ్ము) ఎటుల కనం బడుటలేదో, అట్లే బ్రహ్మము గనంబడుటలేదు కావున బ్రహ్మము సద్వస్తువు కాఁజాలదు.

## సమాధానము

బ్రహ్మము సద్వస్తువు. ఏలయనఁగా ఆకాశాదికార్యజాతమంతయు బ్రహ్మము వల్ల నుండి ఏర్పడినదని శ్రుతి బోధించుచున్నది. దేనివల్ల నుండి ఒకటి పుట్టుచున్నదో అది యున్నదనియే గ్రహించుట యుక్తము. ఘటమును చూచి మృత్తికను అంకుర మును చూచి బీజమును మనము ఎట్లు గ్రహించుచున్నామో, అట్లే ఆకాశాదికార్యమును చూచి తత్కారణరూపమగు బ్రహ్మము ఉన్నదని గ్రహించుటయే న్యాయము. లోకము నందు శూన్యమునుండి ఏకార్యము ఏర్పడుటలేదు. నామరూపాది కార్యమునకు కార ణము శూన్యమగు నెడల మనకు గోచరమే కాదు. నామరూపాది ప్రపంచ కార్యము మనకు గోచరమగుచున్నది కావున తత్కారణము కూడ సద్వస్తువే గాని శూన్యము కాదు. "కథ మసతః స జ్జాయేత" అను (ఛాందో. ౬.౨.౨) శ్రుతి అసత్తునుండి సత్పదార్థము పుట్టఁజాలదని నిషేధించుచున్నది.

## పూర్వపక్షము

మృత్తిక, బీజములు, ఘట, అంకురములకు ఏవిధములుగా కారణభూతములో, అట్లే బ్రహ్మము నామరూపసమన్వితమగు ప్రపంచమునకు కారణభూతమగునెడల బ్రహ్మమున్ను మృద్బీజములవలె అచేతనమే గదా?

## సమాధానము

బ్రహ్మము అచేతనము కాదు. "సోఽకామయత" అని శ్రుతి చెప్పుటచేత బ్రహ్మము కామయితృత్వము (కోరుట) గలది అగుచున్నది. కామయితృత్వము అచేతనమునకు అసంభవము కావున బ్రహ్మము అచేతనము కాదు. బ్రహ్మము సర్వజ్ఞ మని ఇదివఱకే చెప్పియున్నారము కనుక కామయితృత్వము బ్రహ్మమునకు ఉపపన్న మగుచున్నది.

## పూర్వపక్షము

కామయితృత్వముండుటచేత అచేతనము కాకపోవచ్చును. కాని అస్మదాదుల వలె బ్రహ్మమున్నూ అనాప్తకామత్వము (వలయు కోరికల నన్నిఁటిని పొందనిది.) గలదియే గదా?

## సమాధానము

బ్రహ్మము అస్మదాదులవలె అనాప్తకామత్వము గలదిగాదు. అస్మదాదుల కామములు ధర్మాది నిమిత్తాపేక్షములు, స్వాత్మవ్యతిరిక్తములు, కార్యకారణసాధనాంతరాపేక్షము లెట్లగుచున్నవో, అట్టి నిమిత్తము బ్రహ్మమునకు లేదు. ఇఁక నేమనఁగా స్వాత్మకంటె వేఱుకానివి, సత్యజ్ఞానలక్షణమగు బ్రహ్మము తత్త్వాప్రాణిజాతము యొక్క కర్మ ననుసరించి సృష్ట్యాదిరచనను నిర్వహించుచుండును, కావున మనవంటి అనాప్తకామత్వము బ్రహ్మమునకు లేదు. సాధనాంతరములు కూడ బ్రహ్మమునకు లేవు. కావున అనాప్తకామత్వము మున్నగునవి బ్రహ్మమునందు ఘటింపవు.

ఇట్టి దేశకాలనామరూపాత్మకమును స్థావరజంగమాత్మకమును అగు ప్రపంచమును ప్రాణికర్మానుసారముగ సృజించి దానియందు తాను ప్రవేశించెను.

ప్రవేశము ఎట్లను విషయము చెప్పఁబడుచున్నది:—

'సోఽకామయత' ఆయాత్మ—అనఁగా ఎవనివల్లనుండి ఆకాశము పుట్టినదో, అట్టి యాత్మ కోరెను; ఏమని? 'బహు స్యామ్' అని (విస్తారముగా కావలయునని) ఒకఁడు ఘటాకదానిని ప్రవేశించని యెడల విస్తారము ఎట్లు కాఁగలఁడు? ఆ విషయమే చెప్పఁబడుచున్నది. ప్రజాయేయ—పుట్టవలయునని. ఇచట బహూభవనము అనఁగా విస్తారముగా అగుట పుత్రోత్పత్తి మున్నగు వానివలన అని గాదు, ఇంకనేమనఁగా తనయం దనభివ్యక్తములయి యున్న నామరూపాభివ్యక్తిచేత; ఎప్పుడు తనయందు దాగియున్న నామరూపములను ప్రకటనము చేయుచున్నాఁడో, అప్పుడు ఆత్మస్వరూపమునకు పరిత్యాగము లేనివిధముగనే బ్రహ్మము నుండి సర్వావస్థయందున్నూ అప్రవిభక్తి దేశకాలములుగల నామరూపములు వెలువడుచున్నవి. ఈ విధముగనే చెప్పుట ఉపపన్నముగాని లేనియెడల అవయవశూన్యమయిన బ్రహ్మమునకు బహూభవనముగాని అల్పత్వముగాని ఉపపన్నము కాఁజాలదు. ఆకాశమునకు బహుత్వముగాని అల్పత్వముగాని వస్త్వంతరాధీన మెట్లగుచున్నదో, అట్లే ఇచ్చటను గ్రహించునది. కావున నామరూపద్వారముచేతను ఆత్మకు బహూభవనము ఉపపన్న మగుచున్నది. ఆత్మకంటె వేఱయినది—అనఁగా అనాత్మభూతమయినది, సూక్ష్మమయినది, సమీపమయినది,

దూరమయినది, భూతభవిష్య ద్వర్తమానములందు ప్రవిభక్తదేశకాలములు గలది యయి ఉండుటలేదు. కనుక నామరూపములు సర్వావస్థలందు బ్రహ్మము చేతనే ఆత్మభూతములయి యున్నవి. బ్రహ్మము మాత్రము నామరూపాత్మకము కాదు. ఆ నామరూపములు ఆ బ్రహ్మమును ప్రత్యాఖ్యానము చేసిన యెడల ఉండఁజాలవు కావున తదాత్మకములని చెప్పఁబడినవి. ఆ నామరూపోపాధుల చేతనే జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ శబ్దార్థాది సర్వవ్యవహారభావభాక్కయిన బ్రహ్మముయొక్క బహుభవనము (అనఁగా బుద్ధ్యుపాధికమయిన బ్రహ్మము జ్ఞాతృవ్యవహారభాక్కు, బుద్ధివృత్త్యుపాధికమయిన బ్రహ్మము జ్ఞేయవ్యవహారభాక్కు, నామోపాధికమయిన బ్రహ్మము శబ్దవ్యవహారభాక్కు, సామాన్యముగ జడోపాధికమయిన బ్రహ్మము బ్రహ్మార్థవ్యవహారభాక్కు, ఆదిపదము కర్మాదిసంగ్రహార్థము; ఇటుల బ్రహ్మము సర్వవ్యవహారభాక్కని భావము) అట్టి యాత్మ ఇట్టి కోరిక గలదియై—అనఁగా బహుభవనాభిలాషగలదియై తపము సల్పెను. యస్య జ్ఞానమయంతపః (ముండ. ౧-౧-౯.) అను శ్రుత్యనుసారము ఇచట జ్ఞానమే తపస్సు—అనఁగా సృజింపఁదలఁచిన జగద్రచనాది విషయక మయిన ఆలోచనము సలిపెనని భావము. ఆయాత్మ ఇటుల ఆలోచించి తత్తత్ప్రాణికర్మాది నిమిత్తానురూపముగ దేశ కాల నామ రూపములచేత అందఱిచేత సర్వావస్థలందు అనుభవింపఁబడుచున్న యీ జగత్తును సృజించెను. ఈ యాత్మ ఇటుల జగమును సృజించినదై సృజించిన యీ జగమునందు తాను ప్రవేశించెను.

ఇచట యీ విషయ మొకింత విచారింపఁబడుచున్నది:—

'తదేవ అనుప్రవిశత్' అని గదా శ్రుతియందు చెప్పఁబడినది. ఎవఁడు స్రష్టయో అతఁడే స్వకీయ ఆత్మతో ప్రవేశించెనా? లేక స్వవికారమయిన మఱొక ఆత్మతో ప్రవేశించెనా? ఈ పక్షద్వయమునం దేది యుక్తముగా నుండును? సృష్ట్వా= సృజించి అని 'క్త్వా' ప్రత్యయము శ్రుతియందు గనంబడుచుండుటవలన ఎవఁడు స్రష్టయో అతఁడే అను ప్రవేశించె ననుటయే యుక్తమగుచున్నది.

పూర్వపక్షము:—నీవు చెప్పిన సిద్ధాంతము యుక్తముగా లేదు. ఘటమునకు మృత్తిక యెట్లు కారణమో, అట్లే బ్రహ్మమున్నూ జగత్తునకు కారణముగదా. కార్యమనఁగా కారణాత్మకమేగదా? కారణమే కార్యాత్మగా పరిణమించుట లోకమునందు సుప్రసిద్ధము. కార్యోత్పత్తికంటె ముందు కార్యమునందు ప్రవేశింపకయున్న కారణము కార్యోత్పత్త్యనంతరము కార్యమునందు ప్రవేశించుచున్నదనుట యుక్తముగా

లేదు. లోకమునందుకూడ ఘటమునకు కారణమగు మృత్తిక ఘటరూపపరిణామము కంటె వేఱుగ ఘటమునందు తిరిగి ప్రవేశించుట సంభవముగ లేదు. ఘటపరిణామము కంటె భిన్నముగ మృత్తిక ఘటమునందు ప్రవేశించుట లోకమునందు లేదుగదా.

లేక వికారభూతమయిన మఱొక యాత్మతో నామరూపకార్యమునందు ఆత్మ ప్రవేశించెనని యందుమని చెప్పితివేని "అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య (ఛాందో. ౬. ౩. ౨.) అను శ్రుతి యీ యాత్మయే ప్రవేశించెనని చెప్పుటచేత అదియు ఉప పన్నము కాదు. కనుక ఆత్మ తాను సృజించిన జగత్తునందు ప్రవేశించెననుట ఉప పన్నముగా లేదు.

తన్నిరాకరణము:—బ్రహ్మ మొక్కటియే యగుటచేత నీ వన్న మాట — అనఁగా మఱొక ఆత్మరూపముతో జగమునందు ప్రవేశించె ననుట మాట ఉపపన్నము కాజాలదు. మృచ్చూర్ణము సావయవ మగుటచేతను, అనేక మగుటచేతను, అప్రవిష్ట దేశము కలది యగుటచేతను, ఘటమునందు చూర్ణాత్మకముగ ప్రవేశించుట యుక్తమే. అద్వితీయుఁ డగు ఆత్మ నిరవయవుఁ డగుటవల్లను, అతఁడు ప్రవేశించని దేశమే లేకపోవుటవల్లను, అతఁడు ప్రవేశించె ననుట అసంగతమగుచున్నది. అట్లయిన యెడల 'తదేవాను ప్రావిశత్' అని శ్రుతియందు ప్రవేశించెనని చెప్పుచున్నది గదా, ఇందుల కేమి సమాధానము చెప్పెదవు? ఒకవేళ నిరవయవమగుటచేత ప్రవేశ శ్రుతి విరోధించును కావున సావయవమే అని అంగీకరించి ముఖమునందు హస్తప్రవేశము వలె నామరూప కార్యమునందు జీవాత్మరూపమున అనుప్రవేశము యుక్తము కావచ్చు నని యందువా?

అట్లన రాదు — బ్రహ్మము అంతటా ప్రవేశించియే యున్నది, కావున బ్రహ్మము క్రొత్తగా ప్రవేశించదగిన ప్రదేశము లేదు. లోకమునందు కార్యాత్మక ముగ పరిణమించిన నామరూపకార్యదేశములకు వ్యతిరేకముగ ఆత్మశూన్యమయిన ప్రదేశమే లేదుగదా. అట్టి ప్రదేశ మొకటి యున్నపుడుగదా అచ్చట జీవాత్మగా ప్రవే శించుట ఉపపన్న మగును. లేక కార్యభూతుఁడయిన జీవుఁడే కారణమయిన బ్రహ్మ మును ప్రవేశించెనని చెప్పెదమందువా? అదియు పొసగదు. ఏలయనఁగా ఘటము మృత్తికయందు ప్రవేశించుట యనఁగా ఘటత్వమును వదలుటయే యగుచున్నది. అట్లే కారణమగు బ్రహ్మమునందు జీవుఁడు ప్రవేశించెనని చెప్పునెడల అప్పు డతఁడు జీవత్వమునే వదలు ననవలసివచ్చుచున్నది. మఱియు 'తదేవాను ప్రావిశత్' అను శ్రుత్యర్థమును పరికించి చూచినయెడల కారణాను ప్రవేశము యుక్తముగా లేదు.

శంక:—కార్యాంతరమే అగుచున్నాఁడు. అనఁగా 'తదేవాను ప్రావిశత్' అను శ్రుతి జీవాత్మ రూపమయిన కార్యము, నామరూపపరిణతమయిన కార్యాంతరమును పొందినది అని చెప్పుచున్నాము (అని చెప్పునెడల)

తన్నిరాకరణము—అట్లనరాదు. ఏలయనఁగా ఘటము ఘటాంతర భావమును పొందుననుటలో లోకసిద్ధముగా లేదు. ఈ విషయమును అనేక శ్రుతులు నిషేధించుచున్నవి—అనఁగా జీవుఁడు నామరూప కార్యము కంటె వేఱయినవాఁడు అని చెప్పెడి అనేక శ్రుతులు గలవు. కావున ఆ శ్రుతుల కీ విషయము విరుద్ధము కావున ప్రమాణము కాఁజాలదు.

నిజముగా దేహాది భావమునే జీవుఁడు పొందుచున్నాఁడను అర్థమునే చెప్పఁదలఁచిన మఱొక విరోధము కూడ గలదు. అప్పుడు మోక్ష మనునదియే అతనికి కలుగఁజాలదు. దేనిని వదలవలయునో దానినే పొందుచున్నాఁ డనుట ఉపపన్నము కాఁజాలదుగదా.

ఆ బ్రహ్మమే బాహ్యాంతర్భేదములచేత పరిణమించినదని చెప్పినయెడల అనఁగా ఆ కారణమగు బ్రహ్మమే బాహ్యమయిన శరీరాద్యాధారభూతముగను. ఆ శరీరమునకు లోపల ఆధేయమగు జీవాత్మభూతముగను పరిణమించినదను నెడల.—

అట్లనరాదు—ఏలయనఁగా ప్రవేశించుట యనునది వెలుపల నుండువానికే గాని, లోపల నున్న వానికి ప్రవేశించుట యనునది ఉపపన్నము కాఁజాలదు. ఎవఁడు ఎవ్వనియొక్క లోపల నుండునో వానిని ప్రవేశించెనని చెప్పుట సంభవముగా లేదు. అనుప్రవేశము బహిష్ఠునికేగదా. ''గృహం కృత్వా ప్రావిశత్=ఇల్లు కట్టుకొని ప్రవేశించెను'' మున్నగు శబ్దము లీ యర్థమునందే రూఢిగా ప్రయోగింపఁబడుచున్నవి. లేక నీటియందు ప్రతిబింబించినటుల ప్రవేశము నిచట గ్రహించుచున్నామని యందురా?

ఆత్మ అపరిచ్ఛిన్నుఁడును, అమూర్తుఁడును అగుటవలన అట్లనరాదు. పరిచ్ఛిన్నమును మూర్తమును అగు వస్తువు ప్రసాద స్వభావము గల జలాశయాదికమునందు ప్రతిబింబించుట ఉపపన్నముగా నుండును గాని ఆకాశాదికమునకు కారణమయిన ఆత్మ సర్వవ్యాపకమగుటచేత ప్రతిబింబించె ననుటయు ఉపపన్నముగా లేదు. బ్రహ్మము కంటె భిన్నమయినట్టియు, విప్రకృష్టదేశ ప్రతిబింబాధారభూతవస్త్వంతరము లేకపోవుటబట్టియు, ప్రతిబింబించె ననుటయు యుక్తము కాదు.

శంక—విచారించి చూడఁగా ప్రవేశించె ననుటకు ఉపపత్తి ఏమియు లేదు. కాని అతీంద్రియమయిన విషయము నెఱుంగుటకు మనకు శ్రుతి గదా పరమ ప్రమా

ణము. అట్టి శ్రుతి 'తదేవాను ప్రావిశత్' అని స్పష్టముగా ప్రవేశించెనని చెప్పుచున్నదే. ఇంతవఱకు మనము విచారించిన విమర్శవలన ప్రవేశించె ననుట ఉపన్నము కాదని సిద్ధాంతితమాయెను గదా. అప్పుడు 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్' అను శ్రుతివాక్యము విరుద్ధార్థబోధకము కావున పరిత్యాజ్యమనియే గదా తేలుచున్నది.

శ్రుతివాక్య మెన్నటికి పరిత్యాజ్యము కాఁజాలదు. కాని ఆ శ్రుతివాక్య తాత్పర్యమును మాత్రము నీవు సరిగా గ్రహించలేదు. ఆ యర్థ మిదుగో, ఇచ్చట శ్రుతి ''బ్రహ్మవిదాప్నోతి పరం'' అని ప్రతిజ్ఞ చేసినది, ''సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'' అని బ్రహ్మముయొక్క లక్షణమును వివరించినది, ''యో వేద నిహితం గుహాయాం'' అని బ్రహ్మవిజ్ఞానమును చెప్ప ప్రారంభించినది, ఇచట మనకు ప్రకృతము బ్రహ్మవిజ్ఞానమును—బ్రహ్మస్వరూపమును బోధించుటకొఱకయి ప్రథమమున ఆకాశాద్యన్నమయాంతమగు కార్యజాతమును ప్రదర్శించినది, తరువాత బ్రహ్మమును తెలుపుట కుపక్రమించినది, ఆ విషయమునందే అన్నమయాత్మ కంటె వేఱుగ అంతరుఁడగు ప్రాణమయుఁడు గలఁడనియు, ఆ ప్రాణమయాత్మకు లోపల మనోమయాత్మ గలఁడనియు, ఆ మనోమయాత్మకు లోపల విజ్ఞానమయుఁడు గలఁడనియు, ఆ విజ్ఞాన గుహయందు ఆనందమయుఁడను విశిష్టాత్మ గలఁడనియు ప్రదర్శించినది. తరువాత ఆనందమయ లింగాధిగమద్వారముగ ఆనందవృద్ధ్యవసానభూతుఁ డగు ఆత్మను—బ్రహ్మమును. 'పుచ్ఛం ప్రతిష్ఠ' అనియు తెలుపుచు, సర్వవికల్పాస్పదుఁడును, నిర్వికల్పుఁడును అగు బ్రహ్మము ఈ గుహయందే పొందం దగినవాఁడనియు చెప్పినది. ఇచటనే ప్రవేశము ప్రకల్పితమయినది. నిర్విశేష మగుటచేత బ్రహ్మము బుద్ధికంటె వేఱయినచోట లభింపఁజాలదు. చంద్రసూర్య సంబంధము లేనిచోట రాహు వెటుల గనంబడఁజాలఁడో, చంద్రసూర్య సంబంధ మున్నచోటుల నెటుల రాహువు గనంబడునో, అట్లే సంనికర్ష సంబంధమువలన అంతఃకరణగుహా సంబంధమువలన బ్రహ్మము ఉపలబ్ధము—పొందంబడునది అగుచున్నది. అంతఃకరణము అవభాసాత్మక మనుట ప్రసిద్ధముగదా. లోకమునందు ఘటాద్యుపలబ్ధికి అంతఃకరణ సంబంధ మెట్లో, అట్లే ఆత్మోపలబ్ధియు బుద్ధి ప్రత్యయాలోక విశిష్టమయినదే అగుచున్నది. అందువలన ఉపలబ్ధిహేతువగు గుహయందు నిహితమగు బ్రహ్మమును గూర్చి చెప్పుటయే ప్రకృతమగుచున్నది. ముందు చెప్పఁబోవు మంత్ర మంతయు వృత్తిస్థానీయ మగుటచేత పౌనరుక్తి శంక లేక 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్' అని చెప్పఁబడినది.

ఆకాశాదికమున కంతటికిని కారణభూతమయిన ఆ పరమాత్మయే యీ గనం బడుచున్న కార్యజాతమును సృజించి దానియందు ప్రవేశించినదానివలె హృదయ కమలమునందున్న బుద్ధి గుహయందు ద్రష్ట, శ్రోత, మంత, విజ్ఞాత మున్నగు విశేషములతో స్ఫురించుచున్నాఁడు, ద్రష్టృ, శ్రోతృ, మంతృ, విజ్ఞాత్రాది విశేష స్ఫురణమే ప్రవేశ శబ్దార్థము కావున ఆకాశాది కారణమగు బ్రహ్మము ఉన్నదనియే గ్రహించుట యుక్తము. కావున బ్రహ్మ మున్నదనియే గ్రహించవలయును. ఆకాశాది కమునకు కారణమగు అట్టి బ్రహ్మము సత్తు - అనఁగా మూర్తము, త్యత్తు - అనఁగా అమూర్తము ఆయెను. అవ్యాకృతనామ రూపములుగా ఆత్మయందున్న ఆ నామ రూపముల అంతర్గతమయిన ఆత్మచేత వ్యాకృతము లాయెను. మూర్తామూర్తవాచ్యము లయిన ఆ నామరూపములు వ్యాకృతములయి ఆత్మతోడ అప్రవిభక్త దేశకాలములు గలవి యగుటచేత, బ్రహ్మమే ఆ మూర్తామూర్తము లాయెనని యిచట చెప్పఁబడినది. మఱియు ఆ బ్రహ్మమే నిరుక్తమున్నూ అనిరుక్తమున్ను ఆయెను. నిరుక్త మనఁగా సమాన అసమాన జాతీయములయిన వానివల్ల దేశకాల విశిష్టముగా వేఱుచేసి ఇది అది యని చూపింపఁబడినది. అనిరుక్తమనఁగా తద్విపరీతమయినది. నిరుక్తా నిరుక్తము లున్నూ మూర్తామూర్తములకే విశేషణములు, సత్తు త్యత్తు అనునవి ఎట్లు ప్రత్యక్ష పరోక్షము లగుచున్నవో అట్లే ప్రత్యక్షపరోక్షములగు నిలయమున్నూ అనిలయన మున్నూ బ్రహ్మమే యగుచున్నవి. నిలయనమనఁగా నివాసము ఆశ్రయము, మూర్త ధర్మము, అనిలయన మనఁగా తద్విపరీతము అమూర్తధర్మము. త్యత్, అనిరుక్త, అనిలయనములు అమూర్తధర్మము లయినప్పటికిన్నీ సర్గోత్తరకాలభావ విషయక ములుగా శ్రుతియందు చెప్పఁబడుచుండుటచేత వ్యాకృతవిషయములుగనే ఇచట గ్రహించవలయును. త్యత్ అనఁగా ఆకాశప్రాణాద్యనిరుక్తము. అదియే అనిలయన మున్నూ కావున ఇచటగల త్యత్ అనిరుక్త, అనిలయనమును అమూర్తవిశేషణ ములు, వ్యాకృతవిషయములనియే గ్రహించవలయును. అట్లే, విజ్ఞానమనఁగా చేతన మున్నూ, అవిజ్ఞానమనఁగా చేతన రహితమగు పాషాణాదికమున్నూ బ్రహ్మమే, సత్యమనఁగా ఇచట ప్రకరణము ననుసరించి వ్యవహార విషయకమగు సత్యమునే గ్రహించవలయునుగాని పారమార్థిక సత్యము గ్రహింపరాదు. పరమార్థసత్యమగు బ్రహ్మమెప్పుడు ఒక్కటియే. ప్రకృతము నందుపయుక్తమయిన సత్యశబ్దము ఎండ మావులందుఁగల అనృతజలముకంటె భిన్నమయిన వ్యవహార విషయకమయిన ఆపేక్షికసత్యమగు జలాదివాచకమని గ్రహించవలయును. అనృతమనఁగా పూర్వోక్త

మునకు విపరీతమయినది, ఈ చెప్పఁబడినదంతయు సత్యమే — అనఁగా పరమార్థ సత్యమే అయినది. పరమార్థ సత్యమనగా నేమి? బ్రహ్మమే పరమార్థ సత్యము 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని బ్రహ్మమే ఇచట ప్రకృతము. కావున బ్రహ్మము సత్యశబ్ద వాచ్యము. సత్, త్యత్ మున్నగు శబ్దవాచ్యమును, మూర్తామూర్తమును అగు నీ పదార్థ సమూహమంతయు ఏకమయిన సచ్ఛబ్దవాచ్య మగుచున్నది. కావున నామరూపములు సచ్ఛబ్దవాచ్య బ్రహ్మవ్యతిరేకముగ లేవు. ఇందువలన అంతయు బ్రహ్మమే యగుచున్నది, ఇందువలననే బ్రహ్మవేత్తలు ఆ బ్రహ్మమును సత్యమని పలుకుచున్నారు. ఇచట ప్రకృతము 'అస్తి నాస్తి' (బ్రహ్మ మున్నదా లేదా?) అను ప్రశ్న కావున ఆ ప్రశ్నకు సమాధాన మీ విధముగా చెప్పఁబడుచున్నది. ఆత్మ అనేకముగా కావలయునని కోరెను. ఆ యాత్మ సత్యసంకల్పుఁడు కావున తాను కోరిన విధముగా సత్, త్యత్, నిరుక్త, అనిరుక్త ఇత్యాది లక్షణముగల ఆకాశాది కార్యజాతమును సృజించి దానియందు తాను ప్రవేశించి చూచుచున్నవాఁడై, వినుచున్నవాఁడయి, తలఁచుచున్నవాఁడయి, తెలిసికొనుచున్నవాఁడయి, అటుల అనేకముగా ఆయెను. అందువలన ఆకాశాది కార్యజాతమునకు కారణభూతమును, కార్యకారణ సంఘాతము నందు సాక్షిభూతము నయి ఉన్నదియును, పరమవ్యోమ యందు — అనఁగా హృదయాకాశము నందు తత్ప్రత్యయావభాసమాన విశేషోప లభ్యమును అగు బ్రహ్మము ఉన్నదనియే ఎఱుంగవలయును. ఈ చెప్పఁబడిన విషయమునందు ఈ చెప్పఁబోవు శ్లోకము - మంత్రము గలదు. అనఁగా ఇదివఱకు అన్నమయాద్యాత్మ పంచకమును ప్రకాశింపఁ జేయునట్టి శ్లోకములు—మంత్రము లెట్లు తెలుపఁబడినవో, అట్లే సర్వాంతరభూత మయిన ఆత్మ ఒక్కటి గలదను విషయమును ప్రకటించునట్టి శ్లోకము—మంత్రము కూడ గలదని ముందు చెప్పఁబడుచున్నది.

వివరణము:—"స తపస్తప్త్వా, ఇదగ్ం సర్వమసృజత" అను విషయమును గూర్చి ఇచట భాష్యము నందెట్లు శంకరాచార్యులవారు వివరించిరో ఇట్లే బ్రహ్మసూత్ర శంకరభాష్యమందు 'జన్మాద్యస్య యతః. బ్ర. సూ. ౧-౧-౨' నందును వివరించిరి. దానిని కూడ గమనించుట యుక్తము. "అస్యజగతో నామరూపాభ్యాం వ్యాకృతస్య, అనేక కర్తృభోక్తృ సంయుక్తస్య, ప్రతినియత దేశకాల నిమిత్త క్రియా ఫలాశ్రయస్య. మనసాఽప్యచింత్య రచనారూపస్య, జన్మస్థితి భంగం యతః సర్వజ్ఞాత్ సర్వశక్తేః కారణాద్భవతి తత్ బ్రహ్మ" అని గలదు.

ఈ భాష్యపంక్తి భామతియందు విపులముగ ఇట్లు వ్యాఖ్యాతమైనది:—చేతనోహి బుద్ధా వాలిఖ్య నామరూపే ఘట ఇతి నామ్నా రూపేణచ కంబుగ్రీవాదినా

బాహ్యం ఘటం నిష్పాదయతి, ఏవమేవ మూలకారణ మపి నామరూపాభ్యాం స్వబుద్ధా వావిర్భూతమేవ సర్వం పశ్చాత్ వ్యనక్తీతి నామరూపాభ్యాం ఇత్థం భూతం వ్యాకృత మిత్యుచ్యతే, కేచిత్ కర్తారో భవంతి, సూదర్త్విగాదయః, నభోక్తారః; కేచిత్తు భోక్తారః, యథా శ్రాద్ధ వైశ్వానరీయేష్ట్యాదిషు పితా పుత్రాదయః, న కర్తారః; కేచిత్తు ప్రతినియతదేశోత్పాదాః - యథా కృష్ణమృగాదయః; కేచిత్ ప్రతినియత కాలోత్పాదాః-యథా కోకిలరవాద యః; కేచి త్ప్రతినియత నిమిత్తాః, — యథా నవాంబుదధ్వానాది నిమిత్తా బలాకాగర్భాదయః; కేచిత్ ప్రతినియత క్రియాః, యథా బ్రాహ్మణానాం యాజనాదయః, నేతరేషాం; ఏవం ప్రతినియత ఫలాః, యథా కేచిత్సుఖినః, కేచిత్ దుఃఖినః, ఏవం య ఏవ సుఖినః, త ఏవ కదాచిత్ దుఃఖినః; సర్వమేత దాకస్మికాపరనామ్ని యాదృచ్ఛికత్వే చ, స్వాభావికత్వే చ, అసర్వశక్తి కర్తృకత్వే చ న ఘటతే.''

గ్రంథ విస్తరభీతిచేత ఆంధ్ర తాత్పర్యమును వ్రాయలేదు.

## ఇతర గ్రంథ భాగములు

తైత్తి. భాష్యవార్తికము, బ్రహ్మవల్లి, ౭ ఖండ. శ్లో. ౧-౭౯.

అనుభూతిప్రకాశ, ౨ అధ్యా. శ్లో. ౮౬-౧౧౩.

ఆత్మపురాణము, ౧౦ అధ్యా. శ్లో. ౧౭౭ - ౨౩౦.

## ౭. సప్తమో ఽనువాకః

మం. అసద్వా ఇద మగ్ర ఆసీత్ । తతో వై సదజాయత ।
తదాత్మానగ్గ్ం స్వయమకురుత । తస్మా త్త త్సుకృత
ముచ్యత ఇతి । యద్వైత త్సుకృతమ్ । రసో వై సః ।
రసగ్గ్ం హ్యేవాయం లబ్ధ్వా ఽఽనన్దీ భవతి । కో
హ్యేవాన్యా త్కః ప్రాణ్యాత్ । య దేష ఆకాశ
ఆనందో న స్యాత్ । ఏష హ్యేవానన్దయాతి । యదా
హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే ఽనాత్మ్యేఽనిరు క్తే ఽని
లయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే । అథ సో ఽభ
యం గతోభవతి । యదా హ్యేవైష ఏతస్మిన్నుదర
మంతరం కురుతే । అథ తస్యభయం భవతి । త త్త్వేవ
భయం విదుషో ఽమన్వానస్య । తదప్యేష శ్లోకో
భవతి ॥

శాంకరభాష్యమ్:—

అసద్వా ఇదమగ్ర ఆసీత్। అసదితి వ్యాకృత నామరూప విశేష విపరీత రూపమ్ అవ్యాకృతం బ్రహ్మ ఉచ్యతే; న పునరత్య న్తమేవాసత్। న హ్యసతః సజ్జ న్మాస్తి। ఇదమ్ ఇతి నామరూప విశేషవద్వ్యాకృతం జగత్; అగ్రే పూర్వం

ప్రాగుత్పత్తేః బ్రహ్మైవ అసచ్ఛబ్దవాచ్యమాసీత్। తతః అసతః వై సత్ ప్రవిభక్త నామరూప విశేషమ్ అజాయత ఉత్పన్నమ్। కిం తతః ప్రవిభక్తం కార్యమితి— పితురివ పుత్రః? నేత్యాహ। తత్ అసచ్ఛబ్దవాచ్యం స్వయమేవ ఆత్మానమేవ అకురుత కృతవత్। యస్మాదేవమ్, తస్మాత్ తత్ బ్రహ్మైవ సుకృతం స్వయం కర్తృ ఉచ్యతే। స్వయం కర్తృ బ్రహ్మేతి ప్రసిద్ధం లోకే సర్వకారణత్వాత్। యస్మాద్వా స్వయమకరోత్సర్వం సర్వాత్మనా, తస్మాత్పుణ్య రూపేణాపి తదేవ బ్రహ్మ కారణం సుకృతం ఉచ్యతే। సర్వథాపి తు ఫలసంబన్ధాది కారణం సుకృత శబ్దవాచ్యం ప్రసిద్ధం లోకే। యది పుణ్యం యది వా అన్యత్ సా ప్రసిద్ధిః నిత్యే చేతనకారణే సతి ఉపపద్యతే. తస్మాదస్తి బ్రహ్మ, సుకృత ప్రసిద్ధేరితి। ఇతశ్చాస్తి; కుతః? రసత్వాత్। కుతో రసత్వ ప్రసిద్ధిర్బ్రహ్మణ ఇత్యత ఆహ—యద్వై తత్సుకృతం రసో వై సః। రసో నామ తృప్తిహేతుః ఆనన్దకరో మధురామ్లాదిః ప్రసిద్ధో లోకే। రసమేవ హి అయం లబ్ధ్వా ప్రాప్య ఆనన్దీ సుఖీ భవతి। నాసత ఆనన్దహేతుత్వం దృష్టం లోకే। బాహ్యానన్ద సాధన రహితా అపి అనీహా నిరేషణా బ్రాహ్మణా బాహ్యరస లాభాదివ సానన్దా దృశ్యన్తే విద్వాంసః; నూనం బ్రహ్మైవ రసస్తేషామ్। తస్మాదస్తి తత్తేషామానన్ద కారణం రసవద్బ్రహ్మ। ఇతశ్చాస్తి; కుతః? ప్రాణనాది క్రియా దర్శనాత్। అయమపి హి పిణ్డో జీవతః ప్రాణేన ప్రాణితి అపానేన అపానితి। ఏవం వాయవీయా ఐన్ద్రియకాశ్చ చేష్టాః సంహతైః కార్యకరణైర్నిర్వర్త్యమానా దృశ్యన్తే। తచ్చైకార్థ వృత్తిత్వేన సంహననం నాన్తరేణ చేతనమసంహతం సంభవతి, అన్యత్రా దర్శనాత్। తదాహ—యత్ యది ఏషః ఆకాశే పరమే వ్యోమ్ని గుహాయాం నిహిత ఆనన్దో న స్యాత్ న భవేత్, కో హ్యేవ లోకే అన్యాత్ అపానచేష్టాం కుర్యాదిత్యర్థః। కః ప్రాణ్యాత్ ప్రాణనం వా కుర్యాత్; తస్మాదస్తి తద్బ్రహ్మ, యదర్థాః కార్యకరణ ప్రాణనాది చేష్టాః; తత్కృత ఏవ చ ఆనన్దో లోకస్య। కుతః? ఏష హ్యేవ పర ఆత్మా ఆనన్దయాతి ఆనన్దయతి సుఖయతి లోకం ధర్మానురూపమ్। స ఏవాత్మా ఆనన్దరూపోఽవిద్యయా పరిచ్ఛిన్నో విభావ్యతే ప్రాణిభి రిత్యర్థః। భయాభయ హేతుత్వాద్విద్వద విదుషోరస్తి తద్బ్రహ్మ। సద్వస్త్వాశ్రయణేన హి అభయం భవతి; నాసద్వస్త్వాశ్రయణేన భయ నివృత్తిరుపపద్యతే। కథమభయహేతుత్వమితి, ఉచ్యతే—యదా హ్యేవ యస్మాత్ ఏషః సాధకః ఏతస్మిన్ బ్రహ్మణి—కిం విశిష్టే? అదృశ్యే దృశ్యం నామ ద్రష్టవ్యం వికారః, దర్శనార్థత్వాద్వికారస్య; న దృశ్యమ్ అదృశ్యమ్, అవికార ఇత్యర్థః। ఏతస్మిన్నదృశ్యే అవికారేఽవిషయభూతే, అనాత్మ్యే

అశరీరే, యస్మాద దృశ్యం తస్మాదనాత్మ్యమ్, యస్మాదనాత్మ్యం తస్మాద నిరుక్తమ్; విశేషో హి నిరుచ్యతే; విశేషశ్చ వికారః, అవికారం చ బ్రహ్మ, సర్వవికారహేతుత్వాత్; తస్మాత్ అనిరుక్తమ్। యత ఏవమ్, తస్మాద నిలయనం నిలయనం నీడ ఆశ్రయః న నిలయనమ్ అనిలయనమ్. అనాధారం తస్మిన్ ఏతస్మిన్ అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే సర్వకార్య ధర్మవిలక్షణే బ్రహ్మణీతి వాక్యార్థః। అభయమితి క్రియావిశేషణమ్। అభయమితి వా లిఙ్గాన్తరం పరిణమ్యతే। ప్రతిష్ఠాం స్థితిమాత్మభావం విన్దతే లభతే। అథ తదా సః తస్మిన్నానాత్వస్య భయహేతోర విద్యాకృతస్యా దర్శనాద భయం గతోభవతి। స్వరూపప్రతిష్ఠో హ్యసౌ యదా భవతి, తదా నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి। అన్యస్య హ్యన్యతో భయం భవతి, న ఆత్మన ఏవ ఆత్మనో భయంయుక్తమ్। తస్మాత్ ఆత్మైవ ఆత్మనః అభయకారణమ్। సర్వతో హి నిర్భయా బ్రాహ్మణా దృశ్యన్తే సత్సు భయహేతుషు; తచ్చాయుక్తమసతి భయత్రాణే బ్రహ్మణి। తస్మాత్తేషామభయ దర్శనాదస్తి తదభయకారణం బ్రహ్మేతి। కదా అసౌ అభయం గతో భవతి సాధకః? యదా నాన్యత్పశ్యతి ఆత్మని చ అన్తరం భేదం న కురుతే, తదా అభయం గతో భవతీత్యభిప్రాయః। యదా పునరవిద్యావస్థాయాం హి యస్మాత్ ఏషః అవిద్యావాన్ అవిద్యయా ప్రత్యుపస్థాపితం వస్తుతైమిరిక ద్వితీయ చన్ద్రవత్పశ్యత్యాత్మని చ ఏతస్మిన్ బ్రహ్మణి, ఉత అపి, అరమ్ అల్పమపి, అన్తరం ఛిద్రం భేదదర్శనం కురుతే; భేదదర్శనమేవ హి భయకారణమ్; అల్పమపి భేదం పశ్యతీత్యర్థః। అథ తస్మాద్భేద దర్శనాద్ధేతోః తస్య భేదదర్శినః ఆత్మనో భయం భవతి। తస్మాదాత్మైవాత్మనో భయకారణ మవిదుషః; తదేతదాహ—తత్ బ్రహ్మ త్వేవ భయం భేద దర్శినో విదుషః ఈశ్వరోఽన్యో మత్తః అహమన్యః సంసారీత్యేవం విదుషః భేదదృష్టమీశ్వరాఖ్యం తదేవ బ్రహ్మ అల్పమప్యన్తరం కుర్వతః భయం భవతి ఏకత్వేన అమన్వానస్య। తస్మాత్ విద్వానప్యవిద్వానేవాసౌ, యోఽయమేక మభిన్నమాత్మతత్త్వం న పశ్యతి। ఉచ్ఛేదహేతుదర్శనాద్ధ్యుచ్ఛేద్యాభిమతస్య భయం భవతి; అనుచ్ఛేద్యో హ్యుచ్ఛేదహేతుః; తత్ర అసత్యుచ్ఛేదహేతౌ ఉచ్ఛేద్యే న తద్దర్శనకార్యం భయం యుక్తమ్। సర్వం చ జగద్భయవద్దృశ్యతే। తస్మాజ్జగతో భయ దర్శనాద్గమ్యతే—నూనం తదస్తి భయకారణ ముచ్ఛేదహేతురనుచ్ఛేద్యాత్మకమ్, యతో జగద్బిభేతీతి। తత్ ఏతస్మిన్నప్యర్థే ఏషః శ్లోకః భవతి॥

ఇతి సప్తమానువాక భాష్యమ్॥

టీక. ఇదం = ఈ (నామరూపవిశేషాత్మకమగు) ప్రపంచము, అగ్రే = ప్రపంచ సృష్టికి ముందు, అసత్ వై = అవ్యాకృతనామరూపవిశేషములు గల బ్రహ్మముగ, ఆసీత్=అయియుండెను, తతః = ఆయవ్యాకృతనామరూపవిశేషము గల అసత్తు నుండి, సత్=నామరూప ప్రవిభక్తమగు ప్రపంచము, అజాయత = పుట్టెను. (యస్మాత్=ఎందువలన) తత్ = ఆ యవ్యాకృత నామరూపములు గల బ్రహ్మము, ఆత్మానం—నామరూపాత్మకమగు ప్రపంచమును, స్వయం అకురుత = తానుగా చేసెనో, తస్మాత్=అందువలన, తత్ = అ బ్రహ్మమే, సుకృతం ఇతి = స్వయం కర్తృకమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

సుకృతం=స్వకర్తృకమగు, తత్ = ఆ బ్రహ్మము, యత్ వై=ఏది గలదో, సః=అది. రసః=రసస్వరూపము. అయం = ఈ ప్రాణి, రసం హి ఏవ = రసమునే. లబ్ధ్వా=పొంది, ఆనందీ=ఆనందము గలవాఁడు, భవతి=అగుచున్నాఁడు. యత్ = ఎందువలన, ఏషః=ఈ, ఆనందః=ఆనందము, ఆకాశే = హృదయాకాశమునందు, న స్యాత్ = లేనియెడల, కః హి ఏవ=ఎవ్వఁడు, అన్యాత్ = అపానచేష్టను చేయును. కః=ఎవ్వఁడు. ప్రాణ్యాత్=ప్రాణనచేష్టను చేయును, ఏషః హి ఏవ = ఈ యాత్మయే, ఆనందయాతి=(లోకమును) సుఖపెట్టుచున్నాఁడు. ఏషః=ఈ సాధకుఁడు. యదాహి ఏవ=ఎప్పుడైతే, అదృశ్యే=కనఁబడినట్టియు, అనాత్మ్యే = శరీర రహితుఁడైనట్టియు. అనిరుక్తే = వికారరహితుఁడైనట్టియు, అనిలయనే = ఆధార రహితుఁడైనట్టియు, ఏతస్మిన్ = ఈ పరమాత్మయందు, అభయం = భయము లేని, ప్రతిష్ఠాం=(ఆత్మభావ) స్థితిని, విందతే = పొందుచున్నాఁడో. అథ=తర్వాత, సః= ఆ సాధకుఁడు, అభయం=అభయమును, గతఃభవతి=పొందినవాఁ డగుచున్నాఁడు. యదా=ఎప్పుడు. ఏషః = వీఁడు. ఏతస్మిన్=ఈ పరబ్రహ్మమునందు, ఉదరం = స్వల్పమయినను, అంతరం = భేదమును. కురుతే హి = చేయుచున్నాఁడో. అథ= పిమ్మట తస్య=ఆ సాధకునకు, భయం=భయము, భవతి = అగుచున్నది అమన్వానస్య=బ్రహ్మముకంటె భిన్నముగాలేదు అను తలంచని. విదుషః విద్వాంసునకున్నూ, తత్ తు ఏవ భయం=అదే భయము (భవతి=అగుచున్నది.) తత్=ఆ విషయమును గూర్చి, ఏషః=ఈ, శ్లోకః అపి = శ్లోకమున్నూ-మంత్రమున్నూ, భవతి=కలదు.

తా. 'అస ద్వా ఇద మగ్ర ఆసీత్' అని మంత్రముయొక్క ప్రారంభము, ఇచ్చట 'అసత్' అనఁగా వ్యాకృతమయిన నామరూపవిశేషములకుఁ విపరీతమయిన రూపము గల అవ్యాకృత బ్రహ్మము అని గ్రహించవలయును. కాని అత్యంతమయిన

అసత్తు అని తలంచకూడదు. ఏలయనఁగా: అత్యంతాసత్తు అయినదానివల్ల నుండి 'సత్తు' అయినది పుట్టఁజాలదు గదా, మూలమునందు గల 'ఇదం' అను పదము నామరూపవిశేషములుగ వ్యాకృతమయిన జగద్వాచకము. అగ్రమునందు అనఁగా సృష్టికంటె పూర్వమునందు అసచ్ఛబ్ద వాచ్యమగు బ్రహ్మయే అయి ఉండెను. అట్టి అసచ్ఛబ్దవాచ్యమయిన బ్రహ్మము నుండియే 'సత్తు' అనఁగా ప్రవిభక్తనామరూప విశేషములు గల జగత్తు ఉత్పన్నమాయెను. తండ్రివలన జన్మించిన పుత్త్రుఁడు తండ్రి కంటె ఎట్లు భిన్నుఁ డగుచున్నాఁడో, అట్లే బ్రహ్మకార్య మగు జగత్తు కూడ ఆ బ్రహ్మముకంటె భిన్నమా? యేమి? అను ప్రశ్న రాగా అట్టి భేదము లేదనియు అసచ్ఛబ్దవాచ్యమగు ఆ బ్రహ్మము స్వయముగనే ఆత్మనే చేసినదాయెను. ఎందువలన ఆత్మనే జగద్రూపముగ నొనర్చి యున్నదో, అందువల్లనే ఆ బ్రహ్మము సుకృతమని చెప్పఁబడుచున్నది. లోకమునందు కూడ బ్రహ్మమే సర్వకారణ మగుటచేత "స్వయంకర్తృ" అను ప్రసిద్ధిని కూడ వహించియున్నది.

## బ్రహ్మమే సుకృతము — పుణ్యము

౧. ఏ కారణముచేత బ్రహ్మము సర్వమయిన జగత్తును స్వాకారము చేతనే సృజించియున్నదో అట్టి పుణ్యరూపము చేతకూడ ఆ కారణరూపమగు బ్రహ్మము సుకృతమనియు చెప్పఁబడును. లోకమునందు కూడ స్వర్గాదిఫల సంబంధమునకు కారణభూత మగు పుణ్యము కూడ సుకృతశబ్ద వాచ్యమయి ప్రసిద్ధిని వహించి యున్నది. కాబట్టి అట్టి చేతనకారణమయిన బ్రహ్మ మున్నప్పుడే అది ఉపపన్న మగుచున్నది. కావున బ్రహ్మము గలదు. ఆ బ్రహ్మము సుకృతమను ప్రసిద్ధి కలిగి యున్నది.

## బ్రహ్మమే అతీంద్రియమయిన రసస్వరూపము

౨. బ్రహ్మము కలదనుటకు మఱొకహేతువు కూడఁ గలదు. ఏలయనఁగా రసస్వరూపుఁడగుటవలన, బ్రహ్మమునకు 'రసత్వ ప్రసిద్ధి కలదా?' యని ఆశంకించి కలదని శ్రుతియే నిరూపించుచున్నది— "యద్వైతత్సుకృతం। రసో వై సః=ఎయ్యది సుకృతమో అదియే రసముగదా" అని శ్రుతి. లోకమునందు కూడ తృప్తి హేతువును ఆనందకరమును అగు మధురామ్లాదికమునకు రసము అని ప్రసిద్ధి కూడ గలదు గదా. ప్రాణులు కూడ రససదృశమయిన ఆత్మానందమును వృత్తిద్వారముగ పొందియే ఆనందము గలవార లగుచున్నారు. అసత్తునకు ఆనందహేతుత్వము లోకమునం దెచ్చటను గనంబడుట కూడ లేదు. బాహ్యానంద సాధనరహితులును, ఆనీ

హీనులును, నిరేషణులును అగు బ్రహ్మవేత్తలగు విద్వాంసులు కూడ బాహ్యరస లాభమువలనవలె ఆనందసహితులయి గనంబడుచున్నారు. నిశ్చయముగా వారికి బ్రహ్మమే రసముగదా. కావున అట్టి నిరేషణులగు వారలకు కూడ ఆనందకారణమును. రసస్వరూపమును అగు బ్రహ్మము కలదనియే గ్రహించవలయును.

బ్రహ్మమే దేహాదిచేష్టకు, వైషయికానందమునకు హేతుభూతము

బ్రహ్మమున్నదనుటకు మఱొక ఉపపత్తి కూడ గలదు. ప్రాణనాదిక్రియలు గనంబడుచుండుటచేత కూడ బ్రహ్మమున్నదనియే అంగీకరించి తీరవలయును. జీవద్దశ యందు దేహమునందు ప్రాణాపానాదిక్రియలు జరుగుచున్నవి గదా. అదేవిధముగా వాయుసంబంధమయినట్టియు, ఇంద్రియసంబంధమైనట్టియు చేష్టలు పైతము సంహతములయిన కార్యకరణములచేత నియతముగా జరిపించబడుచున్నవి. చేతన సంబంధములేక ఏకార్థవృత్తిత్వసంహననము—అనఁగా ఒక్కనియొక్క నిమిత్తమయి కలిసియుండుట ఉండఁజాలదు — లోకమునందు కూడ గృహప్రాసాదాది సంహననము చేతనస్వామి సంబంధము లేక గనంబడుట లేదు. కనుక ఈ ఆనంద స్వరూపుఁడు పరమవ్యోమయందు—అనఁగా హృదయకమలాంతర్వర్తి యగు గుహయందు లేనియెడల లోకమునం దెవ్వఁడు ప్రాణనకర్మను చేయును? ఎవ్వఁడు అపానచేష్టను చేయును? కాఁబట్టి ఎవ్వని నిమిత్త మీ కార్యకరణ సంఘాతము — శరీరము ప్రాణాపానాదిక్రియలను చేయుచున్నదో, అట్టి బ్రహ్మమున్నదనియే అంగీకరించవలయును. లోకమునందు గల ఆనందము కూడ ఆ యాత్మానందకృతమే, ఏల యనఁగా ఈ పరమాత్మయే వారి వారి కర్మానుసారము ఆ యా ప్రాణులను ఆనందింపఁ జేయుచున్నాఁడు ఆనంద స్వరూపుఁడగు ఆ యాత్మయే అవిద్యచేత ఆచ్ఛాదితుఁడయి లోకులచేత నానావిధములుగ అనుభవింపఁబడుచున్నాఁడు.

విద్వాంసులకును అవిద్వాంసులకును అభయహేతువును, భయహేతువును అగుటచేత బ్రహ్మము కలదనియే గ్రహించవలయును. సద్వస్తువును ఆశ్రయించుట చేత అభయము అగుచున్నది. అసద్వస్తువు నాశ్రయించుటచేత భయనివృత్తి కలుగఁజాలదు.

విద్వాంసునకే బ్రహ్మప్రాప్తి

అభయహేతు వెట్లో చెప్పఁబడుచున్నది:—

సాధకుఁ డగువాఁ డెప్పుడు అదృశ్యమును, అనాత్మ్యమును, అనిరుక్తమును, అనిలయమును అగు బ్రహ్మమునందు అభయ మనగా భయము లేనటుల ప్రతిష్ఠను -

స్థితిని పొందుచున్నాఁడో (దృశ్యమనఁగా చూడఁదగినది — వికారజాతము; అదృశ్యమనఁగా వికారరహితము ఆ విషయభూతము; అనాత్మ్యమనఁగా అశరీరము, అదృశ్యము కావున అనాత్మ్యము యుక్తమగుచున్నది. ఎప్పుడు అనాత్మ్యమో—అశరీరమో అప్పుడు అనిరుక్తమగుచున్నది. అనిరుక్త మనఁగా విశేషరహితము — లేక వికారరహితము. సర్వవికారములకు హేతుభూతమగుటవలన బ్రహ్మమును అనిరుక్తమనుట యుక్తమే. అనిరుక్తమగుటచేత అనిలయనము — నిలయన మనఁగా ఆశ్రయము-ఆధారము, ఇట్టి అనఁగా అదృశ్యమును అనాత్మ్యమును అనిరుక్తమును అనిలయమును సర్వకార్యధర్మ విలక్షణమును అగు బ్రహ్మమునందు అని భావము.) అభయ మనునది క్రియావిశేషణము, అనఁగా భయము లేనటుల ప్రతిష్ఠను పొందుచున్నాఁడు. లేక ఛాందసము కావున అభయమను పదమును ప్రతిష్ఠ యనుదానికి విశేషణముగా గ్రహించి భయరహితమయిన ప్రతిష్ఠను పొందుచున్నాఁడు. అనఁగా ఆత్మభావమును పొందుచున్నాఁడు ఎప్పుడు అట్టి ఆత్మభావమును పొందునో అప్పుడు ఆ బ్రహ్మమునందు అవిద్యాకృతమయిన నానాత్వభావము నశించుచున్నది, కావున అభయమును పొందినవాఁ డగుచున్నాఁడు. ఎప్పుడు సాధకుఁడగువాఁడు స్వరూప ప్రతిష్ఠుఁ డగుచున్నాఁడో అప్పుడు అన్యమును చూచుటలేదు, అన్యమును వినుట లేదు, అన్యమును ఎఱుంగుట లేదు, కావున భయకారణమే ఇతనికి లేదు. అన్యుని వలన అన్యునకు భయము కలుగుట లోకప్రసిద్ధముకాని ఆత్మవలన ఆత్మకు భయము కలుగుట లోకప్రసిద్ధముగ లేదు కావున ఆత్మయే ఆత్మకు అభయకారణము. భయహేతువు లున్నప్పటికిన్ని భయము నుండి రక్షించు బ్రహ్మముయొక్క స్వరూపభూతులు తాము అగుటచేతనే బ్రహ్మవేత్తలు నిర్భయులయి చరించుచున్నారు. కావున అనఁగా బ్రహ్మవేత్తలు నిర్భయులయి యుంటున్నారు, కావున అభయకారణమగు బ్రహ్మమున్నదనియే అంగీకరించి తీరవలయును. సాధకుఁ డగువాఁడెప్పుడు అభయమును పొందుచున్నాఁడనఁగా ఎప్పుడు అన్యమును గాంచఁడో, ఆత్మయందు అంతరము—అనఁగా భేదమును గాంచఁడో, అప్పుడు అభయమును పొందుచున్నాఁడని అభిప్రాయము.

## భేదదర్శనమే భయమునకు కారణము

అక్షిదోషముచేత రెండవ చంద్రుని గాంచినటుల అవిద్యావస్థయం దెప్పుడు వస్త్వంతరమును గాంచుచున్నాఁడో, అనఁగా ఆత్మయందు - బ్రహ్మమునందు స్వల్పముగనైనను భేదమును గాంచుచున్నాఁడో, అట్టి భేదదర్శనమే భయకారణ

మగుచున్నది. అట్టి భేదదర్శన మల్పమయినప్పటికిన్నీ భయహేతువే అగుచున్నది. అట్టి భేదదర్శనమువల్లనే వానికి ఆత్మవల్లనుండి భయమగుచున్నది కావున అవిద్వాంసుఁడగు వానికి ఆత్మయే భయకారణ మీవిధముగా అగుచున్నది.

## భేదదర్శియగు విద్వాంసునకు బ్రహ్మము భయకారణము

ఈశ్వరుడు నాకంటె భిన్నుఁడు, నేను ఈశ్వర భిన్నుఁడగు సంసారిని, అని తలంచెడి భేదదర్శియగు విద్వాంసునకు బ్రహ్మమే భయహేతువగుచున్నది. ఆత్మ తనకంటె భిన్నమయినదని తలంచెడి—అనఁగా ఆత్మైకత్వమును తలంచని విద్వాంసునకు అభేదభావన అల్పమయినప్పటికిన్ని అతఁడు విద్వాంసుఁడు కాఁజాలఁడు. ఏలయనఁగా అతఁడు వాస్తవముగా ఏకమును అభిన్నమును అగు ఆత్మతత్త్వమును చూడలేదు కావున (అతఁడు విద్వాంసుఁడనుట యుక్తముకాదు) ఉచ్ఛేద హేతుభూతమగు బ్రహ్మమున్నదని తలంచుచున్నాఁడు కావునను, లోకమంతయు భయంపడుచున్నది కావునను, అట్టి భయహేతువగు బ్రహ్మ మున్నదనియే అంగీకరించి తీరవలయును. స్వయముగా తాను నశించక ఇతరమును నశింపజేయునట్టి ఒక మహత్తత్త్వమున్నదనియు, అట్టిదానివిగాంచి జగమంతయు భయంపడుచున్నదనియు సిద్ధించుచున్నది. ఈ విషయమును గూర్చి—అనఁగా సర్వమునకు భయహేతువగు ఒక పదార్థము కలదను విషయమయి ఒక శ్లోకము—మంత్రము చెప్పఁబడుచున్నది:—

వివరణము.—వెనుకటి యనువాకమునందుఁగల ౩ ప్రశ్నములకు ఇచట సమాధానము చెప్పఁబడినది.

౧. విద్వాంసుఁడు ఆత్మయందు ప్రతిష్ఠను పొందినయెడల అతఁడే బ్రహ్మస్వరూపుఁడయి అభయమును పొందుచున్నాఁడు. కావున బ్రహ్మవేత్తకు బ్రహ్మప్రాప్తి సిద్ధాంతభూతమే.

౨. అవిద్వాంసుఁడు భేదదృష్టి కలిగియుండుటచేతను, భేదదృష్టి జన్మ జరా మరణ రూపమగు సంసారమును కలుగఁజేయును కావునను అవిద్వాంసునకు బ్రహ్మప్రాప్తిలేదు.

బ్రహ్మజ్ఞానము గల దేవాదులకు గూడ సంతతముగ ఆత్మజ్ఞాననిష్ఠ దృఢముగ అనుభవమునకు రానందుచేతనే వారందఱు భయముకలిగి ప్రవర్తించుచున్నారను విషయమును తెలుపుటకయి ఒక మంత్ర ముదహరింపఁబడుచున్నది.

## ఇతర గ్రంథ భాగములు

తైత్తి. భాష్యవార్తికము, బ్రహ్మవల్లి, ఖండ. ౮. శ్లో. ౧౫-౨౯.

అనుభూతి ప్రకాశము, ౨-వ అధ్యా. శ్లో. ౧౦౩-౧౨౦.

ఆత్మపురాణము, ౧౦-వ అధ్యా. శ్లో. ౨౩౧-౨౭౧.



## ౮. అష్టమోఽనువాకః

(ఆనందమీమాంసా)

౫౦. ౧. భీషాఽస్మా ద్వాతః పవతే । భీషోదేతిసూర్యః ।
భీషా ఽస్మా దగ్ని శ్చేంద్రశ్చ । మృత్యు ర్ధావతి
పంచమ ఇతి ॥

౨. సైషా ఽఽనందస్య మీమాగ్ంసా భవతి । యు
వా స్యా త్సాదు యువాఽధ్యాయకః । ఆశిష్ఠో
ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్త
స్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనన్దః ।

3. *శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం
మానుషా ఆనందాః । స ఏకో మనుష్యగంధ
ర్వాణామానందః । శ్రోత్రియస్య చాకామహ
తస్య ।

౪. తే యే శతం మనుష్యగంధర్వాణా మానన్దాః ।
స ఏకో దేవగంధర్వాణా మానందః । శ్రోత్రి
యస్య చాకామహతస్య ।

---

* మానుషానందపర్యాయే శ్రోత్రియస్యేతి వాక్యం శాంకరపాఠేనాస్తి.

౫. తే యే శతం దేవగంధర్వాణా మానందాః। స ఏకః పితౄణాం చిరలోకలోకానా మానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

౬. తే యే శతం పితౄణాం చిరలోకలోకానా మానందాః। స ఏక ఆజానజానాం దేవానా మానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

౭. తే యే శత మాజానజానాం దేవానా మానందాః। స ఏకః కర్మదేవానాం దేవానా మానందః। యే కర్మణా దేవా నపి యంతి। శ్రోత్రియస్య చాకామహతస్య।

౮. తే యే శతం కర్మ దేవానాం దేవానా మానందాః దాః। స ఏకో దేవానా మానందః। శ్రోత్రియస్య చాకామహతస్య।

౯. తే యే శతం దేవానా మానన్దాః। స ఏక ఇంద్రస్యానందః దః। శ్రోత్రియస్య చాకామహతస్య।

౧౦. తే యే శతమిన్ద్రస్యానన్దాః। స ఏకో బృహస్పతే రానందః। శ్రోత్రియస్య చాకామహతస్య॥

౧౧. తే యే శతం బృహస్పతే రానన్దాః । స ఏకః
ప్రజాపతే రానందః । శ్రోత్రియస్య చాకామ
హతస్య ।

౧౨. తే యే శతం ప్రజాపతే రానందాః । స ఏకో
బ్రహ్మణ ఆనందః । శ్రోత్రియస్య చాకామహ
తస్య ।

౧౩. స య శ్చాయం పురుషే । యశ్చాసా వాదిత్యే ।
స ఏకః ।

౧౪. స య ఏవం విత్ । అస్మా ల్లోకా త్ప్రేత్య ।
ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏత మానన్దమయ మాత్మాన ముపసంక్రామతి ।

౧౫. తదప్యేష శ్లోకో భవతి ॥

శాంకరభాష్యమ్:—

భీషా భయేన అస్మాత్ వాతః పవతే। భీషోదేతి సూర్యః। భీషా అస్మాత్ అగ్ని శ్చేన్ద్రశ్చ। మృత్యుర్ధావతి పఞ్చమ ఇతి। వాతాదయో హి మహార్హాః స్వయమీశ్వరాః

సన్తః పవనాది కార్యేష్వాయాసబహులేషు నియతాః ప్రవర్తన్తే; తద్యుక్తం ప్రశాస్తరి సతి; యస్మాత్ నియమేన తేషాం ప్రవర్తనమ్, తస్మాదస్తి భయకారణం తేషాం ప్రశాస్తృ బ్రహ్మ। యతస్తే భృత్యా ఇవరాజ్ఞః అస్మాత్ బ్రహ్మణః భయేన ప్రవర్తన్తే తచ్చ భయకారణ మానన్దం బ్రహ్మ। తస్య అస్య బ్రహ్మణః ఆనన్దస్య ఏషా మీమాంసా విచారణా భవతి। కిమానన్దస్య మీమాంస్యమితి. ఉచ్యతే—కిమానన్దో విషయవిషయి సంబన్ధ జనితః లౌకికానందవత్, ఆహోస్విత్ స్వాభావికః, ఇత్యేవమేషా ఆనన్దస్య మీమాంసా॥

తత్ర లౌకిక ఆనన్దో బాహ్యాధ్యాత్మిక సాధన సంపత్తి నిమిత్త ఉత్కృష్టః। సః య ఏష నిర్దిశ్యతే బ్రహ్మానన్దానుగమార్థమ్। అనేన హి ప్రసిద్ధేన ఆనన్దేన వ్యావృత్తవిషయబుద్ధిగమ్య ఆనన్దోఽనుగన్తుం శక్యతే। లౌకికోఽప్యానన్దః బ్రహ్మానన్దస్యైవ మాత్రా; అవిద్యయా తిరస్క్రియమాణే విజ్ఞానే ఉత్కృష్యమాణాయాం చ అవిద్యాయాం బ్రహ్మాదిభిః కర్మవశాత్ యథావిజ్ఞానం విషయాది సాధన సంబన్ధ వశాచ్చ విభావ్యమానశ్చ లోకేఽనవస్థితో లౌకికః సంపద్యతే; స ఏవ అవిద్యాకామ కర్మాపకర్షేణ మనుష్యగన్ధర్వాద్యుత్తరోత్తర భూమిషు అకామహతవిద్వచ్ఛ్రోత్రియ ప్రత్యక్షో విభావ్యతే శత గుణోత్తరోత్తరోత్కర్షేణ యావద్ధిరణ్యగర్భస్య బ్రహ్మణ ఆనన్ద ఇతి॥

నిరస్తే త్వవిద్యాకృతే విషయవిషయివిభాగే, విద్యయా స్వాభావికః పరిపూర్ణః ఏకః ఆనన్దః అద్వైతః భవతీత్యేతమర్థం విభావయిష్యన్నాహ —— ——
యువా ప్రథమవయాః; సాధుయువేతి సాధుశ్చాసౌ యువా చేతి యూనో విశేషణమ్; యువాప్యసాధుర్భవతి సాధురప్యయువా, అతో విశేషణం యువా స్యాత్సాధు యువేతి; అధ్యాయకః అధీతవేదః। ఆశిష్ఠః ఆశాస్తృతమః; దృఢిష్ఠః దృఢతమః; బలిష్ఠః బలవత్తమః; ఏవమాధ్యాత్మిక సాధన సంపన్నః। తస్యేయం పృథివీ ఉర్వీ సర్వా విత్తస్య విత్తేనోపభోగ సాధనేన దృష్టార్థేనా దృష్టార్థేన చ కర్మసాధనేన సంపన్నా పూర్ణా రాజా పృథివీపతిరిత్యర్థః। తస్య చ య ఆనన్దః, సః ఏకః మానుషః మనుష్యాణాం ప్రకృష్టః ఏక ఆనన్దః। తే యే శతం మానుషా ఆనన్దాః, స ఏకో మనుష్యగన్ధర్వాణా మానన్దః; మానుషానన్దాత్ శతగుణేనోత్కృష్టః మనుష్యగన్ధర్వాణా మానన్దః భవతి। మనుష్యాః సన్తః కర్మవిద్యావిశేషాత్ గన్ధర్వత్వం ప్రాప్తా మనుష్య గన్ధర్వాః। తే హ్యన్తర్ధానాది శక్తి సంపన్నాః సూక్ష్మకార్యకరణాః; తస్మాత్ప్రతిఘాతాల్పత్వం తేషాం ద్వన్ద్వప్రతిఘాతశక్తి సాధన సంపత్తిశ్చ। తతః అప్రతిహన్యమానస్య ప్రతీ

కారవతః మనుష్య గన్ధర్వస్య స్యాచ్చిత్తప్రసాదః। తత్ప్రసాద విశేషా త్సుఖవిశేషాభివ్యక్తిః। ఏవం పూర్వస్యాః పూర్వస్యా భూమేరుత్తరస్యాముత్తరస్యాం భూమౌ ప్రసారవిశేషతః శతగుణేన ఆనన్దోత్కర్ష ఉపపద్యతే। ప్రథమం తు అకామహతాగ్రహణం మనుష్యవిషయ భోగకామానాభిహతస్య శ్రోత్రియస్య మనుష్యానన్దాత్ శతగుణేన ఆనన్దోత్కర్షః మనుష్యగన్ధర్వేణ తుల్యో వక్తవ్య ఇత్యేవమర్థమ్। సాధు యువా అధ్యాయక ఇతి శ్రోత్రియత్వావృజినత్వే గృహ్యేతే। తే హ్యవిశిష్టే సర్వత్ర। అకామహతత్వం తు విషయోత్కర్షాపకర్షతః సుఖోత్కర్షాప కర్షాయ విశేష్యతే। అతః అకామహతగ్రహణమ్, తద్విశేషతః శతగుణసుఖోత్కర్షోపలబ్ధేః అకామ హతత్వస్య పరమానన్దప్రాప్తిసాధనత్వవిధానార్థమ్। వ్యాఖ్యాతమన్యత్। దేవగన్ధర్వా జాతిత ఏవ। చిరలోకలోకానామితి పితౄణాం విశేషణమ్। చిరకాలస్థాయీ లోకో యేషాం పితౄణామ్, తే చిరలోకలోకా ఇతి। ఆజాన ఇతి దేవలోకః తస్మిన్నాజానే జాతా ఆజానజా దేవాః, స్మార్తకర్మవిశేషతో దేవస్థానేషు జాతాః। కర్మదేవా యే వైదికేన కర్మణా అగ్నిహోత్రాదినా కేవలేన దేవానపియన్తి। దేవా ఇతి త్రయస్త్రింశద్ధవిర్భుజః; ఇన్ద్రస్తేషాం స్వామీ; తస్య ఆచార్యో బృహస్పతిః। ప్రజాపతిః విరాట్ త్రైలోక్య శరీరో బ్రహ్మా సమష్టివ్యష్టి రూపః సంసారమణ్డలవ్యాపీ। యత్రైతే ఆనన్దభేదా ఏకతాం గచ్ఛన్తి। ధర్మశ్చ తన్నిమిత్తః జ్ఞానం చ తద్విషయమ్ అకామహతత్వం చ నిరతిశయం యత్ర, స ఏష హిరణ్యగర్భో బ్రహ్మా, తస్యైష ఆనన్దః శ్రోత్రియేణ అవృజినేన అకామహతేన చ సర్వతః ప్రత్యక్షముపలభ్యతే। తస్మాదేతాని త్రీణి సాధనానీత్యవగమ్యతే। తత్ర శ్రోత్రియత్వావృజినత్వే నియతే, అకామహతత్వం తు ఉత్కృష్యత ఇతి ప్రకృష్టసాధనతా అవగమ్యతే। తస్య అకామహతత్వప్రకర్షతశ్చోపలభ్యమానః శ్రోత్రియ ప్రత్యక్షో బ్రహ్మణ ఆనన్దః యస్య పరమానన్దస్య మాత్రా ఏకదేశః "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" ఇతి శ్రుత్యన్తరాత్। స ఏష ఆనన్దః—యస్య మాత్రా సముద్రామ్భస ఇవ విప్రుషః ప్రవిభక్తాః యత్రైకతాం గతాః — స ఏష పరమానన్దః స్వాభావికః, అద్వైతాత్; ఆనన్దానన్దినోశ్చ అవిభాగోఽత్ర॥

తదేతన్మీమాంసాఫలముపసంహ్రియతే — స యశ్చాయం పురుష ఇతి। యః గుహాయాం నిహితః పరమే వ్యోమ్ని ఆకాశాదికార్యం సృష్ట్వా అన్నమయాన్తమ్, తదేవానుప్రవిష్టః, సః య ఇతి నిర్దిశ్యతే। కోఽసౌ? అయం పురుషే। యశ్చాసావాదిత్యే యః పరమానన్దః శ్రోత్రియప్రత్యక్షో నిర్దిష్టః, యస్యైకదేశం

బ్రహ్మాదీని భూతాని సుఖార్హాణ్యుపజీవన్తి, సః యశ్చాసావాదిత్యే ఇతి నిర్దిశ్యతే। స ఏకః భిన్నప్రదేశఘటాకాశా కాశైకత్వవత్। నను తన్నిర్దేశే స యశ్చాయం పురుష ఇత్యవిశేషతోఽధ్యాత్మం న యుక్తో నిర్దేశః; యశ్చాయం దక్షిణేఽక్ష న్నితి తు యుక్తః, ప్రసిద్ధత్వాత్। న, పరాధికారాత్। పరో హ్యాత్మా అత్ర అధికృతః "అదృశ్యేఽనాత్మ్యే" "భీషాస్మాద్వాతః పవతే" "సైషానన్దస్య మీమాంసా" ఇతి। న హి అకస్మాత ప్రకృతో యుక్తో నిర్దేష్టుమ్; పరమాత్మవిజ్ఞానం చ వివక్షితమ్। తస్మాత్ పర ఏవ నిర్దిశ్యతే—స ఏక ఇతి। నన్వానన్దస్య మీమాంసా ప్రకృతా; తస్యా అపి ఫలముప సంహర్తవ్యమ్। అభిన్నః స్వాభావికః ఆనన్దః పరమాత్మైవ, న విషయవిషయి సంబన్ధజనిత ఇతి। నను తదనురూప ఏవ అయం నిర్దేశః — "స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః" ఇతి భిన్నాధికరణస్యవిశేషోపమర్దేన। నన్వేవమప్యాదిత్యవిశేషగ్రహణమనర్థకమ్; న అనర్థకమ్, ఉత్కర్షాపకర్షాపోహార్థత్వాత్। ద్వైతస్య హి యో మూర్తామూర్త లక్షణస్య పర ఉత్కర్షః సవిత్రభ్యన్తర్గతః స చేత్పురుషగత విశేషోపమర్దేన పరమానన్దమపేక్ష్య సమో భవతి. న కశ్చిదుత్కర్షోఽపకర్షో వా తాం గతిం గతస్యేత్యభయం ప్రతిష్ఠాం విన్దత ఇత్యుపపన్నమ్॥

అస్తి నాస్తీత్యను ప్రశ్నో వ్యాఖ్యాతః। కార్యరస లాభ ప్రాణనాభయ ప్రతిష్ఠా భయ దర్శనోపపత్తిభ్యోఽస్త్యేవ తదాకాశాది కారణం బ్రహ్మేత్యపాకృతః అను ప్రశ్న ఏకః; ద్వావన్యాను ప్రశ్నౌ విద్వద విదుషోర్బ్రహ్మ ప్రాప్త్యప్రాప్తి విషయౌ; తత్ర విద్వాన్స మశ్నుతే న సమశ్నుత ఇత్యను ప్రశ్నోఽన్త్యః; తదపాకరణాయోచ్యతే। మధ్యమోఽను ప్రశ్నః అన్త్యాపాకరణాదేవ అపాకృత ఇతి తదపాకరణాయ న యత్యతే। స యః కశ్చిత్ ఏవంయథోక్తం బ్రహ్మ ఉత్సృజ్యోత్కర్షాపకర్షమద్వైతం సత్యం జ్ఞాన మనన్త మస్మీత్యేవం వేత్తీతి ఏవం విత్; ఏవం శబ్దస్య ప్రకృత పరామర్శార్థత్వాత్। స కిమ్? అస్మాల్లోకాత్ప్రేత్య దృష్టా దృష్టేష్ట విషయ సముదాయో హి అయం లోకః. తస్మాదస్మాల్లోకాత్ప్రేత్య ప్రత్యావృత్య నిరపేక్షో భూత్వా ఏతం యథావ్యాఖ్యాతమ్ అన్నమయమాత్మాన ముప సంక్రామతి విషయజాతమన్నమయాత్పిణ్డాత్మనో వ్యతిరిక్తం న పశ్యతి, సర్వం స్థూలభూత మన్నమయమాత్మానం పశ్యతీత్యర్థః। తతః అభ్యన్తరమేతం ప్రాణమయం సర్వాన్నమయాత్మస్థమవిభక్తమ్। అథైతం మనోమయం విజ్ఞానమయ మానన్దమయ మాత్మానముపసంక్రామతి। అథా దృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే॥

తత్రైతచ్చిన్త్యమ్ — కోఽయమేవం విత్, కథం వా సంక్రామతీతి; కిం పరస్మాదాత్మనోఽన్యః సంక్రమణకర్తా ప్రవిభక్తః, ఉత స ఏవేతి। కిం తతః? యద్యన్యః స్యాత్, శ్రుతి విరోధః— "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" "అన్యోఽసావన్యోఽహ మస్మీతి। న స వేద" "ఏకమేవాద్వితీయమ్" "తత్త్వమసి" ఇతి। అథ స ఏవ ఆనన్దమయమాత్మాన ముపసంక్రామతీతి; కర్మకర్తృత్వానుపపత్తిః పరస్యైవ చ సంసారిత్వం పరాభావో వా। యద్యుభయథా ప్రాప్తో దోషో న పరిహర్తుం శక్యత ఇతి, వ్యర్థా చిన్తా। అథ అన్యతరస్మిన్పక్షే దోషాప్రాప్తిః తృతీయే వా పక్షే అదుష్టే, స ఏవ శాస్త్రార్థ ఇతి వ్యర్థైవ చిన్తా; న, తన్నిర్ధారణార్థత్వాత్।

సత్యం ప్రాప్తో దోషో న శక్యః పరిహర్తుమన్యతరస్మిన్ తృతీయే వా పక్షే అదుష్టే అవధృతే వ్యర్థా చిన్తా స్యాత్; న తు సోఽవధృత ఇతి తదవధారణార్థత్వాదర్థవత్యేవైషా చిన్తా। సత్యమర్థవతీ చిన్తా, శాస్త్రార్థావధారణార్థత్వాత్। చిన్తయసి చ త్వమ్. 'న తు నిర్ణేష్యసి; కిం న నిర్ణేతవ్యమితి వేదవచనమ్? న; కథం తర్హి? బహుప్రతిపక్షత్వాత్; ఏకత్వ వాదీ త్వమ్, వేదార్థ పరత్వాత్; బహవో హి నానాత్వవాదినో వేదబాహ్యాః త్వత్ప్రతి పక్షాః; అతో మమాశఙ్కా—న నిర్ణేష్యసీతి। ఏతదేవ మే స్వస్త్యయనమ్—యన్మా మేక యోగిన మనేకయోగి బహుప్రతిపక్షమాత్థ। అతో జేష్యామి సర్వాన్; ఆరభే చ చిన్తామ్॥

స ఏవ తు స్యాత్, తద్భావస్య వివక్షితత్వాత్। తద్విజ్ఞానేన పరమాత్మ భావో హి అత్ర వివక్షితః— "బ్రహ్మ విదాప్నోతి పరమ్" ఇతి। న హి అన్యస్య అన్యభావాపత్తి రుప పద్యతే। నను తస్యాపి తద్భావాపత్తి రనుపపన్నైవ। న, అవిద్యాకృతతాదాత్మ్యాపోహార్థత్వాత్। యా హి బ్రహ్మవిద్యయా స్వాత్మప్రాప్తిరుపదిశ్యతే, సా అవిద్యాకృతస్య అన్నాది విశేషాత్మనః ఆత్మత్వేనాధ్యారోపితస్య అనాత్మనః అపోహార్థా। కథమేవమర్థతా అవగమ్యతే? విద్యామాత్రోపదేశాత్। విద్యాయాశ్చ దృష్టం కార్యమ విద్యానివృత్తిః; తచ్చేహ విద్యామాత్ర మాత్మప్రాప్తౌ సాధన ముపదిశ్యతే। మార్గవిజ్ఞానోపదేశవదితి చేత్, తదాత్మత్వే విద్యామాత్రసాధనోపదేశోఽహేతుః। కస్మాత్? దేశాన్తర ప్రాప్తౌ మార్గవిజ్ఞానోపదేశ దర్శనాత్; న హి గ్రామ ఏవ గన్తేతి చేత్, న; వైధర్మ్యాత్। తత్ర హి గ్రామవిషయం నోపదిశ్యతే, తత్ప్రాప్తి మార్గ విషయమేవోప దిశ్యతే విజ్ఞానమ్; న తథేహ బ్రహ్మవిజ్ఞాన వ్యతిరేకేణ సాధనాన్తర విషయం విజ్ఞాన ముపదిశ్యతే। ఉక్త కర్మాది సాధనాపేక్షం బ్రహ్మవిజ్ఞానం పర ప్రాప్తౌ సాధన ముపదిశ్యత ఇతి చేత్, న; నిత్యత్వాన్మోక్షస్యేత్యాదినా ప్రత్యు

కత్వాత్। శ్రుతిశ్చ "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" ఇతి కార్యస్య తదాత్మత్వం దర్శయతి। అభయప్రతిష్ఠోపపత్తేశ్చ। యది హి విద్వాన్ స్వాత్మనోఽన్యన్న పశ్యతి, తతః అభయం ప్రతిష్ఠాం విన్దత ఇతి స్యాత్, భయహేతోః పరస్య అన్యస్య అభావాత్। అన్యస్య చ అవిద్యాకృతత్వే విద్యయా అవస్తుత్వ దర్శనోపపత్తిః; తద్ధి ద్వితీయస్య చన్ద్రస్య అసత్త్వమ్, యదతైమిరికేణ చక్షుష్మతా న గృహ్యతే; నైవం న గృహ్యత ఇతి చేత్, న; సుషుప్త సమాహితయోరగ్రహణాత్। సుషుప్తేఽగ్రహణ మన్యాసక్తవదితి చేత్, న; సర్వాగ్రహణాత్। జాగ్రత్స్వప్నయో రన్యస్య గ్రహణా త్సత్త్వమేవేతి చేత్, న; అవిద్యాకృతత్వాత్ జాగ్రత్స్వప్నయోః; యదన్యగ్రహణం జాగ్రత్స్వప్నయోః, తదవిద్యాకృతమ్, విద్యాభావే అభావాత్। సుషుప్తే అగ్రహణమపి అవిద్యాకృతమితి చేత్, న; స్వాభావికత్వాత్। ద్రవ్యస్య హి తత్త్వమ విక్రియా, పరానపేక్షత్వాత్; విక్రియా న తత్త్వమ్, పరాపేక్షత్వాత్। న హి కారకాపేక్షం వస్తునస్తత్త్వమ్; సతో విశేషః కారకాపేక్షః; విశేషశ్చ విక్రియా; జాగ్రత్స్వప్నయోశ్చ గ్రహణం విశేషః। యద్ధి యస్య నాన్యాపేక్షం స్వరూపమ్, తత్తస్య తత్త్వమ్; యదన్యాపేక్షమ్, న తత్తత్త్వమ్; అన్యాభావే అభావాత్। తస్మాత్ స్వాభావికత్వాత్ జాగ్రత్స్వప్నవత్ న సుషుప్తే విశేషః। యేషాం పునరీశ్వరో అన్య ఆత్మనః, కార్యం చ అన్యత్, తేషాం భయానివృత్తిః, భయస్య అన్య నిమిత్తత్వాత్; సతశ్చ అన్యస్య ఆత్మహానానుపపత్తిః। న చ అసత ఆత్మలాభః। సాపేక్షస్య అన్యస్య భయహేతుత్వమితిచేత్, న; తస్యాపి తుల్యత్వాత్। యద్ధర్మాద్యను సహాయీభూతం నిత్యమనిత్యం వా నిమిత్తమపేక్ష్య అన్యద్భయకారణం స్యాత్, తస్యాపి తథాభూతస్య ఆత్మహానాభావాత్ భయానివృత్తిః; ఆత్మహానే వా సదసతోరితరేతరాపత్తౌ సర్వత్ర అనాశ్వాస ఏవ। ఏకత్వపక్షే పునః సనిమిత్తస్య సంసారస్య అవిద్యా కల్పితత్వాదదోషః। తైమిరికదృష్టస్య హి ద్వితీయచన్ద్రస్య న ఆత్మలాభో నాశో వా అస్తి। విద్యావిద్యయోః తద్ధర్మత్వమితి చేత్, న; ప్రత్యక్షత్వాత్। వివేకావివేకౌ రూపాదివత్ ప్రత్యక్షావుపలభ్యేతే అన్తఃకరణస్థౌ। న హి రూపస్య ప్రత్యక్షస్య సతో ద్రష్టృధర్మత్వమ్। అవిద్యా చ స్వానుభవేన రూప్యతే—మూఢోఽహమ్ అవివిక్తం మమ విజ్ఞానమ్ ఇతి। తథా విద్యావివేకో అనుభూయతే। ఉపదిశన్తి చ అన్యేభ్య ఆత్మనో విద్యాం బుధాః। తథా చ అన్యే అవధారయన్తి। తస్మాత్ నామరూప పక్షస్యైవ విద్యావిద్యే నామరూపే చ; న ఆత్మధర్మౌ. "నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ" ఇతి శ్రుత్యన్తరాత్। తే చ పునర్నామరూపే సవితర్యహోరాత్రే ఇవ

కల్పితే; న పరమార్థతో విద్యమానే। అభేదే "ఏతమానన్దమయమాత్మానముపసంక్రామతి" ఇతి కర్మకర్తృత్వానుపపత్తిరితి చేత్, న; విజ్ఞానమాత్రత్వాత్ సంక్రమణస్య। న జలూకాదివత్ సంక్రమణమిహోపదిశ్యతే; కిం తర్హి, విజ్ఞానమాత్రం సంక్రమణశ్రుతే రర్థః। నను ముఖ్యమేవ సంక్రమణం శ్రూయతే—ఉపసంక్రామతీతి ఇతి చేత్, న; అన్నమయే అదర్శనాత్। న హి అన్నమయముపసంక్రామతః బాహ్యాదస్మాల్లోకాత్ జలూకావత్ సంక్రమణం దృశ్యతే, అన్యథా వా। మనోమయస్య బహిర్నిర్గతస్య విజ్ఞానమయస్య వా పునః ప్రత్యావృత్త్యా ఆత్మసంక్రమణమితి చేత్, న; స్వాత్మని క్రియావిరోధాత్। అన్యోఽన్నమయమన్యముపసంక్రామతీతి ప్రకృత్య మనోమయో విజ్ఞానమయో వా స్వాత్మానమేవోపసంక్రామతీతి విరోధః స్యాత్। తథా న ఆనన్దమయస్య ఆత్మసంక్రమణ ముపపద్యతే। తస్మాత్ న ప్రాప్తిః సంక్రమణమ్; నాపి అన్నమయాదీనామన్యతమకర్తృకం పారిశేష్యాదన్నమయాద్యానన్దమయాన్తాత్మవ్యతిరిక్త కర్తృకం జ్ఞానమాత్రం చ సంక్రమణముపపద్యతే। జ్ఞానమాత్రత్వే చ ఆనన్దమయాన్తః స్థస్యైవ సర్వాన్తరస్య ఆకాశాద్యన్నమయాన్తం కార్యం సృష్ట్వా అనుప్రవిష్టస్య హృదయగుహాభిసంబన్ధాదన్నమయాదిషు అనాత్మసు ఆత్మవిభ్రమః సంక్రమణాత్మక వివేక విజ్ఞానోత్పత్త్యా వినశ్యతి। తదేతస్మిన్నవిద్యావిభ్రమనాశే సంక్రమణశబ్ద ఉపచర్యతే; న హి అన్యథా సర్వగతస్య ఆత్మనః సంక్రమణముపపద్యతే। వస్త్వన్తరాభావాచ్చ। న చ స్వాత్మన ఏవ సంక్రమణమ్। న హి జలూకా ఆత్మానమేవ సంక్రామతి। తస్మాత్ సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మేతి యథోక్తలక్షణాత్మప్రతిపత్త్యర్థమేవ బహు భవనసర్గప్రవేశరసలాభాభయసంక్రమణాది పరికల్ప్యతే బ్రహ్మణి సర్వవ్యవహారవిషయే; న తు పరమార్థతో నిర్వికల్పే బ్రహ్మణి కశ్చిదపి వికల్ప ఉపపద్యతే। తమేతం నిర్వికల్పమాత్మానమ్ ఏవం క్రమేణోపసంక్రమ్య విదిత్వా న బిభేతి కుతశ్చన అభయం ప్రతిష్ఠాం విన్దత ఇత్యేతస్మిన్నర్థేఽపి ఏషః శ్లోకః భవతిః సర్వస్యైవ అస్య ప్రకరణస్య ఆనన్దవల్ల్యర్థస్య సంక్షేపతః ప్రకాశనాయ ఏష మన్త్రో భవతి॥

ఇతి అష్టమానువాక భాష్యమ్॥

టీక: ౧. అస్మాత్ = ఈ పరబ్రహ్మము వల్లనుండి (పుట్టిన). భీషా = భయము చేత. వాతః = వాయువు, పవతే = వీచుచున్నది. సూర్యః = సూర్యుడు, భీషా = (ఆ పరమాత్మవల్లనుండి పుట్టిన) భయముచేత, ఉదేతి = ఉదయించుచున్నాడు. అగ్నిః చ = అగ్నియును, ఇంద్రః చ = ఇంద్రుడును. అస్మాత్ = ఈ పరమాత్మ

వల్లనుండి అయిన, భీషా = భయముచేతనే (ప్రవర్తించుచున్నారు), పంచమః = అయిదవవాఁడగు, మృత్యుః = మృత్యుదేవతయు, ధావతి = (స్వకార్యమునందు ఆత) వల్లనుండి కలిగిన భయముచేతనే) వ్యాపృతుఁడగుచున్నాఁడు.

౨. ఆనందస్య = ఆయానందముయొక్క, సా = ఆ, ఏషా = ఈ, మీమాంసా = విచారణ, భవతి = అగుచున్నది. యువా = యౌవనముగల వాఁడును, సాధుయువా = యువానుఁడై సాధుత్వము కలిగియుండువాఁడును, అధ్యాయకః = వేదాధ్యయన మొనర్చినవాఁడును, ఆశిష్ఠః = భోగ్యవస్తువులను సకాలమునం దనుభవించువాఁడును, ద్రఢిష్ఠః = దృఢతముఁడును, బలిష్ఠః = బలవత్తముఁడును, స్యాత్ = కలిగియుండవలయును, తస్య = ఇట్టి దేహదార్ఢ్యాదికము గలవానికి. ఇయం పృథివీ = ఈ భూమి, సర్వా = అంతయు, విత్తేన = దృష్టాదృష్టరూపమగు ఉపభోగసాధనముచేత, పూర్ణా = పూర్ణమయినది, స్యాత్ = అగును. (అట్టివానికిఁగల, యః = ఏ, ఆనందము గలదో) సః = ఆ, ఏకః = ఒకటియగు. ఆనందః = ఆనందము, మానుషః = మానుషమగును. (అనఁగా సార్వభౌమునకుఁగల ఆనందము ఒక మానుషానందము.)

౩. తే = ఆ (సార్వభౌమనిష్ఠములగు) మానుషాః = మనుష్య సంబంధములగు, ఆనందాః = ఆనందములు, శతం = నూరుసంఖ్య గలవి, యే = ఏయవి (గలవో), సః = ఆ యానంద సమూహము, మనుష్య గంధర్వాణాం = మనుష్య గంధర్వులకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందమగుచున్నది.

అకామహతస్య = కామముచేత హతుఁడుకాని. శ్రోత్రియస్యచ = శ్రోత్రియునకును (అట్టి యానందము కలుగుచున్నది.)

౪. మనుష్యగంధర్వాణాం = మనుష్య గంధర్వులయొక్క, తే = ఆ ఆనందాః = ఆనందములు, శతం = నూరు సంఖ్య గలవి, యే = ఏయవిగలవో. సః = ఆ యానంద సమూహము, దేవ గంధర్వాణాం = దేవ గంధర్వులకు. ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగును).

అకామహతస్య = కామముచేత హతుఁడు కాని, శ్రోత్రియస్య చ = శ్రోత్రియునకును (ఇట్టి యానందము కలుగుచున్నది.)

౫. దేవగంధర్వాణాం = దేవ గంధర్వులయొక్క, తేః = ఆ, ఆనందాః = ఆనందములు, శతం = నూరు సంఖ్యగలవి, యే = ఏయవిగలవో. సః = ఆ యానంద సమూహము, చిరలోకలోకానాం = చిరలోక లోకులను. పితౄణాం = పితరులకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగును).

అకామహతస్య = కామముచేత హతుఁడుకాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియు నకును (ఇట్టి యానందము కలుగుచున్నది.)

౬. చిరలోక లోకానాం = చిరలోక లోకులను, పితౄణాం = పితరులకు, తే = ఆ, ఆనందాః = ఆనందములు, శతం = నూరు సంఖ్యగలవి, యే = ఏయవిగలవో, సః = ఆ యానంద సమూహము, ఆజానజానాం = ఆజానజులగు, దేవానాం = దేవతలకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగును).

అకామహతస్య = కామముచేత హతుఁడుకాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియు నకును (ఇట్టి యానందము కలుగును.)

౭. ఆజానజానాం = ఆజానజులగు, దేవానాం = దేవతలకు, తే = ఆయానంద ములు, శతం = శతసంఖ్య గలవి, యే = ఏయవిగలవో, సః = ఆ యానంద సమూ హము, కర్మదేవానాం = కర్మదేవులగు, దేవానాం = దేవతలకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగును.)

అకామహతస్య = కామముచేత హతుఁడుకాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియు నకును (ఇట్టి యానందము కలుగును.)

౮. కర్మదేవానాం = కర్మదేవులగు, దేవానాం = దేవతలకు, తే = ఆయానంద ములు, శతం = శతసంఖ్య గలవి, యే = ఏయవిగలవో, సః = ఆ యానంద సమూ హము, దేవానాం = దేవతలకు, ఏకః = ఒకటియగు. ఆనందః = ఆనందమగును.

అకామహతస్య = కామముచేత హతుఁడు కాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియున కును (ఇట్టి యానందము కలుగును).

౯. దేవానాం = దేవతలయొక్క, తే = ఆ యానందములు, శతం = శత సంఖ్యగలవి, యే = ఏయవి గలవో, సః = ఆ యానంద సమూహము, ఇంద్రస్య = ఇంద్రునకు. ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగును).

అకామహతస్య = కామముచేత హతుఁడు కాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియున కును (ఇట్టి యానందము కలుగును).

౧౦. ఇంద్రస్య = ఇంద్రునియొక్క, తే = ఆ యానందములు, శతం = శత సంఖ్యగలవి, యే = ఏయవి గలవో, సః = ఆ యానంద సమూహము, బృహస్పతేః = బృహస్పతికి, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందము (అగుచున్నది).

అకామహతస్య = అకామహతుఁడగు, శ్రోత్రియస్యచ = శ్రోత్రియునకును (ఇట్టి ఆనందము కలుగుచున్నది).

౧౧. బృహస్పతేః = బృహస్పతియొక్క, తే = ఆ యానందములు, శతం = శత సంఖ్య గలవి, యే = ఏయవిగలవో, సః = ఆ యానంద సమూహము, ప్రజాపతేః = త్రైలోక్యశరీరుఁడగు విరాట్పురుషునకు, ఏకః = ఒకటియగు, ఆనందః = ఆనందమగుచున్నది.

అకామహతస్య = కామముచేత హతుఁడు కాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియునకును (ఇట్టి యానందము కలుగుచున్నది).

౧౨. ప్రజాపతేః = విరాట్పురుషునియొక్క, తే = ఆ యానందములు, శతం = శతసంఖ్యగలవి, యే = ఏయవిగలవో, సః = ఆ యానంద సమూహము, బ్రహ్మణః = హిరణ్యగర్భునకు, ఏకః = ఒకటియగు. ఆనందః = ఆనందము (అగుచున్నది).

అకామహతస్య = కామముచేత హతుఁడు కాని, శ్రోత్రియస్యచ = శ్రోత్రియునకును (ఇట్టి యానందము కలుగుచున్నది).

౧౩. పురుషే = పురుషునియందు, అయం = ఈ యానంద స్వరూపమగు పరమాత్మ, యః = ఎవఁడో, సః చ = వాఁడును. యః చ ఆదిత్యే = ఎవ్వఁడు సూర్యునియందున్నాఁడో, సః చ = వాఁడును, ఏకః = ఒక్కఁడే.

౧౪. యః = ఎవ్వఁడు, ఏవంవిత్ = ఈ విధముగా తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, అస్మాత్ = ఈ, లోకాత్ = లోకము నుండి, ప్రేత్య = మఱలి (విషయములం దపేక్షలేనివాఁడై). ఏతం = ఈ, అన్నమయం = అన్నమయుఁడగు. ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు. ఏతం = ఈ, ప్రాణమయః = ప్రాణమయుఁడగు, ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు. ఏతం = ఈ, మనోమయం = మనోమయుఁడగు. ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు. ఏతం = ఈ, విజ్ఞానమయం = విజ్ఞానమయుఁడగు, ఆత్మానం = ఆత్మను, ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు ఏతం = ఈ, ఆనందమయం = ఆనందమయుఁడగు, ఆత్మానం = ఆత్మను. ఉపసంక్రామతి = పొందుచున్నాఁడు.

౧౫. తత్ అపి = ఆ విషయమును గూర్చి, ఏషః శ్లోకః = ఈ మంత్రము, భవతి = అగుచున్నది.

తా. ఈ పరబ్రహ్మమునకు భయంపడియే వాయువు వీచుచున్నాఁడు. సూర్యుఁడుదయాస్తమయము లందుచున్నాఁడు. అగ్నియు ఇంద్రుఁడును భయంపడియే తమ తమ కృత్యముల నిర్వహించుచున్నారు. ఐదవవాఁడగు మృత్యువు పైతము ఆయుస్సు క్షీణించినవాని సమీపమునకుఁ బోయి తన లోకమునకు వారిని కొంపోవుచున్నాఁడు.

పూజ్యతములగు వాయువు అగ్ని మున్నగువారలు సైతము తాము స్వయముగ జగదీశ్వరులయినను, 'వీచుట ప్రకాశించుట' మున్నగు ఆయాసకరము అగు కార్యములందు నియతముగ ప్రవర్తించుచున్నారు. వారట్టి భీతితో చరించుటకు కారణము తమ కంటే మిన్నయై తమ్ము శాసించునట్టి బ్రహ్మమను ఒక వస్తు వుండుటచేతనే గదా. రాజును గాంచి భృత్యు లేవిధముగా భయంపడుదురో (అట్లే బ్రహ్మమును గాంచి వీరున్నూ భయంపడుచున్నారు).

ఏ బ్రహ్మమువల్ల నుండి భయంపడి వాయ్వాదులు తమ తమ కృత్యముల నొనర్చుచున్నారో, అట్టి భయకారణమయిన ఆనందాత్మక బ్రహ్మము ఏదిగలదో ఆ బ్రహ్మముయొక్క ఆనందముయొక్క వివర మిచట మీమాంస చేయఁబడుచున్నది.

ఆనందమును గుఱించి ఏమి విచారించవలసి యున్నది?

చెప్పెదను వినుఁడు. (బ్రహ్మస్వరూపమని చెప్పఁబడిన) ఆ యానందము లౌకికానందమువలె విషయ విషయి సంబంధముచేత జనించెనా? లేక స్వాభావికమా? అను విషయమే ఇచట మీమాంస్యము.

లౌకికమగు ఆనందము బాహ్యసాధనము (అగు విషయము)ల యొక్కయు, ఆధ్యాత్మిక సాధనము (అగు యౌవనాదికము) యొక్కయు, మేలనముచేత మిన్నయయియుండును. బ్రహ్మనంద మిట్టిదని ఊహించుటకుఁగాను లౌకికానందమవ ఇట్టిదని మొదట నిర్దేశింపఁబడుచున్నది. సుప్రసిద్ధమగు ఈ లౌకికానందముచేత విషయ నివృత్తి నందిన బుద్ధిచేత పొందఁదగిన బ్రహ్మానందము ఊహింప శక్యమగుచున్నది.

ఆనంద మనఁగా బ్రహ్మానందమే. ఆ యానందముయొక్క అంశయే లౌకికానందమున్నూ అగుచున్నది. అవిద్యతోటి సంబంధము దృఢమగుచున్నకొలది విజ్ఞానము తగ్గుచుండును. ఆ యా విషయములు సాధనములు వీని సంబంధముచేత ఆనంద మొకప్పుడు ప్రాదుర్భవించి సాధనవైకల్య సమయమున నశించుచు లౌకికానందమగుచున్నది. అవిద్య, కామము, కర్మలు వీనియొక్క ప్రాబల్యము తగ్గినకొలఁదియు క్రమ క్రమముగ ఆ యానందము మానుషానంద, మనుష్యగంధర్వానందాది హిరణ్యగర్భానందాంతము ఉత్తరోత్తరము ఆనందాభివృద్ధి నందుట ఇచట చెప్పఁబడినది. ఇట్టి యానందము, అకామహతుఁడును, శ్రోత్రియుఁడును అగు బ్రహ్మవేత్తకే అనుభవసిద్ధము. అవిద్యతోటి సంబంధము ఏమాత్రము లేనిదియే స్వాభావికమగు పరిపూర్ణానందము. ఇట్టి యానందమే అద్వైతము. విద్యచేత

అవిద్యాకృతమును, విషయ విషయి విభాగము గలదియు నగు ఆనందము నిరాకృత మయినది అగుచుండఁగా స్వాభావికమయినట్టియు, పరిపూర్ణమైనట్టియు, ఏకమైనట్టియు, అద్వైతమయినట్టియు ఆనంద మేర్పడునని ప్రతిపాదింపఁదలఁచి వివరించు చున్నాఁడు.

పరబ్రహ్మము ఆనందస్వరూపుఁడు కావున అట్టి యానంద మిట్టిదిగా నుండు నని యూహించుటకుఁగాను లౌకికమగు మానుషానందమును దృష్టాంతముగ గనం బఱచి అట్టి మానుషానందము కంటె ౧౦౦ మడుంగులు మనుష్యగంధర్వానంద మనియు, మనుష్యగంధర్వానందము కంటె ౧౦౦ వంతులు అధికముగ దేవగంధర్వానంద మనియు ఇటుల క్రమముగ వివరింపఁబడుచున్నది.

(మానుషానంద మిట్టిదని తెలుపుటకుఁగాను శ్రీశంకరానందులవారు ఆత్మపురాణమునం దిటుల వచించి యున్నారు:—

శ్లో. యౌవనేనాభిసంపన్నో రూపశీలాదిసంయుతః,
పురాణన్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రితాః. ౨౭౭

వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ,
సర్వాణ్యేతాన్యధీయాన ఊహాపోహవిశారదః. ౨౭౮

మాత్రా పిత్రా తథాఽఽచార్యైః శిక్షితో వినయాన్వితః,
వజ్రసారసమానాఙ్గో బలవాన్ బలభి ద్యథా. ౨౭౯

తస్యేయం పృథివీ సర్వా సప్తసాగరమేఖలా,
సశైలైః ర్వీరుత్తైశ్చ సంపూర్ణా నాభికాంచనపర్వతా.
స్వాధీనా చే ద్భవే త్సోఽయ మానందో మానుషః పరః. ౨౮౦)

౧. మానుషానందము

౧. యువ యనఁగా మంచి యౌవనము గలవాఁడు. సాధు యువ యనఁగా సాధువయిన యువకుఁడని యువకునకు సాధుశబ్దము విశేషణము. యువకుఁడయి అసాధువు కావచ్చును, సాధువయి అయువకుఁడు కావచ్చును. అట్టి విభేదమును తొలగించుటకు 'సాధుయువ' యని చెప్పఁబడినది. అధ్యాయకుఁ డనగా అధీత వేదుఁడు—సాంగాధ్యయన మొనర్చినవాఁడు. ఆశిష్ఠ డనఁగా ఎట్టిపని నైనను అవలీలగా త్వరలో చేయువారిలో శ్రేష్ఠుఁడు. ఇట్లే ద్రఢిష్ఠుఁడు, బలిష్ఠుఁడు, యౌవనము కలిగి మంచిప్రవర్తనము గలఁవాడై దేహసంబంధములగు రోగములుగాని, మన

స్వంబంధములగు అధులఁగాని, లేక విద్వాంసుఁడై బలిష్ఠుఁడయి జగమునంతయు ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలునట్టి సార్వభౌమునకు గల యానందము ఒక మానుషానంద మనంబడును.

## ౨. మనుష్యగంధర్వానందము

౨. ఇట్టి మానుషానందమునకు నూరు మడుంగులు ఆనందము మనుష్యగంధర్వుల యానందము. మనుష్యగంధర్వు లనఁగా మనుష్యులయి యుండి తా మాచరించిన పుణ్యకర్మలచేతను యోగబలముచేతను గంధర్వత్వమును పొందిన వారలు. వారు మనుష్యులవలె పరిమితశక్తులు కాక అంతర్ధాన, ఆకాశగమనాది శక్తులు కలిగియుందురు. కామరూపు లగుటచేత వారికి సాధారణముగ ప్రతిఘాతము లేమియు నుండఁజాలవు ఒకవేళ సంభవించినను ద్వంద్వప్రతిఘాతశక్తి సాధన సంపత్తి కలిగి యుందురు. అనఁగా కష్టములు వచ్చిన వానిని నివారించుకొనుటకు తగిన సామర్థ్యము కలిగియుందురు. సుఖసాధనము లెన్ని గలవో ఆ సాధనముల నన్నిటిని సమగ్రముగఁ గలిగియుందురు. మనుష్యగంధర్వునకు ఇట్టి సాధన సంపత్తి యుండును కావున వానికి చిత్తప్రసాద ముండును చిత్తప్రసాదమువలన సుఖవిశేషాభివ్యక్తి కలిగి యుండును. ఇట్టి మనుష్యగంధర్వునకు ఎట్టి ఆనందము గలదో అట్టి యానందము అకామహతుఁడగు శ్రోత్రియున కుండును. అకామహతుఁ డనఁగా—మనుష్య విషయకమయిన విషయభోగములం దాసక్తి లేనివాఁడు. శ్రోత్రియుఁ డనఁగా సాంగవేదాధ్యేత. సాంగవేదాధ్యేతయై విషయభోగాసక్తి లేని విప్రుని యొక్క ఆనందము మనుష్యగంధర్వానందముతో సమానమై యుండును. ఇచట 'సాధుయువాఽధ్యాయకః' అనునదియు గ్రహింపఁబడును, అనఁగా శ్రోత్రియుడును, పాపాచరణము లేనివాఁడును అని గ్రహించునది. 'శ్రోత్రియస్య చాకామహతస్య' అను వాక్యము, మనుష్యగంధర్వాది హిరణ్యగర్భాంతానందముల చివర వఱకు అనువృత్త మగుచున్నది. కావున సర్వత్ర 'సాధుయువాఽధ్యాయకః' అను విశేషణమును—అనఁగా శ్రోత్రియత్వ అపాపిత్వములు గలవాఁడు అనియు అనువృత్తము చేసుకొనవలయును.

## 3. దేవగంధర్వానందము

౩. ఇట్టి మనుష్య గంధర్వులకు గల ఆనందమునకు నూరింతలయిన ఒక దేవగంధర్వుని యానందమగును. సాధుయువయగు అకామహతశ్రోత్రియునకు కూడ

ఇట్టి యానంద ముండును. ఇట్లే సర్వత్ర గ్రహించునది. దేవగంధర్వుఁ డనగా సృష్టికాలమునందే దేవలోకమునందు గంధర్వుఁడై జన్మించినవాఁడు.

### ౪. చిరలోక లోకపిత్రానందము

౪. ఇట్టి దేవగంధర్వులకుఁ గల ఆనందమునకు నూరింతలయిన చిరలోక లోకుఁడగు ఒక పితరుని యానంద మగును, చిరలోకలోకుఁ డనఁగా చిరకాల ముండునట్టి లోకమును గాంచెడివాఁడు.

### ౫. ఆజానజదేవానందము

౫. అట్టి చిరలోకలోకులగు పితరుల యానందమునకు నూరింతలయిన ఒక ఆజానజుఁడగు దేవవిశేషముయొక్క ఆనందమగును. ఆజానజ మనఁగా పితృలోకముకంటె ఊర్ధ్వభాగమునందున్న దేవలోకవిశేషము. ఆ లోకమునం దుత్పన్నులయిన వారలు ఆజానజులు. స్మార్తకర్మవిశేషాచరణముచేత దేవలోకమునందు పుట్టినవారలని శంకరభాష్యమునందు గలదు.

### ౬. కర్మదేవానందము

౬. అట్టి ఆజానజులగు దేవతల యానందమునకు నూఱింతలయిన యానందము ఒక్క కర్మదేవునియొక్క యానందమగును. ఆజానజదేవభోగముకంటె మిక్కుటమగు భోగమును పొందుటకయి వైదికమగు అగ్నిహోత్రాదికము ననుష్ఠించినవారలు కర్మదేవులు.

### ౭. దేవానందము

౭. అట్టి కర్మదేవుల యానందమునకు నూరింతలయిన ఒక దేవతయొక్క యానందమగును. దేవత లనఁగా హవిర్భుక్కులగు 33 రు దేవతలు.

### ౮. ఇంద్రానందము

౮. అట్టి దేవతలకుఁ గల యానందమునకు నూరింతలయిన ఒక ఇంద్రుని యొక్క యానందమగును. ఇంద్రుఁ డనఁగా దేవతలకు ప్రభువు.

### ౯. బృహస్పత్యానందము

౯. అట్టి ఇంద్రునకుఁ గల యానందమునకు నూరింతలయిన ఒక బృహస్పతియొక్క ఆనందమగును. బృహస్పతి యనఁగా ఇంద్రునకు ఆచార్యుఁడు.

## ౧౦. ప్రజాపత్యానందము

౧౦. అట్టి బృహస్పతికిఁ గల యానందమునకు నూరింతలయిన ప్రజాపతి యొక్క ఆనందమగును. ప్రజాపతి యనఁగా త్రైలోక్యశరీరుఁడగు విరాట్పురుషుఁడు.

## ౧౧. హిరణ్యగర్భానందము

౧౧. అట్టి విరాట్పురుషునకుఁ గల యానందమునకు నూరింతలయిన ఒక హిరణ్యగర్భానంద మగును. ఇచట హిరణ్యగర్భుఁ డనఁగా వ్యష్టిసమష్టి రూపుఁడగు సూత్రాత్మ. ఇతఁడే శరీరులలో ప్రథముఁడు. 'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే' అని వేదము చెప్పుచున్నది గదా.

ఈ విధముగా ఆనందతారతమ్యము ౧౧ పర్యాయములుగా చెప్పఁబడి యున్నది. ప్రథమపర్యాయమునందు మాత్రము 'శ్రోత్రియస్యచాకామహతస్య' అను వాక్యము శంకరభాష్యానుసారము లేదుగాని తక్కిన ౧౦ పర్యాయములందును ఈ వాక్యము తప్పక అంతమునందు చేరియే యున్నది. కొందఱు మొట్టమొదట కూడ 'శ్రోత్రియస్యచాకామహతస్య' అని పఠించుచున్నారు.

(మొట్టమొదట మానుషానందమును చెప్పినప్పుడు 'శ్రోత్రియస్యచాకామహతస్య' అను వాక్యము ఏల చెప్పఁబడియుండలేదనుటకు సమాధానము:-శ్రోత్రియుఁడును, సదాచారశీలుఁడును, కోరికలు లేనివాఁడును అగువానియొక్క ఆనందము, మానుషానందముకంటె నూరంతలు ఎక్కువ యని తెలుపుటకుఁ గాను ప్రథమ పర్యాయమున 'శ్రోత్రియస్యచాకామహతస్య' అను వాక్యము ప్రయోగింపఁబడి యుండలేదు.

మనుష్య గంధర్వులకు ఎట్టి యానందము గలదో అట్టి యానందము 'సదాచారశీలుఁడును అకామహతుఁడును అగు శ్రోత్రియునకుఁ గలుగుచున్నది.' ఇట్లే దేవ గంధర్వులకును, చిరలోక లోకపితరులకును, ఆజానజదేవులకును, కర్మదేవుల కును, దేవతలకును, ఇంద్రునకును. బృహస్పతికిని, ప్రజాపతికిని, హిరణ్యగర్భున కును ఎట్టి యానందము గలదో అట్టి యానందము 'సాధువును. అకామహతుఁడును అగు శ్రోత్రియునకుఁ గలుగును' అను తలంపుతో మనుష్య గంధర్వానందాది వాక్య ములకు చివర 'శ్రోత్రియస్యచాకామహతస్య' అను వాక్యము చేర్పఁబడియున్నది.)

కాని ఇచ్చట మనుష్యగంధర్వానందముకంటె దేవగంధర్వానందము ౧౦౦ తలు అధికమనియు, దేవగంధర్వానందము నూరంతలు చిరలోక లోకపితరుల యానందము అధికమనియు, ఉత్తరోత్తరము, వృద్ధిగా చెప్పఁబడి యుండఁగా

అకామహతశ్రోత్రియానందము మనుష్యగంధర్వాద్యానందముతో సమాన మెట్లగు? నను సంశయము కలుగుట న్యాయ్యమగుచున్నది. ఇందులకు సమాధాన మేమనఁగా:—అకామహతత్వమునందు తరతమ భావములుండునని తలంచవలయును. మానుషానందపర్యాయమున చెప్పఁబడిన శ్రోత్రియునకు మానుషానందమునందు తుచ్ఛత్వబుద్ధితో కోరిక లేనివాఁడనియు, దేవగంధర్వానందపర్యాయమున చెప్పఁబడిన శ్రోత్రియునకు మనుష్య గంధర్వానందము నందు తుచ్ఛత్వబుద్ధి కలిగి దాని యందు కోరిక లేనివాఁడనియు ఇటుల హిరణ్యగర్భానంద పర్యాయము వఱకు గ్రహించునది.

ఆనందము ననుభవించుటకు సాధనములు—సదాచారము, అకామహతత్వము శ్రోత్రియత్వము అని మూఁడు చెప్పఁబడినవి. సదాచారశ్రోత్రియత్వములు మాత్రము ౧౦ పర్యాయములు చెప్పఁబడినవారికి సమానములే.

'అకామహతత్వము' మాత్రము అవిద్యాసంబంధము యొక్క తరతమభావము ననుసరించి ప్రథమపర్యాయమునందు గల శ్రోత్రియునికంటె ద్వితీయ పర్యాయము నందుఁగల శ్రోత్రియునకు అవిద్యాసంబంధము స్వల్పమనియు, అంతకంటె తృతీయ పర్యాయ పఠితశ్రోత్రియునకు అవిద్యాసంబంధము తక్కువ యనియు ఇట్లే క్రమ ముగ నెఱుంగవలయును.

ఇటుల క్రమక్రమముగ శతగుణాధికముగ హిరణ్యగర్భానందము వఱకు చెప్పఁబడిన ఆనందముకంటె శ్రేష్ఠమగు బ్రహ్మానందము యేది గలదో, అది వాఙ్మనస్సులకు కూడ అగోచరము కావున భగవతి యగు శ్రుతి సముద్రతుల్యమగు బ్రహ్మానందమునందు బిందువుతో సమానమగు హిరణ్యగర్భానంద మిట్టిదని మనకు సూచించి అంతకంటె విస్పష్టముగ సూచించుటకు అశక్యమని ఉపరమించినది. సముద్రమునకు సముద్రజలబిందువునకు అభేద మెట్లు లోకప్రసిద్ధియో అట్లే ఇక్కడ ఆనందమునకు ఆనందికి అభేదమును గ్రహించునది.

అట్టి హిరణ్యగర్భానందముకంటె అధికమగు ఆనందమే స్వరూపముగాఁగల స్వప్రకాశమానుఁడును, పంచకోశాత్మకుఁడును అగు పురుషుని యందు బ్రహ్మ పుచ్ఛశబ్దవాచ్యుఁడై యున్నవాఁడును, ఆదిత్యమండలాంతర్వర్తియై యున్నవాఁడును ఒక్కఁడే. ఇట్టి యభేదమగు బ్రహ్మానందమును అనుభవముగా నెఱింగిన విద్వాం సుఁడు అన్నమయాత్మను పొందుచున్నాఁడు. ఇట్లే ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాత్మలను పొందుచున్నాఁడు అని శ్రుతి బోధించుచున్నది.

శ్రుతియందుఁ గల 'ఉపసంక్రామతి' అను శబ్దమునకు 'పొందుట' అను అర్థమును పరిగ్రహించినయెడల ఆత్మవేఱు, ఆత్మను పొందువాఁడు వేఱు అను విరోధము ఏర్పడుచున్నది. కావున అన్నమయాదికములగు అనాత్మలయందు కలిగిన అవిద్యా విభ్రమము నశించుటయే ఇచట సంక్రమణ శబ్దార్థముగ గ్రహించుట యుక్తము.

ఆనందమీమాంసాఫలము ఉపసంహరింపఁబడుచున్నది:—

'స యశ్చాయం పురుషే' అను మంత్రమునందుగల 'సః యః' అను పదములయొక్క అర్థ మేమనఁగా—ఎవ్వఁడు పరమవ్యోమ యనంబడు హృదయ కమలాంతర్వర్తి యగు గుహయందున్నవాఁడయి, ఆకాశాదికమును అన్నమయాంత మును అగు కార్యజాతమును సృజించి ఆ కార్యమునందు తానే ప్రవేశించి యున్నాఁడో, అతఁడే ఇచట నిర్దేశింపఁబడుచున్నాఁడు. అతఁ డెవ్వఁడు?

ఈ పురుషునియం దెవ్వఁ డున్నాఁడో, ఎవ్వఁ డీ గనంబడుచున్న ఆదిత్యుని యం దున్నాఁడో, పరమానందస్వరూపభూతుఁడుగను, శ్రోత్రియ ప్రత్యక్షుఁడుగను ఎవ్వఁడు నిర్దేశింపఁబడి యున్నాఁడో, ఏ పరమానందముయొక్క ఏకదేశమును సుఖార్హమగు బ్రహ్మదిభూతజాత మనుభవించుచున్నదో, అతఁడే 'యశ్చాసావాదిత్యే' అని నిర్దేశింపఁబడుచున్నాఁడు. ఈ పురుషునియం దున్నవాఁడున్నూ, ఆదిత్యమండ లాంతర్వర్తియగువాఁడున్నూ, భిన్నప్రదేశములందున్న ఘటాకాశ మహాకాశముల వలె ఏకమేగాని వేఱు కాదు.

శంక:—ఆత్మను నిర్దేశించునప్పుడు వివరమును చెప్పక ఊరక 'సయ శ్చాయం పురుషే' అని దేహమునందున్న పురుషుఁడని నిర్దేశించి చెప్పుట యుక్త ముగా లేదు. 'య శ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః' అని చెప్పిన యుక్తముగా ఉండును. (ఉపనిషత్తులందు పలుతావుల యోఽయందక్షిణేఽక్షన్పురుషః. బృ. ౨. ౩. ౫. అని చెప్పఁబడి యుండుట) ప్రసిద్ధిగా ఉన్నది గదా.

సమా:—అట్లనరాదు. ఇదిపరాధికారము — అనఁగా ఇచట వివక్షితుఁడు పరుఁడగు ఆత్మగాని అపరబ్రహ్మ కాదు. "అదృశ్యేఽనాత్మ్యే; భీషాఽస్మాద్వాతః పవతే; సైషాఽఽనందస్య మీమాగ్ంసాభవతి" మున్నగు శ్రుతులు పరమాత్మను గూర్చియే ప్రతిపాదించుచున్నవి. ఇట్టి సందర్భమునందు మధ్యలో సోపాధికబ్రహ్మ మును గూర్చి చెప్పుట సంగతముగా నుండదుగదా. పరమాత్మవిజ్ఞానము ప్రకృత మగుటచేత 'సః ఏకః' అని పరమాత్మయే ఇట చెప్పఁబడినాఁడు.

శంక:—ఇచ్చట ఆనందమీమాంస ప్రకృతము. కావున ఆ యానందమీమాంస ఇచట ఉపసంహరింపఁబడవలసి యున్నది. అభిన్నస్వాభావికానందమే పరమాత్మ. విషయ విషయిసంబంధ జనితమయిన ఆనందము పరమాత్మ కాఁజాలదు.

"స యశ్చాయం పురుషే, యశ్చాసావాదిత్యే, స ఏకః" అను శ్రుతి భిన్నాధికరణములందున్న విశేషణములను నిరసించి 'ఈ పురుషుని యందు ఎవ్వఁ డున్నాఁడో, ఆదిత్యునియందున్నూ ఎవ్వఁ డున్నాఁడో, వారిద్దఱు ఒకఁడే యని స్పష్టముగా తెలిపినది.

శంక:—కాని 'యశ్చాసావాదిత్యే, స ఏకః' అని ఆదిత్యుని గ్రహించుట యుక్తముగా లేదు.

సమాధానము:—అట్లనరాదు. అట్లు చెప్పినది సార్థకమే. ఏలయనఁగా, అట్లు చెప్పుట ఉత్కర్షాపకర్షలు లేవని చెప్పుటకు అని గ్రహించునది. మూర్తామూర్త లక్షణమయిన ద్వైతమునకు, ఆదిత్యమండలాంతర్గతుఁడగు పురుషుఁడు పరమోత్కృష్టుఁడు. అతనితో పోల్చిచూచిన యెడల జీవుఁడు చాల తక్కువయినవాఁడు. పురుషగతమయిన విశేషణమును నిరసించిన యెడల పరమానంద విషయమున ఉభయులు సములగుచున్నారు. అట్టి స్థితికి వచ్చినవానికి ఉత్కర్షాపకర్షలనునవి లేనేలేదు. అందువలన 'అభయం ప్రతిష్ఠాం విందతే' అని శ్రుతి వచించినది యుక్తమే యగుచున్నది.

## పూర్వోత్తర గ్రంథసంగతి

"అస్తి నాస్తి" యను అను ప్రశ్నమును చర్చించి—అనఁగా బ్రహ్మము అనునది ఉన్నదా లేదా యని విచారించి కార్య, రసలాభ, ప్రాణన, అభయ, ప్రతిష్ఠా, భయదర్శనములను ఉపపత్తుల ననుసరించి ఆకాశాదికమునకు కారణభూతమగు బ్రహ్మము గలదని సిద్ధాంతపరచుటచేత (అస్తివా? యను) ఒక ప్రశ్న నిరాకృతమయినది. ఇఁక ౧. విద్వాంసుఁడు బ్రహ్మమును పొందునా? ౨. అవిద్వాంసుఁడు బ్రహ్మమును పొందఁడా? యను రెండు అను ప్రశ్నలు గలవు. విద్వాంసుఁడు బ్రహ్మమును పొందునా? లేక పొందఁడా? యనునది అంత్యమయిన అను ప్రశ్న. అంత్యమయిన అను ప్రశ్నకు సమాధానమును చెప్పినయెడల మధ్యమమయిన అను ప్రశ్నకు సమాధానము చెప్పినట్లే యగును కావున తదర్థము ప్రయత్నించుట లేదు.

ఎవ్వఁడయితే ఈవిధముగా యథోక్తమయిన—అనఁగా సత్యజ్ఞానానంద లక్షణమయిన బ్రహ్మమును ఉత్కర్షాపకర్షలను వదలి అద్వైతము, సత్యము, జ్ఞానము,

అనంతము అగు బ్రహ్మమే నేనయితినని తెలిసికొనుచున్నాఁడో, అట్లు తెలిసికొన్న వాఁడు ఈ లోకము నుండి — అనఁగా దృష్టాదృష్ట ఇష్టవిషయ సముదాయము గల ఈ లోకము నుండి బయలుదేరినవాఁడయి, నిరపేక్షుఁడయి యథావ్యాఖ్యాతమయిన యీ యన్నమయాత్మను ఉపసంక్రమించుచున్నాఁడు—అనఁగా విషయజాతమంతయు అన్నమయాత్మకమగు పిండాత్మకంటె వేఱని తలంపఁడు. అనఁగా స్థూలభూతము నంతయు అన్నమయాత్మనుగాఁ గాంచుచున్నాఁడు. తరువాత ఈ యన్నమయా భ్యంతరుఁడగు ప్రాణమయాత్మనుఁగా అన్నమయుని గాంచుచున్నాఁడు. తదభ్యం తరుఁడగు మనోమయునిగా ప్రాణమయుని గాంచుచున్నాఁడు. తదభ్యంతరుఁడగు విజ్ఞానమయునిగా మనోమయుని చూచుచున్నాఁడు. తదభ్యంతరుఁడగు ఆనందమయు నిగా విజ్ఞానమయునిగా గాంచుచున్నాఁడు. తరువాత 'అదృశ్యే, అనాత్మ్యే, అనిరుక్తే, అనిలయనే, అభయం ప్రతిష్ఠాం విందతే' అను శ్రుతి ప్రమాణానుసారము బ్రహ్మమునందు ప్రతిష్ఠను పొందుచున్నాఁడు.

## ద్వైత, అద్వైతచర్చ

మంత్రమునందుఁ గల ౧. 'ఏవం విత్' అనువాఁ డెవ్వఁడు?

౨. సంక్రమణము నెటుల నొనర్చును?

అనునది విచారించుట ఇట అత్యావశ్యకము.

శంక:—ఇచట సంక్రమించువాఁడు పరమాత్మకంటె భిన్నుఁడయిన మఱొ కఁడా? లేక పరమాత్ముఁడేనా? మీకు ఈ చర్చవలన కలుగఁగల లాభమేమందురా? ఆ విషయమును సావధానముగ వినుఁడు. ఉపసంక్రమించువాఁడు—అనఁగా పొందు వాఁడు పరమాత్మకంటె భిన్నుఁడయిన యెడల అనేక శ్రుతులకు విరోధము ఏర్పడు చున్నది.

శ్రుతులను కొన్నిఁటిని పేర్కొనియెదను:—

౧. తత్సృష్ట్వా। తదేవాను ప్రావిశత్. (తై. ఉ. ౨౬.)
౨. అన్యోఽసావన్యోఽహ మస్మీతి న స వేద. (బృహ. ౧. ౪. ౧౦.)
౩. ఏకమేవాద్వితీయమ్. (ఛాందో. ౬. ౨. ౧.)
౪. తత్త్వమసి. (ఛాందో. ౬. ౮. ౭.)

లేక ఆ పరమాత్మయే 'ఆనందమయ మాత్మాన ముపసంక్రామతి'=ఆనంద మయాత్మను పొందుచున్నాఁడు. అని చెప్పిన యెడల ఒక్కఁడే కర్మగను కర్తగను

ఉండుననుట యుక్తము కాదు. పరమాత్మునకు సంసారిత్వముండునని అంగీకరింప వలసి యుండును, లేదా పరమాత్ముఁడయినను లేకపోవలసివచ్చును. ఇటుల రెండు పక్షములందును—అనఁగా ఉపసంక్రమణకర్త పరుఁడన్నను, జీవుఁడన్నను, దోష మేర్పడుచున్నది కావున పరిహరించుటకు సాధ్యము కాఁజాలదు కావున ఇచట విమర్శించుట వ్యర్థము.

లేక మఱొక పక్షమునందు దోషము లేదందువా? (అనఁగా పరాపరులకు భేద మున్నూ అభేదమున్నూ రెండున్నూ వాస్తవములే అనెడి భాస్కరాదుల యభిప్రాయము ననుసరించి యిట ఆశంక చేయఁబడినది.) ఆ మూఁడవ పక్షమే శాస్త్రార్థము కావున ఇచట విమర్శ అనవసరము.

సమాధానము:—అట్లనరాదు. ఏది శాస్త్రసమ్మతమో దానిని నిర్ణయించుచున్నారము కావున విమర్శ సార్థక మగుచున్నది. ఉపసంక్రమణకర్త పరుఁడా? లేక జీవుఁడా? అను పక్షద్వయమునందున్నూ దోషము సంభవించిన మాట వాస్తవమే. ఈ రెండు పక్షములందున్నూ గనంబడుచున్న దోషమును పరిహరించుట ఆవశ్యక మనుటయు సత్యమే. మూఁడవ పక్షము నిదివఱ కెవ్వరయిన నిర్ణయించి యున్న యెడల మేము మఱల విమర్శించి నిర్ణయించుటకు ప్రారంభించుట వ్యర్థము కావచ్చును, కాని అట్టి నిర్ణయము నిదివఱ కెవ్వరును చేసియుండలేదు కావున తన్నిర్ణయార్థము మేము విమర్శింపఁదలఁచితిమి కావున మేము చేయఁదలఁచిన విమర్శ సార్థకమే గాని నిరర్థకము కాఁజాలదు.

పూర్వ:—వేదప్రతిపాదితమయిన సిద్ధాంతమును నిర్ణయింపఁదలఁచితివి కావున నీవు చేయఁదలఁచిన విమర్శ సార్థకమే కావచ్చును కాని నీవు ఆలోచించి ఏదియో కొంత చెప్పఁగలవు కాని 'ఇదమిత్థ' మని నిర్ణయింపఁజాలవు.

సిద్ధా:—ఏమీ? వేదవచనముల సిద్ధాంతము నిర్ణయించుటకు వలనుపడని దనియా నీ తలంపు.

పూర్వ:—నే నట్లనుటలేదు.

సిద్ధాంతి:—అట్లయితే నీవన్నమాటకు అర్థమేమి?

పూర్వ:—నీకు ప్రతిపక్షు లనేకు లున్నారు. నీ వన్ననో ఒక్క వేదార్థమును మాత్రమే పట్టుకొని పాకులాడునట్టి ఏకత్వవాదివి, ఏకాకివి; నీకు ప్రతిపక్షు లనేకు లున్నారు—వేదబాహ్యులయిన నానాత్వవాదు లనేకులు నీ సిద్ధాంతమును అంగీకరింపకున్నారు, కనుక నీవు నిర్ణయింపలేవని నా యభిప్రాయము.

సిద్ధాంతి:—అట్లనా! నీవు "వేదార్థమాత్రశరణుఁడనైన ఏకత్వవాదినైన నాకు వేదబాహ్యులయిన నానాత్వవాదు లనేకులు ప్రతిపక్షు లున్నారని" చెప్పినాఁడవే, అదియే నాకు పరమసంతోషము, ఫరవాలేదు. వారి నందఱను జయించగలను. ఇఁక విమర్శించుటకు ప్రారంభించెదను.

## ద్వైతము అవిద్యాకృతము కావున అద్వైతమే పరమార్థము

('స ఏవ తు స్యాత్, తద్భావస్యతు వివక్షితత్వాత్' అని భాష్యకారులవారు చర్చను ప్రారంభించిరి. ఇచట భేదపక్షమును, భేదాభేదపక్షమును అవధారణ, తు శబ్దములచేత క్రమముగ నిరాకరించి సిద్ధాంతము చేసి యున్నారు.)

ఇచట తద్భావము వివక్షితము కావున ఉపసంక్రమణకర్త పరుఁడే యగుచున్నాఁడు. మూలమునందు 'బ్రహ్మవిదాప్నోతి పరం' అని చెప్పఁబడియున్నది. తద్విజ్ఞానముచేత పరమాత్మభావము చెప్పఁబడియున్నది. కావున పరమాత్మయే ఇచట గ్రహింపఁబడినటుల ఎఱుంగవలయును.

ఒకఁడు ఇంకొకఁడుగా అగుట లోకమునందు ప్రసిద్ధి లేదుగదా. కనుక పరుఁడే ఇచట వివక్షితుఁడు.

శంక:—బ్రహ్మవేత్తకు బ్రహ్మభావాపత్తి కలుగునని చెప్పుట ఉపపన్నము కాఁజాలదు గదా.

సమా:—ఇందనుపపత్తి ఏమియు లేదు. అవిద్యాకృతమయిన ఆత్మగాని దాని యందు గల అపోహను తీసివేయుటకే ఇట్లు చెప్పఁబడినది—ఇచట బ్రహ్మవిద్యచేత స్వాత్మప్రాప్తి కలుగుచున్నదని ఏయ్యది చెప్పఁబడుచున్నదో, ఆ యాత్మ ప్రాప్తి యనునది ఏమనఁగా అవిద్యాకృతమయిన అన్నాది విశేషములుగల అనాత్మలను ఆత్మనుగా ఆరోపించుకొని యున్నాఁడు కావున, అట్టి అనాత్మలందు ఆత్మబుద్ధిని తొలగించుకొనుటయే "తద్భావాపత్తి" గాని వేఱుకాదు.

శంక:—ఆత్మప్రాప్తి యనఁగా అనాత్మలందు గల ఆత్మభావ నిరసనమే ఇచట ఆత్మప్రాప్తి యనుటకు అర్థమని నీ కెట్లు తెలిసినది?

సమా:—'బ్రహ్మవిత్' అని విద్యామాత్రమునే— అనఁగా తెలిసికొన్నవాఁడని మాత్రమే, శ్రుతి చెప్పుటవలన (ఆత్మప్రాప్తియనఁగా అనాత్మలందుగల ఆత్మభావ నిరసనమే యని తెలియవచ్చుచున్నది) విద్యయొక్క కార్యము అవిద్యానివృత్తి యని సుప్రసిద్ధము, కావున ఇక్కడ ఆత్మప్రాప్తికి విద్యామాత్రము—అనఁగా తెలిసికొనుటయే సాధనముగ ఉపదిష్టమైనది.

శ్రుతియందుఁ గల 'ఉపసంక్రామతి' అను శబ్దమునకు 'పొందుట' అను అర్థమును పరిగ్రహించినయెడల ఆత్మవేఱు, ఆత్మను పొందువాఁడు వేఱు అను విరోధము ఏర్పడుచున్నది. కావున అన్నమయాదికములగు అనాత్మలయందు కలిగిన అవిద్యా విభ్రమము నశించుటయే ఇచట సంక్రమణ శబ్దార్థముగ గ్రహించుట యుక్తము.

ఆనందమీమాంసాఫలము ఉపసంహరింపఁబడుచున్నది:—

'స యశ్చాయం పురుషే' అను మంత్రమునందుగల 'సః యః' అను పదములయొక్క అర్థ మేమనఁగా—ఎవ్వఁడు పరమవ్యోమ యనంబడు హృదయ కమలాంతర్వర్తి యగు గుహయందున్నవాఁడయి, ఆకాశాదికమును అన్నమయాంత మును అగు కార్యజాతమును సృజించి ఆ కార్యమునందు తానే ప్రవేశించి యున్నాఁడో, అతఁడే ఇచట నిర్దేశింపఁబడుచున్నాఁడు. అతఁ డెవ్వఁడు?

ఈ పురుషునియం దెవ్వఁ డున్నాఁడో, ఎవ్వఁ డీ గనంబడుచున్న ఆదిత్యుని యం దున్నాఁడో, పరమానందస్వరూపభూతుఁడుగను, శ్రోత్రియ ప్రత్యక్షుఁడుగను ఎవ్వఁడు నిర్దేశింపఁబడి యున్నాఁడో, ఏ పరమానందముయొక్క ఏకదేశమును సుఖార్థ మగు బ్రహ్మాదిభూతజాత మనుభవించుచున్నదో, అతఁడే 'యశ్చాసావాదిత్యే' అని నిర్దేశింపఁబడుచున్నాఁడు. ఈ పురుషునియం దున్నవాఁడున్నూ, ఆదిత్యమండ లాంతర్వర్తియగువాఁడున్నూ, భిన్నప్రదేశములందున్న ఘటాకాశ మహాకాశముల వలె ఏకమేగాని వేఱు కాదు.

శంక:—ఆత్మను నిర్దేశించునప్పుడు వివరమును చెప్పక ఊరక 'సయ శ్చాయం పురుషే' అని దేహమునందున్న పురుషుఁడని నిర్దేశించి చెప్పుట యుక్త ముగా లేదు. 'య శ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః' అని చెప్పిన యుక్తముగా ఉండును. (ఉపనిషత్తులందు పలుతావుల యోఽయందక్షిణేఽక్షన్పురుషః. బృ. ౨. ౩. ౫. అని చెప్పఁబడి యుండుట) ప్రసిద్ధిగా ఉన్నది గదా.

సమా:—అట్లనరాదు. ఇదిపరాధికారము — అనఁగా ఇచట వివక్షితుఁడు పరుఁడగు ఆత్మగాని అపరబ్రహ్మ కాదు. "అదృశ్యేఽనాత్మ్యే; భీషాఽస్మాద్వాతః పవతే; సైషాఽఽనందస్య మీమాగ్ంసాభవతి" మున్నగు శ్రుతులు పరమాత్మను గూర్చియే ప్రతిపాదించుచున్నవి. ఇట్టి సందర్భమునందు మధ్యలో సోపాధికబ్రహ్మ మును గూర్చి చెప్పుట సంగతముగా నుండదుగదా. పరమాత్మవిజ్ఞానము ప్రకృత మగుటచేత 'సః ఏకః' అని పరమాత్మయే ఇట చెప్పఁబడినాఁడు.

పూర్వ:—జాగ్రత్స్వప్నము లందు అన్యగ్రహణ ముండుటవలన ద్వైతము వాస్తవముగా నున్నది.

సమా:—జాగ్రత్స్వప్నకృతమయిన అన్యవస్తుగ్రహణము అవిద్యాకృతమగుటచేతనే అని గ్రహించవలయును. విద్యాభావము నందు జాగ్రత్స్వప్నము లందు అన్యవస్తుగ్రహణము గనంబడుట లేదు. కావున అన్యవస్తుగ్రహణము మిథ్యాభూతమని గ్రహించవలయును.

ద్వైతాగ్రహణమే ఆత్మకు స్వతస్సిద్ధము

శంక:—సుషుప్తి యందు అన్యాగ్రహణము అవిద్యాకృతము కావచ్చును.

సమా:—అట్లనరాదు, అదియే స్వాభావికము, వికారరహితమయి యుండుటయే పరానపేక్షము కావున అదియే వస్తువుయొక్క తత్త్వము. పరాపేక్షమయి యుండునట్టి వికార మెప్పుడున్నూ యథార్థము కాఁజాలదు. వస్తువుయొక్క తత్త్వ మెప్పటికిన్నీ కారకాపేక్షమయి యుండఁజాలదు. సత్తునకు కారకాపేక్షము విశేష మనంబడును. విశేష మెప్పుడున్నూ వికారమేగాని వాస్తవము కాఁజాలదు. జాగ్రత్స్వప్నము లందు అన్య వస్తుగ్రహణము విశేషము కావున అది వస్తుతత్త్వ మెన్నటికి కాఁజాలదు. అన్యాపేక్షమయినది తత్త్వ మెన్నటికి కాఁజాలదు. కావున స్వాభావిక మగుటచేత జాగ్రత్స్వప్నము లందువలె సుషుప్తి యందు విశేష ముండఁజాలదు.

భేదపక్షమునందు అభయప్రతిష్ఠ లేదు

ఎవరు జీవుని కంటె ఈశ్వరుఁడు—అనఁగా పరమాత్మ వేఱు, జగత్తు వేఱు అని తలంచెదరో వారి కెప్పుడున్నూ భయ నివృత్తి లేనేలేదు. ఏలయనఁగా భయ హేతు వెప్పుడున్నూ అన్యనిమిత్తమే గదా.

శంక:—సాపేక్షమయిన బ్రహ్మమే భయహేతుకము (అనఁగా సత్కర్మల నాచరింపక దుష్కృత్యముల నాచరించిన వానికే ఈశ్వరుఁడు పాపఫలమగు నరకాదిరూపదండనము నొసంగుచున్నాఁడు కావున అట్టివానికి బ్రహ్మము భయహేతువగుటయందు దోష మేమియు లేదు.)

నిరాకరణము:—అట్లనరాదు. ఎట్లయినను ఒకటియే, అధర్మాచరణాది సహాయము నపేక్షించి—అనఁగా నిత్యమో అనిత్యమో అగు కర్మజాతము ననుసరించి వేఱయిన భయకారణము ఉన్నయెడల అప్పటికిన్నీ ఆత్మ లాభము లేదుగదా.

ఏకత్వపక్షమునందీ యనుపపత్తి ఏమియు లేదు. ఏలయనఁగా వారు సని మిత్తమయిన సంసారమును అవిద్యా పరికల్పితమునుగా భావించుచున్నారు కనుక వారికి అనుపపత్తి ఏమియు లేదు. నేత్రరోగముచేత ఒకనికి ద్వితీయచంద్రుఁడు గనంబడెనని తలంచుఁడు. అతఁడు నేత్రరోగ ముపశమించిన తర్వాత చంద్రుఁడొక్కఁడైనాడని తలంచును. అట్టి తైమిరిక దోషదృష్టుఁడగు చంద్రునియొక్క లాభముగాని నాశముగాని వాస్తవముగా లేదుగదా.

## విద్యాఽవిద్యలు ఆత్మ ధర్మములు కావు

పూర్వ:—విద్యావిద్యలు రెండున్నూ ఆత్మధర్మములు.

సిద్ధాంతి:—ప్రత్యక్షము లగుటవలన ఆత్మధర్మములు కాఁజాలవు. ఏలయనఁగా వివేక, అవివేకములు రూపాదికము వలె అంతఃకరణ ధర్మములుగా తెలియఁబడుచున్నవి. ప్రత్యక్షముగా ఉన్న రూపము ద్రష్టృధర్మ మనుట ఉపపన్నము కాఁజాలదు. అవిద్య స్వానుభవముగ నిరూపింపఁబడుచున్నది— నేను మూఢుఁడను, నాకు బాగుగా యీ విషయము తెలియలేదు, (అని అవిద్య నిరూపింపఁబడుచున్నది) అదేవిధముగా విద్యావివేకములు కూడ లోకమునందు స్ఫుటముగ నిరూపింపఁబడుచున్నవి — ఆత్మజ్ఞాన మెఱింగినవాఁ డితరులకు ఆత్మవిద్యను బోధించుచున్నాఁడు. అతఁడు చెప్పినదానిని ఇతరు లెఱుంగుచున్నారు. కనుక (అనఁగా విద్యావిద్యలు ఆత్మధర్మములు కాఁజాలవు కనుక) నామరూప పక్షమునకు చేరినవే విద్యాఽవిద్యలు- (అనఁగా విద్యాఽవిద్యలు నామరూపాంతఃపాతి అయిన అంతఃకరణ ధర్మములే గాని ఆత్మధర్మములు కాఁజాలవు.) నామరూపములు ఆత్మధర్మములు కాఁజాలవని "నామ రూపయో ర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ (ఛాందో. ౮. ౧౪. ౧.) అను శ్రుతి ప్రతిపాదించుచున్నది. ఆ నామరూపములు సూర్యునకు ఉదయాస్తమయముల వలె ఆత్మయందు కల్పితములే గాని పరమార్థముగా లేవు.

## సంక్రమణ మనఁగా విజ్ఞానము

శంక:—అభేదపక్షము నందు "ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి" అని శ్రుతి చెప్పుచున్నది గదా. కర్మకర్తృత్వములు తెలియుచున్నవి గదా, ఇటు లంగీకరించిన అసంగత మగునుగదా.

సమా:—ఇచట సంక్రమణ మనఁగా విజ్ఞాన మాత్రమే; జలూకవలె సంక్రమణము ఇట శ్రుత్యభిప్రేతము కాదు. ఇఁక నేమనఁగా విజ్ఞానమే సంక్రమణ శ్రుతికి తాత్పర్యము.

శంక:—'ఉపసంక్రామతి' అని శ్రుతియందు ముఖ్యమయిన సంక్రమణమే చెప్పఁబడియున్నది గదా.

సమా:—అట్లనరాదు. ముఖ్యసంక్రమణము అన్నమయమునందు కనంబడుట లేదు గదా—బాహ్యమయిన యీ లోకము నుండి (అనఁగా పుత్ర భార్యాది లక్షణమయిన బాహ్యమయిన యీ లోకము నుండి) అన్నమయమును జలూక వలె (జలగ వలె) గాని. మఱొక విధముగాఁగాని ఉపసంక్రమించుట-అనఁగా పొందుట లోకమునందు గనంబడుట లేదుగదా.

శంక:—బహిర్నిర్గతుఁడయిన మనోమయునకు గాని విజ్ఞానమయునకుఁ గాని మఱల వచ్చి ప్రవేశించుటయే ఆత్మసంక్రమణము — (అనునెడల).

నిరాకరణము—అట్లనరాదు. స్వాత్మయందు స్వయముగ ప్రవేశించుట అనునది క్రియావిరోధమగుచున్నది. అన్యుఁడగువాఁడు, అన్యమయిన అన్నమయమును ఉపసంక్రమించుచున్నాఁడు అని ప్రారంభించి మనోమయుఁడుగాని విజ్ఞానమయుఁడుగాని స్వాత్మనే ఉపసంక్రమించుచున్నాఁడు అనుట విరోధమగుచున్నది. అట్లే ఆనందమయునకు ఆత్మసంక్రమణము ఉపపన్నము కాఁజాలదు. కావున ఇచట ఉపసంక్రమణ మనఁగా ప్రాప్తి—పొందుట అను అర్థమును గ్రహింపకూడదు. (స్వాత్మని క్రియావిరోధాత్ అను న్యాయము ననుసరించి ఆనందమయ సంక్రమణము ఆనందమయ కర్తృకము కాకపోవుటయేగాక అన్నమయాద్యన్యతమకర్తృకము అగుఁగాక యని చెప్పునెడల అట్లని శ్రుతియందు చెప్పఁబడలేదు కావున) అన్నమయాద్యన్యతమకర్తృకము కూడ కాఁజాలదు. ఇఁక పరిశేషన్యాయముచేత అన్నద్యానందమయాంతాత్మ వ్యతిరిక్త జ్ఞానమాత్రమే ఇచట సంక్రమణ శబ్దార్థమని గ్రహించుట యుక్తము. ఉపసంక్రమణ మనఁగా జ్ఞానమాత్రమని అర్థమును గ్రహించినప్పుడే సర్వాంతరుఁడయిన ఆత్మయే ఆనందమయాంతస్థుఁడును అయియున్నాఁడు కావున అతఁడు ఆకాశాద్యన్నమయాంతమగు కార్యమును సృజించి దానియందు ప్రవేశించినవాఁ డాయెను. హృదయగుహాభి సంబంధమువలన అన్నమయాద్య నాత్మలయందు అతనికి ఆత్మవిభ్రమము కలుగుట సహజము. సంక్రమణాత్మకమయిన అట్టి ఆత్మవిజ్ఞానోత్పత్తిచేత అట్టి విభ్రమము నశించుట ఉపపన్నమగుచున్నది. ఆ యా అవిద్యావిభ్రమవినాశము నందు ఉపసంక్రమణ శబ్దము గౌణముగ గ్రహింపఁబడుచున్నది. లేనియెడల ఆత్మకు వాస్తవమయిన ఉపసంక్రమణము సిద్ధింపఁజాలదు. వస్త్వంతర మున్నగదా ఉపసంక్రమణము సిద్ధించును. తనవే తాను

పొందుట అనునది అసంగతము. జలూక (జలగ) మఱొకదానిని పట్టుకొనుచున్నది కాని తననే తాను పట్టుకొనఁజాలదు గదా.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని లక్షితమయిన బ్రహ్మమును తెలిసికొనుటకే బహుభవన, సర్గప్రవేశ, రసలాభ, అభయ. సంక్రమణాదికము సర్వవ్యవహారా విషయమయిన బ్రహ్మమునందే పరికల్పితము కాని వాస్తవముగా చూడ నిర్వికల్పమయిన బ్రహ్మమునందు ఒక్క వికల్పముకూడ వాస్తవముగ లేదు.

ఆ యీ నిర్వికల్పుఁడగు ఆత్మను ఈ విధముగ నెఱింగిన యెడల—

ప్ర. న బిభేతి కుతశ్చన,

అభయం ప్రతిష్ఠాం విందతే.

అను విషయమునం దొక శ్లోకము - మంత్రము గలదు. ఈ చెప్పఁబోవు మంత్రము ఈ ఆనందవల్లి యందు ప్రతిపాదించిన సకల విషయజాతముయొక్క సారభూతమయి విరాజిల్లుచున్నది.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము, బ్రహ్మ. శ్లో. ౮౦-౯౪.

అనుభూతి ప్రకాశిక, ౨-అధ్యా. శ్లో. ౧౨౧-౧౩౫.

ఆత్మపురాణము, ౧౦-అధ్యా. శ్లో. ౨౩౭-౨౯౭.

—o—

## ౯. నవమోఽనువాకః

మం. యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా స
హ । ఆనందం బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కుత
శ్చనేతి । ఏతగ్ం హ వావ న తపతి । కి మహగ్ం
సాధు నాకరవమ్ । కిమహం పాప మకరవమితి । స
య ఏవం విద్వా నేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । ఉభే
హ్యేవైష ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే । య ఏవం
వేద । ఇత్యుపనిషత్ ॥

ఉత్తర శాంతిపాఠః.

సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహవీర్యం
కరవావహై । తేజస్వి నావధీత మస్తు మా విద్విషా
వహై । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

(బ్రహ్మవిదిదమయమిదమేకవిగ్ంశతిః రన్నాదన్న
రసమయా, త్ప్రాణో వ్యానోఽపాన ఆకాశః పృథివీ
పుచ్ఛగ్ం షడ్విగ్ంశతిః; ప్రాణం యజుర్ ఋక్సామా
దేశోఽథర్వాంగిరసః పుచ్ఛం ద్వావిగ్ంశతిః; ర్యతశ్శ్ర

ధ్వర్తగ్ం సత్యం యోగో మహో౽ష్టాదశ; విజ్ఞానం

ప్రియం మోదః ప్రమోద ఆనందో బ్రహ్మ పుచ్ఛం

ద్వావిగ్ంశతి; రసస్త్వేవాథాష్టావిగ్ం శతి; రస త్వో

దశ; భీషా౽స్మాన్మానుషో మనుష్యగంధర్వాణాం దేవ

గంధర్వాణాం పితృణాం చిరలోకలోకానామాజాన

జానాం కర్మదేవానాం యే కర్మణా దేవానా మింద్ర

స్య బృహస్పతేః ప్రజాపతే ర్బ్రహ్మణ స్సయశ్చ సం

క్రామ త్యేకపఞ్చాశ; ద్యతః కుతశ్చనైతమేకాదశ నవ ॥౯॥

(బ్రహ్మవిన్నవ.)

తైత్తిరీయోపనిషది ద్వితీయః ప్రశ్నః సమాప్తః.

బ్రహ్మవల్లీ (ఆనందవల్లీ) సమాప్తా.

శాంకరభాష్యమ్:—

**యతః** యస్మాత్ నిర్వికల్పాత్ యథోక్తలక్షణాత్ అద్వయానన్దాత్ **ఆత్మనః.** వాచః అభిధానాని ద్రవ్యాదిసవికల్పవస్తువిషయాణి వస్తుసామాన్యాన్నిర్వికల్పే అద్వయే౽పి బ్రహ్మణి ప్రయోక్తృభిః ప్రకాశనాయ ప్రయుజ్యమానాని, అప్రాప్య అప్రకాశ్యైవ నివర్తన్తే స్వసామర్థ్యాద్ధీయన్తే। మన ఇతి ప్రత్యయో విజ్ఞానమ్। తచ్చ, యత్రాభిధానం ప్రవృత్తమతీన్ద్రియే౽ప్యర్థే. తదర్థే చ ప్రవర్తతే ప్రకాశనాయ। యత్ర చ విజ్ఞానమ్, తత్ర వాచః ప్రవృత్తిః। తస్మాత్ సహైవ వాఙ్మనసయోః అభిధానప్రత్యయోః ప్రవృత్తిః సర్వత్ర। తస్మాత్ బ్రహ్మప్రకాశనాయ సర్వథా ప్రయోక్తృభిః ప్రయుజ్యమానా అపి వాచః యస్మాదప్రత్యయవిషయాదనభిధేయాద దృశ్యాదివిశేషణాత్ సహైవ మనసా విజ్ఞానేన సర్వప్రకాశన సమర్థేన నివర్తన్తే, తం బ్రహ్మణ ఆనన్దం శ్రోత్రియస్య అవృజినస్య అకామహతస్య సర్వైషణావినిర్ముక్తస్య ఆత్మభూతం విషయవిషయిసంబన్ధ వినిర్ముక్తం స్వాభావికం నిత్యమవిభక్తం పరమా

నన్దమ్ బ్రహ్మణో విద్వాన్ యథోక్తేన విధినా న బిభేతి కుతశ్చన, నిమిత్తాభావాత్। న హి తస్మాద్విదుషః అన్యద్వస్త్వన్తరమస్తి భిన్నం యతోబిభేతి। అవిద్యయా యదా ఉదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతీతి హి యుక్తమ్। విదుషశ్చ అవిద్యాకార్యస్య తైమిరికదృష్ట ద్వితీయచన్ద్రవత్ నాశాద్భయనిమిత్తస్య న బిభేతి కుతశ్చనేతి యుజ్యతే। మనోమయే చ ఉదాహృతః మన్త్రః, మనసో బ్రహ్మవిజ్ఞాన సాధనత్వాత్। తత్ర బ్రహ్మత్వమధ్యారోప్య తత్స్తుత్యర్థం న బిభేతి కాదాచనేతి భయమాత్రం ప్రతిషిద్ధమ్; ఇహ అద్వైతవిషయే న బిభేతి కుతశ్చనేతి భయనిమిత్తమేవ ప్రతిషిద్ధ్యతే। నన్వస్తి భయనిమిత్తం సాధ్వకరణం పాపక్రియా చ। నైవమ్। కథమితి, ఉచ్యతే—ఏవం యథోక్తమేవంవిదమ్, హ వావ ఇత్యవధారణార్థౌ, న తపతి నోద్వేజయతి న సంతాపయతి। కథం పునః సాధ్వకరణం పాపక్రియా చ న తపతీతి, ఉచ్యతే—కిం కస్మాత్ సాధు శోభనం కర్మ నాకరవం న కృతవానస్మి ఇతి పశ్చాత్సం తాపో భవతి ఆసన్నే మరణకాలే; తథా కిం కస్మాత్ పాపం ప్రతిషిద్ధం కర్మ అకరవం కృతవానస్మి ఇతి చ నరకపతనాది దుఃఖభయాత్ తాపో భవతి। తే ఏతే సాధ్వకరణపాపక్రియే ఏవమేనం న తపతః, యథా అవిద్వాంసం తపతః। కస్మాత్పునర్విద్వాంసం న తపత ఇతి, ఉచ్యతే—స య ఏవం విద్వాన్ ఏతే సాధ్వసాధునీ తాపహేతూ ఇతి ఆత్మానం స్పృణుతే ప్రీణాతి బలయతి వా, పరమాత్మభావేన ఉభే పశ్యతీత్యర్థః। ఉభే పుణ్యపాపే హి యస్మాత్ ఏవమ్ ఏష విద్వాన్ ఏతే ఆత్మానాత్మరూపేణైవ పుణ్యపాపే స్వేన విశేషరూపేణ శూన్యే కృత్వా ఆత్మానం స్పృణుత ఏవ। కః? య ఏవం వేద యథోక్తమద్వైతమానన్దం బ్రహ్మ వేద, తస్య ఆత్మభావేన దృష్టే పుణ్యపాపే నిర్వీర్యే అతాపకే జన్మాన్తరారమ్భకే న భవతః। ఇతీయమ్ ఏవం యథోక్తా అస్యాం వల్ల్యాం బ్రహ్మవిద్యోపనిషత్. సర్వాభ్యః విద్యాభ్యః పరమ రహస్యం దర్శితమిత్యర్థః—పరం శ్రేయః అస్యాం నిషణ్ణమితి॥

ఇతి నవమానువాకభాష్యమ్॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవిన్ద భగవత్పూజ్యపాద శిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ తైత్తిరీయోపనిషద్భాష్యే బ్రహ్మానన్దవల్లీభాష్యం సంపూర్ణమ్॥

టీక. యతః = (సర్వకారణభూతుఁడు నిర్వికల్పుఁడును అగు) ఏ ఆనందాత్మక బ్రహ్మము నుండి, వాచః = ద్రవ్యాదిసవికల్పక వస్తువిషయములగు వాక్కులన్నియు. మనసా సహ = మనస్సుతోడ, అప్రాప్యఏవ = (ఆ యానందస్వరూపుని)

పొందకయే, నివర్తంతే=మఱలుచున్నవో (అట్టి), బ్రహ్మణః=బ్రహ్మముయొక్క, ఆనందం = ఆనందమును, విద్వాన్ = ఎఱింగినవాఁడు, కుతశ్చన= దేనివల్ల నుండియు, న బిభేతి= భయపడఁడు. ఇతి = (ఈ ఆనంద విషయక శ్లోకము) సమాప్తము.

(మరణకాలము సమీపించినదగుచుండఁగా) అహం=నేను, సాధు = పుణ్య కర్మలను, కిం నాకరవం=ఏల చేయకపోతిని? అహం=నేను, పాపం=పాప కర్మను, కిం అకరవం=ఏల చేసితిని? ఇతి=ఇట్లనెడి (చింత), ఏతం=ఇట్టి బ్రహ్మవేత్తను, న తపతి హ వావ = తపింపఁజేయఁజాలదు గదా.

యః = ఎవ్వఁడు, ఏవం = ఈ విధముగా, విద్వాన్ = ఎఱుంగునో, సః= వాఁడు. ఆత్మానం = ఆత్మను, స్పృణుతే = బలపఱచుచున్నాఁడు. (ఈ పుణ్య పాపములను రెంటిని పరమాత్మబుద్ధితోఁ గాంచునని భావము).

యః=ఎవ్వఁడు ఏవం=ఈ విధముగా, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః ఏషః = ఆ ఇతఁడు, ఏతే ఉభే=ఈ పుణ్యపాపములు రెంటిని, ఆత్మానం = ఆత్మను గూర్చి, స్పృణుతే = బలపఱచుచున్నాఁడు.

ఉపనిషత్ = ఉపనిషత్తు, ఇతి సమాప్తమైనది.

తా. ద్రవ్యాది సవికల్పక వస్తువులను గుఱించి చెప్పఁబడెడి వాక్కులు వస్తు సామాన్యబుద్ధితో అద్వయుఁడగు బ్రహ్మమునందు ఆ బ్రహ్మమును ప్రకాశింప జేయు టకుగాను ప్రయోగింపఁబడుచున్నవి. కాని ఆ (బ్రహ్మమును ప్రకాశింపఁ జేయుటకు) ప్రయోగింపఁబడిన వాక్కులు ఆ బ్రహ్మమును ప్రకాశింపఁజేయు సామర్థ్యములేని వయి, నిర్వికల్పుఁడును, సత్యజ్ఞానానంత లక్షణుఁడును, ఆనందాత్మకుఁడును అగు బ్రహ్మమును పొందఁజాలకయే అచటినుండి మనస్సుతోడ మఱలుచున్నవి—అనఁగా స్వసామర్థ్యవిహీనము లగుచున్నవి.

## విద్యయే భయనాశహేతువు

ఇచట మన స్సనఁగా శబ్దజన్యజ్ఞానము. మనస్సు అతీంద్రియమగు విషయము నందు ప్రవేశించునపుడు ఎచ్చట (శబ్దశక్తి) అభిధానము ప్రవర్తించునో అచటనే ప్రకాశముకొఱకు ప్రవేశించును. ఎచ్చట విజ్ఞానమో అచ్చటనే వాఙ్మప్రవృత్తియు కలు గును. విద్వాంసుఁడున్నూ, పాపరహితుఁడున్నూ, నిష్కాముఁడున్నూ, సర్వైషణా వినిర్ముక్తుఁడున్నూ అగువానికి ఆత్మ భూత మయినట్టిదియు, విషయవిషయి సంబంధ వినిర్ముక్త మయినట్టిదియు, స్వాభావికమయినట్టియు, నిత్యమయినట్టియు, అంతట

అవిభక్తమైనట్టియు పరమానందమును వెనుకఁ జెప్పబడిన విధముగా తెలిసికొనిన వాఁడు భయనిమిత్తము లేకపోవుటవలన దేనివల్లనుండియు భయపడఁజాలడు.

అట్టి విద్వాంసుఁడగు వానికంటె భిన్నమగువస్తువే లేదు. కావున అతనికి భయమే లేదు. అవిద్యచేత ఎప్పుడు కొద్దిగనైనను భేదబుద్ధిని పొందునో అప్పుడు అతనికి భయము కలుగును, అని ఇదివఱకు చెప్పియే యున్నారము.

నేత్ర రోగమువలన చంద్రు లిద్దఱున్నటుల గనంబడునటుల అవిద్యవలన వస్త్వంతరము ఉన్నటుల తెలియవచ్చును. అట్టి అవిద్య విద్వాంసునకు నశించును. కావున ఆత్మకంటె భిన్నమగు వస్తువే లేదు. కావున భయనిమిత్తమే లేదు. భయనిమిత్తము లేనప్పుడు భయము పుట్టకపోవుటయు యుక్తమే గదా.

"యతో వాచో నివర్తంతే" అనెడి ఈ మంత్రము మనోమయ కోశవివరణ స్థలమునం దొక పర్యాయము పఠింపఁబడియున్నది. అచట మనస్సు బ్రహ్మవిజ్ఞానమునకు సాధన మగుటవలన మనస్సునందు బ్రహ్మత్వమును ఆరోపించి ఆ మనస్సును స్తుతించుటకుఁగాను "న బిభేతి కదాచన" యని భయమేమియు కలుగఁజాలదని భయము మాత్రము నిషేధింపఁబడినది.

ఇచట "న బిభేతి కుతశ్చన" అని అద్వైత విషయమునందు భయపడుటకు తగిన నిమిత్తమే లేదని నిమిత్తమే ప్రతిషేధింపఁబడినది.

పూర్వ:—భయపడుటకు తగిన నిమిత్తమే లేదనుట సరికాదు. లోకమునందు మనుష్యులందఱు యౌవనావస్థయందు ఎటుల చరించుచున్నను కొంచెము తల నరిసి మరణకాలము సమీపించుచున్నదని ఎఱింగినప్పుడు. అయ్యో! నేను పుణ్యకార్యముల నాచరింపకపోతినే! పాపపు కృత్యముల నాచరించియుంటినే అని సంతాపము కలుగును గదా? కావున భయపడుటకు తగిన నిమిత్తముంటియే యున్నది.

సమా:— అట్లనరాదు. నేను పాపకృత్యముల నేల ఆచరించితిని? పుణ్యకార్యముల నేల సలుపలేదు? నాకు నరకబాధ సంభవించునే అనెడి విచారము మూఢునకుఁ గాని విద్వాంసునకు సంభవింపదు. ఏలయనఁగా విద్వాంసుఁడగువాఁడు ఈ పుణ్యకృత్యములను, పాపకృత్యములను ఆత్మకంటె భిన్నము లైనవానినిగా జూడక ఆత్మ భావముతోడనే గాంచుచున్నాఁడు.

విద్వాంసుఁ డీ రెంటిని ఆత్మభావముతోడనే గాంచుచు పుణ్యపాప రూప జడాంశమును వానియందు గాంచక చిదంశస్వరూపమునే భావించును. ఈ విధముగా అద్వయమును ఆనందాత్మకమును అగు బ్రహ్మము నెఱింగినవానికి పుణ్యపాపములు

ఆత్మ భావముతో జూడఁబడును. కావున (దగ్ధబీజమువలె) నిర్వీర్యములయి జన్మా రంభకములు కాఁజాలవు. ఇట్టి రహస్య విషయములను ప్రతిపాదించునట్టి బ్రహ్మ విద్య ఈ ఆనందవల్లియందు చెప్పఁబడినది. ఇయ్యది సకల విద్యలకంటె పరమ రహస్యభూతమయినది. ఉపనిషత్తనఁగా రహస్యభూతమగు విద్యయని భావము. లేక శ్రేష్ఠమగు శ్రేయస్సు ఈ విద్యయందు కలదు కావున ఉపనిషత్తనుటయు తగును కావున అట్టి యుపనిషత్తు సమాప్తమయినది.

వివరణము:—"యతో వాచో నివర్తన్తే" అను మంత్రము ఇదివఱకు ౪-వ అనువాకమునందు మనోమయకోశ వివరణ రూపముగ చెప్పఁబడినది. లోకమునందు సామాన్యముగ బ్రహ్మవిద్యను తెలిసికొనఁదలఁచిన వారలకు మనస్సు సాధన భూత మగుటచేత అట్టి మనస్సునందు బ్రహ్మత్వమును ఆరోపించి తదుపాసనమును స్తుతిం చుటకుఁగాను భయమేమియు లేదనియు, ఒకవేళ కలిగినను తత్ప్రతీకారము కలదు. కావున భయము కలుగఁజాలదనియు నిషేధింపఁబడినది. ఇచట అద్వయ బ్రహ్మ మును ప్రమాణములచేత నెఱింగిన వానికి భయనిమిత్తమే లేదని నిషేధింపఁబడినది.

భయ మెప్పుడున్నూ "ద్వితీయాద్వై భయం భవతి" అనెడి శ్రుతి ప్రమా ణము వలన తనకంటె భిన్నమగు వస్తువున్నప్పుడు కలుగు ననుట ప్రసిద్ధమయి యున్నది.

అద్వయమని బోధించుటచేత భయహేతువే నిషిద్ధమయినదని భావము. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అను న్యాయము ననుసరించి పుణ్య పాపకర్మ లనుభవముచేతఁ గాని నశింపఁజాలవు గదా. అప్పుడు నిమిత్తమే లేదనుట ఎట్లు పొసఁగును? అను సంశయము జనించునుగాని ఆ న్యాయము బ్రహ్మజ్ఞాన విరహితుల విషయముగాని బ్రహ్మజ్ఞానుల యొక్క విషయము కాదు.

"జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" అను భగవద్గీతా ప్రమా ణము ననుసరించి పుణ్యపాపరూప కర్మలన్నియు జన్మాంతరారంభమునకు బీజ భూత ములు గాక నశించునని భావము.

జ్ఞానాత్పూర్వము సంచితమగు కర్మయందు అనారబ్ధఫలముగల కర్మ యంతయు ఇటుల నశించును.

ఆరబ్ధమగు కర్మము మాత్రము శ్రుత్యనుభవములచేత తత్త్వవేత్తకు వైతము కలదు కావున దేహప్రాణవియోగానంతరము తత్త్వవేత్త నిర్విశేష బ్రహ్మాత్మకుఁ డగును.

ఆరబ్ధఫలమగు దేహాది సంసారముండుటచేతనే తత్త్వవేత్తయగు ఆచార్యుఁడు ఉపదేష్టయగుటయు, శిష్యులు తదుపదేశాదికమువలన తరించుటయు లోకమునందు శాస్త్రీయసంప్రదాయము వృద్ధిచెందుటకు మార్గభూతమగుచున్నది. అవిద్వాంసుఁ డెప్పుడును ఉపదేశకుఁడు కాఁజాలఁడు గదా.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయ భాష్యవార్తికము, బ్రహ్మ. శ్లో. ౯౫-౧౫౦.
అనుభూతిప్రకాశము, అధ్యా-౨. శ్లో. ౧౩౬-౧౪౨.
ఆత్మపురాణము, అధ్యా-౧౦ శ్లో. ౨౯౭-౩౦౬.

బ్రహ్మవల్లి సమాప్తము.



శ్రీ ర స్తు

శ్రీసచ్చిదానందగురుపరబ్రహ్మణే నమః

# తైత్తిరీయోపనిషత్

## 3. భృగువల్లీ

అనువాకాః = దశ

(బ్రహ్మమీమాంసా) వారుణీదేవతా ఉపనిషత్

ఆంధ్రటీకాతాత్పర్య సమన్వితము



శాంతిపాఠః

హరిః ఓమ్. (సహ నావవతు । సహ నౌ భునక్తు ।

సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీత మస్తు మా

విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥)



### ౧. ప్రథమోఽనువాకః



(పురాణం - ఉపాఖ్యానమ్)

మం. భృగు ర్వై వారుణిః । వరుణం పితర ముపససార ।

అధీహి భగవో బ్రహ్మేతి । తస్మా ఏతత్ప్రోవాచ ।

అన్నం ప్రాణం చక్షు శ్శ్రోత్రం మనో వాచ మితి ।
తగ్ం హోవాచ । యతో వా ఇమాని భూతాని
జాయన్తే । యేన జాతాని జీవన్తి । యత్ప్రయన్త్యభి
సంవిశన్తి । త ద్విజిజ్ఞాసస్వ । త ద్బ్రహ్మేతి । స తపో
ఽతప్యత । స తపస్తప్త్వా ॥౧॥

భృగువల్లీ — ఉపక్రమః

శాంకరభాష్యమ్:

సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ ఆకాశాది కార్యమన్నమయాన్తం సృష్ట్వా తదేవానుప్రవిష్టం విశేషవదివోపలభ్యమానం యస్మాత్, తస్మాత్ సర్వకార్యవిలక్షణమ్ అదృశ్యాది ధర్మకమేవ ఆనన్దం తదేవాహమితి విజానీయాత్, అనుప్రవేశస్య తదర్థత్వాత్; తస్యైవం విజానతః శుభాశుభే కర్మణీ జన్మాన్తరారమ్భకే న భవతః ఇత్యేవమానన్దవల్ల్యాం వివక్షితోఽర్థః । పరిసమాప్తా చ బ్రహ్మవిద్యా । అతఃపరం బ్రహ్మవిద్యాసాధనం తపో వక్తవ్యమ్; అన్నాది విషయాణి చ ఉపాసనాన్యనుక్తానీత్యతః ఇదమారభ్యతే —

ఆఖ్యాయికా విద్యాస్తుతయే, ప్రియాయ పుత్రాయ పిత్రోక్తేతి—భృగుర్వై వారుణిః। వై-శబ్దః ప్రసిద్ధానుస్మారకః, భృగురిత్యేవం నామా ప్రసిద్ధో అనుస్మార్యతే, వారుణిః వరుణస్యాపత్యం వారుణిః వరుణం పితరం బ్రహ్మ విజిజ్ఞాసుః ఉపససార ఉపగతవాన్ — అధీహి భగవో బ్రహ్మ ఇత్యనేన మన్త్రేణ। అధీహి అధ్యాపయ కథయ। స చ పితా విధివదుపసన్నాయ తస్మై పుత్రాయ ఏతత్ వచనం ప్రోవాచ—అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రమ్ మనో వాచమ్ ఇతి। అన్నం శరీరం తదభ్యన్తరం చ ప్రాణమ్ అత్తారమ్ అనన్తర ముపలబ్ధిసాధనాని చక్షుః శ్రోత్రం మనో వాచమ్ ఇత్యేతాని బ్రహ్మోపలబ్ధౌ ద్వారాణ్యుక్తవాన్ । ఉక్త్వా చ ద్వారభూతాన్యేతాన్యన్నాదీని తం భృగుం హోవాచ బ్రహ్మణో లక్షణమ్। కిం తత్? యతః యస్మాత్ వా ఇమాని బ్రహ్మాదీని స్తమ్బపర్యన్తాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి ప్రాణాన్ధారయన్తి వర్ధన్తే, వినాశకాలే చ యత్ప్రయన్తి

యద్బ్రహ్మ ప్రతిగచ్ఛన్తి, అభిసంవిశన్తి తాదాత్మ్యమేవ ప్రతిపద్యన్తే, ఉత్పత్తి స్థితిలయకాలేషు యదాత్మతాం న జహతి భూతాని, తదేతద్బ్రహ్మణో లక్షణమ్, తద్బ్రహ్మ విజిజ్ఞాసస్వ విశేషేణ జ్ఞాతు మిచ్ఛస్వ; యదేవం లక్షణం బ్రహ్మ తద న్నాదిద్వారేణ ప్రతిపద్యస్వేత్యర్థః। శ్రుత్యన్తరం చ—"ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమన్నస్యాన్నం మనసో యే మనో విదుస్తే నిచిక్యుర్బ్రహ్మ పురాణ మగ్ర్యమ్" ఇతి బ్రహ్మోపలబ్ధౌ ద్వారాణ్యే తానీతి దర్శయతి। స భృగుః బ్రహ్మోపలబ్ధి ద్వారాణి బ్రహ్మలక్షణం చ శ్రుత్వా పితుః, తపో బ్రహ్మో పలబ్ధి సాధనత్వేన అతప్యత తప్తవాన్। కుతః పునరనుపదిష్టస్యైవ తపసః సాధనత్వ ప్రతిపత్తిర్భృగోః? సావశేషోక్తేః। అన్నాది బ్రహ్మణః ప్రతిపత్తౌ ద్వారం లక్షణం చ యతో వా ఇమాని ఇత్యాద్యుక్తవాన్। సావశేషం హి తత్, సాక్షాద్బ్రహ్మణోఽ నిర్దేశాత్। అన్యథా హి స్వరూపేణైవ బ్రహ్మ నిర్దేష్టవ్యం జిజ్ఞాసవే పుత్రాయ ఇద మిత్థం రూపం బ్రహ్మ ఇతి; న చైవం నిరదిశత్; కిం తర్హి, సావశేషమేవోక్త వాన్। అతోఽవగమ్యతే నూనం సాధనాన్తరమప్యపేక్షతే పితా బ్రహ్మవిజ్ఞానం ప్రతీతి। తపోవిశేషప్రతిపత్తిస్తు సర్వసాధక తమత్వాత్; సర్వేషాం హి నియత సాధ్య విషయాణాం సాధనానాం తప ఏవ సాధకతమం సాధనమితి హి ప్రసిద్ధం లోకే। తస్మాత్ పిత్రా అనుపదిష్టమపి బ్రహ్మవిజ్ఞాన సాధనత్వేన తపః ప్రతిపేదే భృగుః। తచ్చ తపో బాహ్యాన్తఃకరణ సమాధానమ్, తద్ద్వారకత్వాద్బ్రహ్మ ప్రతిపత్తేః, "మనస శ్చేన్ద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః। తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే" ఇతి స్మృతేః। స చ తపస్తప్త్వా॥

ఇతి ప్రథమానువాక భాష్యమ్॥

టీక. వారుణిః = వరుణుని పుత్త్రుఁడగు, భృగుః = భృగువనువాఁడు, భగవః = ఓ పూజ్యుఁడా! బ్రహ్మ = బ్రహ్మమును, అధీహి ఇతి = ఉపదేశింపుమని, పితరం వరుణం = తండ్రి యగు వరుణుని, ఉపససార వై = సమీపించెను. (పిదప ఆ వరుణుఁడు) తస్మై = (బ్రహ్మజిజ్ఞాస కలిగి తన సమీపమునకు వచ్చిన) ఆ పుత్త్రుని కొఱకు, అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనః వాచం ఇతి = అన్నము ప్రాణము చక్షుస్సు శ్రోత్రము మనస్సు వాక్కు ఇవి బ్రహ్మప్రాప్తికి ద్వారభూతము లని, ఏతత్ = ఈ విషయమును, ప్రోవాచ = పలికెను.

యతః = ఎవనివలన, ఇమాని = ఈ, భూతాని = భూతములు, జాయంతే = పుట్టుచున్నవో, జాతాని = పుట్టిన భూతములు, యేన = ఎవనిచేత, జీవంతి =

జీవించుచున్నవో (ప్రళయకాలము నందు), యత్ప్రయంతి = దేనిని పొందు చున్నవో, అభిసంవిశంతి = తాదాత్మ్యమును పొందుచున్నవో, తత్ = అది. బ్రహ్మ ఇతి = బ్రహ్మము అని, తం = ఆ భృగువును గూర్చి, ఉవాచహ = పై బ్రహ్మలక్షణ మును చెప్పెను.

(ఈ విధముగా తండ్రి యగు వరుణుఁడు ఉపదేశించిన పిదప) సః = ఆ భృగువు, తపః అతప్యత = తపస్సు నాచరించెను, సః = ఆ భృగువు, తపః తప్త్వా = (ఈ విధముగా) తపము నాచరించి;

## భృగువల్లి భాష్యోపోద్ఘాతము

## ఆనందవల్లీ తాత్పర్యార్థము

ఆనందవల్లి యనెడి నామాంతరము కల బ్రహ్మవల్లి యను గ్రంథ భాగము నందు ఇదివఱకు చెప్పఁబడిన విషయ మేమనఁగా:—సత్యజ్ఞానానంతాత్మకమగు బ్రహ్మము ఆకాశాదికమును అన్నమయాంతమును అగు కార్యజాతమును సృజించి తా నందు ప్రవేశించి సాంసారిక ధర్మములు గలదానివలె గనంబడుచున్నది. కావున సర్వకార్య విలక్షణమును అదృశ్యాది ధర్మము గల ఆనందమే నేనను విషయమును తెలిసికొనవలయును.

"త త్సృష్ట్వా। తదేవాను ప్రావిశత్" అనుచోట గల 'అనుప్రవేశము' అను శబ్దము ఈ యర్థముతోనే ప్రయుక్తమయినది. జీవబ్రహ్మములకుఁ గల ఇట్టి యభేద మును ఎఱింగినవానికి శుభాశుభ కర్మలు పుణ్యపాపజన్మములను కలుగఁజేయఁజాలవు అనియు చెప్పఁబడియున్నది. బ్రహ్మవిద్యయు పరిసమాప్తి నందినది.

## భృగువల్లీ ఉపనిషత్ ప్రవృత్తి నిమిత్తము

ఇఁక బ్రహ్మవిద్యా సాధనమగు తపస్సు, అన్నాది విషయకములగు ఉపాసన ములు చెప్పఁబడి యుండలేదు. కావున తదర్థ మీ భృగువల్ల్యుపనిషత్తు ఆరబ్ధమయి నది. (ఆ విషయమును చెప్పఁబోవుచు) భృగువను పుత్రునకు వరుణుఁడను తండ్రి ఈ విషయమును బోధించినటుల ఆఖ్యాయిక చెప్పఁబడినది. ఆఖ్యాయిక విద్యాస్తుతికి గాను చెప్పబడును. (విద్యాస్తుతి ఎట్లనఁగా:—తండ్రి తన ప్రీతి పాత్రుఁడగు పుత్రునకు ఉపదేశించెడి విద్య శ్రేష్ఠమయి యుండును గాని సామాన్యముగా నుండఁ జాలదు. కావున మన మిట్టి శ్రేష్ఠ విద్యయందు ఉపేక్ష చేయరాదు అని యస్మదాదు లగు ముముక్షువులు ఉత్సాహపూర్వకముగ తత్ప్రాప్తికయి ప్రయత్నించుటకు పురి కొల్పును.) ఇఁక ప్రకృతము.

(అన్నప్రాణాదికములు ఉపలక్షణములు)

వరుణుని పుత్త్రుఁడును సుప్రసిద్ధుఁడును అగు భృగువను మహర్షి తన తండ్రి యగు వరుణుని సమీపమునకు బ్రహ్మజిజ్ఞాస కలిగిపోయి "అధీహి భగవో బ్రహ్మ" యని ప్రార్థించెను. అంతట తండ్రియగు వరుణుఁడు జిజ్ఞాస కలవాఁడు బ్రహ్మోప దేశార్థము ఎటుల సద్గురువు నాశ్రయింపవలయునో ఆ విధముగా తన్ను సమీపించిన తన పుత్త్రునకు అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు — అన్న మనఁగా శరీరము, ప్రాణమనఁగా శరీరాభ్యంతరమును, అత్తయు అనఁగా అన్నభక్షకమును అగు ప్రాణమును, తరువాత జ్ఞానప్రాప్తికి సాధనభూతములగు చక్షుశ్శ్రోత్రమనోవాక్కులను ఇవి బ్రహ్మప్రాప్తికి ద్వారభూతములని ఉపదేశించెను. బ్రహ్మప్రాప్తికి ఇవి ద్వారభూతములని—అన్నాదికములను చెప్పి బ్రహ్మముయొక్క లక్షణమును సైతము భృగువునకు ఉపదేశించెను. ఆ లక్షణ మేమనఁగా:—ఎవని వల్ల నుండి బ్రహ్మాది స్తంబపర్యంతములగు భూతములు పుట్టుచున్నవో, పుట్టినవి ఎవనివల్ల నుండి జీవించుచున్నవో—అనఁగా ప్రాణములను ధరించుచు వృద్ధిని పొందుచున్నవో, ప్రళయకాలము నందు మఱల ఎవనిని గూర్చి పొందుచున్నవో మఱియు తాదాత్మ్యమును పొందుచున్నవో (అనఁగా బ్రహ్మమునందు లీనమగుచున్న వని భావము.) అనఁగా భూతములు ఉత్పత్తి స్థితిలయ కాలము లందు దేనితో సంబంధించి తదాత్మకములయి యుండునో అది బ్రహ్మమునకు లక్షణము. అట్టి జగ త్కారణ మగునదియే బ్రహ్మము.

బ్రహ్మజిజ్ఞాస

అట్టి బ్రహ్మమునే విశేషించి తెలిసికొనుము. ఇట్టి లక్షణముగల బ్రహ్మమును "అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు" అను ద్వారముల రూపముగా పొందుము.

అన్నము మున్నగునవి బ్రహ్మప్రాప్తికి ద్వారభూతము లనుటకు శ్రుతి సైతము ప్రమాణముగాఁ గలదు.

శ్రు. "ప్రాణస్య ప్రాణ ముత చక్షుష శ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత్ర మన్నస్యాన్నం మనసో యే మనో విదుః స్తే నిచిక్యు ర్బ్రహ్మ పురాణ మగ్ర్యమ్."

(బృహ. ౪. ౪. ౧౮.)

(అర్థ. ప్రాణమునకు ప్రాణభూతుఁడును, మఱియు నేత్రములకు నేత్ర భూతుఁడును, శ్రోత్రములకు శ్రోత్రభూతుఁడును, అన్నమునకు అన్నభూతుఁడును,

మనస్సునకు మనోభూతుఁడును అగువానిని ఎవ్వ రెఱుంగుదురో వారు సృష్టికంటె ముందున్నట్టి బ్రహ్మమును ఆత్మగా ఎఱుంగఁగలరు.)

**బ్రహ్మప్రాప్తికి అధ్యాత్మికమగు తపస్సే ప్రధాన సాధనము**

ఈ విధముగా భృగుమహర్షి తన తండ్రివల్ల నుండి బ్రహ్మమును పొందుటకు అన్నాదికములగు ద్వారములను, బ్రహ్మలక్షణమును, ఆకర్ణించి బ్రహ్మోప లబ్ధికి తపస్సు సాధనము కావున తప మొనర్చెను. భృగుమహర్షి అనుపదిష్టమయిన తపమునే బ్రహ్మోప లబ్ధికి సాధనముగా నేల గ్రహించెను?

(అన్నాదికము బ్రహ్మోపలబ్ధికి ద్వారమనియు, బ్రహ్మకు లక్షణము జగత్కారణత్వమనియు చెప్పినాఁడే కాని) స్వరూపముగా సాక్షాత్తుగా బ్రహ్మమును నిర్దేశించి చెప్పలేదు. అందువలన (బ్రహ్మవిజ్ఞానమునకు వెనుక చెప్పినవి గాక) సాధనాంతరము లపేక్షితములని తెలియవచ్చుచున్నది. సాక్షాత్తుగా నిర్దేశించి చెప్పుటకు వీలు లేనిది కావుననే ఇట్టుల సావశేషముగ ప్రియ పుత్త్రునకు బోధించెను గాని వీలున్న యెడల సాక్షాత్తుగానే బ్రహ్మ మిట్టిదని బోధించియుండును.

తపస్సు, అసాధ్యమగుదానిని సాధించుకొనుటకు వీలగునట్టి సాధనములలో శ్రేష్ఠతమమయిన దను విషయము లోకమునందు సుప్రసిద్ధము కావున తన తండ్రి బ్రహ్మవిజ్ఞానార్థము తప మొనర్పుము అని చెప్పకపోయినను లోక ప్రసిద్ధిచేత నెఱింగి తప మొనర్చెను.

తపస్సనఁగా బాహ్యాంతఃకరణ సమాధానాత్మకము, తద్ద్వారకముగనే బ్రహ్మమును పొందవలయును. ఇందులకు స్మృతిప్రమాణము —

శ్లో. "మనస శ్చేంద్రియాణాంచ హ్యైకాగ్రం పరమం తపః,
తజ్జ్యాయ స్సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే."

(భారత. మోక్షధర్మ. ౨౫౦-౪.)

(అర్థ, మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు ఏకాగ్రత శ్రేష్ఠమగు తపస్సు, ఇయ్యదియే సకల ధర్మముల కంటె అధికమయినది. ఇదియే శ్రేష్ఠమయిన ధర్మము) ఆ భృగు వీ విధముగా తప మొనర్చి.

౧. వివరణము:—'భృగుర్వై వారుణిః' అను ఒక ఆఖ్యాయిక ఆది యందు చెప్పఁబడినది. ఇట్టి ఆఖ్యాయికలు పారిప్లవార్థములా? లేక విద్యోపయోగములా? అను విషయము బ్రహ్మసూత్రములందు పారిప్లవాధికరణము నందు —

సూ. పారిప్లవార్థా ఇతిచేన్న విశేషితత్వాత్. ౨౩
తథాచైక వాక్యతోపబంధాత్. ౨౪ (బ్ర. సూ. ౩. ౪.)

అను సూత్రములతో నిర్ణీతమయినది.

శ్రీ శంకరులవారు భాష్యమునందు "అసతిచ పారిప్లవార్థత్వే ఆఖ్యానానాం సన్నిహిత విద్యాప్రతిపాదనోపయోగిత్వైపన్యాయ్యా" అని నిర్ణయించిరి.

౨. మూలమునందు గల "అభిసంవిశన్తి" యను పదము "ప్రయంతి" యను పదము యొక్క వివరణ రూపమని ఎఱుంగునది.

౩. భృగువు "అధీహి భగవో బ్రహ్మ" యని బ్రహ్మజిజ్ఞాస గలవాఁడై పృచ్ఛఁజేయఁగా "యతో వా ఇమాని భూతాని" మున్నగువానిచేత జగత్కారణము నెఱుంగుమని ఆచార్యుఁడగు వరుణుఁడు చెప్పుట న్యాయమేనా? అని సంశయమును చెంద నక్కరలేదు. "తద్బ్రహ్మ" అని శ్రుతియే జగత్కారణమయినదే బ్రహ్మమని చెప్పియున్నది. కావున ప్రశ్న సమాధానములు రెండును యుక్తములే.

౪. తపశ్శబ్ద వివరణము ఇదివఱకు భాష్యోదాహృతమహాభారత వచనము ననుసరించి చేసియున్నారము. ఇప్పుడు వార్తికకారాద్యభిమతమయిన నిర్వచనము చెప్పఁబడుచున్నది:—

శ్లో. "మనసశ్చేంద్రియాణాంచై క్యేవమాధ్యాత్మికం తపః,
ఇహన్యాయం ప్రసిద్ధంతు హ్యేరా దుపకరోతి నః.
అన్వయవ్యతిరేకాదిచింతనం వా తపో భవేత్,
అహం బ్రహ్మేతి వాక్యార్థబోధాయాల మిదం యతః."
(తైత్తి. భాష్య. వార్తి. భృగు. ౧. ౧౦. ౧౯.)

సూతసంహితాయాం పరమేశ్వరేణోక్తమ్:—

శ్లో. "కోఽహం? ముక్తిః కథం? కేన సంసారం ప్రతిపన్నవాన్?
ఇత్యాలోచన మర్థజ్ఞా స్తప శ్శంసన్తి పండితాః."

అర్థ. నే నెవఁడను? ముక్తి ఎట్టిది? దేనిచేత సంసారమును పొందితిని? ఈ విషయమును పరిశీలించుటయే తపస్సని పండితులు పలుకుచున్నారు.

౫. 'తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి' అని చెప్పఁబడియుండుటచేత బ్రహ్మసూత్రములందు ఆదియందు గల—

౧. అథాతో బ్రహ్మజిజ్ఞాసా. ౧-౧-౧.

౨. జన్మాద్యస్య యతః. ౧-౧-౨.

౩. శాస్త్రయోనిత్వాత్. ౧-౧-౩.

౪. తత్తు సమన్వయాత్. ౧-౧-౪.

అను నాలుగు సూత్రములకు యీ శ్రుతి ఆధారభూతమని తలంచుచున్నారు.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము. భృగువల్లీ. శ్లో. ౧-౨౨.

ఆత్మపురాణము, అధ్యా. ౧౦. శ్లో. ౩౦౭-౩౩౫.

అనుభూతిప్రకాశము. అధ్యా. ౨ శ్లోక. ౧౪౫.



## ౨. ద్వితీయోఽనువాకః

(బ్రహ్మవిజ్ఞానే ప్రథమపర్యాయః — అన్నస్య బ్రహ్మత్వమ్)

మం. అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ । అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । అన్నేన జాతాని జీవన్తి । అన్నం ప్రయన్త్యభి సంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥౨॥

శాంకరభాష్యమ్:—

అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ విజ్ఞాతవాన్। తద్ధి యథోక్త లక్షణోపేతమ్ కథమ్? అన్నాద్ధ్యేవ ఖలు ఇమాని భూతాని జాయన్తే। అన్నేన జాతాని జీవన్తి। అన్నం ప్రయన్త్యభిసంవిశన్తీతి। తస్మాత్ ద్యుక్తమన్నస్య బ్రహ్మత్వమిత్యభిప్రాయః। స ఏవం తపస్తప్త్వా, అన్నం బ్రహ్మేతి విజ్ఞాయ లక్షణేన ఉపపత్త్యా చ పునరేవ సంశయ మాపన్నః వరుణం పితరముపససార—అధీహి భగవో బ్రహ్మేతి। కః పునః సంశయహేతురస్యేతి, ఉచ్యతే—అన్నస్యోత్పత్తి దర్శనాత్। తపసః పునః పునరుపదేశః సాధనాతిశయత్వావధారణార్థః। యావద్బ్రహ్మణో లక్షణం నిరతిశయం న భవతి, యావచ్చ జిజ్ఞాసా న నివర్తతే. తావత్తప ఏవ తే సాధనమ్; తపసైవ బ్రహ్మ విజిజ్ఞాసస్వేత్యర్థః। ఋజ్వన్యత్॥

ఇతి ద్వితీయానువాక భాష్యమ్॥

టీక. ఇమాని = ఈ, భూతాని = భూతములు, అన్నాత్ ఏవ = అన్నము వల్లనుండియే, జాయంతే ఖలు = పుట్టుచున్నవి గదా, జాతాని = పుట్టిన భూతములు, అన్నేన = అన్నముచేతనే, జీవన్తి = జీవించుచున్నవి గదా, అన్నం = అన్నమును గూర్చియే. ప్రయంతి = (లయకాలమునందు) లీనమగుచున్నవి, అభిసంవిశన్తి = తాదాత్మ్యమును పొందుచున్నవి, ఇతి = ఈ హేతువు వలన, అన్నం = అన్నమును, బ్రహ్మ ఇతి = బ్రహ్మము అని, వ్యజానాత్ = తెలిసికొనెను, తత్ = ఆవిధముగా అన్నము బ్రహ్మము అను విషయమును, విజ్ఞాయ = ఎఱింగి, పునః = మఱల, పితరం వరుణం = తండ్రియగు వరుణుని 'అధీహి భగవో బ్రహ్మ' ఇతి = ఓ భగవంతా! బ్రహ్మమును గూర్చి నాకు ఉపదేశించుము అని, ఉపససార ఏవ = సమీపించినవాఁడాయెను. తం = ఆవిధముగా తన్ను సమీపించిన పుత్రునిం గాంచి, తపసా = తపస్సుచేత, బ్రహ్మ = బ్రహ్మమును, విజిజ్ఞాసస్వ = తెలిసికొనుము, తపః = తపస్సే, బ్రహ్మ ఇతి = బ్రహ్మము అని, ఉవాచహ = (వరుణుఁడు) పలికెను. సః = ఆ భృగువు, తపః అతప్యత = తప మొనర్చెను, సః = ఆభృగువు, తపః తప్త్వా = తప మొనర్చి.

తా. (తండ్రి బ్రహ్మముయొక్క లక్షణమును తత్ప్రాప్తిద్వారమును ఉపదేశించిన పిదప సాధ్య సాధనమునకు తపస్సు శ్రేష్ఠతమమగు సాధనమను విషయము జగద్విదితము కావున భృగువు తప మొనర్చెను. ఇటుల తప మొనర్చి) అన్నమును బ్రహ్మమునుగా నెఱింగెను. బ్రహ్మమునకు లక్షణముగా చెప్పిన సకల విషయములు అన్నమునకు సరిపోవుచున్నవి. ఎట్లనఁగా—అన్నమువల్లనే సమస్త జీవజాతము పుట్టుచున్నది, వృద్ధిని పొందుచున్నది, నశించుచున్నది. ఈ విధముగ లక్షణోపపత్తుల చేత నెఱింగియు మఱల సంశయము గలవాఁడై, తండ్రిని సమీపించి మఱల 'అధీహి భగవో బ్రహ్మ' అని ప్రార్థించెను. సంశయము కలుగుటకు హేతువు ఏమనఁగా—అన్నమునకు ఉత్పత్తి గనంబడుచున్నది. ఉత్పత్తి గలది నిత్యము కాదు. (బ్రహ్మము నిత్యవస్తువు)

ఇటుల సంశయావిష్టుఁడై బ్రహ్మజిజ్ఞాసతో తన్ను సమీపించిన భృగువునకు తండ్రియగు వరుణుఁడు "తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనుము, తపస్సే బ్రహ్మము" అని యుపదేశించెను. తండ్రి యుపదేశించిన పిదప భృగువు మఱల తప మొనర్చెను, ఇటుల తప మొనర్చి;

వివరణము:—౧. అన్నమును బ్రహ్మము అని ఎఱుంగుటకు బ్రహ్మలక్షణము శ్రుతియందే "యతోవా ఇమాని భూతాని జాయంతే" అని చెప్పఁబడి

యున్నది. అన్నము వల్లనే సమస్త భూతములు సృజింపఁబడి వర్ధిల్లి లయమును పొందుచున్నవనుటకు బ్రహ్మవల్లియందే శ్రుతి ఇట్లు గలదు:—

శ్రు. అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే, యాః కాశ్చ పృథివీగ్‌ శ్రితాః, అథో అన్నేనైవ జీవన్తి, అథైన దపియన్త్యంతతః.

౨. ఉపపత్తి—అన్నశబ్దవాచ్యమగు విరాట్టు ఉపాస్యమని వేదములందు పలు తావులఁ జెప్పఁబడి యున్నది. బ్రహ్మము కానిది ఉపాసించుటకు యోగ్యము కాకపోవుటచేత అన్నమును బ్రహ్మమునుగా భావించుటకు ఉపపత్తి యగును.

౩. "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అని ప్రతిపర్యాయము చెప్పుట బ్రహ్మజ్ఞానసాధనముల లోపల తపస్సే శ్రేష్ఠతమమను విషయమును దృఢీకరించుటకని ఎఱుఁగునది.

౪. 'తపో బ్రహ్మ' అని చెప్పుట శ్రేష్ఠతమసాధనమగుటచేత ఆ తపమునే ఆచరించుము అని బోధించుచున్నాఁడు కావున తపస్సు యొక్క స్తుతి నిమిత్తమయి చెప్పఁబడినది.

ఎంత పర్యంతము బ్రహ్మముయొక్క లక్షణము సంపూర్ణముగా తెలియఁబడదో అంత పర్యంతము జిజ్ఞాస నివర్తించదు. అట్టి జిజ్ఞాస పోవుటకు శ్రేష్ఠసాధనము తపస్సుగాని మఱొకటి కాదు.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము, భృగువల్లీ, ౨,౩,౪,౫. ఖండ. ౨౩-౨౯
అనుభూతిప్రకాశము, .... ....
ఆత్మపురాణము, అధ్యా-౧౧. శ్లో. ౩౩౬-౩౪౧.



# 3. తృతీయోఽనువాకః

(బ్రహ్మవిజ్ఞానే ద్వితీయపర్యాయః)

మం. ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్ । ప్రాణాద్ధ్యేవ ఖల్వి
మాని భూతాని జాయన్తే । ప్రాణేన జాతాని జీవన్తి ।
ప్రాణం ప్రయన్త్యభిసంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ
వరుణం పితర ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి ।
తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో
బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥3॥

టీక. ప్రాణాత్ ఏవ = ప్రాణమునుండియే, ఇమాని భూతాని = ఈ సకల భూతములు, జాయంతే ఖలు హి = పుట్టుచున్నవి గదా, జాతాని = పుట్టిన భూతములు, ప్రాణేన = ప్రాణముచేత, జీవన్తి = జీవించుచున్నవి. ప్రాణం = ప్రాణమునే, ప్రయంతి అభిసంవిశన్తి = ప్రళయకాలమునందు పొందుచున్నవి. ఇతి = ఈ హేతువువలన, ప్రాణః = ప్రాణము. బ్రహ్మ ఇతి = బ్రహ్మము అని. వ్యజానాత్ = తెలిసికొనెను. తత్ = ప్రాణమే బ్రహ్మమను విషయమును. విజ్ఞాయ = తెలిసికొని (సంశయముగలవాడై), పునః = మరల, అధీహి భగవో బ్రహ్మ ఇతి = భగవన్తా బ్రహ్మము నుపదేశింపుమని, పితరం వరుణం ఉపససార = తండ్రియగు వరుణుని సమీపించెను, తం = (ఆ విధముగా బ్రహ్మజిజ్ఞాస కలిగి తన్ను సమీపించిన) పుత్రుని గూర్చి, తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపః బ్రహ్మ ఇతి = తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనుము. తపస్సే బ్రహ్మము అని, ఉవాచహ = పలికెను.

(పిదప) సః = ఆ భృగువు, తపః అతప్యత = తప మొనర్చెను. సః = ఆ భృగువు, తపః తప్త్వా = తప మొనర్చి.

తా. తండ్రి యుపదేశానుసారము బ్రహ్మ నిర్ణయార్థము తప మొనర్చిన భృగు మహర్షి జగత్సృష్టి స్థితిలయములు ప్రాణాధీనములయి యుండుట నెఱింగినవాఁడై ప్రాణము బ్రహ్మమని గ్రహించెను. అయినను ప్రాణము జడ మగుటచేతను, బ్రహ్మము చైతన్యపరిపూర్ణమగుటచేతను, ప్రాణము బ్రహ్మము కాఁజాలదను సంశయము కలవాఁడై 'బ్రహ్మము నుపదేశింపు' మని మఱల తండ్రిని సమీపించెను. వరుణుఁడును వెనుకటివలెనే మఱల తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనుము, తపస్సే బ్రహ్మము అని పుత్రునకు బోధించెను. తదనుసారము భృగుమహర్షి మఱల తప మొనర్చినవాఁడై.

వివరణము:—ప్రాణము భూతోత్పత్తి స్థితి లయములకు కారణభూతమనుటకు ప్రమాణభూతములగు శ్రుతుల నుదహరించుచున్నాఁడను.

౧. న హవా ఋతే ప్రాణా ద్రేత స్సిచ్యతే యద్వా ఋతే ప్రాణా
ద్రేత స్సిచ్యేత పూయే న్న సంభవేత్. ఐతరేయోపనిషత్తు.

౨. యావదస్మిం చ్ఛరీరే ప్రాణో భవతి తావదాయుః.
కౌషీతక్యుపనిషత్. ౩. ౨.

౩. ప్రాణోత్క్రాంతి సమయము - అనఁగా దేహమునకు లయమనుట జగత్ప్రసిద్ధమే కావున ప్రమాణ మనావశ్యకము.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్త్తికము. భృగువల్లీ ...
అనుభూతి ప్రకాశము .... ....
ఆత్మపురాణము, ౧౭-అధ్యా. శ్లో - ౭౮౫.



## ౪. చతుర్థోఽనువాకః

(బ్రహ్మవిజ్ఞానే తృతీయపర్యాయః)

మం. మనో బ్రహ్మేతి వ్యజానాత్ । మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । మనసా జాతాని జీవన్తి । మనః ప్రయన్త్యభిసంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా ॥౪॥

టీక. ఇమాని భూతాని = ఈ భూతములు, మనసః జాయంతే హి ఖలు = మనస్సువల్ల నుండియే పుట్టుచున్నవి కదా, జాతాని = పుట్టినవి, మనసా జీవన్తి = మనస్సుచేత జీవించుచున్నవి, మనః ప్రయంతి అభిసం విశంతి = ప్రళయకాలము నందు మనస్సునందు ఐక్యమగుచున్నవి, ఇతి = ఈ హేతువువలన, మనః బ్రహ్మ ఇతి = మనస్సు బ్రహ్మము అని, వ్యజానాత్ = గ్రహించెను.

తత్ విజ్ఞాయ = మనస్సు బ్రహ్మము అను విషయము నెఱింగి (సంశయము గలవాఁడై), పునః = మఱల, 'అధీహి భగవో బ్రహ్మ ఇతి' = ఓ భగవన్తా! బ్రహ్మము నుపదేశింపుమని, పితరం వరుణం ఉపాససార ఏవ = తండ్రియగు వరుణుని సమీపించెను.

తం = అట్టి పుత్రుని గూర్చి, తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తపః బ్రహ్మ ఇతి = తపస్సుచేత బ్రహ్మమును తెలుసుకొనుము. తపస్సే బ్రహ్మము అని, ఉవాచహ = (వరుణుఁడు) పలికెను.

సః = ఆ భృగుమహర్షి, తపః అతప్యత = తప మొనర్చెను. సః = అతఁడు, తపః తప్త్వా = తప మొనర్చి.

తా. తప మొనర్చిన పిదప జగత్సృష్టి స్థితిలయములు మనస్సుచేత-అనఁగా సంకల్పముచేతనే కలుగుచున్నవి. కావున మనస్సే బ్రహ్మమని గ్రహించెను. ఆ విధముగా తెలిసికొనిన పిదప మఱల మనస్సు బ్రహ్మము కాఁజాలదను సంశయము గలవాఁడై మఱల 'బ్రహ్మము నుపదేశింపు' అని తండ్రిని సమీపించగా తండ్రి తపస్సుచేత బ్రహ్మము నెఱుంగుము, తపస్సే బ్రహ్మము అని పుత్రున కుపదేశించెను. పుత్రుఁడు తదనుసారము మఱల తప మొనర్చెను.

వివరణము:—

జగత్సృష్టి స్థితిలయములు మనఃకృతములనుటకు శ్రుతిప్రమాణములు:-

శ్రు. ౧. అథ హైనం కౌసల్యశ్చాశ్వలాయనః పప్రచ్ఛ;
భగవ న్కుత ఏష ప్రాణో జాయతే?
కథ మాయాత్యస్మిన్ శరీరే? (ఇతి అశ్వలాయనప్రశ్నః)
ప్రశ్నోపనిషత్.

(అర్థ. ఈ శరీరమునందు ప్రాణము ఎటుల ప్రవేశించును? అని ప్రశ్నము)
సమా:—మనఃకృతేనాయాత్యస్మిఞ్ఛరీరే.

(ఇతిపిప్పలాదస్యోత్తరం.)

అర్థ. ఇట్టి దేహమును పొందెదను అనెడి సంకల్పముచేత ప్రాణ మీ శరీరమునందు చేరుచున్నది.

౨. కృషివాణిజ్యాది సకల జీవనోపాయకర్మలు మనస్సునకు అధీనములు కావున మనస్సు జీవనహేతువనుట సుప్రసిద్ధము.

౩. మరణకాలమునందు వాగాదీంద్రియప్రవృత్తు లన్నియు మనస్సునందు ప్రవేశించుచున్నవి కావున మనస్సు లయహేతు వగుచున్నది.

ఈ విషయమును గూర్చి విపులముగ తెలిసికొనఁగోరువారు ప్రశ్నోపనిషత్తు తృతీయప్రశ్న తచ్ఛాంకరభాష్యములను, బృహదారణ్యకోపనిషత్తునందుఁగల "తద్యథా తృణజలూకా తృణస్యాంతం గత్వా" (౪-౪-౩) అను ఉపనిషద్వాక్యమును గాంచునది. ఇవి మనస్సు బ్రహ్మమనుటకు హేతువులు.

మనస్సు బ్రహ్మము కాదను సంశయమునకు హేతువు ఏమనఁగా—(మనస్సు నేత్రము మున్నగు ఇంద్రియములవలె కరణభూత మగుచున్నది. కరణ మెన్నఁ

డున్నా కర్తృపరతంత్రమగునుగాని స్వతంత్రము గాదు. కావున మనస్సు బ్రహ్మము కాదని దలంచినవాఁడయి విషయగ్రహణార్థము మఱల తప మొనర్చినాడని భావము.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము ....
అనుభూతి ప్రకాశము ....
ఆత్మపురాణము, అధ్యా-౧౦. శ్లో. ౩౫౦-౩౫౨



## ౫. పంచమోఽనువాకః

(బ్రహ్మవిజ్ఞానే చతుర్థపర్యాయః)

మం. విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానా ద్ధ్యేవ
ఖల్విమాని భూతాని జాయంతే । విజ్ఞానేన జాతాని
జీవంతి । విజ్ఞానం ప్రయంత్యభి సంవిశంతీతి । తద్వి
జ్ఞాయ । పునరేవ వరుణం పితర ముపససార । అధీహి
భగవో బ్రహ్మేతి । తగ్ంహోవాచ । తపసా బ్రహ్మ
విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపో ఽతప్యత ।
స తప స్తప్త్వా ॥౫॥

టీక. ఇమాని భూతాని = ఈ భూతములన్నియు, విజ్ఞానాత్ ఏవ = విజ్ఞానము వల్ల నుండియే, జాయంతే హి = పుట్టుచున్నవిగదా, జాతాని = పుట్టిన భూతములు, విజ్ఞానేన = విజ్ఞానముచేత, జీవ న్తి = జీవించుచున్నవి, ప్రయంతి విజ్ఞానం అభిసం విశ న్తి=ప్రళయకాలమునందు విజ్ఞానమునందే లీనమగుచున్నవి, ఇతి=ఈ హేతువు వలన, విజ్ఞానం = విజ్ఞానమును, బ్రహ్మఇతి = బ్రహ్మము అని, వ్యజానాత్ = తెలిసి కొనెను.

తత్ = విజ్ఞానమే బ్రహ్మమను విషయమును, విజ్ఞాయ = తెలిసికొని, (మఱల సంశయము గలవా(డై), 'అధీహి భగవో బ్రహ్మఇతి' = పూజ్యు(డా! బ్రహ్మము నుపదేశింపుము అని, పునః = మఱల, పితరం వరుణం ఉపససార ఏవ = తండ్రి యగు వరుణుని సమీపించెను. (ఆ వరుణు(డు) తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపః బ్రహ్మఇతి = 'తపస్సుచేత బ్రహ్మము నెఱుంగుము, తపస్సే బ్రహ్మము' అని, తం ఉవాచ హ = ఆ భృగువును గూర్చి పలికెను.

సః = ఆ భృగువు, తపః అతప్యత = తప మొనర్చెను. సః తపః తప్త్వా = అతఁడు తప మొనర్చి;

తా. విజ్ఞానమువల్ల నుండియే జగత్సృష్టి స్థితిలయములు కలుగుచుండుటచేత విజ్ఞానమే బ్రహ్మమని భృగువు తపస్సువలన తెలిసికొనెను. తరువాత విజ్ఞానము నైతము బ్రహ్మము కాఁజాలదను సంశయముగలవాఁడై మఱల 'బ్రహ్మము నుపదేశింపుము' అని తండ్రిని సమీపించెను. తండ్రియు వెనుకటివలెనే 'తపస్సుచేత బ్రహ్మము నెఱుంగుము. తపస్సే బ్రహ్మము' అని పుత్రుని గూర్చి పలుకగా భృగువు మఱల తప మొనర్చి,

విజ్ఞానము బ్రహ్మము కాదనుటకు అతనికి తోఁచిన సంశయ మేమనఁగా:—

'విజ్ఞానం యజ్ఞం తనుతే' ఇత్యాది శ్రుతిచేత విజ్ఞానము కర్త యగుచున్నది, కర్తృత్వము, క్లేశసమన్వితము, బ్రహ్మము అకర్త, క్లేశరహితుఁడు.

విజ్ఞానమువలన కర్మద్వారా దేహోత్పత్తి మాత్రము కలుగవచ్చును గాని ఆకాశాది భూతము లన్నియు పుట్టుటలేదు. కనుక విజ్ఞానము బ్రహ్మము కాఁజాలదని భృగువునకు స్ఫురించెను.

వివరణము:—విజ్ఞానము జగత్సృష్టి స్థితిలయములకు హేతుభూత మనుటకు శ్రుతి ప్రమాణము:—

౧. 'విజ్ఞానం యజ్ఞం తనుతే' ఇత్యాది శ్రుతియు, "యత్కర్మ కురుతే తదభిసంపద్యతే. పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" (బృహ. ౪. ౨. ౧౩.) అను శ్రుతియు ప్రస్తుతాంశమును ప్రతిపాదించుచున్నవి.

౨. విజ్ఞానము లౌకికములగు కృష్యాది కర్మలకు కర్త యగుటచేత జీవన హేతుత్వము సుప్రసిద్ధమే గదా.

౩. మరణకారణము లగు యుద్ధాదికములందును విజ్ఞానముచేత ప్రవర్తించును కావున లయకారణ మనుటయు స్ఫుటముగానే తెలియుచున్నది.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము ....

అనుభూతిప్రకాశము ....

ఆత్మపురాణము. అధ్యా-౧౦. శ్లో. ౩౫౪-౩౬౦.



## ౬. షష్ఠోఽనువాకః

(బ్రహ్మవిజ్ఞానే పంచమపర్యాయః)

మం. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । ఆనందేన జాతాని జీవంతి ఆనందం ప్రయంత్యభిసంవిశంతీతి । సైషా భార్గవీ వారుణీ విద్యా । పరమే వ్యోమన్ప్రతిష్ఠితా । య ఏవం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి మహాన్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్కీర్త్యా ॥౬॥

శాంకరభాష్యమ్:—

ఏవం తపసా విశుద్ధాత్మా ప్రాణాదిషు సాకల్యేన బ్రహ్మలక్షణ మపశ్యన్ శనైః శనైః అన్తరనుప్రవిశ్య అన్తరతమ మానన్దం బ్రహ్మ విజ్ఞాతవాన్ తపసైవ సాధనేన భృగుః; తస్మాత్ బ్రహ్మ విజిజ్ఞాసునా బాహ్యాన్తః కరణ సమాధాన లక్షణం పరమం తపః సాధనమనుష్ఠేయమితి ప్రకరణార్థః। అధునా ఆఖ్యాయికాం చ ఉపసంహృత్య శ్రుతిః స్వేన వచనేన ఆఖ్యాయికా నిర్వర్త్యమర్థమాచష్టే। సైషా భార్గవీ భృగుణా విదితా వరుణేన ప్రోక్తా వారుణీ విద్యా పరమే వ్యోమన్ హృదయాకాశ గుహాయాం పరమే ఆనన్దే అద్వైతే ప్రతిష్ఠితా పరిసమాప్తా అన్నమయాదాత్మనోఽధి ప్రవృత్తా। య ఏవమన్యోఽపి తపసైవ సాధనేన అనేనైవ క్రమేణ అనుప్రవిశ్య ఆనన్దం బ్రహ్మ వేద, స ఏవం విద్యాప్రతిష్ఠానాత్ ప్రతితిష్ఠతి ఆనన్దే పరమే బ్రహ్మణి. బ్రహ్మైవ భవతీత్యర్థః। దృష్టం చ ఫలం తస్యోచ్యతే—అన్నవాన్ ప్రభూత మన్న మస్య విద్యత ఇత్యన్నవాన్; సత్తామాత్రేణ తు సర్వో హి అన్నవానితి విద్యయా

విశేషో న స్యాత్। ఏవ మన్నమత్తీత్యన్నాదః, దీప్తాగ్నిర్భవతీత్యర్థః। మహాన్భవతి। కేన మహత్త్వమిత్యత ఆహ—ప్రజయా పుత్రాదినా పశుభిః గవాశ్వాదిభి బ్రహ్మవర్చసేన శమదమజ్ఞానాది నిమిత్తేన తేజసా। మహాన్భవతి కీర్త్యా ఖ్యాత్యా శుభాచార నిమిత్తయా॥

ఇతి షష్ఠానువాక భాష్యమ్॥

టీ. ఆనందాత్ ఏవ = ఆనందమువల్ల నుండియే, ఇమాని భూతాని = ఈ భూతములు. జాయంతేహి ఖలు = పుట్టుచున్నవి గదా. జాతాని ఆనందేన జీవన్తి = పుట్టినవి ఆనందముచేత జీవించుచున్నవి, ఆనందం ప్రయంతి = అభిసంవిశన్తి = ప్రళయకాలమునందు ఆనందము నందు లయమయి తాదాత్మ్యమును పొందుచున్నవి, ఇతి = ఈ హేతువువలన, ఆనందః బ్రహ్మ ఇతి = ఆనందము బ్రహ్మము అని, వ్యజానాత్ = భృగుమహర్షి తెలిసికొనెను.

సా ఏషా = ఆ ఈ సుప్రసిద్ధమయిన, విద్యా = విద్య, వారుణీ = వరుణుని చేత చెప్పఁబడినది, భార్గవీ = భృగుమహర్షిచేత తెలిసికొనఁబడినది. పరమే వ్యోమన్ = శ్రేష్ఠమయిన హృదయాకాశమునందు, (అనఁగా దాని యందున్న బుద్ధి గుహయందు గల ఆనందరూపమయిన అద్వైతమయిన బ్రహ్మము నందు) ప్రతిష్ఠితా = పరిసమాప్తి నందినది.

యః = ఎవ్వఁడు, ఏవం = ఈ విధముగా తప మొనర్చి. వేద = (క్రమముగా అన్నాదికమును నిరసించుకొని ఆనందమునే బ్రహ్మమునుగా) తెలిసికొనునో, సః = వాఁడు, ప్రతితిష్ఠతి = (ఆనందమునందు అనఁగా బ్రహ్మమునందు) ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. (బ్రహ్మమే అగుచున్నాఁడు) అన్నవాన్ = అన్నము గలవాఁడు. భవతి = అగుచున్నాఁడు, అన్నాదః = దీప్తాగ్ని గలవాఁడు (భవతి = అగు చున్నాఁడు). ప్రజయా = పుత్రపౌత్రాదికముచేతను, పశుభిః = గోవృషభాది పశు గణముచేతను, బ్రహ్మవర్చసేన = శమదమజ్ఞానాదికమువలన జనించిన బ్రహ్మ తేజస్సుచేతను. మహాన్ = శ్రేష్ఠుఁడు, భవతి = అగుచున్నాఁడు కీర్త్యా = సదా చారము గలవాఁడను కీర్తిచేత, మహాన్=గొప్పవాఁడు (భవతి=అగుచున్నాడు.)

తా. ఈ విధముగా తపస్సుచేత విశుద్ధాత్మయగు భృగుమహర్షి అన్నప్రాణ మనో విజ్ఞాన కోశములందు బ్రహ్మలక్షణము సమగ్రముగఁ గనంబడక పోవుట చేతను, క్రమముగ ఈ కోశములు పూర్వాపేక్షయా ఉత్తరకోశము అంతరమగుటను ఎఱింగినవాఁడై చివరకు తపస్సుచేతనే సర్వాంతరతమమగు ఆనందమును బ్రహ్మ

మునుగా నెఱింగెను. కావున బ్రహ్మజిజ్ఞాసువగు నతఁడు బాహ్యాంతఃకరణ సమాధాన రూప మగు తపస్సను సాధనముచేతనే బ్రహ్మము నెఱుంగవలయునని శ్రుతి బోధించుచున్నది. ఇంతటితో అఖ్యాయిక సమాప్తమాయెను. ఈ సంగతిని శ్రుతియే స్వయముగా బోధించుచున్నది. ఇదియే వరుణుఁడు చెప్పినట్టియు, భృగువు తెలిసికొనినట్టియు విద్య. అన్నమయకోశము మొదలుకొని హృదయాకాశగుహాంతర్వర్తి యగు ఆనందస్వరూపము వఱకు ప్రవర్తించినది. (భృగు వే విధముగా తపస్సుచేత ఆనందమునే బ్రహ్మముగా నెఱింగెనో) అట్లే ఇతరుఁ డెవ్వఁడైనను తపస్సాధనము చేత అన్నాది క్రమముగా బ్రహ్మలక్షణమును భావించుకొని తపఃపరిపాకముచేత అయ్యది కాజాలదని ఎఱింగి ఆనందమే బ్రహ్మమని చివరకు నెఱుంగునో అతఁడు ఆనందబ్రహ్మమునందు ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. అనఁగా బ్రహ్మమే అగుచున్నాఁడని భావము) ఇది అదృష్ట ఫలము.

ఇఁక దృష్టఫలము చెప్పఁబడుచున్నది :—

౧. ప్రభూతమయిన అనఁగా అతిశయమైన అన్నముగలవాఁ డగుచున్నాఁడు. (ఇచట అన్నశబ్దమునకు ప్రభూతము అని విశేషణము చెప్పనియెడల జీవించియున్న వారందఱు అన్నవంతులే కావున విద్వాంసునకు సాధారణునకు భేదమే లేకపోవును.)

౨. అన్నాదుఁ డగును (అనఁగా దీప్తమగు జఠరాగ్నిగలవాఁ డగును.)

౩. పుత్ర పౌత్రాది ప్రజలచేతను, గోమహిష్యాది పశుసంపత్తిచేతను, శమదమ జ్ఞానాదినిమిత్తమగు బ్రహ్మవర్చస్సుచేతను శ్రేష్ఠుఁడగుచున్నాఁడు.

౪. సదాచారనిరతుఁ డను కీర్తి చేత పూజ్యుఁడగును.

వివరణము:— మూలమునందు లేని "ప్రభూతము" అను అన్న విశేషణము సమన్వయార్థము భాష్యకారాదృతమయినది, అన్నాదశబ్దమునకు 'దీప్తాగ్ని' యను నర్థమును పైతము ఇట్లే యని గ్రహించునది.

"అన్నవాన్ అన్నాదః, ప్రజయా పశుభిః బ్రహ్మవర్చసేన, కీర్త్యామహాన్ భవతి." మున్నగు ఫలములు కృతకృత్యుఁడగు బ్రహ్మవిదునకు అనావశ్యకములు గదా. పోనీ అతనికి అనావశ్యకములయినను ఇవి నియమముగా బ్రహ్మవిదులందఱకు తప్పక కలుగు ననిగాని లోకమునందు దృష్టాంతము లేదు గదా. అని సంశయము కొందఱకుఁ గలుగవచ్చును. అయినను ఛాందోగ్యప్రతిపాదిత భూమవిద్యయందు

భూమవిద్యాస్తుతి నిమిత్తము సగుణ బ్రహ్మవిద్యాఫలమగు విషయమునే భూమ విద్యాఫలముగా ఎటుల చెప్పఁబడి యున్నదో అట్లే బ్రహ్మవిద్యాస్తుతి నిమిత్త మిచట ఫలసంకీర్తన మని ఎఱుంగునది.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము, భృగువల్లి, ౬-వ ఖండ. శ్లో. ౩౦-౩౯.
అనుభూతి ప్రకాశము ....
ఆత్మపురాణము, అధ్యా-౧౦. శ్లో. ౩౬౩-౩౭౨.



## ౭. సప్తమోఽనువాకః

(అన్నబ్రహ్మోపాసక వ్రతనియమాః)

మం. అన్నం న నిన్ద్యాత్ । తద్వ్రతమ్ । ప్రాణో వా
అన్నమ్ శరీర మన్నాదమ్ । ప్రాణే శరీరం ప్రతిష్ఠి
తమ్ । శరీరే ప్రాణః ప్రతిష్ఠితః । తదేత దన్న మన్నే
ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే ప్రతిష్ఠితం వేద
ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి మహా న్భవతి
ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేన । మహా న్కీర్త్యా॥

శాంకరభాష్యమ్:—

కిం చ, అన్నేన ద్వారభూతేన బ్రహ్మ విజ్ఞాతం యస్మాత్, తస్మాత్ గురు మివ అన్నం న నిన్ద్యాత్; తత్ అస్య ఏవం బ్రహ్మవిదో వ్రతమ ఉపదిశ్యతే। వ్రతోపదేశో అన్న స్తుతయే, స్తుతిభాక్త్వం చ అన్నస్య బ్రహ్మోపలబ్ధ్యుపాయత్వాత్। ప్రాణో వా అన్నమ్, శరీరా న్తర్భావాత్ప్రాణస్య। యత్ యస్యా న్తః ప్రతిష్ఠితం భవతి, త త్తస్యాన్నం భవతీతి। శరీరే చ ప్రాణః ప్రతిష్ఠితః, తస్మాత్ ప్రాణోఽన్నం శరీరమన్నాదమ్। తథా శరీరమప్యన్నం ప్రాణోఽన్నాదః। కస్మాత్ ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్? తన్నిమిత్తత్వా చ్ఛరీరస్థితేః। తస్మాత్ తదేతత్ ఉభయం శరీరం ప్రాణశ్చ అన్నమన్నాదశ్చ। యేనాన్యోన్యస్మిన్ప్రతిష్ఠితం తేనాన్నమ్; యేనాన్యోన్యస్య ప్రతిష్ఠా తేనాన్నాదః। తస్మాత్ ప్రాణః శరీరం చ ఉభయమన్నమన్నాదం చ। స య ఏవమ్ ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి అన్నాన్నాదాత్మనైవ। కిం చ, అన్నవానన్నాదో భవతీత్యాది పూర్వవత్॥

ఇతి సప్తమానువాకభాష్యమ్॥

టీక. అన్నం = అన్నమును, న నిన్ద్యాత్ = నిందింపఁగూడదు, తత్ = అది, వ్రతం = బ్రహ్మవేత్తకు వ్రతము, ప్రాణఃవా = ప్రాణమే, అన్నం = అన్నము, శరీరం = శరీరము, అన్నాదం = అన్నాదము, ప్రాణే = ప్రాణమునందు, శరీరం = శరీరము, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమయి యున్నది, శరీరే = శరీరమునందు, ప్రాణః = ప్రాణము, ప్రతిష్ఠితః = ప్రతిష్ఠితమయి యున్నది, తత్ = అందువలన, ఏతత్ = ఈ యన్నము ప్రాణము అనెడి యుభయ విధమగు అన్నము. అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠిత మగుచున్నది, యః = ఎవ్వఁడు. ఏతత్ = ఈ శరీరము, ప్రాణము అనెడి ఉభయ విధమగు, అన్నం = అన్నము, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమయినదని, వేద = ఉపాసించుచున్నాఁడో, సః = వాఁడు, ప్రతితిష్ఠతి = ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు.

అన్నవాన్ = అన్నవంతుఁడును, అన్నాదః = అన్నాదుఁడున్నూ, భవతి = అగుచున్నాఁడు, ప్రజయా = సంతానముచేతను, పశుభిః = పశువులచేతను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సుచేతను, మహాన్ = గొప్పవాఁడు, భవతి = అగుచున్నాఁడు, కీర్త్యా = కీర్తి చేతను, మహాన్ (భవతి) = గొప్పవాఁ డగుచున్నాఁడు.

తా. ద్వారభూతమగు అన్నబ్రహ్మోపాసనము చేతనే బ్రహ్మజ్ఞానము ప్రాప్తించినది కావున గురువును వలె అన్నమును ఎప్పుడున్నూ నిందింపఁదగదు, ఇటుల నిందింపకుండుట బ్రహ్మవేత్తకు వ్రతము, వ్రతము అని చెప్పుట అన్నముయొక్క స్తుతి నిమిత్తము, అన్నమునకు అట్టి స్తుతి కలుగుటకు కారణము బ్రహ్మవిజ్ఞానమునకు ప్రథమమున ఉపాయమగుటచేత నని తెలిసికొనవలయును.

శరీరమునందు లోపల ఉండుటచేత ప్రాణము అన్నమనంబడును, లోకమునందు ఏయది దేనియొక్క లోపలనుండునో అది దానికి అన్నమని చెప్పఁబడుచున్నది గదా!

శరీరమునందు ప్రాణము ప్రతిష్ఠితమయి యున్నది, కావున ప్రాణము అన్నము, శరీరము అన్నాదము, అదేవిధముగా శరీరమున్నూ అన్నము, ప్రాణము అన్నాదము, ఏల యనఁగా ప్రాణమునందు శరీరము ప్రతిష్ఠితమయి యున్నది, (అనఁగా) శరీర స్థితికి ప్రాణము నిమిత్తము అని భావము.

కావున ఈ శరీరము ప్రాణము ఈ రెండున్నూ అన్నమున్నూ అన్నాదమున్నూ అగుచున్నవి.

పరస్పర మొకటి ఒకదానియందు ప్రతిష్ఠితమై యుండుటచేత అన్నమనియు ఒక్కొకటి ఒక్కొకదానికి ప్రతిష్ఠగా నుండుటచేత అన్నాదమనియు భావము.

కావున ప్రాణము శరీరము ఈ రెండున్నూ అన్నమున్నూ అన్నాదమున్నూ అగుచున్నవి.

ఎవ్వఁడీ విషయము నెఱింగి ఉపాసించుచున్నాఁడో, వాఁడు మిక్కుటముగు అన్నము గలవాఁడున్నూ, అన్నాదుఁడున్నూ పుత్రపౌత్రాది ప్రజలచేతను, గోమహిష్యాది పశుసంపత్తిచేతను, శమదమజ్ఞానాదినిమిత్త బ్రహ్మవర్చస్సుచేతను, కీర్తిచేతను లోకమునందు వన్నె కెక్కును.

వివరణము:—శరీరముయొక్క లోపల మనము భుజించిన యన్నముండును గదా, అదేవిధముగా శరీర మధ్యభాగమునందు ఉండుటచేత ప్రాణము అన్న మనంబడును.

మధ్యవర్తి యగు ప్రాణరూపాన్నమును శరీరము ధరించియున్నది కావున శరీరము అన్నాద మనంబడును.

గృహమధ్యవర్తి యగు స్తంభము గృహమును ఎటుల ధరించుచున్నదో, అదేవిధముగా దేహ మధ్యవర్తి యగు ప్రాణము దేహమును ధరించుచున్నది, కావున ప్రాణమునందు శరీరము ప్రతిష్ఠితమయినదని చెప్పఁబడినది.

ప్రాణము దేహమును ధరించియున్న విషయము ప్రశ్నోపనిషత్తునందు ప్రాణసంవాదమునం దిట్లు చెప్పఁబడి యున్నది:—

> శ్రు. అహ మేవైత త్పంచధాఽఽత్మానం ప్రవిభజ్యైత ద్బాణ
> మవష్టభ్య విధారయామి. ప్రశ్నోపనిషత్. ౨. ౩.

శరీరము ప్రాణమునకు ఆధారమనుట సుప్రసిద్ధమే గదా!

ఇటుల అన్యోన్యాధారత్వమును తెలిసికొనవలయును, శరీరము అన్నకార్యమగుటచేత అన్న మగుచున్నది, శరీరము ప్రాణము ఈ రెండున్నూ అన్నమగుట వలనను పైన చెప్పినరీతిగా పరస్పరాధారము లగుటచేతను, అన్నమే 'అన్నము' నందు ప్రతిష్ఠితమయి యున్నదనియు ఎఱుంగునది.

అన్నమును నిందింపఁగూడదు అను నియమ మిచట ఉపదేశింపఁబడినది.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయ భాష్యవార్తికము, భృగు, ౭-వ ఖండ. శ్లో. ౪౭, ౪౮.
ఆత్మపురాణము ....
అనుభూతిప్రకాశము

# ౮. అష్టమో ఽనువాకః



(ఆనందమీమాంసా)

మం. ౧. భీషాఽస్మా ద్వాతః పవతే । భీషోదేతిసూర్యః ।
భీషా ఽస్మా దగ్ని శ్చేంద్రశ్చ । మృత్యు ర్ధావతి
పంచమ ఇతి ॥

౨. సైషా ఽఽనందస్య మీమాగ్ంసా భవతి । యు
వా స్యా త్సాదు యువాఽధ్యాయకః । ఆశిష్ఠో
ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా వి త్త
స్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనన్దః ।

3. *శ్రోత్రియస్య చాకామహతస్య । తే యే శతం
మానుషా ఆనందాః । స ఏకో మనుష్యగంధ
ర్వాణామానందః । శ్రోత్రియస్య చాకామహ
తస్య ।

౪. తే యే శతం మనుష్యగంధర్వాణా మానన్దాః ।
స ఏకో దేవగంధర్వాణా మానందః । శ్రోత్రి
యస్య చాకామహతస్య ।

---

* మానుషానందవర్యాయే శ్రోత్రియస్యేతి వాక్యం శాంకరపాఠేనాస్తి.

యః=ఎవ్వఁడు, ఏతత్=ఈ ఆపోజ్యోతీ రూపమగు, అన్నం=అన్నమును, అన్నే=అన్నమునందు, ప్రతిష్ఠితం=ప్రతిష్ఠితమయినదానినిగా, వేద=ఉపాసించుచున్నాఁడో. సః=వాఁడు, ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు, అన్నవాన్=అన్నవంతుఁడున్నూ, అన్నాదః = అన్నాదుడున్నూ, భవతి = అగుచున్నాఁడు, ప్రజయా=సంతానముచేతను, పశుభిః=పశువులచేతను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సుచేతను, మహాన్=గొప్పవాఁడు, భవతి=అగుచున్నాఁడు, కీర్త్యా = కీర్తిచేతనున్నూ, మహాన్=గొప్పవాఁడు. (భవతి=) అగుచున్నాఁడు.

తా. త్రాగిన జలములు ఉదరాగ్నిచేత జీర్ణము చేయబడుచున్నవి కావున జలములు అన్నమగుచున్నవి. జ్యోతిస్సు అన్నాద మగుచున్నది. వర్షోదకము లందు వైద్యుతాగ్ని యుండుటచేతను, దేహసంతాపముచేత దేహమునందు చెమట గనంబడుటచేతను, జలజ్యోతిస్సులు, పరస్పర ప్రతిష్ఠితము లగుచున్నవి. కావుననే పరస్పరాన్నములు అగుచున్నవి, ఇట్టి విషయము నెఱింగి యుపాసించువానికి వెనుకటివలెనే అన్నము చక్కఁగా లభించుట, ప్రదీప్తమయిన జఠరాగ్ని కలిగియుండుట, మున్నగు ఫలములు కలుగును.

ఈ యనువాకమునందు భోజనకాలమునందు ప్రాప్తమయిన అన్నమును మంచిది కాదని తలంచి పరిహరింపఁ దగదను నియమము వ్రతముగా విధింపఁబడినది.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము, భృగు, ఖండ. ౮-౪౨.

ఆత్మపురాణము ....

అనుభూతిప్రకాశము ....



# ౯. నవమోఽనువాకః

## (అన్నబ్రహ్మోపాసక వ్రతమ్)

మం. అన్నం బహు కుర్వీత । తద్వ్రతమ్ । పృథివీ వా
అన్నమ్ । ఆకాశోఽన్నాదః । పృథివ్యా మాకాశః
ప్రతిష్ఠితః । ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా । తదేత దన్న
మన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏత దన్న మన్నే ప్రతి
ష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవా నన్నాదో భవతి ।
మహా న్భవతి ప్రజయాపశుభి ర్బ్రహ్మవర్చసేన । మహా
న్కీర్త్యా ॥౯॥

శాంకరభాష్యమ్: —

అప్సు జ్యోతిః ఇత్యబ్జ్యోతిషోఽన్నాన్నాద గుణత్వేనోపాసకస్య అన్నస్య బహూకరణం వ్రతమ్॥

ఇతి నవమానువాకభాష్యమ్॥

టీ. అన్నం = అన్నమును, బహు = విస్తారముగా, కుర్వీత = సంపాదింప వలయును. తత్ = అది, వ్రతం = వ్రతము, పృథివీ = భూమి. అన్నం వై = అన్నము గదా, ఆకాశః = ఆకాశము. అన్నాదః = అన్నాదము, పృథివ్యాం = భూమియందు, ఆకాశః = ఆకాశము, ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితమయియున్నది. ఆకాశే = ఆకాశమునందు, పృథివీ = భూమి, ప్రతిష్ఠితా = ప్రతిష్ఠితమయియున్నది. తత్ ఏతత్ = ఆ ఈ యుభయమువిధ మగు. అన్నం = అన్నము. అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమయి యున్నది, యః = ఎవ్వఁడు, ఏతత్ = ఈ యుభయవిధమగు, అన్నం = అన్నము, అన్నే = అన్నమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమయియున్నదని, వేద = ఉపాసించు

చున్నాఁడో, సః=వాఁడు, ప్రతితిష్ఠతి=ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. అన్నవాఞ్=అన్నవంతుఁడున్నూ, అన్నాదః=అన్నాదుఁడున్నూ, భవతి = అగుచున్నాఁడు, ప్రజయా=ప్రజచేతను, పశుభిః = పశువులచేతను, బ్రహ్మవర్చసేన=బ్రహ్మవర్చస్సు చేతను, మహాఞ్=గొప్పవాఁడు, భవతి=అగుచున్నాఁడు, కీర్త్యా=కీర్తిచేతను, మహాఞ్=గొప్పవాఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా. అన్నమును అతిథుల కొఱకుగుటకయి మిక్కుటముగ సంపాదింప వలయును. ఇది వ్రతము, క్రిందను మీఁదను ఉన్న ఆకాశము యొక్క మధ్య భాగమునం దుండుటచేత పృథివి అన్నమగుచున్నది, ఆకాశము అన్నాద మగు చున్నది.

పామరదృష్టిచేత భూమికి పై భాగమునందు ఆకాశము గనంబడుచుండుటచేత ఆకాశమునకు పృథివి యాధారమగుచున్నది. విచారదృష్టిచేత ఆకాశము ఆధారభూత మగుచున్నది, ఇటుల పరస్పరాధారత్వమును, పరస్పరాన్నత్వాదికమును ఊహించు కొనవలయును.

ఇటుల నెఱింగి ఉపాసించువానికి వెనుకటివలె ప్రభూతాన్నవత్త్వము, అన్నాదత్వము, ప్రజాపశుకీర్త్యాదిలాభము తప్పక కలుగును.

దీనికి సంబంధించిన ఇతర గ్రంథ భాగములు

తైత్తిరీయభాష్యవార్తికము, భృగు, ఖండ-౯. శ్లో. ౪-౨.
ఆత్మపురాణము ....
అనుభూతిప్రకాశము ....



## ౧౦. దశమోఽనువాకః

(వ్రతవిశేషాః)

౫౦. న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । తద్వ్రతమ్ । తస్మా ద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్ । అరాధ్యస్మా అన్న మిత్యాచక్షతే । ఏతద్వై ముఖతో ఽన్నగ్ం రాద్ధమ్ । ముఖతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వై మధ్యతోఽన్నగ్ం రాద్ధమ్ । మధ్యతో ఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వా అన్త తోఽన్నగ్ం రాద్ధమ్ । అన్తతో ఽస్మా అన్నగ్ం రాధ్యతే ॥౧౦॥

య ఏవం వేద । క్షేమ ఇతి వాచి । యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః । కర్మేతి హస్తయోః । గతి రితి పాదయోః । విముక్తి రితి పాయౌ । ఇతి మానుషీ స్సమాజ్ఞాః । అథ దైవీః । తృప్తి రితి వృష్టౌ । బల మితి విద్యుతి ॥౧౧॥

